# ప్రధాన పోషకులు.

---

మ. రా. రా. శ్రీ కొప్వూరి చంద్రారెడ్డిగారు,

జమీందారు,

నిడదవోలు.

మ. రా. రా. శ్రీ వాడ్రేవు వేంకటరత్నంపంతులుగారు,

పిఠాపురము.

ఆంధ్రప్రచారిణీగ్రంథమాల 16.

శ్రీ

# నవాబునందిని.

---

ఇది

కర్ణాటకగ్రంథము ననుసరించి

చాగంటి శేషయ్యగారిచే

ఆంధ్రీకరింపఁబడినది.

అయ్యగారి నారాయణమూర్తి బి. యె. బియల్ గారిచే

సంపాదింపఁబడినది.

మొదటికూర్పు.

ఆంధ్రప్రచారిణీముద్రాక్షరశాల,

నిడదవోలు.

వెల [illegible]—ల—౦

౧౯౧౫.

# కృతి.

అమృతగర్భయగుచు ♦ నలరెనే తన్వంగి
కడుపారంగా మమ్ముఁ ♦ గాంచుపట్ల

నమృతహస్తయగుచు ♦ నలరెనే గుణమణి
ప్రియమారంగా మమ్ముఁ ♦ బెంచుపట్ల

నమృతేక్షణయగుచు ♦ నలరెనే యబ్జాక్షి
కన్నారంగా మమ్ముఁ ♦ గాంచుపట్ల

నమృతస్వరూపయై ♦ యలరెనే కల్యాణి
రేబవల్ మమ్మాద ♦ రించుపట్ల

నమృతరూపిణియై తాఁ దా ♦ నమరలోక
మందెనే సాధ్వి యిచ్చ లా ♦ నందయగుచు
నట్టిమాతృదేవత సుబ్బ ♦ మాంబఁ దలఁచి
ప్రేమ నీకృతి నామె క ♦ ర్పించుకొంటి.

చాగంటి శేషయ్య.



# రాజపోషకులు

మ. రా. రా. శ్రీ రాజా రావు వేంకటకుమారమహిపతిసూర్యారావు
బహద్దరువారు, పిఠాపురము.

మ. రా. రా. శ్రీ రాజా రావు చెల్లాయమ్మారావుబహద్దరువారు,
కోలంకవీరవరమువగైరా, లక్ష్మీనరసాపురము.

మ. రా. రా. శ్రీ రాజా నాయని వేంకటరంగారావు బహద్దరువారు, మునగాల.

మ. రా. రా. శ్రీ రాజా బలుసు బుచ్చిసర్వారాయుడుబహద్దరు
జమీందారువారు కపిలేశ్వరపురము.

మ. రా. రా. శ్రీ రాజా కొచ్చర్లకోట రామచంద్రవేంకటకృష్ణారావు బహద్దరు,
బి. యె. గారు జమీందారు, పోలవరము.

మ. రా. రా. శ్రీ రాజా కందుకూరి లక్ష్మీప్రసాదరావు బహద్దరువారు,
జమీందారు, ఉర్లాం.

మ. రా. రా. శ్రీ రాజా సురభిలక్ష్మారావు బహద్దరు వారు, రాజాఆఫ్ జటప్రోలు.

మ. రా. రా. శ్రీమంతురాజా యార్లగడ్డ అంకినీడుప్రసాద్ బహద్దరు కుమార
రాజావారు, చల్లపల్లి.

మ. రా. రా. శ్రీ రాజా యినుగంటి వేంకట సూర్యప్రకాశరావుగారు, ఉండూరు

మ. రా. రా. శ్రీ చెలికానిసీతారామస్వామిగారు, ఉండూరు.

మ. రా. రా. శ్రీ కలిదిండి వేంకటరామరాజుగారు, భీమవరము.

# రాజపోషకులు

శ్రీ. రా. రా. శ్రీ శ్రీ రాజా వత్సవాయి వేంకటసుభద్రయ్యమ్మ జగపతిబహాద్దరు,

జమీందారిణీవారు, తుని.

---

# పోషకులు

---

మ. రా. రా. శ్రీ దివాన్ బహదూర్ వి. నాగమయ్యగారు బి. యె., తిరువనంతపురం.

మ. రా. రా. శ్రీ ద్రోణంరాజు వేంకటరమణారావు పంతులుగారు,

మొఖాసాదారు, తణుకు.

మ. రా. రా. శ్రీ సారంగు సోమసుందరరావుపంతులుగారు, తణుకు.

మ. రా. రా. శ్రీ తల్లాప్రగడ సూర్యనారాయణరావు పంతులుగారు, కొవ్వూరు.

మ. రా. రా. శ్రీ మల్లెల శివరామకృష్ణయ్యగారు, రాయపూడి.

మ. రా. రా. శ్రీ బందా సూర్యనారాయణగారు, బి. యే. నిడదవోలు.

మ. రా. రా. శ్రీ దుగ్గిరాల దేవళరాజుగారు, ప్రొప్రయిటరు, ఏలూరు.

---

# పీఠిక.

---

దుర్గేశనందినీపాఠకులలోఁ గొందఱు "అయేషా తరువాత వృత్తాంత మేమైన" దని ప్రశ్నింపమొదలిడిరి. ఆప్రశ్నకుఁ బ్రత్యుత్తరముగఁ జాలకాలముక్రిందటనే దామోదరముఖోపాధ్యాయులీనవలను బంగాళాభాషయందు రచియించియుండిరి. దానిని బి. వేంకటాచార్యులవారు కన్నడభాషలోనికిఁ బరివర్తనము చేసిరి. నేనాకన్నడగ్రంథము నిట్లాంధ్రీకరించితిని. ఈగ్రంథాంధ్రీకరణభాగ్యముగూడ నాకే లభించినందుల కెంతయు నానందమునొందుచున్నాఁడను. దుర్గేశనందినిలోఁ బరిచయులైన జగత్సింహుఁడు, తిలోత్తమ, అస్మాన్‌ఖాను, అయేషా, మానసింహుఁడు, విమల మొదలగువారే యిందును వచ్చుచుందురు. ప్రధానకథాంశాదులలో దానికిని దీనికిని విశేషభేదము కలుగకుండుటకై నాలుగైదువాక్యముల నిం దధికముగఁ జేర్చితిని. స్వల్పభేదములేమైననున్నను నవి యంతగాఁ బాటింపఁదగినవికావు.

కపిలేశ్వరపురము,
ది 1 జూన్ 1915.

చాగంటి శేషయ్య.

శ్రీరామచంద్ర.

# నవాబునందిని.

## ప్రథమభాగము.

### మొదటిప్రకరణము.

సర్వమును పూర్వమువలెనే యుండెను.

మందారణగడమందు వీరేంద్రసింహుని దుర్గము పూర్వమువ
లెనే యుకేతీరుగ సమభావముతోఁ దలయెత్తుకొని యాకాశమార్గమున
నిలుచుండి యుండెను. దుర్గపార్శ్వమందలి మామిడితోఁటయందు వృ
క్షములు శాఖాప్రశాఖలతో వృద్ధినొంది పూర్వమువలెనే సమాన
భావముతోఁ దూగాడుచు క్రీడించుచుండెను. నీరు పూర్ణముగా లేక
కృశించియున్న యామోదరానదియును బూర్వమువలెనే మృదుమృదు
శబ్దములను జేయుచు దుర్గశిరోభాగమందున్న కుడ్యపాదప్రదేశము
లను తడుపుచుఁ బ్రవహించుచుండెను. వసంతమందానిలము వికసిం
చుచున్న సహకారవృక్షకుసుమములయందలి పరిమళముల నపహరిం
చుకొనివచ్చి హెచ్చుతగ్గులు లేకుండ సమానభావముతో నందఱుశరీ
రములమీఁదను వెదజల్లుచుండెను. కవిప్రసిద్ధమును వసంతఋ
వున కేడబాయనిసహచరము నగుకోయిల వృక్షపర్ణములనడుమ త
నశరీరమును దాచుకొని క్రమోచ్చస్వరముతో కంఠమునెత్తి తాన

కములను గూయుచు దిగంతములను గంపింపఁజేయుచుండెను. సునీ
లమైన గగనాంగణమందు చంద్రుఁడును నక్షత్రములును పూర్వము
వలెనే మేఘమధ్యమున దాఁగిలిమూఁతల నాడుకొనుచుండెను.

అన్నియును పూర్వమువలెనే యుండెను. కాని, ఎంతస్వల్ప
కాలములో నెట్టియవాంతరములు జరిగిపోయినవి! విమలయు దు
ర్గేశనందిని యగుతిలోత్తమయు మొట్టమొదట శైలేశ్వరునిదేవాలయ
మందు యువరాజగు జగత్సింహుని సందర్శించుట, పఠానులదుర్గమం
దు విమల యస్త్రాఘాతముచే నవాబు కటుల్ఖానుమరణించుట, ఈ
మొదలగు నవాంతరకార్యము లెంతస్వల్పకాలములో నడచిపోయి
నవి! ఆకాలరాత్రి—ఏరాత్రి విమల యజాగ్రత్తమూలమున పఠా
నులు దుర్గమును జయించి దుర్గాధిపతియగు వీరేంద్రసింహుని యు
వరాజగు జగత్సింహుని పట్టుకొని బంధించి బందాలుగఁ జేసిరో, ఆ
కాలరాత్రిసంబంధములైన చిహ్నములేవియు నిప్పుడు కాన్పించు
చుండుటలేదు. ఆదినమున రక్తప్రవాహముచే నేలయంతయు నాని
పోయినగురుతు లణుమాత్రమును నిప్పుడు కనఁబడుటలేదు. దుర్గ
మునంతను ప్రకంపించునట్లుచేసిన యానాఁటిహాహాకారధ్వనులేవి
యు నిప్పుడు శ్రవణగోచరమగుటలేదు. ఎక్కడచూచినను దుర్గము
నందంతటను సౌభాగ్యలక్షణములే కనఁబడుచుండెను. అన్నియు స
మంజసభావముతో విరాజిల్లుచుండెను. అన్నియును పూర్వమువలెనే
యుండెను. కాని వీరకేసరియైన వీరేంద్రసింహుఁడు మాత్ర మిప్పు
డు లేఁడు. అంతటిస్వల్పకాలములో విమలయు వితంతువైపోయెను.
తిలోత్తమ తండ్రిలేనిబాలిక యయ్యెను. దుర్గమునందు సర్వమును
పూర్వమువలెనే యుండెను. పూర్వముండెడివారందఱును మరల వ
చ్చి దుర్గమునందు చేరిరి. వీరేంద్రసింహుఁ డొక్కఁడుమాత్రము

లేఁడు. ఆతఁడు తిరిగి రాలేదు. యమునియందాత్మసమర్పణము చేసి
కొనినవారు తిరిగివచ్చుట జూచినవారెవ్వరును లేరు.

అనేకజనులు యమాలయమునకుఁ బోయియున్నారు. స్థిర
మైనయానివాసమున కనేకులు నిత్యమును బోవుచున్నారు. వారిలో
నెవరును తిరిగిరాలేదు. వచ్చుటయును లేదు. అందువలనఁ బ్రపంచ
మునకు గలిగినలోపమేమియును లేదు. వసుంధరయందు సుఖదుఃఖ
ప్రవాహమున కించుకంతయును హెచ్చుతగ్గులున్నట్లు కాన్పించుట
యును లేదు. మందారణదుర్గమున కధీశ్వరుఁడైన వీరేంద్రసింహుఁడు
తిరిగి రాలేదు. అందుచే దుర్గమునకు లోపముగాని దుర్గతిగాని కలిగి
నట్లు కాన్పింపదు. ఒక్కొకప్పుడు విచారము పోయి దానిస్థానమున
సంతోష మధికారము చేయుచుండును. మఱియొకప్పుడు సంతోషము
పోయి దానిస్థానమును విచారమాక్రమించుకొనుచుండును. విచార
సంతోషములు రెండు నొకేసూత్రమునందు గ్రథితములైనట్లున్న
వి. అవి రెండును విశ్వమండలమునకు సమానగతితో నవిరతముగఁ
బ్రదక్షిణము చేయుచుండు నని తోఁచుచున్నది.

విమల—విలాసమయియు, లావణ్యమయియు, హాస్యకౌతు
కనిరతయు నగువిమల విధవయైపోయినదా! ఎవతె తనకు ప్రణయా
స్పదుఁడైనపురుషుని బొందుటకై యనేకకష్టముల ననుభవించినదో,
సహధర్మిణీగౌరవము లేకపోయినను తనస్వామికి తానొకదాసిమా
త్రమని చెప్పుకొనుచుఁ జిరకాలమాతనిగృహమునం దొకపరిచారి
కవలె నెవతె కాలము వెళ్లపుచ్చుకొనుచుండెనో, అట్టివిమల నామె
హృదయేశ్వరుఁడు శాశ్వతముగ విడనాడిపోయెనుగదా! అబ్బ! అది
సహించుటకు సాధ్యమైనయాతనయేనా? కాని యట్టియసదృశయా
తనలయందును మనస్సును హర్షసంయుతముగాఁ జేయుకార్యములు

లేదా? ఉండుననిచెప్పవచ్చును. వీరుఁడైనయామెపతి వీరునివలెనే తే
జస్వియై కాతరమేమియులేకుండ ప్రాణములను తుచ్ఛములుగనెంచి
త్యాగమొనర్చెను. ఆకార్యము వీరపతికి మిగుల గౌరవమును
కలుగఁజేసెను. ఆమెకుఁగలిగిన వేఱొకగౌరవవిషయమేమనఁగా—విమ
లతనపతి ఘాతకుఁడును, హృదయహీనుఁడును, పరమశత్రువు నగున
వాబు కటుల్ఖానువక్షస్థలమున తనస్వహస్తముతో నిశితఖడ్గముఁ
చే నొక్కపోటు పొడిచి యాతనిని శమనసదమునకు పంపించినది.
అది యామెకు మిగుల గౌరవకారణమయినదియే. ఇంకనునాహ్లాదక
రమైనవిషయమొకటికలదు. అదియేమనిన——మిగులగారాబముతోఁ
బెంచిన తనముద్దులపట్టితిలోత్తమమనోభీష్టము సఫలీకృతమయ్యెను.
సుశీలయు, సురసుందరియు నగుతిలోత్తమ మహాగౌరవయుతుఁడును
మహారాజునగు మానసింహునకుఁ గోడలయ్యెను. ఆమెగర్భమునజ
న్మించెడితనయుఁడు ముందు అంబరేశ్వరుఁడు కాఁగలఁడు. అది యొ
కసామాన్యమైనయానందమా?

తిలోత్తమ——పితృహీన——తండ్రిపోవుటచే దుఃఖితయైనతి
లోత్తమ ప్రేమమయుఁడైన తండ్రిప్రేమధనమునుండి వంచితయై
హృదయవిదారకవ్యధ ననుభవించుచుండెను.——ఔను——దానికి సం
దేహము లేదు. కాని, మర్త్యాంతికములగు వ్యథలమధ్యమునగూడ నా
నందమొనగూర్చుకార్యములు లేవా? అనేకములున్నవి. క్రూరాత్ముఁ
డగు నవాబుకటుల్ఖానుని పాపపంకిలమైనయంతఃపురమునం, దామె
బందీయయ్యెను. కటుల్ఖానుని యంతఃపురమునకుఁ బోవుటతటస్థిం
చినచో స్త్రీలలో తమపవిత్రతనుగాపాడుకొని ధర్మధనమ్మును గో
లుపోనకుండ వచ్చినవారొక్కరును లేరు. కాని తిలోత్తమకుమాత్ర
మచ్చట నెట్టికళంకమును సంప్రాప్తముకాలేదు. ఆమె తండ్రియగు

వీరేంద్రసింహుఁడు శత్రువులచే నిహతుఁడయ్యెను. ఆమెజీవనసార రూపుఁడగు జగత్సింహుఁడు శత్రువులయస్త్రఘాతముచే మృతప్రాయుఁడై పోయియు పునర్జీవితుఁడయ్యెను. ప్రేమముగ్ధుఁడును సౌందర్యవంతుఁడును సౌభాగ్యశాలియు వీరపురుషుఁడునగు కుమారజగత్సింహుఁడు పవిత్రమైనవివాహబంధముచేఁ గట్టువడి యెల్లవేళల, నెల్లభావములఁ దిలోత్తమనే తలపోయుచుండెను. అది యొకనిరుపమానమైన యత్యంతానందముకాదా ?

మహారాజగు మానసింహుని యాజ్ఞానుసారముగా మందారణదుర్గము స్వర్గస్థుఁడైన వీరేంద్రసింహుని పత్నికిని, యాతనితనయయగుతిలోత్తమకు నొసఁగఁబడి వారిరువురకును స్వాధీనముఁ జేయఁబడియెను. మందారణదుర్గము కొలఁదికాలము పఠానులవశమునందున్నను ప్రకృతమున నట్టి పరాధీనచిహ్నము లేవియు నట కాన్పించుట లేదు.

అపరాహ్ణకాలమునం దొకనాఁడు దుర్గమధ్యమున నంతఃపురమునకుఁ జేరియున్న యొకసౌధముపైఁ గుమారజగత్సింహుఁ డొంటరిగ నటునిటు ప్రచారముసేయుచుండెను. ఆతనిమొగముపంకఁ బరికించిచూచినచో నాతఁ డేదియోవిచారముచే దిగులొందియున్నట్లు తోఁచును. అచ్చటి యామృదుమలయానిలముగాని, యత్యంతరమణీయమైన యాప్రదేశముగాని యాతనిహృదయమున కించుకంతయును వినోదమును కలుగఁజేయుచున్నట్లు తోఁచుటలేదు. ఆతని హృదయప్రాణవినోదకారిణి యైనసుందరితో వివాహసూత్రమున బద్ధుఁడై యింకను నొకనెలయైనను కాలేదు. అట్టి నవోఢ యయ్యునాసుందరి యాతని నొకనిమిషమైనను విడువకుండ సహచరియై యుండెనని చెప్పినను చెప్పవచ్చును. అట్టిచో నాతఁడు చింతనొందు

చుండుటకుఁ గారణమేమి చెప్పుమా ?

దారుకేశ్వరనదీతీరమున శిబిరములను స్థాపించుకొని సైన్యములతోఁగూడ నివసించియున్న మానసింహుఁడు కలహము లడఁగిపోయినవని తెలిసికొని శిబిరముల నెత్తివైచి యనుచరులతోఁగూడ పాట్నానగరమునకుఁ బయనమైపోయెను. జగత్సింహుఁ డాసమయమునకుఁ బోయి యాతనిని గలిసికొనఁజాలఁడయ్యెను. ప్రస్తుతమునఁ జేయవలసిన విశేషకార్యభారమేమియు నాతనిపై లేకుండుటచే నాతఁడు తనయిష్టమువచ్చినట్లు కాలమును వినోదముగా గడపుచుండెను. ఆతఁడిపుడు మందారణదుర్గమునఁ బ్రేమమయి యగు ప్రణయినీసంగసుఖమునఁ గాలమును గడపుచుండెనని వేఱుగఁ జెప్పనక్కఱలేదు.

యువరాజగుజగత్సింహుఁడు ప్రచారము సేయుచుండిన యాసౌధముపై నొకవైపున శయ్యయొకటి సిద్ధముగ వేయఁబడియుండెను. జగత్సింహుఁ డాశయ్యపైఁ గూరుచుండకయే యాసౌధముపై మఱియొకవైపున నిటునటు నూరక తిరుగాడుచుండెను.

ఇంతలో భువనమోహిని యగునొకజవ్వని యచ్చటికరుదెంచెను. లావణ్యమయి యగునాలలనసమాగమముచే, నస్తమయోన్ముఖుఁడగుసూర్యదేవుని స్వర్ణమయకిరణజాలముతోఁగూడిన సుషమామయియగు ప్రకృతిదేవికిసైత మధికకాంతి కలుగుచుండెను. సౌందర్యసంపన్నయుక్త యగునాయువతియు లజ్జాయుక్తమగువదనముతో జగత్సింహుని సమీపించి మృదుమధురకంఠస్వరమున "యువరాజా! నారాక యాలస్యమయ్యెనా యేమి ?" అనియెను.

జగత్సింహుఁడు—అంతవిశేషకాల మాలస్యమైనట్లు కాన్పింపదు. కాని, యోప్రాణాధికా! ఎవతె దగ్గరలేనిచో యర్ధనిమిష

మైన శోకమహోదయముగఁ గాన్పించుచుండునో, యట్టి నీవు చేసిన యీయత్యల్పాలస్యముగూడ నెంతయో నాలస్యముగా నాకుఁ గనఁ బడుచున్నది.

లజ్జాశీల యగునాసురసుందరి చిఱునగవుతోఁగూడిన తనవదనమండలము నించుక వంచుకొనియెను. యువరాజు తనవామబాహువు నామెవీపునఁజేర్చి దగ్గరఁదీసి యేమియుఁ జెప్పకుండ నామె యాజ్ఞలేనిదే సుధామధురబింబాధరమును పరిపూర్ణప్రేమముతోఁ బరిచుంబనము గావించెను. లజ్జవలననో, అనురాగమువలననో, సంకోచమువలననో, మరియెందువలననో నాయువతీముఖమండలము కెంపువన్నెమును దాల్చెను.

ఆసుందరి దుర్గేశనందినియగు తిలోత్తమయే. ఆయువతీయువకులకు పరిణయమయి యెన్నిదినములో కాలేదు. వారిపూర్వపరిచయమ్ము చిరవ్యాపిమైనదియుఁ గాదు. అందుచే సుశీలలగుసుందరులకు స్వభావమైన సంకోచమును, లజ్జయు నించుకంతయు కొఱఁతపడకుండ సంపూర్ణముగ వచ్చి యామె నావరించుకొనినవి.

తిలోత్తమ మఱింత ముఖమును వంచుకొనియెను. ఆనందానురాగములతోఁగూడినలజ్జయు నామెముఖమండలమున కొక యపూర్వకాంతి నొసఁగెను. ముగ్ధుఁడగుజగత్సింహుఁడును సతృష్ణనయనములతో నాకాంతిని సందర్శించుచు "సుందరీ! ఎవరి పుణ్యబలముచే మనకిరువురకును నిట్లు సంఘటితమైనది? చెప్పఁగలవా?" అని యడిగెను.

తిలో—ఎవరిపుణ్యఫలమా? నాదియే. కాకున్నమీపుణ్యఫలమా?

జగ—నాపుణ్యఫలమనియే చెప్పవలయు. నీవీప్రపంచమున

సారరత్నమవు. నీతోసమానమైనరత్న మీలోకమున లేదు. ఈరత్నము దేవతాకంఠము నలంకరింపఁదగినది. అల్పమనుష్యుఁడనైన నన్నుఁగూర్చి చెప్పనేల? మనయీసంఘటనము పుణ్యముయొక్క-ఫలమే యైనచో జన్మాంతరమునందట్టిపుణ్యమును నేను చేసియుండవలయును.

తిలో—అసత్యమును దాపఁదలసివచ్చినచో నిట్లే యన్యథా మాటలాడవలయును. నాథా! నీవెవరవో నేనెవతనో. నీవెఱుఁగనివాఁడవా? నీవు భువనవిఖ్యాతుఁడైన అంబరేశ్వరునితనయుఁడవు. రూపమందేమి, సాహసమందేమి, వీరత్వమునందేమి, గుణమునందేమి, యీప్రపంచమున నీతో సమానులెవ్వరును లేరు. ఇఁక నేనంటినా! అత్యల్పమైన మందారణదుర్గమందలి సామాన్యభూస్వామితనయను. నీదాసానుదాసిగనుండుటకుఁగూడ యోగ్యను గాను. నీవు నాయందలిదయచే నీపాదపద్మములకడ నొక్కింత స్థానమొసంగితివి. ఇది నేననేకకోట్లజన్మములయందు చేసిన పుణ్యఫలము కాదా? నిజము చెప్పుము చూతము.

జగ—పుణ్యము నీదియో నాదియో-ఆవివాదమునఁ బ్రస్తుతము మనకించుకంతయుఁ బ్రయోజనము లేదు. కాని హృదయేశ్వరీ! స్వర్గలోకమునకంటె నధికమధురమైన స్థానమును నిహలోకముననే నిర్మించుకొనుట, నందనవనసమీపమున దేవత లనుభవించుదానికంటె నత్యధికసుఖభోగముల నీలోకముననే యల్పుఁడైనమానవుఁడుకూడ ననుభవించుట యనునీరెండును నేను నీసంఘటనముచేఁ బొందితినని యనుకొనుచున్నాఁడను. నీవు నన్ను భాగ్యవంతులలో నగ్రగణ్యునిగాఁ జేసితివి. నేను నీకుఁ జాలకాలము ఋణపడియుండెదను.

• తిలో—(ఇంచుకనగవుతో) కఠోరహృదయముగల యసిసా థసుఁడగు మహావీరుని రసనయం దిట్టియమృత మున్నదని నేననుకొన లేదు—ఎవ రెవరికి ఋణపడియుండిరో, ఆవిషయమునుగూర్చి బాగుగ యోచించితిరా? యోచించిచూడుఁడు. నానిమిత్తమున వీ రేకార్యములను చేయకుండనుండిరి? అత్యంతపరాక్రమవంతుఁడగు మానసింహుని తనయుఁడవై యుండియు స్వతః వీరాగ్రగణ్యుఁడవై యుండియు యితరులదుర్గమున కర్థరాత్రియందు తస్కరునివలె ప్రవేశించుట యెందుకొఱకు? ఈయబలనొకసారి చూడవలయునని కాదా? పుణ్యశ్లోకుఁడవు నత్యంతధార్మికుఁడవునై యుండియు, స్వల్పపరిచితయు నవివాహితయు నగునొకకులకామినియొక్క యంతఃపురమున కొంటరిగఁ బ్రవేశించుట యెందుకొఱకు? ఈభాగ్యవతితోనొకటిరెండు మాటలాడుటకై కాదా! శత్రుగణములయస్త్రాఘాతములచే శరీరమందలి యమూల్యమైన రక్తమునంతయుఁ బోఁగొట్టుకొని మృత్యుముఖమున కేగుట యెందుకొఱకు? ఈయధమస్త్రీయొక్క తుచ్ఛమైనప్రాణమును రక్షించుటకొఱకుఁగాదా? దురాత్ములగు శత్రువులచేఁ జిక్కి చాలకాలమువఱకు బందీవై కాలమునుగడపుటయెందుకొఱకు? ఈహీననారిపై ప్రేమాకర్షణముచేఁగాదా? నీచరణదాసిగనుండుటకైన యోగ్యతలేనియబలను బరిణయమాడి ప్రత్యక్షదేవతాస్వరూపుఁడైన జనకుని యాగ్రహమునకుఁ బాత్రుఁడవగుటెందుకొఱకు? ఈయధమవనితపైఁ గలమమతచేఁగాదా? యువరాజా! ఇప్పుడు యోచించి చూడుము. ఎవరికెవరు ఋణపడియున్నారు?.

తిలోత్తమపలికిన తుదివాక్యమును విని జగత్సింహుఁడు మిగుల విచలితుఁడయ్యెను. ఆతఁ డాసుందరితోడి యితరసంభాషణము



మాని "ప్రాణేశ్వరీ! ఇంక ముందు నాయదృష్ట మెట్లున్నదో చెప్పఁజాలను. నీ వీ సంభాషణములో మాజనకునియాగ్రహమునుగూర్చి వక్కాణించితివి. అందుమూలమున నాహృదయమున కళవళము హెచ్చయినది. ఆవిషయమున నే నుదాసీనుఁడనై యున్నాఁడను. ప్రాణేశ్వరీ! రమ్ము. ఇటఁ గూర్చుండి యావిషయమున మనకర్తవ్యమేదియో యాలోచింతము" అనియెను.

తిలోత్తమ మాటలాడలేకపోయెను. పరిఫుల్లకమలనిభమగు నామెవదనము వాడిపోయెను. తనవివాహవిషయము మహారాజగుమానసింహునకుఁ దెలియదనియు, దానిపరిణామము భయానకమైనదనియు నామె యెఱుంగును. ప్రస్తుతప్రస్తావమున యువరాజునోటినుండివచ్చిన శంకావాక్యములను వినుటచేఁదిలోత్తమకుఁ బ్రాణమేపోయినట్లయ్యెను. ఆమె వడఁకుచు భర్తతోఁగూడ మెల్లమెల్లగఁ బోయి యట సిద్ధముచేయఁబడియున్నశయ్యపై నొకవైపున నిశ్శబ్దముగఁ గూర్చుండియుండెను.

జగత్సింహుఁడును తిలోత్తమసమీపమునకు వచ్చి కూర్చుండి వామబాహువుచే నామెకంఠమునుజుట్టి కౌఁగిలించుకొని యుత్కంఠితమై నిశావసానకాలశరచ్చంద్రబింబమువలె మలినమైయున్న యామెముఖమండలమును తనవిశాలవక్షమునం జేర్చికొనియెను. తిలోత్తమయు భయకంపితయై దేవతాస్వరూపుఁ డగుతనస్వామివదనమును స్థిరనయనములతోఁ జూచుచుండెను.

జగత్సింహుఁ డిట్లు చెప్పనారంభించెను. "నాతండ్రి నాపై మిగులనాగ్రహముఁ జెందియున్నాఁడు. ఆతఁడుతనయాగ్రహమును మాటలలో వ్యక్తపరుప లేదు. ఆతనికి నమ్మకముఁగలిగియున్న మనుష్యులమూలమునను నాకుఁ దెలియఁజేయ లేదు. కాని, యనే

కళత్రసహాసప్రిలక్షణములచే నాతఁ డాగ్రహమునొందియున్నట్లు వ్యక్తమగుచున్నది.

తిలో—(మెల్లగా) అయినచో, జాగరూకుఁడవై యుండ లేదేమి?

జగత్సింహుఁడు సరళస్వభావయగు నాయువతిముఖమునుచుంబనమాడి, ఇంచుక నగుచు "ఎంత సరళస్వభావవు! జాగరూకతయా? నీముఖమునుజూచి, నీప్రేమసాగరమునమునింగి, నీయందాత్మసమర్పణముచేసినవాఁడు మృత్యుదేవత నెదుటఁ జూచినను నాపద్భయముచే జాగరూకతకై ప్రయత్నింపఁగలఁడా? జాగరూకతమాట చెప్పకుము. జాకరూకతనుగూర్చి నేను యోచించుటలేదు" అనియెను.

తిలో—అట్లయినచో నిప్పుడు యోచించు టెందులకు?

జగ—ఇపుడు యోచించుటకు రెండుకారణము లున్నవి. నా జనకుఁడు రాజపుత్రవీరుఁడు. ఆతనిమనసున నుదయించినభావము క్రియారూపకముగఁ బరిణమించుట కాలస్య మెంతమాత్రము నుండదు. అతనియిష్టమునకు వ్యతిరేకముగ మాటలాడువా రీభూమండలమునం దెవ్వరును లేరు. పాదుషహాఅక్బరుసైత మాతనియిష్టము ననుసరించి నడచుచుండు నని చెప్పనప్పు డితరులమాట చెప్పనేల? అట్టినాజనకుఁడు నన్నవిధేయుఁడైనతనయునిగా నెంచి నాకు ప్రాణదండననువిధించినను నాశ్చర్యముగానుండదు.

తిలోత్తమ చకితయయ్యెను. జగత్సింహుఁ డిట్లని మరలఁ జెప్పఁదొడఁగెను. భయపడకుము. రాజపుత్రవీరుఁ డెప్పుడును మరణమనిన భయపడఁడు. చావనిన నాకెప్పుడును భయము లేదు. కాని, నాకిప్పుడు భయమగుచున్నది. మరణించినచో నీవియోగచింతను సహించుటయసాధ్యమని నాకుఁ దోఁచుచున్నది.

తిలో—(సజలనయనయై) ప్రియమయా! వియోగము కలుగు ననుభయము నాకు లేదు. నీవు వీరశ్రేష్ఠుఁడవు. కాతరమే మియు లేకుండ మరణింపఁగలవు. వీరపత్నులును నవ్వుచునవ్వుచుఁ బ్రాణములను విడువఁగలరు.

జగ—అయినచో నిప్పుడిఁక నాభయమునకుఁగారణముండదు. స్వాభావికమైన యపత్యస్నేహము జనకుని, నంతటికఠోరకార్యము నందుఁ బ్రవర్తింపకుండఁజేసినను చేయవచ్చును. కాని, యంతకంటె ద్విగుణీకృతమైన కఠినతరదండనను విధింపఁగలఁడు. సులభముగా ప్రాణములను దీసివైచి యాతనాసమూహమును దుదముట్టించుటకు బదులుగ స్వల్పస్వల్పముగఁ బ్రాణములుపోవునట్లు భయంకరయాతన లనుభవించుచుండునట్టి కఠోరదండనను విధింపఁగలఁడు.

తిలోత్తమ యావాక్యములను విని కంపితయై "అదియెట్లు?" అని యడిగెను.

జగ—ప్రాణేశ్వరీ! నీపాణిగ్రహణవిషయ మాతని క్లిష్టము గాకుండనుండవచ్చును. అందువలన నన్నిఁక మరలనెన్నఁడును నిన్నుఁ జూడకుండఁజేయును.

తిలోత్తమనేత్రములనుండి బాష్పములు ప్రవహింపనారంభించెను. ఆమె రోదనముచే జడితమైన క్షుబ్ధస్వరముతో "నాసవతి తల్లియగు విమల ధర్మపత్నియయ్యును భర్తయింట దాసివలె కాలమును గడపిపుచ్చినది. నేనునట్లే కాలము గడపుటకు మామగారింట స్థలముదొరకదా!" అనియెను.

జగత్సింహుఁడు తనవస్త్రముచేఁ దిలోత్తమనేత్రములను తుడుచుచు "భయపడవలదు. వ్యాకులత నభివృద్ధినొందింపకుము. మనుష్యవాసస్థలములను వీడి బహుదూరము పోయి సముద్రతీరమున

నొక చెట్టునీడను నీతోఁగూడి వాసముచేయుచుండినను నేను ధన్యుఁడనే యగుదును. కాని, నాజనకుఁ డెందును నెదురులేనిశక్తిశాలి. అతని యిష్టమునకు వ్యతిరేకముగ నిలిచియుండుట కీప్రపంచమున నెవరికిని సామర్థ్యము లేదు. అయినను సాధ్యమైనంతవఱ కనుకూలమగుట కనేకప్రయత్నములను జేసిచూచెదను. ఆపైని భగవంతుఁ డున్నాఁడు. ఈశ్వరునియాజ్ఞ యెట్లున్న నట్లగును" అనియెను.

తిలోత్తమమాటాడకుండ నెమ్మదిగఁ గూర్చుండెను. ఆమెనేత్రములయందు బాష్పములు లేవు. ఆమెముఖమున విషాదచిహ్నము లేవియును లేవు. జగత్సింహుఁ డాదరముతో నామెనుజూచి "తిలోత్తమా! ఏమి యాలోచించుచున్నావు?" అనియడిగెను.

తిలోత్తమయునిట్టూర్పువిడిచి "మరణమునకు మార్గమెప్పుడడ్డములేకుండ తెరవఁబడియుండును—అంతకంటె వేఱుచింత యేమున్నది?" అనియెను.

నూతనపరిణీతులగు ప్రేమోన్మత్తదంపతుల కెట్టి విషమతర యాతన!



## రెండవప్రకరణము.

మఱునాఁడు ప్రాతఃకాలమున జగత్సింహుఁడు చక్కఁగ శృంగారించుకొనివచ్చి మనోహరముగ నలంకరింపఁబడిన తనగుఱ్ఱము పైఁ గూర్చుండి యొంటరిగ వెలుపలకు బయలుదేరెను. మధురమై

సమస్త్రహానకారిణియైన యీయుషఃకాలమునందు ప్రకృతిదేవి పర
మరమణీయవేషమును ధరించియుండెను. పూర్వదిగంగనయు రక్తాం
బరధారిణియైన ప్రగల్భనారివలె నవకుంఠనమును భేదించుకొని వ
దనమండలము నించుక తోంపింపంజేయుచుం జిఱునగవు నవ్వుచుండె
ను. వివిధములగు ననేకపక్షులు విశేషోన్నతములేని వృక్షశాఖాంత
రములయందుం గూర్చుండి తమమధురగీతధ్వనులచే శ్రోత్రలహృద
యముల నాకర్షింపంజేయుచుండెను. శుకపికాదిపక్షిసంతతుల మనో
హరకాకలీశబ్దము లితరపక్షిగణధ్వనులతోం జేరి చాలదూరమున ఱ
కు నానందప్రవాహమును వెల్లివిరియంజేయుచుండెను. అప్పుడు
శాంతియు, పవిత్రతయు, మాధుర్యమును, శోభయు, ప్రీతియు, నా
నందమును మూర్తిభవించి యచ్చటచ్చట సంచరించుచున్నట్లు తోం
చుచుండెను. ఆసమయమున జగత్సింహుండు తెలుపువన్నెగల తన
గుఱ్ఱము నధిరోహించి యొంటరిగ దుర్గతోరణమును దాటిపోవుచుం
డెను. శాంతిపూర్ణమైన యీ దృశ్యప్రపంచమునడుమ చిరాభ్యస్త
మైన యాయశ్వము చిరపరిచితుండైన యాజగత్సింహుని వీపున వ
హించుకొని మెల్లమెల్లగ ముందునకుం బోవందొడంగెను.

జగత్సింహుండును, తిలోత్తమయు రాత్రియంతయును సం
తాపనాశకమైన నిద్రాదేవత నాశ్రయించియు నామెసాన్నిధ్యము
నందలేకపోయిరి. ఇరువురకును నించుకంతయును సుఖములేకపోయె
ను. వాయుప్రవాహమున నించుకసేపు తిరుగాడినచోం దలయును
మెదడును జల్లవడి చింతాభార మొక్కింతయైనను తగ్గునేమో యని
యోచించి జగత్సింహుండు తెల్లవారకమునుపే, యెవరును లేవక
పూర్వమే శయ్యనువిడిచి లేచెను. ఆతండు లేచుటకుం బూర్వము తిలో
త్తమకుం గొంచెము నిద్రపట్టనారంభించెను. జగత్సింహుండు మిగుల

జాగరూకతతో తనజీవనస్వరూపము, నిద్రితయు నగుతిలోత్తమ
బాహుపాశము మెల్లగ విడిపించుకొనియెను. నిద్రాభిభూతయగు
నామాధురీరాశి నొక్కింతసే పత్యాసక్తనయనములతోఁ జూచి పిదప
నామె కపోలము నాదరముతో ముద్దువెట్టుకొనియెను. పిమ్మట స్వ
భావసుందరియగు నామె శోభామయశరీరమును జూచుచు నిట్టూ
ర్పు విడుచుచు నటనుండి బయలువెడలెను.

దుర్గమునుండి కొంచెము దూరమేగి ముందునకుఁ బోవకుండ
నిలిచి హృదయమున నేదియోతోఁచుటచే జగత్సింహుఁడు దుర్గము
నందలి తిలోత్తమశయనమందిరమువంక తిరిగిచూడ నారంభించెను.
చూచుచు గుఱ్ఱపుకళ్లెమును సడలవదలెను. అక్కడ కనఁబడుచుం
డు వస్తువులను ఱెప్పవేయక చూచుచు నిలుచుండియుండెను. శయ
నమందిరగవాక్షమునందు చెదరిపోయినమలినవస్త్రములుగలదియు,
వీడిపోయినకుంతలములుగలదియు, చెదరినహారములుగలదియు నగు
తిలోత్తమ నిలుచుండియుండుటను జూచెను. జగత్సింహుఁ డనేకప
ర్యాయము లనేకభావములతో నాశోభామయిని జూచి విమోహితుఁ
డయ్యెను. కాని, యిప్పు డామాధురీసమయమున—ఆ మాధురీక్షే
త్రమున—ఆమాధురీశోభామధ్యమున—ఆ మాధురీమూర్తి నిలు
చుండియున్న ట్లాతనిహృదయమునఁ దట్టెను.

జగత్సింహుఁడు శయ్యనువిడిచిన కొంతసేపటికే తిలోత్తమ
యు మేల్కని యశ్వశాలనుండి యాయితముచేసి తీసికొనిరాఁబడు
చున్న గుఱ్ఱముడెక్కలచప్పుడు విని యాత్రముతో ప్రేమమయుఁ
డగు తనహృదయరత్నమును జూచుటకై గవాక్షముకడ నిలుచుండి
చూచుచుండెను.

జగత్సింహుఁ డామెనుచూచుచు హృదయముపై తనరెండు

చేతులను జేర్చికొని యామెకుఁ దనప్రణయసూచనను గనఁబఱచెను.
తనచౌకమును విసిరి యామెను లోపలికిఁబొమ్మని సూచించుచు తో
డనే వచ్చెదనని తనచేతితో సంజ్ఞను చేసెను. గుఱ్ఱము మెల్ల మెల్లగ ముం
దునకుఁ బోవుచుండెను. ముందునకుఁ బోవుచున్న జగత్సింహుఁడు మ
రల వెనుకకుఁ దిరిగిచూచెను. సుందరియు నెప్పటియట్ల యట నిలు
చుండియుండెను. ఆతనిదృష్టి యామెవైపునకుఁ బ్రసరింపగనే చీరసవ
రించుకొనుచు నేలపై శిరమునుంచి యామె ప్రణామము చేసెను. జగత్సిం
హుఁడును తనచేయెత్తి "శుభమగుఁగాక!" యనువాక్యార్థము సూ
చించునట్లు సంకేతము చేసెను. గుఱ్ఱము ముందునకుఁ బోవు
చుండెను. జగత్సింహుఁడును మరల వెనుకకుఁ దిరిగిచూచెను. తిలో
త్తమ రోదనము చేయుచుఁ జెఱుగుచేఁ గన్నులను తుడుచుకొనుచుండె
ను. జగత్సింహుని హృదయము కళవళమందఁజొచ్చెను. ముందునకుఁ
బోవుటకు మనసొప్పలేదు. స్వల్పదూరము పోయి యటనుండి మర
లఁ దిరిగి రావలయునని స్థిరపఱచికొని యశ్వమును దాటించెను. అ
ది వేగముగ నడచిపోయెను. జగత్సింహుఁడు మరల వెనుకకుఁ దిరి
గిచూచెను. గవాక్షము నేత్రగోచరము కాలేదు. ఆతఁడు నిట్టూ
ర్పును విడిచెను. అశ్వము సమవేగముతోఁ బోవుచుండెను.

జగత్సింహుఁడు మొట్టమొదట నేమార్గమున మందారణదుర్గ
మునకు విమలతోఁగూడ వచ్చియుండెనో, ఆమార్గముననే యిప్పుడు
ను పోవుచుండెను. అదియే మామిడితోఁట. ఏయుద్యానవనమునం
దలి చెట్టుకడ విమల తెచ్చియిచ్చిన భల్లముచే జగత్సింహుని హ
స్తమునందు పఠానుఁ డొకఁడు మరణమునందెనో, ఆయుద్యానవన
ము దాటి ముందునకుఁ బోయెను. ఆస్థలమున నిప్పుడు జగత్సిం
హుఁ డద్భుతవేషధారి యగు నొకపురుషుని జూచెను. ఆవ్యక్తి

యనుపమానదీర్ఘకాయుఁడును, ఘోరకృష్ణవర్ణశరీరుఁడునై యుండెను. క్షురికాస్త్రసాహాయ్యముచే నాతనిమస్తకము కేశశూన్యమయ్యె, వెనుకభాగమున నొక్కింతకేశగుచ్ఛముమాత్రము శిఖాకారమునఁ గాన్పించుచుండెను. వదనము శ్మశ్రుశూన్యమై యుండెను. ఆతనిదేహమున యధోభాగము పాయిజామాచే నావృతమై యుండెను. ఊర్ధ్వభాగము విచిత్రకంచుకాచ్ఛాదితమై యుండెను. ఆతనికంఠమునందలి రుద్రాక్షమాల చరణద్వయమువఱకును వ్రేలాడుచుండెను. దీర్ఘమగు నాతనినాసిక పైఁదిలకమునకుబదులుగ మృత్తికయుండెను. జగత్సింహుని జూచుటతోడనే యావ్యక్తియు తనచేతిని ముందునకుఁ జాపి "ఖుదానారాయణుఁడు మీ కెప్పుడును మేలొనఁగూర్చుఁగాక" అని యాశీర్వదించెను.

జగత్సింహుఁడు నగవు నాపుకొనుచు "మీరేనా గజపతివిద్యాదిగ్గజులు?" అని ప్రశ్నించెను.

రుద్రాక్షధారి యగునాపురుషుఁడు "ఔను మహాస్వామి! వ్యాకరణాదిశాస్త్రములు తుదముట్టినవి. స్మృతులన్నియు నభ్యసించితిని. అన్నిఁటియందును నాపేరు జగద్విఖ్యాతమైనది. ఇప్పుడు ఉర్దుభాషయందును శిక్షితుఁడనై యుండుటచే నాపేరు బ్రహ్మాండమువఱకును వ్యాపించినట్లు తోఁచుచున్నది" అనియెను.

జగ—మీకీవేషమెందులకు?

గజ—యవనులసంపర్కముచే యవనవేషమే సంభవమైనది. పఠానులు నాజాతిని ధ్వంసముచేసి నావేషమునుమార్పించి వెడలిపోయిరి. నావలెనే యితరులనేకులు వారిసంశ్రయమునందున్నారు. వారికెవరికిని జాతిపోలేదు. వారందఱును గ్రామమునకువచ్చి చేరెదరు. నేనును నధ్యాపకులగుమాస్వాములకడకుఁబోయి వారికి సలా

ములుచేసితిని. వారు నన్నుఁజూచి నీవీవేషముతో నాశ్రమమునకు రాఁగూడదు. నీకు సనాతనధర్మశాస్త్రములను పాఠములుగఁ జెప్పఁ జాలను" అని సెలవొసంగిరి. అదివిని నేను "బాలానాంరోదనంబలం" అనియెఱింగి యేడువఁదొడంగితిని. "అమృతంబాలభాషితం" అని యుండుటచే నధ్యాపకమహాశయులు సంతుష్టచిత్తులై "నీవు గంగా తీరమునకుఁబోయి యచ్చట మూఁడుదినములు నివాసముచేసి గం గాస్నానమునుజేసి మస్తకాదులనుముండనముచేసికొని యొకదినము హవిష్యమును భుజించి తిరిగి వచ్చితివేని మరలఁ బాఠములనుచెప్పె దను" అని యాజ్ఞయిచ్చిరి. నేనును గురునియానతిని నవియన్నియు ను జేసి తిరిగి యాశ్రమమునకుఁ బోవుచున్నాఁడను.

జగ—అయినచో మరల నీవేషమేల?

గజ—వస్త్రాభావము—యవనులు నావస్త్రములనన్నిఁటిని లాగికొని వీనినిచ్చిరి. వీని నుపయోగించుటకంటె గత్యంతరమేమి యును లేదు.

జగత్సింహుఁడు తనకవచమునందుండి యొకరూపాయనుదీసి గజపతికొసఁగి మీరు దుర్గమునకు వచ్చిచూచినచో మీసంగతు లన్నియు వినియెదను" అనియెను.

గజపతియు రూపాయను దీసికొని "స్వస్తి శ్రీభోజరాజ! మీ రిప్పుడు వీరేంద్రసింహుని స్థానమును వహించియున్నారా?" అనిప్ర శ్నించెను.

జగ—మీరు నన్నెఱుఁగరా? పఠానులశిబిరమునం దొకప్పు డు మిమ్ములను నేను జూచియున్నాఁడను. స్వర్గస్థుఁడైన వీరేంద్రసిం హునితనయను నేను పరిణయమాడితిననుసంగతి మీ రెఱుంగరా?"

దిగ్గ—ఔనౌను. భార్యయుఁ బుత్రికయు—వీరుచుపురను గ్రా

పాడవలెయును. వీరేంద్రసింహుఁడు సతిని బుత్రికను సంరక్షించుభారము సరియైనవారియందుంచి స్వర్గారోహణమును చేసియున్నాఁడు.

గజపతివిద్యాదిగ్గజుని యసంగతవాక్యములను వినియు విననియట్లు జగత్సింహుఁడు ముందునకుఁ బోయెను. స్వల్పదూరముపోవునప్పటికి శైలేశ్వరునిమందిరము దృష్టిగోచరమయ్యెను. మందిరమువరకునుబోయి తిరిగి రావలయునని జగత్సింహునియభిప్రాయము. హృదయమునుబదిలపరచుకొని దేవాదిదేవునిచరణకమలములకుభక్తిభావముతో వందనముచేసి తిరిగి రావలయునని యాతఁడు నిశ్చయించుకొనియెను. జగత్సింహుఁడు దేవతాదర్శనము చేసి దేవునిపాదములకడ తనదుఃఖములను నివేదనముచేసికొనునూహతో చిత్తసంయమనము గావించుకొని యక్కడకుఁ బోవుచుండెను.

ఇంతలో దూరమునుండి యనేకాశ్వపదధ్వనులు వినవచ్చుటచే నాతనిచిత్తశాంతి దూరమైపోయెను. దూరమునందు కుండలాకారమైన మేఘఖండమువలె ధూళిరాశి యాకాశమండలమున వ్యాపించెను. జగత్సింహునిగుఱ్ఱము తనసమీపమునందు స్వజాతీయులువచ్చుచుండుటనుగుర్తించి వాలమునల్లాడించుచుఁ జెవులు రిక్కించి తనయభిప్రాయమును వ్యక్తపరిచెను. కొంచెముదూరములో ననేకవీరులు శీఘ్రముగఁ బరువెత్తుచుండుటను జగత్సింహుఁడుచూచెను.

జగత్సింహుఁడు ధైర్యవంతుఁడు. శత్రువులువచ్చుసంభవమేమియు నిప్పుడు లేదు. పఠానులు యుద్ధవిగ్రహములనువీడి యుత్కలదేశమునకుఁ బోయియుండిరి. దేశమునందు పాదుషహాసైన్యముతక్క వేఱుసైనికుఁడొక్కఁడును లేఁడు. పాదుషహాసైనికులు మందారణదుర్గమునకు శత్రువులుకారు. మహారాజగుమానసింహుఁడుస్వయముగా మందారణదుర్గాధికారభారము వీరేంద్రసింహుని యుత్తరాధికారు

లఁ జెందుట కంగీకరించియున్నాఁడు. అయినచో నీయెదుట వచ్చుచున్న వారెవ్వరు? వారెవరో యీ ప్రక్కకే వచ్చుచున్నారు. వారు మహారాజగు మానసింహుని సైనికులైనట్లు కనఁబడుచున్నారు. జగత్సింహున కాకస్మికముగ హృత్కంపము జనియించెను.

సైనికులు సమీపమునకు వచ్చిరి. వారందఱు నేబదిమంది యాశ్వికులుగా నుండిరి. అందఱును శస్త్రధారులై యుండుటే గాక బలిష్ఠులును పరిపుష్టశరీరులును నై యుండిరి. వారిలో నొకఁడు స్వాతంత్ర్యభావముతో నందఱికంటె ముందుగ వచ్చుచుండెను. ఆతఁడు తక్కిన సైనికుల కందఱకును నాయకునివలెఁ గనఁబడుచుండెను. నాయకుని యాజ్ఞాప్రకారము తక్కిన సైనికులందఱును గుఱ్ఱములకళ్ళెములను బిగ్గఁబట్టి నిలిచి సమభావముతోఁ దమతమ కత్తుల నొరలనుండి తీసి భుజములపై నమర్చి సమస్వరముతో "జయ! జయ! బాదుషహా అక్బరునకు జయమగుఁగాక! మానసింహ మహారాజునకు జయమగుఁగాక!" అని యుచ్చైస్స్వరముతో జయజయధ్వనులను జేసిరి.

జగత్సింహుఁడును తక్షణమే తన కత్తినిదీసి ధరించి "జయ! బాదుషహా అక్బరునకు జయమగుఁగాక! జయ! మహారాజగు మానసింహునకు జయమగుఁగాక!" అని జయజయధ్వనులను చేసెను. పిదప ముందుప్రక్కనున్న నాయకునితో జగత్సింహుఁడు "ఇదేమి? మధురాసింహా! సమాచారము లేమి? బాదుషహా కుశలవృత్తాంతములు తెలియుచున్నవా? మహారాజునకుఁ గుశలమా?" యని ప్రశ్నించెను.

మధురాసింహుఁడు గుఱ్ఱమునుండి దిగి నిలిచి "భగవంతుని యనుగ్రహముచే నెచ్చటను నమంగళసూచన లేవియు లేవు" అని యెను.

వెనుక నుండిన సైనికుఁ డొకఁడు వచ్చి మధురాసింహుని గుఱ్ఱపు

క్లేమును బట్టుకొనియెను. మధురాసింహుఁడు యువరాజుసమీపమునకువచ్చి యభివాదనముచేసి పిదప రుమాలనువిప్పి యందు కట్టియున్న యొకపత్రికనుదీసి యతివినీతభావముతో యువరాజుహస్తముకందించెను.

ఆయుధపాణులై సైనికులు వచ్చుచుండుటనుజూచి తనయానందసుఖభోగముల కానాఁడే యాస్థలమునందే యప్పుడే తుదికాలమని తెలిసికొని జగత్సింహుఁడు "నావిషయమున మహారాజు వారి యాజ్ఞయేమి?" అనియడిగెను.

మధు—యువరాజా! నేను మీయనుగతభృత్యుఁడను. ఈ దాసునియపరాధములను క్షమింపవలయును. మీరేయవస్థయందున్న నాయవస్థయందే నాతోఁ గూడ దీసికొనిరావలయునని మహారాజుగారి యాజ్ఞయైనది.

జగ—ఎక్కడకుఁబోవలయును?

మధు—పాట్నానగరమునకు— మహారాజుగారి సన్నిధానమునకు;

యువరాజు—కొంచెము సేపుండి, అనఁగా—ఇప్పు డిక్కడ నుండి బయలుదేరుట కన్నియు సిద్ధపరిచికొని వచ్చుటకంగీకరించుట కేమయిన నాక్షేపణమున్నదా?

మధు—(చేతులుజోడించుకొని) యువరాజా! మీరు మాతోఁగూడవచ్చుటకు వెనుకముందుఁజూచి యాలస్యముచేసితిరేని వెంటనే మిమ్ములను బందీగాఁ జేసి తీసికొనిరావలయునని మాకాజ్ఞయైనది.

జగ—ఇచ్చట నాకాత్మీయులు కొందఱున్నారు. వారిని జూచి వారికడ సెలవుగైకొనివచ్చుటకుఁగూడ నవకాశములేదా?

మధు—(పూర్వమువలెనే చేతులుజోడించుకొని) నేను దాసుఁడను. దాసునియపరాధములను క్షమింపవలయును. ఇంచుకైన నవకాశమిచ్చుట కాజ్ఞ లేదు.

జగత్సింహుఁడు పునరుక్తికిఁగాని ప్రతివాదమునకుఁగాని యది సమయముకాదని తెలిసికొనియెను. తనయపరాధము రాజద్రోహముక్రిందఁ బరిగణింపఁబడెననియుఁ దన్ను రాజద్రోహియని యెంచి విచారణము సేయనున్నారనియుఁ దెలిసికొని మధురాసింహునితో "మహారాజుగారి యాజ్ఞోల్లంఘనము సేయునంతటి ధైర్యవంతులగుమానవులీ భరతఖండమున నెవ్వరును లేరు. ఇఁక నేనంటినో!— సేవకులయందు క్షుద్రులలో క్షుద్రుఁడను. అయినను నిన్నొకప్రశ్నమడిగెదను. నాయంతటనేను మీతోఁగూడ రాకున్నచో నన్ను బందీగఁజేసికొని రావలయునని యాజ్ఞయైనదని చెప్పితివి. ఒకవేళ నేను నీతో యుద్ధముజేసినచో నప్పుడు నీవు నన్నేమిచేయుదువు? ఆవిషయమున నేమనియాజ్ఞయైనది?" అనియడిగెను.

మధు—యువరాజా! ఈదాసానదాసునినోటనుండి యంత మాట రానేరదు. యువరాజును మృతావస్థయందైనను, జీవితావస్థయందైనను సముఖమునకుఁ దప్పక తీసికొనిరావలయునని మహారాజుగారి యాజ్ఞయైనది.

జగత్సింహుఁడుచేసిన యీవిచారణయందు మహారాజత్యంతకఠోరమైనయాదేశ మొసంగెనని స్పష్టపడియెను. అందుచే క్షణకాలమైన నాలస్యము చేయుట కాతనికి ధైర్యముగాని, సాహసముగాని లేకపోయెను. మహారాజు సమ్ముఖమునకుఁ గొనిపోఁబడినప్పుడతికఠోరమైనదండనము విధించుటయే సంభవమగును. తప్పదు. కాని, యావిచారముతోఁ బ్రస్తుతము ప్రయోజనమేమి? భగవద్వాక్య

మును పరిపాలనముచేయుట కనేకమిషలను బన్ని కాలవిలంబమును చేసినఁ జేయవచ్చునుగాని, మహారాజగు మానసింహునియాజ్ఞకు మాత్రమట్టియాలస్య మించుకంతయును గాఁగాదు. ఉత్తరక్షణము ననే యాయాజ్ఞను ప్రతిపాలింపవలయును. జగత్సింహుఁడు మధురాసింహునితో "ఏమ్మా! మధురాసింహా! కాలవిలంబనమువలన ననర్థకమేకాని ప్రయోజనములేదు. నాసైన్యము దారుకేశ్వరనదీతీరమందు జహానాబాదుకడ నున్నది. దానివ్యవస్థ యేమికావలయును?" అనియెను.

మధు—దానికివలయు నేర్పాటులను నేను గావించెదను.

మధురాసింహుఁడు సైనికులలో నొకనినిబిలిచి యాతని నాసైన్యమున్నకడకుఁ బొమ్మని యాజ్ఞయొసంగెను. సైనికుఁడు మందారణదుర్గమార్గమున బోవునని యెఱింగి జగత్సింహుఁడాతనితో నిట్లనియెను. "మందారణదుర్గమార్గమునఁ బోవుచున్నప్పుడు నీకెవరైనను గాన్పించినచో జగత్సింహుఁడు తండ్రిగారియాజ్ఞాప్రకారము వారిసందర్శనమునకై పాట్నానగరమునకుఁ బోవుచున్నాఁడని యాతనితోఁ జెప్పుము." అని చెప్పి పిదప జగత్సింహుఁడు మధురాసింహునితో "నీసైన్యమును రెండుభాగములుగాఁ జేయుము. ఆరెండుభాగములనడుమను నేనుండవలయునని నాయభిప్రాయము. నీవు నాపార్శ్వమునుండి వచ్చుచుండవలయును." అనియెను.

మధు—యువరాజా! ఈదాసుఁడు మహారాజువారికింకరుఁడు. ఆజ్ఞాప్రకారము నడచుటకంటె నీతనికి వేఱేమియు లేదు.

తత్క్షణమే మధురాసింహుని యాజ్ఞానుసారముగ సైనికులు రెండుభాగములుగాఁ జీలిపోయిరి. ఒకభాగము జగత్సింహునకు ముందువైపునను, నొకభాగ మాతనికి వెనుకతట్టునను వ్యూహము

వలె నిలిచి వచ్చుచుండిరి. మధురాసింహుఁడు గుఱ్ఱమునధిష్ఠించి వ
చ్చి జగత్సింహునిపార్శ్వమున నిలుచుండియుండెను. అందఱును మె
ల్లగఁ బయనమును సాగించుచుండిరి.

తిలోత్తమా ! నీవెక్కడ ? నిన్నసాయంకాలము నీహృదయే
శ్వరుఁ డాశంకాసూచకముగఁ బల్కినవాక్యము లింతశీఘ్రకాల
ములోనే క్రియారూపమునఁ బరిణమించునని యెవరు తెలిసికొనఁగ
లరు ? జగత్సింహా ! స్వల్పకాలమునకుఁ బూర్వము గవాక్షమునందు
శిశిరసిక్తకమలమువలె, తొడిమనుండి రాలిపడినకుసుమమువలె, సూ
ర్యకిరణములచే క్లిష్టమైనకిసలయమువలె, మలినమైయున్నముఖము
ను చూచియున్నాఁడవు కాదా ? ఆసందర్శనమే నీకు తుదిసందర్శన
మయ్యెనా ? విగళితవసనభూషితమై నవీనబాలారుణప్రదీప్తమైన
యాశోభాసందర్శనము—ఆరోదనము—ఆ వీడుకోలు—ఆ ప్రణా
మము—హా ! హా ! అవియే నీప్రేమకుఁ దుదియభినయములా ?

## మూడవప్రకరణము.

శశకము విపత్సముదాయమునుండి తప్పించుకొనుటకుపాయము
గానప్పుడు తననేత్రములను మూసికొని యొకవైపున స్థిరముగా
నిలుచుండియుండును. కన్నులుమూసికొనుటచే దానికేమియుఁ గా
న్పింపదు. ఇతరులెవరును తనను చూచుచుండుటలేదని యది యను
కొనుచుండును. కుమారజగత్సింహుఁడును, నట్లే చేసెను. తండ్రి త

నీపరిణయమున కంగీకరింపఁడని యాతఁ డెఱుంగును. ఆతనికిఁ దెలిసినచో వివాహసంఘటనము కాదనియు, వివాహసంఘటనము కానిచోఁ దనజీవనసుఖమంతయుఁ జిరకాలము నష్టమైపోవుననియుఁ గూడ నాతఁ డెఱుంగును. కావున నావివాహవ్యాపారము నతిగోప్యముగ జరిగించెను. మఱియు నావృత్తాంతము తండ్రి కెప్పుడును తెలియఁజాలదనియు భావించుకొనియెను. అల్పప్రాణియగుశశకమువలె జగత్సింహుఁడు కన్నులుమూసికొని నిశ్చింతుఁడై యూరకుండక యుచితసమయమును గనిపెట్టి తండ్రిపాదపద్మములపైఁబడి జరిగినవృత్తాంతమునెల్ల ననుతాపముతో నాతని కెఱింగించినచో నపత్యస్నేహప్రాబల్యముచే ననుకంపవొడమ సదయుఁడై యాతఁడు కుమారునివిన్నపము నాలకించి మన్నించుననియుఁ బిదప నాశంకలన్నియు నిశ్శేషముగ నశించి హృదయమునకు శాంతివొడముననియు నాతఁడు తలపోయుచుండెను.

జగత్సింహుఁడు, తిలోత్తమ, విమల, అభిరామస్వామి, మొదలగువారలేమేమిభావించుకొనిరో యవియన్నియును మహారాజునకుఁ దెలియవు. జగత్సింహుఁడు మందారణదుర్గమందు వీరేంద్రసింహునిమందిరమున పఠానులచేఁజిక్కెనను వార్త తత్క్షణమే మానసింహునకుఁ దెలిసెను. కుమారుఁడు ప్రణయముగ్ధుఁడై దుర్గాధిపతియంగీకారము లేనిదే యవేళయందు దుర్గమునఁ బ్రవేశించుట, మొదలగువృత్తాంతములన్నియు నెప్పటికప్పుడు మానసింహుఁడు తెలిసికొనుచుండెను. తనయునిపై నాతని కెంతయో యాగ్రహము వచ్చెను. మానసింహమహారాజు వీరేంద్రునివృత్తాంతమును పూర్వమునుండియు పూర్ణముగా నెఱిఁగియుండినవాఁడగుటయేగాక వారందఱును కులహీనులనియు, నీచసంపర్కముగలవారనియు నాతఁ

వెలింగియుండెను. అట్టివారు తనకు బంధువులని మాటవరుసకైన
ను చెప్పుట కాతని కిష్టములేదు. అట్టివారితనయను కోడలనుగాఁ జే
కొనుట కాంతఁడించుకంతయు నంగీకరింపఁడు.

అనేకవీరాధివీరులసమక్షమున తండ్రియెదురనిల్చుండి జగ
త్సింహుఁడు మహాగర్వముతో నైదువేలమందిసైనికులసాహాయ్య
మున పఠానులను సువర్ణరేఖానది యావలకు పాఱఁదోలివత్తునని వీ
రములువలికి పోయియుండెను. మానసింహుఁడు కుమారునిస్పర్ధ
యును సాహసమును జూచి మిక్కిలిగౌరవించి యాతఁడు కోరినసై
న్యములనిచ్చి పఠానులజయించుభారమంతయు నాతనిపైఁబెట్టెను.
అట్టిగురుతరమైనమహాభారమును వహించినజగత్సింహుఁడు యథే
చ్ఛగఁ గన్యాన్వేషణకార్యమునఁ దగుల్కొని తస్కరునివలె నితరుల
దుర్గమున నర్ధరాత్రియందుఁ బ్రవేశించి దుర్గేశునితనయపైఁ బ్రణ
యలీలాప్రమత్తుఁడై కర్తవ్యమును విడనాడెను. ఈసమాచారము
లన్నియు మానసింహునియాగ్రహమును మఱింత యభివృద్ధిచేయు
చుండెను. వీరేంద్రసింహునితనయతోఁగూడి యామోదనిమగ్నుఁ
డైయున్న జగత్సింహుఁడు పఠానులచేఁజిక్కి బందియయ్యెననుస
మాచారము తెలియుటతోడనే మానసింహునికోపము మితిమీరి
పోయెను. ఆకారణముచే నాతఁడాక్షణమ పఠానుకులము నామూ
లముగ ధ్వంసముచేయుప్రయత్నములఁ జేయఁడయ్యెను. అవిధేయుఁ
డును నయోగ్యుఁడు నగునట్టికుమారునకు శుభమొడగూర్చుట య
యుక్తమనియు నిష్ప్రయోజనమనియు మానసింహుని యభిప్రా
యము.

విమలయస్త్రాఘాతముచేఁ గటుల్ఖానుఁడు మరణముపొందె
ను. మరణకాలమున కటుల్ఖానుఁడు జగత్సింహునితో సంధిప్రస్తా

వముఖ్ఫచేసెను. జగత్సింహుఁడు బంధమునుండి విడివడియెను. విడుద
లయైనపిదప నాతఁడు పోయి తండ్రినిఁజూచి పఠానులప్రార్థనానుసా
రముగఁ దండ్రితో సంధిప్రస్తావమును జేసెను. మానసింహుఁడు
తాను శీఘ్రముగ డిల్లీకిఁ బోవలసియుండుటవలనను, తనసహకారి
యైన సయ్యదుఖాను వర్షకాలము పోవువఱకును సైన్యములను ప్రో
గుచేసికొని తనకు సాహాయ్యముగ వచ్చుటకవకాశము లేకపోవుట
వలనను, పైకారణములవలనఁ బ్రస్తుతము విగ్రహకార్యముల నడ
పింపవీలు లేకపోవుటవలనను సంధిబంధమునకప్పుడు సమ్మతించెను.
పిదప మంత్రిఖాజాయిసాఖాను, కొత్తనవాబగుసులేమాన్‌ఖాను
తోడను అస్మాన్‌ఖాన్‌తోడను, వచ్చి విస్తారముగ నుపహారాదిక
ములను దెచ్చి మానసింహమహారాజునకు సమర్పించెను. మానసిం
హుఁడు వానినందుకొని వారిని యథాయుక్తముగ సన్మానించి వీ
డుకొలిపెను. పిదప మానసింహునియాజ్ఞాప్రకారము మొగలాయి
సైన్యములు పాట్నానగరమునకుఁ బ్రయాణమైపోవుటకు సిద్ధమ
య్యెను. మానసింహుఁడు జగత్సింహునిపై విశేషకార్యభారము లే
మియు పెట్టలేదు. ఆతనియవజ్ఞతనుగూర్చి విచారణసేయవలయు
నని మానసింహుని యభిప్రాయమై యుండెను.

జగత్సింహుఁడు, తండ్రితనపై విరాగభావముతో నున్నాఁడ
నువిషయమును తెలిసికొనలేదు. అతఁడు శిబిరమునువీడి తనగుఱ్ఱపు
వాగెమ్మునకుఁ గట్టియున్నట్టియు బ్రాహ్మణునిచే లిఖింపఁబడియున్న
ట్టియు లిపినిచూచి యక్కడనుండి యట్లేవెడలిపోయెను. తండ్రియా
జ్ఞను బడయకయే తండ్రికేసమాచారమును తెలుపకయే మంధార
ణదుర్గమునకుఁ బోయి యచ్చటఁ దిలోత్తమను పాణిగ్రహణము
చేసికొనియెను. వివాహమునకు తనబంధువులనేకులువచ్చి కలిసె

కొనిరి. అయేమయు నామెయనుచరులును వచ్చియుండిరి. ఉత్సవసం
బంధమగునానందములన్నియు యథేచ్ఛగ జరిగినవి. వివాహమునకు
జనకుఁడగుమానసింహుని రావలయునని వేఁడుకొనలేదు. మాన
సింహునియంగీకారమునుగాని తుద నాశీర్వాదమును గాని బడయవ
లెననుప్రయత్నము లేవియును జరిపియుండలేదు. తనకుఁ దెలియ
నిదే యీశుభకార్యమిట్లు జరుగునని మానసింహుఁడెన్నఁడు నను
కొనియుండలేదు. మానసింహునియాగ్రహము మఱింత యధికమ
య్యెను. అతనినోటనుండి యేమాగ్రహచిహ్నములేవియు వ్యక్తమ
గుటలేదు. కాని యదిమొదలు మానసింహుఁడు రాజకీయవిషయ
ములనుగూర్చి తనయునితో నాలోచించుటయె మానుకొనియెను.
సామాన్యకార్యనిర్వాహకభార మాతఁడు వహించియుండెను.
జగత్సింహునకుఁ గార్యాకార్యములుమొదలగువానినిగూర్చి పర్యా
లోచనముచేయుట వదలిపోయెను. మహారాజగు మానసింహుని
హృదయకుండమున కుమారసంబంధమైన యసంతోషాగ్ని ప్రజ్వల
నమగుచుండెను. అత్యంతమును ప్రజ్వలించుచున్న యీమహాగ్ని
యథాకాలమున నల్పుఁడగు జగత్సింహుఁడనెడియింధనమును త్రుటి
లో భస్మముచేసివేయసమర్థమైనదనుజ్ఞానము ప్రేమముగ్ధుఁడును
సౌందర్యసందర్శనపరతంత్రుఁడునగు కుమారజగత్సింహుని హృద
యమునందు కలుగలేదు.

మానసింహమహారాజుగారిశిబిరము దారుకేశ్వరనదీతీరము
నుండిపాట్నానగరమునకుఁ బ్రయాణమైపోయెను. కుమారజగత్సింహు
నకాసంగతి తెలిసెను. కాని యాతఁడు యథాకాలమునఁ బోయి తం
డ్రినిగాని, సైన్యమునుగాని చేరుకొనలేదు. రాజకార్యమందునియు
క్తుఁడైనజగత్సింహుఁడు రాజోద్యోగియయ్యునాతఁడెవరికినిసాహా

య్యవఱుగా ముందు పోయియుండలేదు. అతనిసైన్యము దారుకే
శ్వరనదీతీరమున దిక్కులేకుండఁబడియుండెను. జగత్సింహుఁడును స
తనిసైన్యమునుదక్క మిగిలినవారందఱును పాట్నానగరమునకు వె
డలిపోయిరి. మానసింహమహారాజుకోపము మఱింత యతిశయము
య్యెను. అవిధేయుఁడును రాజకార్యములయందుదాసీనుఁడు నగుసై
నికుఁడు తనయుఁడైనను నీపర్యాయము రాజదండనముచే దండింపఁ
బడకతప్పిపోరాదని మానసింహుఁడు తనహృదయమున స్థిరపఱచు
కొనియెను.

తండ్రి తనపై విరక్తచిత్తుఁడయ్యెననుభావముచే జగత్సిం
హుని హృదయమొకప్పుడైన వ్యాకులతకు లోనుగాకుండ నుండెనా?
లేదు. అతఁడొకనిమిషముకూడ కళవళపడకుండనుండెనని యెట్లు
చెప్పఁగలము? అనేకసమయములయందు తండ్రి తనపై నాగ్రి
హముకలిగియున్నాఁడని మిగులఁ జింతించుచుండెను. మానసింహు
నికోపపరిణామ మత్యంతభయంకరమగునని కూడ నాతఁడు యో
చించుకొనుచుండెను. జగత్సింహుని యపరాధము చాల గురుతర
మైనదిగాఁ బరిణమించినమాట వాస్తవమే. కాని జగత్సింహుఁడు
చిక్కువడినయవస్థయందే మఱియెవ్వరైనఁ జిక్కువడినచో వారియ
వస్థయు నపరాధములును నంతకంటె తక్కువకాఁజాలవు. జగత్సిం
హుఁడు తనసైన్యమునువీడి యొంటరిగ సాలారణ్యమున కేగునప్పటి
కక్కడ నొకభగ్నాలయమునఁ బ్రాణావశిష్టయై తిలోత్తమ పడియుం
డెను. ఈయవస్థయందున్నప్పు డెవ్వఁడైనను ప్రాణాధికయగు సుం
దరికి సేవచేయుటను వదలి తదితరకర్తవ్యకార్యములయందు నిష్టచి
త్తుఁడగునా? అటుపిదప వివాహవిచారము. తండ్రియనుమతిలేదు.
పైగా నామె వీరేంద్రసింహునితనయ. ఆమెను బరిణయముచేసి

కొనుటకు మహారాజుసమ్మతింపఁడని యాతఁడెఱుంగును. అట్లయ్యు
ను గోప్యముగా వివాహకార్యమును పూర్తిచేయుట యత్యంతగు
రుతరాపరాధమయ్యెను. కాని యేసుందరికొఱకు హృదయము నున్మ
త్తమైపోవునో, ఏరమణిఁబొందనిచో జీవనధారణ మనావశ్యముగఁ గ
న్పట్టునో, ఏయబలామణిచింతయందుఁదక్క వేఱుకార్యములయందు
మనసుపోవదో, అట్టిమోహనలతికను పొందవలయుననుత్సాహ
మునఁ బ్రాణమే ప్రమత్తమైనచో నట్టివారిష్టసిద్ధియగుమార్గముల
ను విడిచిపెట్టి విరుద్ధకంటకితమార్గముల నవలంబింతురా?

ఇంతియేగాక జగత్సింహుఁడు కేవలమాసుందరీసందర్శనలాల
సుఁడై యొకదినమునైన దనకార్యములను నడపుచుండుట లేదు.
గొప్పగాలియు వానయు వచ్చుటచే జగత్సింహుఁడు మార్గమధ్య
మునఁ జిక్కి యెచ్చటనైన నాశ్రయముదొరకునేమోయని చూచు
చుండ నింతలో నెదుట శైలేశ్వరునిమందిరము కనఁబడియెను. అం
దులోని కాతఁడు పోవుట తటస్థించెను. తనభవిష్యన్మనోమోహిని
యగు తిలోత్తమ యందుండుననని మొట్టమొదట నాలయమునకుఁబో
వునప్పు డాతనికిఁ దెలియదు. పిదప నచ్చట నామెదర్శన మయ్యె
ను. దర్శనమాత్రముననే ప్రమత్తత కలిగెను. ఆప్రమత్తతను
తనహృదయమునుండి దూరముగా తరిమివేయవలయునని జగత్సిం
హుఁ డనేకవిధములఁ బ్రయత్నించెను. కాని, యాచింతను, నాకల్ప
నలను నాతఁడు విడిచిపెట్టఁజాలకపోయెను. అట్టిఘటనము సంఘటిత
మై పిదప హృదయమునందలి యాప్రబలానురాగప్రవాహవేగము
నెవ్వరు సులభముగ మరలింపఁగలుగుదురు? మఱియు చిత్తక్షేత్ర
మునుండి యాప్రబలాకర్షణరేఖలనన్నిటి నెవ్వరార్పివేయఁగలరు?
అటుపిమ్మట జగత్సింహుఁ డామనోమోహినీపరిచయమును దెలిసి

కొనవలయునని పదునైదుదినములకుఁ గిమ్మట మరల నాస్థలమున
కేవచ్చెను. ఆమెసంగతిని తెలిసికొనినపిదప నా హృదయము
మథితమైపోయెను. పరిచయమైనతోడనే యాసుందరీసమాగమ
లాభము తననుదుట వ్రాయఁబడియుండ లేదని యాతఁ డనుకొని
యెను. వీరేంద్రసింహుని తనయతో మానసింహునికుమారునకు
వివాహసంబంధము కేవల మసంభవము. ఎప్పటికిని సంభవింపఁద
గినదికాదు. ఇప్పుడు జగత్సింహునకొకభ్రమ కలిగెను. తనజీవన
సారస్వరూపయగు నాయబలామణి నొక్కమారు కడసారిచూచి
యామెచే సెలవుఁగైకొని రావలయునని యాతనికాశవొడమెను.
అదియాతని కజ్ఞానముచేఁ గలిగిన భయమా కభ్రమ—ఆరీతిగ
చూచి సెలవుగైకొనుటచేఁ బ్రణయము నూఱురెట్లభివృద్ధినొందునని
హతాశులగుప్రియులు తెలిసికొనఁజాలరు. అదర్శనముచేఁ బ్రణయ
లోలత కాలక్రమమున మందీభూతమైననుకావచ్చును. కాని దర్శన
రూపమనెడియింధనసంయోగముచేఁ బ్రణయానలము ప్రజ్వలి
తమై ప్రబలముగ మండుచు విస్తారముగఁ బైకి లేచును. అదియెఱుఁ
గక ప్రేమగలవారు తుదిసందర్శనముకొఱకై యున్మత్తులగుచుం
దురు. అనేకసందర్భములయం దట్టితుదిసందర్శనమే సర్వనాశనము
నకుఁ గారణమగుచుండును. జగత్సింహుని యదృష్టమునకు నావిధ
ముగనే సంభవమయ్యెను.

విమలయాహ్వానముచేయుటచే జగత్సింహుఁడామెతో మం
దారణమునకుఁబోయెను. దుర్గాధిపతియనుమతి లేనిదే దుర్గములోనికిఁ
బ్రవేశించుటకాతనికిష్టము లేకపోయెను. విమలయతనికిద్వారంధ్రమున
తనస్వవిషయమునుగూర్చి చెప్పినపిదప జగత్సింహుఁడుదుర్గమునందుఁ
బ్రవేశించెను. అప్పటిప్రస్తావనసందర్భమున విమలయుపయోగించిన

యొకటి రెండుమాటలు వినినపిదప జగత్సింహునకుక్రోధమో లేక, చిత్తవికారమో కలుగుట మంచిదేయయ్యెను. జగత్సింహుఁడామెను సుచరిత్రియని సంబోధించుటకై, విమల తాను కుచరిత్రినని చెప్పుకొనియెను. స్త్రీలు తాము కుచత్రిలమని చెప్పుకొన్నచో నది మిగులఁ జెడ్డయర్థమును వ్యక్తపరుచుచుండును. దుర్గమునందు ప్రవేశించునప్పుడు గుప్తమార్గప్రస్తావముతోగా విమల "చోరుఁడున్నచోట కన్నముండును" అని చెప్పియుండెను. అది విన్న రాజపుత్రున కనుమానము కలుగవలసి యుండెను. ఏమనిన "చోరుడు—కన్నము" అనుపదములను గుప్తప్రణయమునకు గుప్తోపాయమని చెప్పినట్లు సూచితమగుచుండెను. కులాంగననోటనుండి యట్టిమాటలు వచ్చుట యుక్తముకాదని యాతనికప్పుడు తోఁచియుండినచో నిట్లు సంభవించియుండదు. జగత్సింహుఁడా మాటలన్నియును సరసప్రవీణయగు విమల సరసవాక్యములని యోచించి యర్థాంతరమును తెలిసికొనఁడయ్యెను. వస్తుతః అదియే నిజమని తోఁచుచున్నది.

అంత్యసందర్శనమయ్యెను. కడసారిసందర్శనమున నేమిజరుగునో, ఈసందర్భమునందును నదియే జరిగెను. యిరువురును పరస్పరము నాత్మసమర్పణము చేసికొని చిరకాలావిచ్ఛిన్నమగు ప్రణయపాశమునందు బద్ధులైపోయిరి. ఈవిధముగా వారి ప్రణయలీలాచరిత్రము చెప్పఁబడియెను. జగత్సింహుఁడు వీరుఁడును, సైన్యాధిపతియు నక్బరుపాదుషహా సేవకుఁడునై యుండెను. అందువలన నాసమయమున, ప్రణయరంగమున నాకీతిగాఁ బ్రమత్తుఁడై యుండుటాతని కుచితముకాదు. కాని ఘటనలన్నియు నాతనికి ప్రతికూలములై యున్నవి. ప్రణయరంగక్షేత్రమునందభినేతృఁడై యుండఁ బ్రార్థించినవాఁడుకాఁడు. ఘటనాపరంపర యసంభావితోపాయములచే నాతని

సారంగస్థలము పైఁగూర్చుండఁజేసెను. ఆమదిరామోహానావేశ మొక్కసారి తలకెక్కినచో నెట్టివీరుఁడును దానిశాసనమునుండి బయటపడఁజాలఁడు.

మానసింహుఁ డీసంభవములనన్నిఁటినెఱుఁగునా ? ఆతని కేవ్యాపారమును తెలియలేదని తోఁచుచున్నది. అయినను నాతఁడు కుమారునిపై నాగ్రహము కలిగియుండెను. అతఁడు మొదట స్వామికార్యమును సాధించి పిదపనే స్వసుఖసంతోషవిషయిక యోచనము చేయవలయునని తలంచెడివాఁడు. అట్లుండుటయే కర్తవ్యనిష్ఠుఁ డగువీరునకు లక్షణమై యుండును; న్యాయపరాయణుఁడును కర్తవ్యనిష్ఠుఁడగుసేవకుఁడు నగునంబరేశ్వరుఁ డట్టియుద్దేశముతోడనే జగత్సింహునిపై నతికుపితుఁ డయ్యెను. క్రమముగ ననేకవిధములచే నాతనికోప ముత్తరోత్తరాభివృద్ధినందెను. దానినిగూర్చి పాఠకు లిదివఱకు చదివియేయున్నారు.

ఇంతేగాక జగత్సింహుఁడు మాసాధిక కాలము తనసైన్యమును విడిచిపెట్టి దూరమున నివసించియుండెను. అది చాలగొప్పయపరాధము. అది క్షమింపఁదగిన నేరము కాదని మానసింహునకు గట్టినమ్మకము. ఆతనికోపమునకు హద్దులేకుండెను. అందుచే మహారాజు మానసింహుఁ డపరాధిని సజీవావస్థయందైనను నది యసంభవమైనచో మృతావస్థయందైనను తీసికొనిరావలయునని యాజ్ఞయొసంగెను. ఆయాజ్ఞను వినినసభాసదులందఱును నాతనిక్రోధాధిక్యమును దెలిసికొని యెవరు నేమియు ననలేకపోయిరి.

జగత్సింహుఁడు శైలేశ్వరమహాదేవుని మందిరముకడ బంధీయయ్యెను. ఏస్థలమునందాతనిప్రణయాభినయమునకుఁ బ్రారంభము కలిగెనో; ఆస్థలముననే యాతని యవనికపడిపోయెను.

## న్యాయపరీక్షణము.

---

పాట్నానగరమున మానసింహమహారాజుగారి దర్బారుమం
దిరమునం దిప్పు డొక యసాధ్యకార్యము జరుగనై యుండెను. అట
యథాసమయమున ప్రశ్నాతీతమైన యొకవిషయము నడవనున్నది.
ఇఁక కొంచెము సేపటిలో నచ్చట మిగులగౌరవాస్పదుఁడైన రాజ
సేవకునియపరాధమును గూర్చి విచారణ జరుపఁబడును. రక్షకభటు
లస్త్రధారులై నాల్గువైపులను నిలువఁబడియుండిరి. కొల్వులమంతయు
ను గుట్టుపురోహితులును నందఱు నిష్టానుసారము విచారణసభకు
వచ్చి సిద్ధముగనుండవలయునని యుత్తరువులను పొందియుండిరి. వే
లకొలఁదిసైనికులు సభాస్థలమును చేరియుండిరి. నగరవాసులందఱు
ను వచ్చి చూచుట కభ్యంతరము లేమియు లేవు. ఆకారణమున వి
చారకార్య మారంభమగుటకు ముందు చాలసేపటినుండియును జనస
మాగమముచే విశాలమైన యాదర్బారుమందిరమునం దెచ్చటఁజూ
చినను సంపూర్ణముగ ప్రజలు క్రిక్కిరిసియుండిరి.

యథాసమయమున నగారాశబ్దమయ్యెను. వాద్యధ్వని యా
గిపోయినతోడనే స్తుతిగాయకులు మంగళగానములను పాడి ముగిం
చిరి. పిదప తూర్యధ్వని యయ్యెను. సభాగృహమునందున్నవారంద
ఱును తలలెత్తి మహారాజువచ్చెడిమార్గమువంకఁ జూడనారంభించి
రి. తోడనే యంబరేశ్వరుఁడగు మానసింహమహారాజు ధీరగంభీర
పాదనిక్షేపముతో ప్రత్యేకముగనున్న యొకమార్గమునవచ్చి సభా
స్థానమునఁ బ్రవేశించెను. ఆతనితోఁగూడ నాతనియనుచరులును సే
నాపతులును సభాసదులును పారిషదులు నాతనిననుసరించి వచ్చిన

వారును క్రమముగా నాసభలోఁ బ్రవేశించిరి. అందఱిముఖము లును భయముచే నాక్రమింపఁబడియుండెను. నేఁడేదియో యొకభ యంకరవ్యాపారము సంఘటింపఁగలదని యందఱును భయవ్యాకులి తహృదయులై యుండిరి. మానసింహమహారాజు సభయందాతనికి నిర్దిష్టమైయున్న యెత్తైనభద్రాసనముపై గూర్చుండెను. సేనాధిపతులు సభాసదులుమొదలగువా రుభయపార్శ్వములయందును కొంచెము తగ్గియున్న యాసనములపైఁ గూర్చుండిరి. అటనున్నవారందఱికిని మానసింహమహారాజు ముఖమునందు స్థిరగాంభీర్యభావసూచకలక్షణ ములు గన్పట్టుచుండెను.

జనసమాగమముచే సభయంతయు నిండియుండినను, సత్యం తశాంతమును నిస్తబ్ధతయు సంతతను విరాజిల్లుచుండెను. ఎవరినోటి నుండియును మాట లేదు. పార్శ్వమునందున్నజనులలోఁగూడ మాట లాడవలెయు ననుప్రవృత్తి లేదు. గట్టిగ నుచ్ఛ్వాసనిశ్వాసములను విడుచుటకైన నెవరికిని ధైర్యము లేదు. అందఱును చింతాకులులై యుండిరి. అందఱును భయావహులై యుండిరి.

మహారాజు సింహాసనము నధిష్ఠించి యకంపితగురుగంభీరకం ఠముతో “బందీని తీసికొనిరావలయును” అని యాజ్ఞాపించెను.

తోడనే సభయంతయు విచలితమయ్యెను. అక్కడనున్నవా రందఱిముఖములును మఱింత యుమ్మలికముతో కందినట్లయ్యెను. అందఱు నుత్సుకులై మార్గమువంకఁ దిరిగి చూడసాగిరి. అప్పటికి చుట్టుకొనఁబడియున్ననడివయస్కులగుభటులమధ్యనుండి బందీతల వాల్చుకొని యాసభాప్రదేశమునందు ప్రవేశించెను. జనులందఱును కరుణాసూచకములగునేత్రములతో నపరాధిని చూచుచుండిరి. ఆబందీ “కుమారజగత్సింహుఁడు.”

బందీ వచ్చి యెదురుగ నిలిచినతోడనే మహారాజగు మానసిం హుఁడు పూర్వమువలెనే దృఢకంఠముతో "బందీజగత్సింహా! నీవనేక విధములగు నపరాధములను జేసి యపరాధివైతివి. నీయపరాధముల ను రెండుభాగములుగా విభాగించితిని. కొన్నియపరాధములు పారి వారికమైనవి. మరికొన్నియపరాధములు రాజకీయమైనవి. ఇప్పుడు నీయపరాధముల నన్నిఁటిని విచారణచేసి నీకు తగినదండన విధింపఁబ డును. రాజకీయసంబంధములైన నీయపరాధములు చాల గొప్పవి. విచారణకార్యము సులభముగానుండు నని యెంచి ముందు నీపారివా రికాపరాధములు విచారించుచున్నాను." అనియెను.

అవనతశిరస్కుఁడైన జగత్సింహుఁడు మిగుల లజ్జచే మఃశిం త తలవంచుకొనియెను. సమీపమునందున్న మొగలాయీపారిషదు లలో వృద్ధుడొకఁడు తనస్థానమునుండి లేచి నిలుచుండి మహారాజున కు విహితవినయపురస్సరముగ నభివాదనముచేసి "అధీనుఁడగునీయ పరాధిని క్షమింపవలయును. సవినయముతో విన్నవించుకొనుచున్నా డను. పారివారకమైనయపరాధములనుగూర్చి యాలోచించునప్పు డితరులెవ్వరును వినవలసినయావశ్యకత లేదు. ఆసమయమున మే మందఱమును మరియొకస్థలమునకుఁ బోయియుండవచ్చునా?" అని విన్నవించుకొనియెను.

మానసిం—వలదు. ఎవరును నీస్థలమునువిడిచిపోవలసిన యా వశ్యకత లేదు. ఏమనిన—అపరాధి పారివారికాపరాధములతోఁ గూడ రాజకీయాపరాధములను గలిసిచేసియుండుటచే నొకయపరా ధముయొక్క విచారణపై రెండవయపరాధవిచారణ మాధారపడి యుండును.

మొగలాయీపారిషదుఁడు మరల కూర్చుండెను. అందఱును

విగ్రహములవలె తమతమస్థానములయందు కూర్చుండి మహారా
జాజ్ఞ నెదురుచూచుచుండిరి.

మహారాజు—బందీ! వినుము. ముందునేయుప్రశ్నలకు నిజ
మైనప్రత్యుత్తరములను చెప్పకపోయినచో నీయపరాధములు మఱిం
తగొప్పవిగా గ్రహింపఁబడును.

జగ—(గర్వముతో) మహారాజా! శాసనము కేవలమనా
వశ్యకమైనది. జగత్సింహుఁ డసత్యములనుచెప్పియెన్నఁడు నెఱుఁ
గఁడు. ప్రాణభయముచేనైన నసత్యములనుడువ నశక్తుఁడు.

మాన—నీవు వీరేంద్రసింహుని యంతఃపురమునందలి యొ
కగదియం దొకస్త్రీతోఁగూడ పఠానులచేఁ బట్టువడి బందీగాఁ గొని
పోఁబడలేదా?

జగ—ఔను. కొనిపోఁబడితిని.

మాన—నీవు పఠానులవశమున బందీవైయుండి కటులూఖాను
ని పాలితతనయ యగునయేషాహృదయమందు ప్రేమలాలసత నుత్తే
జితమగునట్లు చేసియుంటివా?

జగ—మహారాజా! ఆప్రశ్న కుత్తరముచెప్పవలయుననిన
చోఁ జాలఁ గలదు. క్షమింపవలయును. నవాబునందినియగు నయేషా
నాకు పరమహితైషిణి. నేననేకాపరాధములచే నాపాదితుఁడనైనయ
పరాధినైనను, ఇప్పుడు న్యాయవిచారణకొఱకు మీాసన్నిధానమునకు
వచ్చి నిలుచుండుటకు సమర్థుఁడనగుట నవాబుతనయయగునయేషా
గుణాతిశయముచేతనే. నేనస్త్రాఘాతముచే క్షతవిక్షతశరీరుఁడనై జ్వ
రవికారముచేస్మృతితప్పియున్నప్పుడు నవాబునందినియగునయేషాత
ల్లివలెనుసోదరివలెను సహధర్మచారిణివలెనుసఖివలెను సర్వప్రయత్న
ములతోఁనను శుశ్రూషచేసి నా కారోగ్యమును గలుగఁజేసినది. ఆ

జేసెకి భక్తితో నమస్కరించెదను. సర్వాంతఃకరణముల చేతను నామె
ను సన్మానించెదను. ఆమె నిష్కపటచిత్తయగు యాత్మీయబంధువని
నాయభిప్రాయము. అట్టిదేవకన్యను ప్రేమదృష్టితోఁ జూచుటకు కథ
ముఁడనైననాకు ధైర్యమెన్నటికి నుండదు. ఆమెను దేవతగా భావిం
చి పూజార్హము లగుభావములతోఁ దక్క మఱి, యేయితరభావముల
తోఁ డను జూడవలయు ననుప్రవృత్తి యెప్పుడును లేదు. కాని చెప్పుట
కు హృదయము విదీర్ణమైపోవుచున్నది; ఒకానొకయసంభావితఘట
నచే గుణవతి యగునవాబునందిని యయోగ్యుఁడ నగునాయందు
ప్రేమాసక్తయైనదని తెలియవచ్చినది. సదయహృదయయగు నయే
షాహృదయము మితిలేనియాతనకాకరమయ్యె నని తెలిసినదిమొద
లుకొని యత్యంతకష్టముల ననుభవించుచుంటిని. ఆమెను ప్రణయో
న్మత్తనుగాఁ జేసితిననుమాట యసత్యము; అపారమైన యామెప్రణ
యమున కించుకైనను ప్రతిదానమునుజేసి సమాధానపడినవాఁడనై
నచో నాసుఖసౌభాగ్యానందములకు పారమే లేకుండనుండియుండును.
ఆమెహృదయమున ప్రేమోత్తేజనము చేయుటయన చాలదూరతో
పాస్తవిషయము. ఆమె యీహృదయమునుండి ప్రేమాకర్షణచిహ్న
మునుమాత్రము తొలఁగఁజేయుటకొఱకు ఎట్టియసాధ్యకార్యమైనఁ
జేయవలసివచ్చినచో నందులకించుకంతయును వెనుకంజవేయను.

మాన — ఇందువిషయమున నీకును పఠానులనవాబగు న
స్మాన్ ఖానునకును ద్వంద్వయుద్ధమయ్యెనా?

జగ — అయినది. మహారాజా! అయేషాప్రణయమే యందు
లకుఁ గారణము. అస్మాన్ ఖా నీప్రపంచమున నయేషాయొక్క
ప్రేమకు రెండుస్థానము లుండరాదు. అందుచే మనయిరువురియం
దెవ్వరైననొక రిప్పు డంతమొంది తీరవలయు ననినాతో చెప్పె.

స్మి. నేనిందులకుఁ బ్రత్యుత్తరముగ "నాకయేషాపై వలపులేదు. అందునిమిత్తము యుద్ధముచేయవలసినప్రయోజనము లేదు" అని స్పష్టముగా తెలియఁజెప్పితిని. అస్మాన్ "నీవు ప్రేమించుటలేదు. కాని అయేషా నీయెడ ననురాగయై యున్నది. యుద్ధమొనర్పుము క్షమాపణలేదు. నీవువధ్యుఁడవు" అనిచెప్పెను. అదియంతయు అస్మాన్‌ఖానుకూడ నొప్పుకొనును. అతఁడు నాతో యుద్ధమునకుఁ గడంగినాఁడు. కాని నేనాతనితో యుద్ధమును చేయలేదు.

మాన—నీవు నవాబుకుమార్తె కప్పుడప్పుడు త్తరములను పంపియుండలేదా?

జగ—అప్పుడప్పుడు మరలమరల వ్రాయలేదు. ఒక్కసారి వ్రాసితిని.

మా—నీవు కారణములేనిదే అయేషాను చూచుటకు పోయియుండలేదా?

జగ—పోయియుంటిని. ఈదేశమును విడిచిపోవుకాలమునం దొకతుదిపర్యాయ మొకసారి చూచివచ్చుటకై పోయితిని.

మాన—ఆమెను రావలయునని నీవెవరిచేనైనను వర్తమాన మంపితివా?

జగ—రావలయు నని వర్తమానమంపితిని.

మాన—నీవయేషాను జూడఁబోయినప్పుడామె నిన్ను చూడ నంగీకరింపక నిన్ను వెనుకకుఁబొమ్మని యనలేదా?

జగ—ఒకానొక కారణవిశేషముచే నామె నన్ను చూచుటకంగీకరింపనిమాట నిజము.

మా—(విరసపునవ్వును నవ్వి) నీవు నబాబునందినియం దాసక్తుఁడవైయుండలేదని యిప్పుడును జెప్పెదవా? నీవామెకు ప్రేమో

తాన్నేహములను జూపితివా? లేక ఆమెయే నీయెడ సన్నురాగిణి యయ్యెనా?

జగ—అగును. మహారాజా! నేను దానినిగూర్చి మొదటనే చెప్పియుంటిని. ఇప్పుడును జెప్పెదను. నమ్ముటయు నమ్మకపోవుటయు మహారాజువారి యిచ్ఛానీనము.

మాన—(దృఢస్వరముతో) వీరేంద్రసింహునితనయ నీకుప పత్నియా?

జగత్సింహుఁడు విచలితుఁడయ్యెను. అతనిశరీరమున విద్యుత్ప్రవాహము ప్రవహించినట్లయ్యెను. ఆతఁడు స్థిరస్వరముతో చెప్పఁదొడంగెను. "మహారాజా! మీరు భూపాలురు. శాసనపాలనకర్తలు. ప్రభువులు. విశేషించి నాకు జనకులు. అందుచే ప్రత్యక్షదేవతాస్వరూపులై యున్నారు. మీరడిగినప్రశ్నకు సరియైనప్రత్యుత్తరమునిచ్చుట కశక్తుడుగ నున్నాఁడను. ఇతరులెవరైన భ్రమచేగాని పరిహాసమునకైగాని యట్టిప్రశ్నను వేసినచో వారి నానిమిషమున నే సర్వనాశనముచేసితీరుదును. వీరేంద్రసింహునితనయ నాసహధర్మిణి. పవిత్రమంత్రానుష్ఠానపురస్సరముగా పరిగ్రహీతయైన ధర్మపత్ని.

మానసింహుఁడు జటలువెతికినసింహమువలె భయంకరరోత్తేజితస్వరముతో నిట్లనియెను. "నరాధమా! రాజపుత్రకులకళంకా! పాపోద్రేకముగలై నయిట్టిమాటలను నాసమక్షమున వచియించి నప్పుడు నీజిహ్వ ముక్కముక్కలై పోలేదేమి? క్షోభచే తనులజ్జచేతను నీప్రాణమాలోడితముకాలేదేమి? వీరేంద్రసింహునికుమార్తె నీకు ధర్మపత్నియా? ఏవీరేంద్రసింహుఁడు వారివాహకునివలె పవిత్రమైన నాయంతఃపురమునందు ప్రవేశించిపరిచారికాగౌరవమును

ధర్మమ్మును సర్వనాశనము చేయవలయునని యత్నించెనో, ఏవీరేంద్ర
సింహుఁడు నాయంతఃపురమునందు పట్టువడి వ్యభిచారిణియైన యొ
కశూద్రస్త్రీ తనూజాత యగువిమలను వివాహముచేసికొనియెనో,
ఆపాపాత్ముఁ డగువీరేంద్రసింహుఁడు నీకు మామయా? మఱియు నా
శూద్రస్త్రీతనయ యగువిమల నీధర్మపత్నికి సవతితల్లియా? ఇంకను
వారివారిచరిత్రములను చెప్పవలయునా? నీధర్మపత్ని యనిచెప్పెడి
యాస్త్రీ యొకజారజగర్భమున జన్మించినది. ఇంతేకాదు. శశిశేఖరుఁ
డనుపేరుతో ప్రపంచమునంతను తలక్రిందులుగఁ జేయయత్నించి
యనర్థోత్పాతములను గల్గించినసన్యాసి యిప్పు డభిరాముఁడై పరిణ
మించిన యాతఁడు నీధర్మపత్నికి మాతామహుఁడు. అతఁడు ప్ర
వాసియగుటకుఁబూర్వము ప్రవాసియైనమఱియొకనిభార్యకు గర్భో
త్పాదనము చేసి పలాయనమైపోయెను. కాశికేగి బహుశాస్త్రము
లనభ్యసించియు తనకు సేవసేయుచు నివసించియుండుటకు గృహము
నొసంగిన యొకశూద్రకన్యకన్యాధర్మమునునాశనము చేసెను. ఆమ
హాపురుషుఁడిప్పుడు పరమజ్ఞాని. ఛీ! ఏమి! నీవివేచనము — నీచజను
న్యులైన వారందఱు నీకాత్మీయపరివారముగా నెంచుకొనుచు సా
మాన్యపు జమీందారునితనయను వివాహముచేసికొంటివి. నీ వా
మెను నీయుపపత్నిగా నంగీకరించినచోఁ గొంతవఱకు నీయపరాధ
ము స్వల్పమై క్షమించుట కర్హమై యుండును. తండ్రియిష్టమునకువి
రోధముగా తండ్రియాశీర్వాదముగాని తండ్రియంగీకారముగాని యు
పేక్షింపనిదే యట్టినికృష్ట వంశమువారితో సంబంధమును చేసికొనిన
కుమారుఁడు తండ్రికిఁ బరిత్యజనీయుఁడు. ఇదిమొదలు జగత్సింహుఁ
డు నాకుమారుఁడుకాఁడు. నీవెవరితోనైనను మానసింహునితనయుఁ
డనని చెప్పుకొనినచో నీకు ప్రాణదండనము సంభవించును.

సభయందలివారందఱు భయభ్రాంతులై మహారాజునాజ్ఞను వినుచుండిరి. మహారాజు మరల చెప్పఁదొడఁగెను—ఇఁక నీరాజకీయాపరాధములనుగూర్చి యాలోచింపవలసియున్నది. నీవు ఫాదుషహావారి సేవకుఁడవై యొకానొక కార్యభారమును వహించిన సేనాధిపతివయ్యును ననాయాసముగా నొకతస్కరునివలె నర్ధరాత్రియందెవరు నెఱుఁగకుండ దుర్గాధిపతికి తెలియనిదే యితరులదుర్గములోనికి ప్రవేశించియుండ లేదా?

జగత్సింహుఁడు ప్రత్యుత్తరమేమియు నీయకుండఁదలవాల్చుకొనియుండెను. మానసింహుఁడు చెప్పఁదొడఁగెను. ఐదువేలసైన్యమును కూడఁదీసికొని పఠానులను తరిమివేయుభారమును వహించి యాకార్యమును జేయకయే స్వసుఖప్రయత్నమున నాకీలాభము నాశించి యక్కడ నుండ లేదా?

జగత్సింహుఁడు నిరుత్తరుఁడయ్యెను. మానసింహుఁడు చెప్పఁదొడఁగెను. పఠానులచెఱనుండి విడుదలయైనపిదప నీవు సైన్యములున్నకడకుఁ బోయి వారిని కలిసికొని నాయాజ్ఞల నెదురుచూచుచు నేలయుండ లేదు?

జగత్సింహుఁడు మాటాడ లేదు. మానసింహుఁడు మరలఁ జెప్పదొడఁగెను. సేనాధిపతులందఱును శిబిరములను దీసి సైన్యసమేతులై పోవుచున్నప్పుడు నాయాజ్ఞానుసారముగఁ బోయి నీవు వారితో నేలచేర లేదు?

జగత్సింహుఁడు మాటాడ లేదు. మానసింహుఁడు తిరిగి చెప్పనారంభించెను. ఏవిధమైనయుత్తరువును బడయనిదే ఫాదుషావారియేకార్యమునందును చేరనిదే స్వతంత్రుఁడవై కాలహరణము నేల చేసితివి?

జగత్సింహుఁ డేమియుఁ జెప్పలేదు. మానసింహుఁడు నుడువసాగెను. చెప్పుము! దురాత్మ! కర్తవ్యజ్ఞానవిహీనుఁడవైన నీయట్టివాని కెట్టిశిక్షవిధింపవలయును? ప్రాణదండశమేనీకుఁ దగినదండనమైయున్నది.

మొదటఁజెప్పిన మొగలాయీపారిషదుఁడు లేచినిలుచుండి యత్యంతవినీతభావముతో మహారాజునకు సలాముచేసి "హుజూర్! అభయము ప్రసాదింపఁబడుఁగాక! ఒకవిన్నపము విన్నవించుకొనుచున్నాఁడను. యువరాజు మీకు పుత్రు—

మాటముగియకపూర్వమే మానసింహుఁడు వజ్రగంభీరస్వరముతో నిట్లనియెను. హతభాగ్యుఁడగు నీనీచుఁడు నాకుతనయుఁడని చెప్పువారెవరు? నాకుఁ గుమారుఁడేయైనచో రాజద్రోహియై కర్తవ్యకార్యమునందనాసక్తుఁడై ప్రభువున కవమానమును గలుగఁజేయఁడు. పుత్రత్వసంబంధమును పరిత్యాగముచేయవలయుననియే పారివారికసంబంధము లగునపరాధములని మొట్టమొదటవిచారణ చేయనారంభించితిని. ఆవిచారణముతోడనే యీహతభాగ్యునితో పుత్రత్వసంబంధము తుదముట్టినది.

మొగ—మంచిది! మీరు ధర్మావతారులు. యోచించి చూడవలయును. యువరాజింకను తరుణవయస్కుఁడు.

మానసింహుఁడొక్కింత సేపధోముఖుఁడై యాలోచించి పిదప "దురాత్మా! వినుము; నీయపరాధములకుఁబ్రాణదండనముతక్క వేఱుసముచితమైనశిక్షయేదియు లేనట్లు తోఁచుచున్నది. అయినను నీచిన్నతనమునకుఁదగ్గినట్లు నీకు యావజ్జీవమును కారాగారవాసదండనమునుమాత్రము విధించితి" నని చెప్పి కావలివారలను జూచి "ఈ హతభాగ్యునిదుస్తులను ఆభూషణముల నన్నిఁటిని దీసివేసి నాసమక్ష

మునసే యీసభయందు సంకెలలను దగిల్చి యందఱును జూచుచుండఁగా వీనినాకారాగారమునకుఁ గొనిపొండు" అనియానతిచ్చెను.

మహారాజుగారియాజ్ఞ తత్క్షణమే నెరవేర్పఁబడియెను. జగత్సింహుఁడు బందీదుస్తులనుతొడిగికొనియెను. లోహశృంఖలము లాతనిహస్తములయందును పాదములయందును నిబద్ధములయ్యెను. నాల్గుమూలలనుండియును నస్ఫుటములగుహాహాకారములును నిట్టూర్పుధ్వనులును బయలువెడలెను. సైన్యాధిపతులందఱును తలలు వాల్చుకొనిరి. వృద్ధులందఱినేత్రములనుండియుఁ గన్నీరు ప్రవహించుచుండెను కావలివారలు బందిని గొంపోయిరి. సభయు విడిపోయెను.



## ఐదవ ప్రకరణము.

---

### వార్తావహుఁడు.

దారుకేశ్వరనదీతీరమునకుఁ బోయిరమ్మనియాజ్ఞాపింపఁబడిన సైనికుఁడు మధురాసింహునిసైన్యమునువీడి యొంటరిగా మందారణదుర్గాభిముఖుఁడై కొంచముదూరము వచ్చినపిదప నాతనికి దారియందు వికటవేషధారియైన గజపతివిద్యాదిగ్గజుఁడు కనఁబడియెను. గజపతికొంచముసేపటికిపూర్వమశ్వారోహియైనజగత్సింహునికలిసికొని యాతనియొద్దనుండి యొకరూపాయను బుచ్చుకొనియుండెను. మరల నింకనొకయశ్వారోహి యగువీరపురుషుఁడు వచ్చుచుండుటను జూచి

మనస్సునందు తనకది సుప్రభాతమనియు, నామనుష్యునితో మాటాడినచోఁ దనకేదైనలాభముండుననియు భావించుకొని యశ్వారోహి కెదురేగినిల్చుండి రెండుచేతులను పైకెత్తి "అల్లామహాదేవుఁడు హుజూర్తబియతును (మీదేహారోగ్యమును) కాపాడుఁగాక!" అని యాశీర్వదించెను.

అశ్వారోహి యగుసైనికుఁ డాశ్చర్యవేషియైనయామనుష్యునినోటనుండియాశ్చర్యభాషయందు వచ్చినయాయాశ్చర్యాశీర్వాదమును విని యాశ్చర్యమునొంది యాతనితో మాటలాడవలయు నన్నునభిప్రాయముతో గుఱ్ఱమును మెల్లమెల్లగ నడపనారంభించెను. దిగ్గజుఁడాతనిపార్శ్వమునుండి నడచివచ్చుచుండెను.

అశ్వారోహి—మీరేజాతివారు?

దిగ్గజుఁ డాలోచింపఁదొడంగెను. కొంచెము సేపయినపిదప గురువువారినడిగి తెలిసికొననిదే మీప్రశ్నకు సరియైనప్రత్యుత్తరమునీయఁజాలను" అనియెను.

అ—అదేమిమాట ? మీజాతినిగూర్చి ఇంకొకరి నడుగనిదే చెప్పఁజాలరా ?

దిగ్గజ—నేనేమో సరిగానే యుంటిని. కాని, నాజాతివిషయ మింకను సరిగాలేదు.

సైనికుఁడు తనమనసునందు "ఈమనుష్యుఁడుపిచ్చివాఁడని తోచుచున్నది. ఇతనితోమాటాడినచో కాలము వ్యర్థముగా నష్టమగు" నని యోచించి "ఏమిచాల నాశ్చర్యముగ నున్నది." అనియెను.

దిగ్గజ—నేను హిందూబ్రాహ్మణుఁడను. పిదప నేను ముసల్మానుఁడనైతి నని విన్నాఁడను. పునః హిందువునగుటకుఁ జేయవల

సినదానిసంతను జేసితిని. ఇప్పుడు నాజాతినిగూర్చి యేమనిచెప్పవలెయునో మాస్వాములవారు సెలవిచ్చువఱకును నేనేమియుఁ జెప్పఁజాలను.

సైనికుఁడు సంగతి నంతయును తెలిసికొనవలయు ననిమెంచి "స్వాములవారెవరు?" అని యడిగెను.

ది—నాకధ్యాపకులు- పాఠములను చెప్పెడివారు."

సైనికుఁడు మరల విస్మితుఁడై "నీకధ్యాపకులా? నీకు వయస్సునందు కొఱంత యేమియు లేనట్లు తోఁచుచున్నది. ఇప్పుడును నీవు విద్యార్థివేనా?" అనియడిగెను.

దిగ్గజ— నాకు వయసత్యల్పము. ఆపాత్మనీ చెప్పినట్లు నేనింకను బసివాఁడనే. ఆమాటయెప్పుడునసత్యముకాదు.

సైనిక—ఆపాత్మనీ యెవరు?

దిగ్గజుఁడు కొంచెము సేపుకన్నులుమూసికొని యోచించి పిదప "ఎవరోనేనెఱుఁగను." అనియెను.

సై—ఆపాత్మనీ స్త్రీయా? లేక పురుషుఁడా?

దిగ్గజుఁడు మరల కొంచెము సేపాలోచించి పిదప "నిశ్చయముగాఁ జెప్పఁ జాలను. స్త్రీ యనియే తోఁచుచున్నది" అనియెను.

సైనికుఁ డాతనికి బుద్ధిచాలదని తెలిసికొనియెను. అట్టివానితోఁ బరిహాసమాడుచుండు టందఱికి నిష్టమే. సైనికుఁడు మరల "ఆపాత్మనీ స్త్రీయని యెవరివలన తెలిసికొంటిరి?" అనియెను.

దిగ్గజ—స్త్రీవలెనే చీరను ధరియించును. శిరోజములను కొప్పుపెట్టుకొనును. భూషణములను ధరియించును. యీలక్షణములనుచూచి స్త్రీ యని నిశ్చయించితిని.

సైని—ఆమెకు గడ్డమునుమీసము లున్నవా?

దిగ్గ—అవేవియుఁ గాన్పింపలేదు.

సైని—అందువలననే యామె స్త్రీయని తెలియుట లేదా?

దిగ్గజుఁడు కొంచెముసేపాలోచించి పిదప "అంతమాత్రముచే నిశ్చయముగాఁ జెప్పవలనుపడదు. నాకు పాఠము చెప్పిన యధ్యాపకుల కనేకులకు గడ్డములును మీసములును లేవు. అనేకులు వైదిక లౌకికులకును మీసములు గడ్డము లేవు. ఈయుత్కల దేశమునందు పురుషులకు గడ్డములును మీసములును లేవు. మస్తకమునందో—కొప్పు పెట్టుకొనవీలు లేని శిరోజములు మాత్రము—" అనియెను.

సై—ఆషాస్త్రీ యధ్యాపకురాలు కాదని చెప్పవచ్చునా?

ది—మహాశయులు చెప్పినది సరికాదని చెప్పను. కాని యాషాస్త్రిముఖభావము మొట్టమొదట నాయధ్యాపకునిముఖభావమునకు సరిగా పోలియున్నది. అదియుఁగాక యాషాస్త్రీవ్యవహారాదులాయధ్యాపకులవ్యవహారాదులవలె నున్నవి.

సైనికుఁడు కౌతూహలముతో "ఏవిషయమునందు?" అని యడిగెను.

దిగ్గ—ఆమె యెప్పుడును నన్ను కొట్టుచునేయుండును. కాని నాయందు మిగుల ప్రీతికలిగియుండును. నేను చేయఁదగినకొన్ని కార్యములను నాచేఁ జేయించుకొనుచుండును. సుఖదుఃఖములను గూర్చి నాకుఁ జెప్పుచుండును.

సై—నీకు పాఠములను జెప్పుచుండుట లేదా?

ది—లేదు. అది నాదోషమనియే చెప్పవలయును. నేనామెను జూచినతోడనే సర్వమును మరచిపోవుదును. చదువవలసినవిషయములు మనసున పట్టవు. పాఠములనుచదువుటకు సమయముండదు.

సై—ఆషాస్త్రీ స్త్రీయని యిప్పుడు తెలిసినది. మీారిదివఱకు

ను నాతోఁ బరిహాసమాడుచున్నట్లున్నది. ఆస్త్రీ మీకుఁ బ్రణయిని.

దిగ్గజుఁ డుద్దండుఁడై యెగిరి గంతువైచెను. అతఁడు పైకెగిరి గంతువేయుతొందరలో నాతనికంఠముననున్న రుద్రాక్షమాల కంఠమునుండి తెగి దూరముగాఁబడిపోయెను. అతఁడు దానిని తీసికొనకుండ నట్టే పోయి సైనికునియొద్ద నిలిచి "మీరేమి చెప్పితిరి? నేనా మాటనే యోచించుకొనుచున్నాఁడను. కాని, ఇతపులామెను స్త్రీ యని తెలిసికొందురా ?" అనియెను.

సైనికుఁడు చిఱునగవుతో "నిజముగా జను లట్లే తెలిసికొందురు. ఆమె మీయందు ప్రీతికలిగియున్నదనియు మీతో నొకటి రెండు మాటలాడినతోడనే యామె మీప్రణయిని యనియు తెలిసికొంటిని" అనియెను.

దిగ్గజుఁడు స్వస్థుఁడై రుద్రాక్షమాలను తీసికొని కంఠమున వేసికొని సైనికునిసమీపమునకు వచ్చి నిలిచి "మీరు దైవజ్ఞులా? మీరు నిజమైనమాటలనే చెప్పుచుండిరికదా ? నేనీపర్యాయము దుర్గములోనికిఁ బోయి యామెను నాప్రణయిని యని పిలువవచ్చునా ?" అనియెను.

సైనిక—ఆమె మీప్రణయిని యని నిజముగా చెప్పుచున్నాను. మీరు పోయి స్వచ్ఛందముగా నామెను మీప్రియతమ యని చెప్పియాదరింపవచ్చును. నేనుచాలకాలము మాగురువులకడ సాముద్రికశాస్త్రము నభ్యసించితిని. మీముఖమునుజూచినతోడనే మీకొకమనోమోహిని యుండెనని తెలిసికొన్నాఁడను. ఆమెనామము యొక్క మొదటియక్షరము "ఆ" యని గోచరమైనది. ఆమెనామము నందలి యంత్యాక్షరము గోచరమయినదికాదు. నీవిప్పుడు తొంద

రగా వచ్చి నిలుచుండినపిదప మీ ప్రియునినామాంత్యాక్షరము "ని" యని స్పష్టమయ్యెను.

ది — (పరమానందముతో) దేవర చెప్పినమీఁదట కన్నులు తెరచిచూచినట్లయ్యెను. మీవంటి దైవజ్ఞులనోటినుండి వినినపిదప నా స్వామి నా ప్రియుని యని దృఢవిశ్వాసము కలిగినది. అందులకు సంశయము లేదు. మీరు దయచేసి నాలలాటమును కొంచెము పరీక్షించి చూడవలయును. నాప్రియునినామాక్షరములుగాకుండ నక్కడక్కడ వేఱేయక్షరసముదాయమేమైన నున్నదేమో సరిగా పరీక్షించి చూచి చెప్పవలయును.

గజపతిలలాటమును కొంచెము విప్పి దగ్గరగా వచ్చెను. సైనికుఁడు "అక్షరములున్నవి. కాని, "ఆ" "ని" అనునీరెండక్షరములుఁ గనఁబడినంత స్పష్టముగా తక్కినవి కాన్పించుట లేదు. అవి మసకమై పోయినవి." అనియెను.

గజ — మీరు నాకు మహోపకారమును చేసినవారైనారు. మీ రెక్కడకు పోయెదరు?

సై — ప్రస్తుతము మందారణదుర్గమునకుఁ బోయెదను. పిదప వేఱేమఱియొకతావునకుఁ బోయెదను.

గజ — మందారణదుర్గముకడకు వచ్చినారము. ముందు కనఁబడుతోఁటవెనుక నేకదా కోటయున్నది. ఇక్కడ కెవరికొఱకు వచ్చితిరి?

సై — విశేషకార్యము లేవియు లేవు. కోటలోనొక వార్తఁ జెప్పవలసియున్నది.

గ — అయినచో పోవుదము రండు. నేను మొట్టమొదట కోట లోపలికే పోయెదను. అచ్చట నాస్వామి యున్నది. మొదట నా మొ

ను చూడనిదే మఱియొక్కఁడకను బోను.

సై—మీరు దుర్గమునందున్న యుండఱితోడను మాటాడు
ట కలదా?

గ—(గర్వముతో) అనేక పర్యాయములు—విశేషముగ—
దుర్గమునకుకర్తలగు నభిరామస్వాములు నాకధ్యాపకులు. దుర్గమం
దు సర్వము యగునామె నాభృత్యభాండము. ఎవతెనామాతృకము
లలో మొదట "ఆ" యును నంత్యమున "ని" యును కలదో, ఆమె
యే నాకు ముఖ్యాధారము.

సై—అయినచో, దయచేసి మీరొక సామాన్యవార్తను దు
ర్గమునందు తెలిపినచో గొప్పయుపకారమును చేసినవారగుదురు.
ఎవతెనామాతృకములలో మొదట "ఆ" యును చివర "ని"యు
ను కలదో, యట్టిమీముఖ్యాధారిణిమూలమున నీవార్తను బంపిన
జాలును!

గ—అవశ్యము చేయుదును. మీకొఱకు నాప్రాణమును
బోఁగొట్టుకొనుటకైనను సిద్ధముగానున్నాఁడను. ఆస్త్రీనాప్రాణము
నియని మీరుచెప్పినదిమొదలుకొని నాధైర్యసాహసము లెట్టుల
భివృద్ధియయ్యెనో నేను చెప్పఁజాలను. నేనిప్పుడేపోయి వర్తను చెప్పి
వైచెదను. సమాచారమేమి? చెప్పుఁడు.

సై—మీరు దయచేసి కుమారజగత్సింహుఁడు బందీయ
య్యెనని తెలియఁజేయవలయును.

గజపతి "ఎందులకు బందీయయ్యెను? ఎవరు బంధించినారు?" అ
నియడిగెను.

సై—ఎందులకు బందీయయ్యెనో చెప్పఁజాలను. మహారాజ
కుమారసింహుని యాజ్ఞాప్రకారము మేమే యతనినిబందీగా పట్టు

కొంటిమి

దిగ్గజుఁడు మనస్సునందు కొంచెమాలోచించి యువరాజు బందీయైనప్పుడు దుర్గమునందలి మిగిలినవారందఱు నదేగతిఁ బట్టువడిరనియు, వీరేంద్రసింహుఁడు బందీయైనప్పుడాతని యనుచరులందఱు నాతనితో ననుగతులై బందీలైరనియు భావించుకొనియెను. తాను చేసిన గంగాస్నానము, తీర్థదర్శనము, గంగాతీరవాసము మొదలగునవన్నియు వ్యర్థములయ్యెననియు, యువరాజునుపట్టుకొని బందీచేసిన వారిలో నొకఁడు ముందుగా వచ్చినాఁడనియు, మిగిలినవారు వెంటనే రాఁగలరనియు, ప్రస్తుతము బందీగాఁ జేయునాతని సహవాసమును వీడి పారిపోవుట మిగుల మేలనియు యోచించుకొని ప్రకాశముగా సైనికునితో "ఈవార్తను దుర్గమునందు తెలియఁజేసెదను. వేఱుకార్యములనుగూర్చి మీరు దయచేయవచ్చును" అని చెప్పెను.

ఈవిధముగఁ జెప్పి దిగ్గజుఁడు క్రమముగా నచ్చటచ్చట నడయాడ నారంభించెను. సైనికుఁ డాతని కడ్డమువచ్చి వెన్నంట లేదు. దిగ్గజుఁడు మెల్లమెల్లగ కొంచెము దూరము పోయి పిదప పరువిడ నారంభించెను. పరుగెత్తుచు నప్పుడప్పుడు వెనుదిరిగి చూచుచు మరల పరుగెత్తుచుండెను. పఱుగెత్తుటయం దాతనికి విశేషనైపుణ్యముండెను. పూర్వమొకప్పుడు విమలతోఁగూడ రాత్రికాలమునఁ బోవుచున్నప్పుడు పిశాచభయముచే గజపతి యీరీతిగనే పారిపోయియుండెను.

దిగ్గజుఁడు పలాయనమై యదేపోకగాఁ బోవుచుండుట యంతవిశేషముగా సైనికుఁడు గమనింపలేదు. పదస్థుఁడగునాతఁడు పదచ్యుతుఁడగువానికి పూర్వమువలె గౌరవమునొసంగక యవజ్ఞ చేయుచుండు టెల్లరకును స్వభావసిద్ధము. జగత్సింహుఁడు ప్రస్తుతము బందీ

మైయుండుటచే నాతనియాజ్ఞను నెరవేర్చుట యంత యావశ్యకము కాదని సైనికుఁడు తెలిసికొనియెను. యువరాజు చెప్పినవార్తను దెలుపుటకు తానే దుర్గమునకుఁబోయి కాలమును వ్యర్థముగా నష్టము చేసికొనుట ప్రయోజనకారి కాదని యాతఁడు తెలిసికొనియెను. ఇంతేగాక యాస్థితియందు యువరాజు చెప్పినవార్తను దుర్గమునకుఁబోయి తెలియఁజెప్పుట క్రమము కాదని కూడ నాతఁడు భావించుకొనియెను. ఏమంటిరా? ఈవార్తను దుర్గమునకుఁబోయి చెప్పె ననుసమాచారము మహారాజెఱింగినచో సైనికుఁడు దండార్హుఁడగును. ఆశంక చేతనే దుర్గమునకుఁబోవలసిన యావశ్యకత లేదని యాతఁడనుకొనియెను. గజపతిని వార్తావహునిగాఁ జేసి వార్తను దుర్గమునఁ దెలియునట్లు చేసి తనపైఁ బెట్టినభారమును తగ్గించుకొనియెను.

మందారణదుర్గమునకు సరిహద్దున నాల్గుమార్గములు చేరి యుండెను. ఒకటి దుర్గములోనికిఁ బోవును. ఒకటి శైలేశ్వరుని మందిరమునకుఁ బోవును. ఒకటి వర్ధమానముకడకుఁ బోవును. నాల్గవది పురమునకుఁ బోవును. సైనికుఁడు దుర్గమునకుఁ బోవకుండ పట్టణమునకుఁ బోవుమార్గమునుబట్టి పోయెను. కశాఘాతముచే నుత్తేజితమైనయాతనిగుఱ్ఱమును వేగముగాఁ బోవుచుండెను.

## ఆఱవ ప్రకరణము.

గజపతివిద్యాదిగ్గజుఁ డూపిరి విడువకుండ పరువెత్తి దుర్గములోనికిఁ బోయెను. మఱియెక్కడకును బోవకుండ నాషాత్రునిని జూడవలయునని యంతఃపురమునకుఁ బోవుట కధికారము లేకపోయినను

సాహసము చేసి పోవుచుండెను. అద్భుతముగనున్న యాతని దుస్తులను, నత్యంతస్వస్థభావముతో నాకస్మికముగా నాస్థలమునకువచ్చి నిలుచుండుటయుఁ జూచి ద్వారరక్షకుఁడు కసరుకొనుచు నాతని నచ్చట నుండి వెడలిపొమ్మని చెప్పెను.

దిగ్గ—అన్నా! కోపపడెదవెందులకు? నేనొకగూఢసమాచారమును దెచ్చితిని. దానినిప్పుడే తెలుపుటయత్యావశ్యకము.

ద్వారపాల—అట్టివార్తయేదియో నాకుఁ దెలుపఁగూడదా?

దిగ్గ—నీకుఁ దెలుపఁదగినది కాదు. ఒక్కరికిమాత్రమే య దియేకాంతముగాఁ దెలుపఁదగియున్నది. నీకుగడ్డమును మీసములు న్నవి. కచ్చబిగించుకొని బట్టకట్టుకొంటివి. నీతలపై కొప్పులేదు. నీకు వార్తఁ జెప్పుటకు నీవు నాకధ్యాపకుఁడవా?

ద్వార—నిన్నువిడిచిపెట్టినచో తాకూరాణియొద్దఁ గూర్చుండి నీవార్తలను విన్నవించెదవా? ఇక్కడ నిలువవలదు. దూరముగఁ బొమ్ము.

దిగ్గ—నీవు నన్నెఱుఁగవా? నేనిక్కడివాఁడనే. నీవు నన్ను మఱచిపోయితివి కాఁబోలు.

ద్వార—నీవెప్పుడు నిక్కడివాఁడవుకావు. నేనుచూడనివారెవరు నిందులేరు. నీవిక్కడివాఁడవేయైనచో నిట్లువచ్చి మార్గమునొద్ద గద్దలమాడుచుండవు. నీవు నిజముగా కిష్కింధలోనుండువాఁడవు.

దిగ్గ—నిజముగా నీవు నన్నుఁ జూచియుండలేదా? దుర్గమునందు నన్నెఱుఁగనివారున్నారనుమాట నా కాశ్చర్యమును గల్గించుచున్నది. నీ వభిరామస్వామి నెఱుఁగుదువా?

ద్వార—ఆయననేయెఱుఁగనా? నీవుపిచ్చివాఁడవు—నీకును, ఆయనకు నేమిసంబంధము?

దిగ్గ — ఆయన నాకు గురువు. నేనాయనకుఁ బ్రధానశిష్యుఁడను.

ద్వార — కొంచెము యోచించి పిదప నాయనకు శిష్యుఁడ వేమైనచో నీకీవేష మేల?

దిగ్గ — దానినిగూర్చి చెప్పవలయుననినచోఁ జాలఁగలదు. మఱి యొకనాఁడదియంతయు నీకెఱింగించెదను. ఇపుడంతఃపురమునందు నా సహాప్త్రనీయున్నది. నేను చెప్పవలసిన యత్యవసరవార్త నామెకు మాత్రమే చెప్పెదను.

ద్వార — ఆప్త్రనీయున్నమాట నిజమే. నీవామె కేమగుదువు?

దిగ్గ — దానినిగూర్చి చెప్పవలయుననినచోఁ జాలకలదు. అది యట్లుంచుము. నీవామె నిక్కడకు పిలువుము. అట్లు కాకపోయినచో నేనామెయుండుస్థలమునకుఁ బోయెదను. విడువుము. అదియునుగాక పోయినచో నిక్కడనుండియే యామెను గట్టిగా కేకవేసి పిలుచుట కొప్పుకొనుము.

ద్వార — కొంచెము సేపాగుము. జనులెవరినైనను చూచి యామెయొద్దకు సమాచారమును చెప్పి పంపెదను.

దిగ్గజ — నేను వేచియుండఁజాలను. వేగముగా సమాచారమును చెప్పిపంపుము. నేను తెలియఁజేయవలసినవార్త చాలనవసరమైనవార్త. కాలవిళంబమైనచో నది యొకమహావిపత్తునకుఁ గారణమగును.

ద్వారపాలకుఁడు కొంచెము యోచించి పిదప మనస్సునందు "ఇతఁడు మందారణనివాసుఁడేయనియు, నితని నిచ్చటనిలిపియుంచుటుచితముకాదనియు నిశ్చయించుకొని "ఆగుము. లోనికి వార్తనం

"పెదన్న" అనియెను.

దిగ్గజునకును ద్వారపాలకునకును నీవితండవాదము జరుగుచున్నప్పుడది యంతయును నంతఃపురమునందు ప్రచ్ఛన్నయై గవాక్షముకడ యవనికాంతరాళమున నొకప్రౌఢవిధవాంగన నిలుచుండి చూచుచుండెను. ఇతరులకామె కానిపింపకుండ మార్గముకడకువచ్చి నిలుచుండి, ముఖహస్తపాదాద్యవయవములతో నభినయము సేయుచు గందరగోళముఁజేయుచున్న దిగ్గజుని చూచుచుండెను.

ఆమె విమల. ఆమె దేహమున నెచ్చటనునాయుజ్జ్వలతయు నా కోమలతయు నిప్పుడు లేదు. అత్యంతమనోహరమగు నాచంపకసదృశవర్ణ మిప్పుడు లేదు. అధరోష్ఠములయం దాతాంబూలరాగవర్ణ మిప్పుడు లేదు. లోచనములయందు పూర్వమువలె నాకజ్జలరేఖలు నిప్పుడు లేవు. ఆలోచనములయందు మన్మథశరరూపములగు నాకటాక్షములును లేవు. కుంతలములయం దానిబిడకృష్ణతయును లేదు. వేణిగాని కబరిగాని యేదియును లేదు. శరీరమం దెచ్చటను నొక్కయాభరణమైనను లేదు. స్వర్ణసూత్రవిమిశ్రితమైనవస్త్రముచే నామె శరీరము సమావృతమై యుండలేదు. వక్షమునందు ముక్తాఖచితమైనకంచుకము లేదు. పూర్వశోభాసమృద్ధులేవియు విమలయందిప్పుడు లేవు. విమల వయస్సునందేగాకుండ పైకిచూచుటకుఁగూడ వృద్ధయై యుండెను. ఆమె యాయలౌకికలావణ్యమును, శోభామయమైన యాయౌవనసంపదయును కాలముచే జయింపఁబడినవనియనేకులెఱుంగుదురు. ఇప్పుడవి శీర్ణభ్రష్టములును, మలినములును, విశుష్కములునై యుండెను. ఆమె యవయవములుక్షీణించియుండెను. దేహము కాతరమై యవసన్నమైయుండెను. గమనము కంపితమై విచలితమైయుండెను. భావభంగులు సంయతములై సావధానములై యుండెను. విలాసమయి

యున్నా విమల యిప్పుడు సభ్రమనధారిణియై యుండెను. హాస్యకౌతు
కమయియగు నావిమలయధరోష్ఠము లిప్పుడు రవికరప్రతప్తకుసుమ
కలికలవలె మ్లానములై యుండెను. ఆహాస్యానందము లామెయొద్దనుం
డి చిరకాలపుసెలవును గైకొనిపోయినవి. రహస్యము, రసికత, పరి
హాసము మొదలగునవి యామెస్నేహమును వదలిపెట్టిపోయినవి.
హా! శోకమా! నీవీసంసారమునందు ఘటించినయచింతితపూర్వపరి
వర్తనము లేవియు రాకుండనుండవా?

ఆసమయమునఁ గొంచెము స్థూలకళేబరమును శ్యామలవర్ణ
మునుగలప్రౌఢవయస్కయగు మఱియొకస్త్రీవచ్చి విమలవెనుకప్ర
క్క నిలుచుండియుండెను. ఆస్త్రీ ఆషాన్మని.

ఆషాన్మని — సఖీ! మధురకుఁబోవుమార్గమునుజూచుచు వ్యర్థ
ముగాఁ గాలహరణముసేయుటెందులకు? శఠుఁడగునానటుఁడు దిగ్గ
జుఁడు వెనుకకుఁదిరిగిరాఁడు.

విమల — ఈప్రణయబంధమును ద్రెంపివేయుటకెవరికి సాధ్య
ము? మనశ్యామసుందరమదనమోహనుఁడు మరలవచ్చియున్నాఁడు.

ఆ — నిజమే! ఆహా! అట్టిదినము మరలవచ్చునా?

వి — వచ్చిచూడుము!

ఇట్లుచెప్పి విమల ఆషాన్మని తానున్నయెడనిల్పి తానుకొంచె
మువెనుకకుజరిగి "చూడుము. మనచోరుని జూడుము. ఔనా? కా
దా?" అనియెను.

ఆషాన్మనియుఁ జూచి నవ్వుచు "ఔను. అమ్మా! ఆపోకిరిబ్రా
హ్మణుఁడువచ్చినాఁడే! కాని యాదుస్తులేమి?" అనియెను.

విమలయు నవ్వుచు నాషాన్మనీగడ్డమునుబట్టుకొని "విరహవి
హ్వలా! రాధా! అన్నియును మఱచితివా? గోపకన్యలప్రాణధన

మిప్పుడు మధురాపురమునకు [illegible] యువరాజువేషము" అనియెను.

ఆపాత్రి—పరిహాసమున కేమి—ఈనిర్భాగ్యుఁ డిన్నిదినములకుఁ దరువాత నిప్పుడెక్కడనుండివచ్చెను?

విమ—అది తెలిసికొనుట మిగుల నావశ్యకము. నీవుపోయి గజపతిని దీసికొనిరమ్ము. ద్వారపాలకునితో గద్దలముసేయుటెందులకు?

ఆపాత్రియు నక్కడనుండి క్రిందికిదిగిపోయి లక్ష్మణియనునొకదాసిని బిలిచెను. ఆమెవచ్చెను. ఆమెనుగూడ తీసికొని యాపాత్రి పార్శ్వమందున్న యొకచీఁకటింటికిఁ బోయెను. అక్కడఁ గూర్చుండుటకు స్థలములేదు. అటనిలుచుండి ఆపాత్రి లక్ష్మణితో "ద్వారముకొద్ద పొడవైనకాళ్లును, బట్టతలయును గలమనుష్యుఁడొకఁడువచ్చి మాటాడుచున్నాఁడు. ఆతఁడెవఁడో, ఎక్కడివాఁడో, అదియంతయు విచారించి తెలిసికొనివచ్చి చెప్పుము" అనియెను.

ల—నీవేపోయి యడుగరాదా?

ఆ—అతఁడు నామనోహరుఁడు. ఆకస్మికముగ నేనెట్లుపోదును? నేనిప్పుడు చూడఁగూడదు.

లక్ష్మణి చాలకాలమునుండి దుర్గమునందుండియుండెను. తఱచుగా విమలతో మాటలాడుచుండును. రసికశాస్త్రమునందును, కుత్సితకృత్యములుచేయుటయందును వెనుకఁదీయునదికాదు. ఆమె మనస్సునందు "రసోల్లాసము బాగుగనేయున్నది" అనియనుకొని "ఏమే శిఖండి! నీహృదయహారమును విప్పుకొని నేను తగిలించుకొనవలయునా యేమి?" అనియెను.

ఆపాత్రిని—నీకది సాధ్యమే? నీవునీవే; యజమానురాలగు

ఠాకురాణి నాకేమియుచేయలేక వెడలిపోయినది. నేనొకప్పుడు ద
యాపూర్వకముగ నామె నాకొరకిఁ జంద్రికనిగా స్పృహముచేసినది.
మానవమయియగు రాధికయైయున్న యామె నేనుదక్కవ నొకళ్ల
గాదు. నేనొక్కతెనుమాత్రమే మొదటినుండియు నాతనిపొందు నా
ధికనై యున్నాను.

లక్ష్మిశ్రీ యనికవయసుకలదికాదు. ఆమ్మాకీకంటె నొకటి రెం
డుసంవత్సరములు తక్కువవయసుకలదని తోఁచుచున్నది. శరీర
చ్ఛాయయు నామెకంటె స్వచ్ఛమైయుండెను. అందుచే లక్ష్మిశ్రీ నా
మెసొబగును జూచుకొని తానామ్మాకీని వినాశనము చేయఁగలనని
యనుకొని "నీకింతటిమోహముతగినదికాదు" అనియెను.

ఇట్లుపలికి లక్ష్మిశ్రీ ద్వారముకడకు వచ్చెను. ఆమె యక్కడి
కు వచ్చునప్పటికి గజపతివిద్యాదిగ్గజుఁడును కాతరభావముతో ద్వా
రపాలకునిఁగూర్చి, "అన్నా! నీవు నాకీవత్తాశమునీయనిచో నేనిచ్చటనే
ప్రాణములను బోఁగొట్టుకొనియెదను. అందువలన నీవు గోహత్య,
బ్రహ్మహత్య, స్త్రీహత్య, భ్రూణహత్య మొదలగు మహాపాతకము
లకు గుఱియగుదువు." అనియనుచుండెను.

ద్వార—నీవు ప్రాణములను విడిచినచో నేను మహాపాత
కములకు గుఱియగుటకుఁ గారణమేమి?

దిగ్గ—చెప్పెదనువినుము. బాల్యమునందు మాగురువుగారు న
న్ను "శుద్ధపసువు" అనిపిలుచుచుండెడివారు. అందుచే నీకు గోహ
త్యాసిద్ధమగును; నేను బ్రాహ్మణకులప్రసూతుఁడను. అందుచే బ్ర
హ్మహత్య సంఘటించునని తోఁచుటలేదా? నేనెల్లప్పుడును మిగుల
భయస్థుఁడను. అదిచూచి నాసహాధ్యాయియొకఁడు నన్ను స్త్రీయని
యు నబలయని ధైర్యములేనివాఁడననియు ననుచుండెడివాఁడు. నేను

సులభముగా మాటిమాటికి నేర్చుచుందుము. అదిచూచి జనులు న
న్ను కేవలము స్త్రీయని చెప్పుచుందురు. అందుచేత స్త్రీహత్యయు
సంభవింపఁగలదు. నేనొకప్పుడు చేఁపలనుకొనవలయునని యంగడికిఁ
బోయియుంటిని. అచ్చట నామత్స్యములనువిక్రయించునొక స్త్రీ చేఁప
లను గుట్టలుగుట్టలుగాఁబోసియుంచెను. వెలయెంతని విచారింపగా "నొ
కడబ్బు" అనిచెప్పి యక్కడనున్నగుట్టలను చూపించెను. నేనొకడబ్బు
నిచ్చి యాగుట్టల నన్నిటిని ప్రోగుచేసి యెత్తుకొనుచుంటిని. ఆస్త్రీ
"అదేమి స్వామీ! ఒక్కడబ్బిచ్చి యన్నిగుట్టలను తీసికొనిపోయెద
రా? " అనియెను. నేను "అన్నిగుట్టలు నొక్కడబ్బుకాదా" అనియుం
టిని. ఆస్త్రీ మీనములను తీసికొనుచు "పాపము స్వామి యేమియు నె
ఱుఁగరు. ఇంకను దల్లికడుపులోనేయుంటిరి." అనియెను. ఆమెయట్లు
చెప్పియుండుటచే భ్రూణహత్యయు నీతలకుఁ జుట్టుకొనును.

దిగ్గజుఁ డీవిధముగా చెప్పునప్పుడు లక్ష్మణియు నాతనిదర్శ
సముచేసి "ఏమి! రసికపురుషా! జ్ఞప్తియున్నదా?" అనియెను.

దిగ్గజుఁడు తలతడవుకొనఁబ్రారంభించెను. అటునిటుచూడఁదొ
డంగెను. ఆసుందరినెఱిఁగియున్నట్లాతనికి జ్ఞప్తిలేదు. కాని య
త్యంతసుందరియగుకామినియొకరు వచ్చి "రసికపురుషా!"యని తన్ను
సంబోధించినప్పుడామె యెవరో తానెఱుంగనని చెప్పుట యరసిక
తయగునని భావించుకొని "సుందరీ! నిన్ను నేనెఱుఁగుదును. చూ
చియున్నాఁడను. బాగుగ నెఱుఁగుదునుగాని గుర్తింపఁజాలను. నీవెవ
తెవు? చెప్పఁగూడదా?" అనియెను.

లక్ష్మణియు ముఖమును విశేషభావసూచకముగ ముడుచు
కొని "సరి! నేననుకొన్నట్లే–పురుషజాతిని తెలిసికొనకుండ వారికిహృ
దయ ప్రాణముల నర్పించినచో తుదకిట్లేయగునని నేనెఱుంగుదును.

తుదకు స్త్రీకి విలపించుటయే గతి. నాహృదయము నపహరించుకొనిన నీవు తుదకు చెప్పినమాట యిదియా!" అనియెను.

దిగ్గజుఁడు చాలసేపు యోచించెను. కాని యెవరిహృదయము నపహరించినట్లాతనికి జ్ఞప్తికిరాక "నాజీవితకాలములో నేనెప్పుడు నితరులది యొకచిల్లిగవ్వయైన నపహరించియుండలేదు. నేను దొంగనుగాను. అదియంతేయు నీమందారణదుర్గమునందున్న వారందఱు నెఱుఁగుదురు. అన్యాయముగా నన్ను చోరుఁడవని చెప్పెదవేల? నీవు బాగుగా వెదకిచూడుము! నీహృదయప్రాణములు మఱియెచ్చటనో యుండియుండవలయును. నేను వానినెప్పుడును తీసికొనియుండలేదు" అనియెను.

లక్ష్మియు చురచురచూచి" తుదకీమాటలనందఱును చెప్పెదరు. మంచిది. నేనిప్పుడే వెడలిపోయెదను" అనియెను.

దిగ్గజ—వెళ్లిపోకుము. సుందరీ! వెళ్లిపోకుము. నేను నిన్ను బాగుగా నెఱుంగుదును. గుర్తించుటకుఁ దగినట్లు చెప్పినచో గుర్తించెదను. నన్ను చోరుఁడనని చెప్పుటకు నీకిష్టముగానుండెనేని నేను చోరుఁడనే యగుదును. నీవిప్పుడు దయచేసి నాకొక్కయుపకారమును జేయవలసియున్నది.

ల—అదియేమి చెప్పుము.?

ది—(చేతులుజోడించుకొని) ఆషాహ్రీతో నత్యవసరమైన యొక వార్తను జెప్పవలసియున్నది. దానికనుకూలమగు నేర్పాటులను నాయందుదయయుంచి నీవు చేయవలయును. ఇదే నాప్రార్థనము.

ల—గొప్పకష్టముసంఘటిల్లినది. నీవాషాహ్రినిపై వలపుఁగొనియున్నట్లు న్నావు. నన్ను మఱచిపోయితివి. నేను నీకు జ్ఞప్తికిరాలేదు. నన్ను గుర్తింపలేకపోయితివి. నేనిప్పుడే పోయి యాయాషాహ్రినిని పి

లిచికొనివచ్చి నీసన్నిధిని విడిచి పోవలయునా! అయ్యో! నాలలాట లిఖితమా!

లక్ష్మణి యీవిధముగా చెప్పి పోవుచుండ దిగ్గజుఁడుచూచి భయభ్రాంతుఁడై యామెవస్త్రమును బట్టుకొని "నాతోడు. నీవునాపై కోపగింపవలదు—కృపయుంచి అమ్మాళ్ళనిపిలువుము. చిరకాలము నీదాసానుదాసుఁడనై యుండెదను" అనియెను.

లక్ష్మణినవ్వుచు నాతనినిగూడఁదీసికొనిపోయెను. ద్వారపాలకుఁడభ్యంతరపెట్టలేదు. లక్ష్మణి దిగ్గజుని కచ్చేరిగదిలోనికిఁదీసికొనిపోయెను.

దిగ్గజుఁడు గదిలో తలపెట్టిచూచి "లోపలనంధకారము" అనియెను.

లక్ష్మణి—నీవు లోపలకుఁబోయినచో వెలుఁగువచ్చును. అమ్మాళ్ళినిచూచెదవు.

దిగ్గజుఁడులోపలకుఁబోయి చూచెను. లోపల నామ్మాళ్ళియుండెను. దిగ్గజుఁడానందముచే నుబ్బి నోరార నవ్వసాగెను.

అమ్మాళ్ళి "ఇదేమిభూతమా? ఇన్నిదినము లెచ్చటనున్నది?" అనియెను.

అమ్మాళ్ళినిజూచుటతోడనే గజపతివిద్యాదిగ్గజుని కవిత్వము పొంగిపొరలెను. పద్మిణియనినిచూచి యొకశ్లోకమును చెప్పనిదే సంబోధించుటయుచితముకాదనియెంచి "యాదేవీసర్వభూతేషు నమస్తస్యై నమోనమః" అనిచెప్పి బ్రాహ్మణుఁడామ్మాళ్ళికి నమస్కారమొనర్చెను.

అ—నాకు నమస్కారమును చేయుచుంటివా?

ది—బ్రాహ్మణపత్నులు నాగవాసులపాదసేవనేసేయునప్పుడు నమస్కారము చేయుట యొకగొప్పకాదు.

ఆ—నీవు రేపుడవేయగుదువు. నీవింతనటుల నెక్కడను నేర్చితివి.?

డి—ఆమాట పిదప చెప్పెదను. నీవిప్పుడు నాతో బయలుదేరవలయును. ఇక్కడనున్నచో ననేకవిపత్తులకు గుఱిగావలసివచ్చును. నీవు నాప్రియునివికావా?

ఆ—దానినిగూర్చి మరలమరల చెప్పనేల? నీవు నాకేమగుదువో యావిషయము సందేహము నెఱుఁగుదురు.

డి.—సరిగాఁజెప్పితివి. ఔను. ఆవిషయము సంపూర్ణము నెఱుఁగుదురు. దేశవిఖ్యాతుఁడైన జ్యోతిషపండితుఁడొకఁడు నన్ను చూచెను. అతఁడును దానిని దెలిసికొనినాఁడు. అట్లయినప్పుడు నీవు నాతోడ రాఁగూడదా?

ఆ—రానని యెవరు చెప్పినారు? నేను నీపై నెంత ప్రేమను కలిగియున్నానో నీవు నాపై నంత ప్రేమను కలిగియుండుట లేదు.

డి—లేదని యెవరు చెప్పినారు? అట్టిమాటను చెప్పినవాఁడు కేవలము మిథ్యావాది. నామనస్సును బాధించుటకసత్యవాక్యముల ను ప్రకటించినాఁడు. నేను నిన్ను ప్రేమించుచున్నాననుటకు నాశరీరమే సాక్షి. నేను చూచిన యాదైవజ్ఞమహాశయుఁడు నాలలాటమును జూచి దానిపై, నీనామాద్యక్షరమగు "ఆ"యనుసంయుక్తాక్షరము గు "నీ"యనువ్రాఁతయున్నవని నుడివియున్నాఁడు. అట్టిప్రీతివిశ్వాసములు మఱియెవ్వనియొద్ద కనఁబడఁగలవు?

ఆ—అదియంతయు నసత్యము. నీవంతవిశేషముగా నన్ను ప్రేమించుచుండినయెడల నీవు నన్ను విడిచి పరదేశమునకుఁబోయి యింతకాలము ప్రవాసివై యుండనేయుండవు.

డి—ఆహా! ప్రాణేశ్వరి! నాకపాలమున నీనామము వ్రాసి

యున్నది. నామాటయందు నీకు నమ్మకము లేకపోయినచో నీవే చూడుము.

అని చెప్పి దిగ్గజుండా స్త్రీనేత్రములకు సరిగా తనలలాటమును బెట్టి "చూచితివా?" అనియెను.

ఆ—ఔను. చూచితిని. కాని నీవు చెప్పినయర్థము తెలియుటలేదు. నీకపాలమున "పశువు" అని స్పష్టముగా వ్రాసియున్నది.

ది—అట్లనుండనిమ్ము. ఏమనిన నేనునీపశువునేయగుదును. నీవునన్ను మేపుచుంటివి. త్రిప్పుచుంటివి. బయటకుఁ దోలుచుంటివి. నీకిష్టమువచ్చినట్లు చెప్పుము. ఇఁకనధిక కాలవిళంబముతోఁ బ్రయోజనము లేదు. వేగముగా నాతోడరమ్ము. ఇక్కడనుండుటవలన భయంకరవిపత్తు సంభవమగును.

ఆ—ఏమి యాపద?

ది—నీ రెండవ సింహళనివ్యాహారము పునః సన్నిహితమైనది.

ఆ—అదియేమి?

ది—యువరాజు బందీయైనాఁడు.

ఆస్త్రీ ప్రకంపితయై భయముతో "ఎవరు చెప్పినారు?" అని కొను.

ది—బందీగాఁ జేసినవారే చెప్పినారు.

ఆ—బందీగాఁ జేసినవారెవరు?

ది—మహారాజగుహాన సింహళ మనుష్యులు.

ఆ—ఎక్కడ బందీగాఁ బట్టుకొనినారు?

ది—పోవుచున్నదారియందు.

ఆస్త్రీ యాతురతతో నీవార్త యసత్యమయినదికాదని

తిసికొని మరల "నీవు చెప్పినది నిజమేనా?" అని యడిగెను.

ది—(హృదయముపైఁజేయివెట్టుకొని) నీతో నసత్యములను జెప్పినచో నాకునరకమందును స్థలముదొరకదు. నాకామాట బాగుగాఁ దెలియును. నీకు తెలియదా? యువరాజు బందీయైనప్పుడు పూర్వముంలెనే యిప్పుడును దుర్గమునందున్నవారందఱును బందీలగుదురు. నీనిమిత్తమై నేనెంతయో యోచించుచున్నాఁడను. ఇప్పుడే వమ్మా! ఎక్కడికైనను పారిపోవుదము.

ఆమాట్రని మిగులకళవళపడి విమలతో నీవార్తనుజెప్పుటకై యాత్రముసొందుచుండెను. గజపతి నక్కడనుండి పంపివేయుటకై "సరిగాఁజెప్పితివి. పారిపోవుటయే వివేకమని తోఁచుచున్నది. నీవిప్పుడు పొమ్ము. సామానులను దీసికొని చీఁకటిపడగనే వెడలిపోవుదము." అనియెను.

ది—పాణేశ్వరీ! ఆలస్యముచేయుటకు ధైర్యముచాలదు. మనము పోవులోపలనే ఆపూఁపదవచ్చినను రావచ్చును.

ఆ—అందుల కొకయుపాయమును జేసెదను. నీవిప్పుడేపోయి యూశ్రమమునందున్నవారితో మానసింహునిమనుష్యులిఁక రెండుగంటలలో వచ్చి దుర్గమును ముట్టడింపనున్నారని చెప్పుము.

వడకుచు ద్వారముకడకు వచ్చి "ఏమంటివి? నేనిప్పుడే పోయెను" అనియెను.

ఆ—నీవు పొమ్ము. నేను సమయమునకు సరిగావచ్చి నిన్నుఁ గలిసికొనియెదను.

గజపతి యొకమార్గమువెంట ద్వారముకడకుఁబోయెను. అచ్చట లక్ష్మణి నిల్చుండియుండి "మిత్రుఁడా! నన్ను విడిచిపెట్టి పోయెదవా?" అనిపలికి యతనిపైనున్న వస్త్రమును బట్టుకొనియెను.

"లేదు — ఇప్పుడే వచ్చెదను — బట్టను విడువుము" అనిదిగ్గజుఁడనియెను.

ఆ స్త్రీముఖలోపసగము లక్ష్మిచేతిలోని కూడివచ్చెను. గజపతి పలాయనుఁడైపోయెను.

## ఏకాదశప్రకరణము.

గజపతివిద్యాదిగ్గజుఁడు చెప్పిన దుర్వార్త స్వల్పకాలములో గ్రామమంతటను వ్యాపించెను. జగత్సింహునకు సంభవించినయాపద్వార్తను వినినప్పటినుండియు నాతనియాత్మీయుల దుఃఖమునకుఁ బారము లేదు. అభిరామస్వామి శీఘ్రముగా దిగ్గజునిబిలిచి యనేకవిధములగు ప్రశ్నలనడిగి తెలిసికొనియెను. దిగ్గజుఁడు విశేషసంగతులేమియు చెప్పఁజాలకపోయెను. తుదకు సత్యస్థితిని దెలిసికొనివచ్చుటకు సమర్థకమైనయొకగూఢపురోహితుని బంపవలయునని నిశ్చయించుకొనిరి. అభిరామస్వామి యాజ్ఞానుసారముగ నొకఁడు పాట్నానగరమునకు బయలువెడలెను. ఆసమయమునం దాత్మీయులందఱును కర్తవ్యమునుగూర్చి యోచింపనారంభించిరి.

సూర్యాస్తమయమైనపిదప నిరువురుస్త్రీ లభిరామస్వామి కుటీరమునకు వచ్చిరి. అభిరామస్వామి మృగచర్మముపైఁ గూర్చుండియుండెను. వచ్చినయిరువురుస్త్రీలలో నొకతె విమల. మఱియొకతె ఆషాంని. వారిరువురును నేలపైఁ గూర్చుండియుండిరి. అందఱిముఖములను చింతావిషాదము లావరించుకొనియుండెను. అందఱును మౌనమునుదాల్చియుండిరి.

విమలమాటాడుట కారంభించి "ఇప్పు డుపాయమేమి?" అని యెను.

అభిరామస్వామి యధోముఖుఁడై కొంచెము సేపు చింతించి పిదప నిట్లు చెప్పనారంభించెను. "విమలా! శైలేశ్వరునిమందిరమున నీకును, జగత్సింహునకును బ్రథమసందర్శనమైనపిదప నీవు నన్నాలోచనయడుగుటకు వచ్చియుంటివి కాదా! ఆదినమున జరిగినమాట లేవైన నీకు జ్ఞప్తియందున్నవా? చాలకాలముమాటకాదు. అదేస్థలమున నిలుచుండి నీవు నన్ను మరల నాలోచన మడుగుచున్నావు."

విమల—జ్ఞప్తియందున్నది. ఆదినమున జరగిన మాటలన్నియు బాగుగా జ్ఞప్తియందున్నవి.

అభి—మానసింహుఁడీపరిణయమున కంగీకరింపఁడని నేనప్పుడు చెప్పియుంటిని. నీవందులకు యువరాజే స్వతంత్రుఁడని బదులుచెప్పితివి. ఆమాటలు జ్ఞప్తియందున్నవా?

విమల—(అధోముఖియై) ఔను.

అభి—ఆస్వాతంత్ర్యమున కిదియే ఫలము. యువరాజున కిప్పుడు నేమాత్రమును స్వాతంత్ర్యము లేదు. ధనమునందును, మానమునందును, పదవియందును, ప్రతిష్ఠయందును, శౌర్యపరాక్రమములయందును, గౌరవమునందును మానసింహుఁ డద్వితీయుఁడని చెప్పిననది యుత్ప్రేక్ష కాఁజాలదు. తండ్రి యిష్టమునకు వ్యతిరేకముగా నేకార్యముఁ జేయుటకును జగత్సింహున కీషణ్మాత్రమును స్వాతంత్ర్యము లేదు. ఇంతేగాక, మానసింహునకును, యువరాజునకును ప్రభుభృత్యసంబంధముండుటచే యువరాజు సార్వభౌమునికార్యములయందు నియోగింపఁబడినవాఁడు. ఆకార్యములయందును నాతని కేవిధమైన స్వాతంత్ర్యమును లేదు.

విమల—ఆవిషయమిప్పుడు తెలిసినది. ఒకవేళ నీసంగతి యప్పుడు తెలిసియున్నను నేమిచేయఁగలము? ఆప్రేమప్రవాహమును నిరుద్ధముచేయుటకు సాధ్యముకాదు.

అభిరామస్వామి యసహ్యాసూచకమందహాసమును జేసి మరలఁ జెప్పనారంభించెను. "విమలా! నీవు బాలవుకావు. ఇట్టివ్యాపారములను తెలియనిదానవుకావు. సమయమువచ్చినప్పుడు చలింపకుండనుండుట నీకుచితమైయుండెను. అనురాగము నంకురముసందే తుంపివేయవలయునని నీకుఁ దెలియఁజేసియున్నాఁడను. కాని నీవు నామాటను వినవైతివి. దానిపరిణామ మిప్పుడు భయంకరమైనది. ముందెట్లు జరుగునో యెట్లు పరిణమించునో తెలియదు.

విమల—మీరు తిలోత్తమను సర్వదా చూచుచుండెడివారుకారు. నేనామెయొద్ద నెల్లప్పుడు నుండెడిదానను. అట్టిసంబంధమును చేరికయు సంఘటనమగునెడల చాలదుఃఖములుకలుగఁగలవని నేను బాగుగ నెఱింగించియుంటిని.

అభి—నేనాసంగతినప్పుడు తెలిసికొనియుండలేదు. ఇప్పుడును తెలిసికొనఁజాలను. ముందైనను తెలిసికొనవలసినంతయవసరము సంభవించునని నాకుఁదోఁచుటలేదు. ప్రథమసందర్శమున నెక్కడనైన నస్సుదైవవశముచే మార్గమధ్యమున నొక్కపర్యాయమాకస్మికముగనైనసందర్శనముతోఁ బుట్టిన ప్రేమము ప్రగాఢముగాఁ బరిణమింప నేరదు. అది కేవలలోలతచేఁ గలిగిన క్షణికమాత్రమోహమేకాని వేఱుకాదు. దానియుత్తేజనము మిగులప్రబలమైనది. అది మనుష్యుని దిక్కుతెలియనివానివలెను జ్ఞానశూన్యునిగను జేయఁగలదు. కాని సరియైనకర్ణధారుఁడు నౌకనునడపించుభారమును వహించినచో నన్నియాపదలును నాశంకలును దూరమైపోవును. అసంగతమును స

సంభవము నగుప్రవృత్తి ప్రవాహమున కుచితకాలమునందు తత్క్షణామే యడ్డు నుగల్పింపనిచో నది మిగుల వర్ధితమై క్రమముగ కూలముల నతిక్రమించి సమస్తమును జేలవేసికొని పోవును. నీకీవిషయములయందు మిగుల నభిజ్ఞత యని యెంచి చక్కగా నడపించుభారము నీపై బెట్టి నిశ్చింతుండనైతిని.

వి — విమల—(అధోముఖియై) సాధ్యమగునంతవఱకు నేను కార్యమును చక్కనిమార్గముననే చేయుచు వచ్చితిని. ఎట్లు చేసినచో సమస్తమును సుఖమయమును, నానందమయమునగునో యట్లే చేసితిని.

అభి—మనకిప్పుడు ఘోరతరమైన యాపత్సమయము తటస్థించినది. మనమందఱమును విషాదమునందు మునిఁగియున్నారము. వెనుక జరిగిపోయిన యప్రియప్రసంగమునుగూర్చి యిప్పుడాలోచింపకుండనుండుటయే యుచితము. అయినను ప్రస్తావవశమ్మున నా విషయమునుగూర్చి యొకటిరెండుమాటలను మాటాడుటవలన హానియుండదని తలఁచెదను. ఈవిషయమున మొదటినుండియును నింతవఱకును చక్కనిమార్గముననే యేర్పరించితినని నీవుచెప్పెడిదానిలో నాకుఁ దెలియకుండనున్న దించుకంతయును లేదు. నీవు చేసినయా కార్యములలోఁ బ్రతిభాగమునందును భయంకరమైన నీయవివేచనమును, నసావధానతయు, బుద్ధివిహీనతయు మొదలగుతొందరపనులు స్పష్టముగాఁ గన్పట్టుచున్నవి.

విమల యధోముఖియై నిరుత్తరయయ్యెను. అభిరామస్వామి చెప్పఁదొడఁగెను. "నిజమాడిననిష్ఠురముగానుండును. ఈదుఃఖసమయమున నప్రియమైన నిజమును చెప్పి వేదన నభివృద్ధిచేయుట నాకిష్టము లేదు. జరిగిపోయినదానిని తిరిగి కూడఁదీసికొనుట కుపాయమున్నచో నిప్పుడు దానినిగూర్చి చర్చించినందువలన ఫలముండును. కా

ని, యిప్పుడు జరగిపోయినదానినిగూర్చి యోచించుట కష్టమునకుం
గారణమగుటయేగాని వేఱుకాదు.

విమల — నాప్రాణములపైనైనను దృష్టిలేకుండ సర్వదా తి
లోత్తమ హితసాధనములగు కార్యములనే చేయుచు వచ్చితిని. తి
లోత్తమ నా రెండవప్రాణము. నాజీవనమందలి సమస్తసుఖములను
వదలుకొంటిని. నాసుఖములన్నియు నష్టమైపోయినవి; ఈప్రాణము
ను నాదేహమున నొకదినమైనను నిలుపఁజాలను. కాని, యిపుడు
ప్రాణములను నిలుపుకొనియుండుట కేవలము తిలోత్తమసుఖమును
జూచుకొని యుండుటయే యైనది. తిలోత్తమ సర్వసుఖముల ననుభ
వించుచుండఁగాఁ జూచి ప్రాణములను విడువవలయునను నొకటే సం
కల్పముతో నుంటిని. ప్రార్థనీయసుఖములన్నియును తిలోత్తమకు ల
భించినవి. కాని నాయదృష్టదోషముచే మరల నామె యిప్పుడు
కూలములేనిసముద్రములోఁ దేలుచున్నది. మరల నామె శోకము
వలనను, చింతవలనను, మృతప్రాయయైపడియున్నది. ఈనాదుఃఖము
నెవరు తెలిసికొనఁగలరు? నాయీదురవస్థ యెవరితోఁ జెప్పుకొందు
ను? నేనెవరిసుఖముకొఱకు సర్వదా వ్యాకులత నొందుచుండెడిదా
నో, అట్టియామెకు నాయవివేచనమువలనను బుద్ధిదోషమువలనను
నెట్టియాపదసంభవించెనో నాకు తెలియదు. అది యప్రియమైనమా
టయైనను దానిని విని పశ్చాత్తాపము నొందుదును. నేనేసమయము
న నన్యాయముగా వ్యవహరించితినో దయయుంచి మీరు నాకుఁ జె
ప్పవలయును.

అభి — పూర్వాపరకార్యములయందు నీ వెఱుఁగని దిసుమంత
యును లేదు. మానసింహునితనయునితో వీరేంద్రసింహునితనయు
కు పరిణయసంబంధ మెట్టిసందర్భమునందును సంఘటితము కాఁజా

లదని నీవు బాగుగ నెఱుంగుదువు. అట్లెఱింగియున్నప్పుడా వ్యామోహాశ నిర్మూలమైపోవునట్లు స్పష్టముగా సరళవాక్యములతోఁ దిలోత్తమ కావిషయమును తెలియఁజేయుట నీకు న్యాయము. దానివలన నెట్టి ఫలమును కలుగకపోయినను నీవు తిలోత్తమకు విమాతవైనను ఆమె కేకమాత్రసంరక్షిణివగుటచే నట్టికర్తవ్యమును చేయుట నీకు విధియైయున్నది. నీవాకర్తవ్యము నొకప్పుడుగూడ నెరవేర్చియుండలేదు. పదునైదుదినములకుఁ బిదప రెండవమారు యువరాజును శైలేశ్వరమందిరముకడఁ జూడవలెననునుద్దేశముతో బయలుదేరుటకుముందు నీవొకసారి యావిషయమును తిలోత్తమకుఁ జెప్పియున్నావనుమాట వాస్తవమే. కాని, యామాటను నీవు నొక్కిచెప్పియుండలేదు. మొదటినుండియు నామాటను పదింబదిగా స్పష్టముగా తెలియఁజేయుట నీకు విధియైయున్నది. నీవట్లు చేయలేదు. అదినిజమేనా ?

విమల మాటాడలేదు. అభిరామస్వామి చెప్పఁదొడఁగెను. "శైలేశ్వరుని యాలయమునందు మొట్టమొదటసమావేశమైనప్పుడు జగత్సింహుఁడు మీరెవరో తెలిసికొనకుండఁగనే వెడలిపోవుచుండెను. అప్పుడు పదునైదుదినములకుఁ బిమ్మట నదేస్థలమున మావృత్తాంతమును తెలిపెదనని యవకాశముకలుగఁజేయుట నీకుచితమైనపనికాదు. ప్రథమసందర్శనమే యంత్యదర్శనమైనచో నెంతయో శ్రేయస్కరముగ నుండును. ఇచ్ఛాపూర్వకముగ రెండవపర్యాయము మరల దర్శనముచేయుదునని ప్రతిజ్ఞచేయుట నీకు కేవల మనుచితము. నీవును నాషామ్రనియు నాశిష్యుఁడగు గజపతితోఁ బరిహాసమాడుచు మూర్ఖతతో రహస్యాలాపములాడుచుండుటను నేను బాగుగా నెఱుఁగుదును. కాని యామూర్ఖుఁడా రహస్యపరిహాసాలా

షము లవివేకజన్యములని తెలిసికొనలేదు. ఆగజపతినిగూడఁ దీసి
కొని యర్ధరాత్రమున శైలేశ్వరునియాలయమునకుఁ దీసికొనిపోవు
ట నీకు యుక్తముకాదు. ప్రపంచజ్ఞానవిహీనుఁడైన యామనుష్యుఁ
డు మీయం దనురక్తుఁడైనాఁడు. ఆదినమున మీయిరువురినడవడి
వలనను మాటలవలనను నతనియనురాగము వృద్ధిపొందినది. పోవు
చున్నప్పుడు మార్గమధ్యమున సంగీతాదిలోలత్వవ్యాపారములన్ని
యు కొదవలేకుండ జరగినవి. పశుతుల్యుఁడగు నాపురుషుఁడు మీ
పై నత్యాచారములు నడపినను నడపవచ్చును. అట్టిప్రవర్తనమం
తయుఁ గులకామినుల కత్యంతము నిందాపాత్రము. ఇదియంతయు
నిజమగునా కాదా ?"

విమల నిరతిశయలజ్జాయుక్తయై ప్రత్యుత్తరమీయలేదు.
స్వామి మరల నిట్లు చెప్పనారంభించెను. "యువరాజునుచూచినప్పు
డతఁడు తిలోత్తమయందత్యంతానురాగమును గలిగియున్నాఁడని
నీవు తెలిసికొనియుంటివి. ఆతనిప్రార్థనను విని యాతనికిఁకనొకసా
రి తిలోత్తమదర్శనముచేయించెదనని యొప్పుకొనుట నీకెంతయుసను
చితము. రెండవసారి సమావేశమైనప్పుడా శైలేశ్వరుని యాలయము
నందే యావిషయమును విడిచిపెట్టియుండినచో నెంతచక్కఁగానుండు
ను! అంతటితో వదలివేయక యారాజకుమారుని కూడఁ దీసికొని
వచ్చి నీశక్తిని, అధికారమును మరచి యనేకగర్హితకార్యములను
జేసితివి. అట్టియుద్ధవిగ్రహకాలమునందు దుర్గేశునకుఁ దెలియకుండ
యువకుఁడగునొకమొగలాయీసైన్యాధిపతి ననాయాసముగా దుర్గ
మునకుఁ గొంపోయితివి. నీవు దుర్గేశునకు శాస్త్రవిహితముగాఁ బరి
ణయమైనధర్మపత్నివే యగుదువు. కాని, యట్టివిశేషకార్యములను
జేయుటకు నీకధికారములేదు. స్త్రీలకట్టిస్వాతంత్ర్య మెచ్చుటను

భింపదు. అది యనేకానర్థములకుఁ గారణమగును. పరిస్థితులు నవియే సంభవించినవి. ఈవిషయమున నీవు త్తరవాదినివి కావా?"

విమల పూర్వమువలెనే మౌనమైయుండెను. అభిరామస్వామి యిట్లు చెప్పనారంభించెను. "పిదప నీవేకార్యమును జేసితివో యాకార్యమును జేయుటకు తల్లిగాని, సవతితల్లిగాని, పరిచారికగాని, పరిచితయైనమరియేస్త్రీగాని తుదకు వేశ్యయైనను సాహసింపఁజాలదు. సుసజ్జితమై సువాసితమై, బద్ధద్వారమైన యొకరాజకన్యకాంతఃపురమున కామెయందత్యాసక్తుఁడైయున్న తరుణవయస్కుఁడగునొకరాజపుత్త్రుని ననాయాసముగాఁ బ్రవేశింపఁజేసితివి. ఆయపరాధమును, ఆస్వాతంత్ర్యమును, ఆయవివేకమును, ఆమాటలను దలఁచుకొనిన నాకిప్పటికిని హృదయమున కంపము జనించుచుండును. ఆనీయజాగ్రత్తమూలముననే దుర్గము పఠానులకు వశమైనది. దానికి ఫలముగానే నీకు వైధవ్యము సంభవించినది. అందువలననే యనేకానర్థములు సంఘటిల్లినవి. విమలా! నేను నిన్ను తిరస్కారము సేయుట లేదు. తిరస్కారమునకును, అనురాగమునకును నిదిసమయముకాదు. కాని, యోచించిచూడుము. ఈవ్యాపారమునందు మొదటినుండి తుదవఱకును నీవుచేసినయేకార్యమును బాగుగా లేదు."

విమల పితృచరణములపైఁబడి "నాకు తెలిసినది. మొదటనుండియును నేను గర్హితకార్యములనే చేసితిని. ఇప్పుడు దానికే ప్రతీకారమును లేదు. ఇప్పుడందులకేమియుపాయముకలదో యోచించి యాకృతిగ చేసి మమ్ముఁ రక్షింపవలయును" అని వేఁడుకొనియెను.

అభిరామస్వామి విమలను లేవఁదీసి "నేను పగలంతయు నుపాయమునుగూర్చి యోచనము చేయుచునేయుంటిని. నేను పంపించి

నదూత తిరిగివచ్చువఱకు నేయుపాయమునవలంబించుటకును నవకాశము లేదు. నిర్బోధకుఁడగుదిగ్గజునివాక్యములవలన నేసంగతియును నిశ్చయముగాఁ దెలియుట లేదు. మహారాజుకోప మేవిధముగా నెంతలకువృద్ధియయ్యెనో తెలిసికొనినపిదప నేమేమియుపాయములను మన మవలంబింపవలయునో స్థిరము చేసికొనవచ్చును" అనియెను.

విమల—దూత తిరిగివచ్చుట కెన్నిదినములుపట్టును?

అభి—ఱేపే రావచ్చును. కాని, యతఁడు పాట్నాపర్యంతమును పోవలసియున్నచో నెనిమిదిపదిదినము లాలస్యముకావచ్చును.

విమల—ఎనిమిదిపదిదినము లాలస్యమైనచో మఱియేవిపత్తులుసంఘటించునో తెలియదు. తిలోత్తమ యిప్పుడే మృతప్రాయయై యున్నది. ఆమె యెనిమిదిపదిదినము లాయాతనను సహించి యెట్లు జీవింపఁగలదు?

అభి—నీవు తిలోత్తమకు విశేషధైర్యమును జెప్పవలయును. నేనామెను ఱేపటియుదయముననే చూచి యోదార్పఁ బ్రయత్నించెదను.

విమల—మహారాజునకును యువరాజునకును జనకపుత్రసంబంధము. తండ్రి కుపితుఁడై కుమారుని బందీగాఁజేసినమాట వాస్తవము. కాని వారిరువురకును బ్రత్యక్షసమాగమమైనచో, కుమారుని నోటినుండి వెడలువినీతవాక్యములనువిని మనసు కరఁగి మానసింహుఁడు తనయుని క్షమింపఁడా?

అభి—అదియెట్లు? వీరపురుషునికోపము పుత్రులు లేక యాత్మీయు లన్నంతమాత్రమున నిరస్తముకాదు.

విమ—ఆకోప మెట్లుగాఁబరిణమించునని మీయభిప్రాయము?

అభి—(కొంచెము యోచించి) నీవాఁడుదాసన్న. సంగతులన్నియు నీకుఁ దెలియకుండుటయే మేలు.

విమ—విశేషానిష్టమేదయిన సంభవించు నెడల తోఁచనే దానికిఁ దగినప్రతీకారమును జేయుటకై ప్రయత్న మొనర్చుటుచితము కాదా? మానసింహమహారాజు మీయెడల విశేషశ్రద్ధాభక్తులను గలిగియున్నాఁడు. తండ్రికొడుకులకున్న భేద భావమును దూరము సేయుటకు మీరుమధ్యస్థులై నిలిచినచో మంచిదికాదా?

అభి—ఈవిషయమున నేనుమధ్యస్థుఁడనుగానుండుట మరింత యనిష్టమునకే కారణమగునుగాని మనోరథసిద్ధి కాఁజాలదు. మానసింహుఁడు నాయందు శ్రద్ధాభక్తులను గలిగియున్నాఁడని నీయభిప్రాయము. కాని యాతనిభక్తిశ్రద్ధలవిషయమున నాకునమ్మకము లేదు. ఆతఁడు సర్వాంతఃకరణములచేతను నన్ను ద్వేషించుచునే యుండును. మనలో నెవరిమీఁదను నాతనికి మమతగాని, శ్రద్ధగాని, విశ్వాసముగాని లేదు. ప్రస్తుతమున మనము మఱియొకరిమూలముననైనను మనకార్యసాఫల్యమునకై ప్రయత్నములను చేయవలసియున్నది. మానసింహునకు గౌరవపాత్రుఁడైన మనుష్యుని మూలమున ప్రయత్నించిచూడవలయు. ఇప్పుడు రాత్రి చాలయైనది. మీరు దుర్గమునకుఁ బొండు. రేపటియుదయమున మరల రండు.

విమలయు నామాత్రియు భక్తిభావముతో నభిరామస్వామికి వందనములుచేసి యక్కడనుండి వెడలిపోయిరి.

## ఎ ని మి ద వ ప్ర క ర ణ ము.

---

దూత తిరిగివచ్చెను. పాట్నానగరమునకును బోయి యచ్చట యువరాజుయొక్క దుర్దశావృత్తాంతముల నన్నింటిని సంపూర్ణముగఁ దెలిసికొని యాతఁడు తిరిగివచ్చెను. ఆతఁడు చెప్పినయుదంతమును విని దుర్గమునందలిజనులందఱును శోకముచే మృతప్రాయులై పోయిరి.

దూత యీదుఃఖవార్తను దెచ్చినదినమున నభిరామస్వామి యాతనినోటినుండి సమస్తవృత్తాంతమును విని దుర్గముతో సంబంధించినకార్యములను చేయుటయందు నివిష్టచిత్తుఁడయ్యెను. తాను దుర్గమున లేనికాలమున రాజకార్యములు సరిగా నిర్వహించుటకుఁ దగిన యేర్పాటులనన్నింటిని జేసి యాతఁడాదినముననే తీర్థయాత్రలను జేసికొనుటకై బయలువెడలెను. అందఱితోడను తాను తీర్థయాత్రలకై పోవుచుంటినని చెప్పెను. జనులట్లే యభిప్రాయపడిరి. కాని విమలమాత్ర మట్లనుకొనలేదు. ఇప్పుడు సంభవించినయీశోచనీయవిషయమునకుఁ బ్రతీకారమును జేయవలయుననుప్రయత్నముతో నాతఁడు దుర్గమునువిడి పోవుచుండెనని యామె యనుకొనియెను.

తిలోత్తమ దుఃఖిని--మర్మపీడిత--తిలోత్తమా! దారుణమైన యీదుఃఖమును హృదయమున నిలుపుకొనుటకు నీకు శక్తి లేదా? మిగులఘోరమైనయీయాతనను సహించికొనుటకు నీకు సామర్థ్యమున్నదా? విపద్వాయువుచే సంక్షుబ్ధమైయున్నసముద్రమును శాంతభావముతో దాటిపోవుటకు నీకు శక్తి కలదా? లేదు. నీకేశక్తియును లేదు. తిలోత్తమ యీయాఘాతముచే నవసన్నమైపోయెను. తీవ్ర

మైనయాతనచే సర్వభావములయందును నామె విచారగ్రస్తయై యుండెను. దుస్తరమైన యాసముద్రమును దాటుటకు కావలసినశక్తిసాహసములేవియు నామెకడలేవు. వియోగవిహ్వలమైన యాదుఃఖిని యధోవదనయై భూశయ్యయందుఁబడియుండెను.

ఆగది—ఏగదియందు సర్వదాతనశ్రేయముఁ నభిలషించువిమలయనుగ్రహముఁ పూర్వమున నచింతితపూర్వోపాయముచేఁదిలోత్తమ తనహృదయేశ్వరుఁడగు జగత్సింహునితో మొట్టమొదట కలిసికొనియెనో, ఏగదియందు సరళహృదయయగుతిలోత్తమ జగత్సింహునిహస్తమునందు శాశ్వతముగ నాత్మసమర్పణముచేసియుండెనో, ఏగదియందు తనప్రాణేశ్వరుఁ డెడతెగకుండఁ గత్తినిద్రిప్పి విపక్ష శత్రువులయస్త్రఘాతముచే స్మృతివిహీనుఁడై రుధిరార్ద్రకళేబరుఁడై ధరాశాయియయ్యెనో, ఏగదియందు, తిలోత్తమయు విమలయు కాలస్వరూపులగుపఠానులచేఁ జిక్కి బందీలై పోయిరో, బహువిధ సుఖదుఃఖస్మృత్యుద్దీపకమైన యాగదియందిప్పుడు తిలోత్తమ పడియుండెను. ఆమెసమీపమున నామంచము—ఏమంచముపై తిలోత్తమ పరధ్యానభావముతో నసంగతములగు నెన్నియోవ్రాతలనువ్రాసివ్రాసి కట్టకడకు కుమారజగత్సింహునినామమును వ్రాసెనో, పిదప తనయసావధానచిత్తమును తెలిసికొనుటచే బొడమిన సిగ్గుచే నధోవదనయై యేశయ్యయందలియాభాగము ననేకపర్యాయములు కడిగితుడిచివైచినను తనహృదయేశ్వరునినామము చెఱిగిపోవకుండ స్పష్టముగా వ్రాసియున్నట్లు కాన్పించుచుండెనని యామెయనుకొనియుండెనో, ఆశయ్య—ఏశయ్యపైఁదిలోత్తమ తనహృదయేశ్వరుని కంఠాలింగనమును జేసికొని యనేకసుఖకల్పనలచేఁ బ్రమత్తయై యానందసాగరమున మునిఁగియుండెనో, ఆశయ్యే యామె

పార్శ్వమునను౦డెను. ఏతల్పముపై బదిదినములకుఁబూర్వము తిలో
త్తమతననాథునిపార్శ్వమున శయనించి యుత్కంఠతతో నారాత్రి
యంతయు గడపి యుషఃకాలమందమలయమారుతసంస్పర్శముచే
నించుక నిద్రఁజెందియుండ నాతఁడు తనబాహుపాశమునువిడిపిం
చుకొని ప్రాతఃకాలవాహ్యాళికై బయలుదేరిపోయెనో, ప్రియమై,
సుఖమయమై, మనోహరమైనయాపర్యంకపార్శ్వమున నాతిలోత్తమ
భూశయ్యపైఁబడి పొరలాడుచుండెను.

ఆమె యశ్వారూఢుఁడై పోవుచున్నతననాథుని గవాక్షము
నుండిచూచుట, ఆతనిసంజ్ఞలు, ఆతనివీడుకోలు, ఆమెరోదనము, ఆ
మెప్రణామము, ఇవియన్నియు జరిగి పదిదినములైపోయినది. అయి
ననాతఁ డింకను దిరిగి రాలేదు. అంతేకాదు. వెనుఁదిరిగి రాకుండుట
యేగాదు. ఆతఁడు తిరిగి వచ్చునను నాశయేలేదు. అతఁడు శృంఖ
లాబద్ధుఁడై బందీయై పోయెను. యావజ్జీవమును నాతఁడాదశయం
దే కాలమును గడపవలసియున్నది. ఈవిధముగా మానసింహమ
హారాజుగారియాజ్ఞ యైనది. తండ్రియాజ్ఞచేఁ గుమారున కాకఠిన
తరమైనశిక్ష—అత్యంతకఠోరమైన యాయాజ్ఞ కన్యథాచేయఁగలి
గినవారెవరు? మానసింహునిమాటకు వ్యతిరేకముగా నెదిరించి
మాటచెప్పఁగలవారీభరతఖండమున నెవరుకలరు?

అకటకటా! సుఖమెన్నిదినములుండును! తిలోత్తమ శైలే
శ్వరునిమ్మందిరమున జగత్సింహునిమోహనమూర్తిని సందర్శించిన
ది—పిదప కేవలముచింత—ఒకపక్షముదినము లతిదారుణమైనగొ
ప్పయాపద—పఠానులగృహమున నివాసము. సతీత్వము—ధర్మ
ము—జీవనము—పవిత్రత—ఇవినాశనమైపోవునేమోయని నిరం
తరము భయము. అసంభావితోపాయముచే నస్మాన్ఖానునియంగు

లీయక సాహాయ్యమున నటనుండి విడుగడ— "ఏ రేంద్రసింహునితో నయమా? ఇక్కడ కేందులకు?" అని యువరాజు పలికినమర్మభేదకోమలగు కఠోరవాక్యములు—అయేషాయనుగ్రహముచే ముక్తిలాభము—దానితోడనే హృదయమునందలివిజాతీయతాపముచేఁ బొడమిన భయంకరవ్యాధి—తన్మూలమున మరణావన్నదశ—అభిరామస్వామి యాహ్వానముచే జగత్సింహునిరాక—అనుగ్రహము—అతనిపాదపద్మములయందు తావొసంగుట—పిదపనట్టిమహాకష్టము. అసహనీయమగునట్టియాతనాపరంపర ననుభవించినపిదప మనోరథమీడేరుట—హృదయేశ్వరునితో సమ్మేళనము—హా! అకటకటా! సుఖమెన్నిదినములు? సుఖసౌధముయొక్క ప్రథమసోపానమున్నంతే యీ బాధ! చిరకాలయత్నార్జితమై మహాయాసలబ్ధమైన రత్నమును వక్షమునధరించుకొనుటతోడనే భయంకరమైనదుర్గతి--సుఖసౌధము మొదలంట భస్మీభూతమైపోయినది. బాణముచేఁ గొట్టఁబడినలేడివలె నిరీహమైన తిలోత్తమ యాతనల నందుచుండెను. అక్కటా! సుఖమెన్నిదినములు!

తిలోత్తమయాహారమునుగైకొనుటలేదు. నిద్రపోవుటలేదు. ముడివీడియున్నయామెనిబిడకృష్ణకేశరాశి ధూళియందు మలినముగఁబడియుండెను. ఆస్వర్ణకాంతి భూతలమునఁబడి మబ్బువలెనైపోయెను. దేహము ధూళిధూసరితమయ్యెను. శరీరము భూషణవిహీనము—నోట మాటలేదు. నేత్రములనుండి బాష్పములులేవు. తిలోత్తమయధోముఖియై, నేలపైఁబడియుండెను.

తిలోత్తమ తనహృదయమునందు "ప్రపంచమున నాపద లనేకముగ నుండుచుండును. వానికిఁబ్రతీకారముండుటయుఁగలదు. అత్యంతఘోరవిపత్తునకుమాత్రము ప్రతీకారముండదా? ప్రతీకారము

లేదని రోదనముచేయుటవలనను, యోచించియోచించియూరకుండుటవలనను, శోకయాతనలననుభవించుటవలనను, ఏమియుపకారముకలుగును? నాజీవనమునకు జీవనమైనజగత్సింహుఁడునుపసంకెలలచే నిబద్ధుఁడై కారాగారమునందున్నాఁడు; ఇఁకనేనో—ఇంటియందుఁపడియుండి యనేకకష్టముల ననుభవించుచున్నాను; అతనికంటె నూఱురెట్లధికకష్టములనే యనుభవించుచుంటిని. కాని దానివలనఁ బ్రయోజనమేమి? ఇట్టియీయుద్వేగముచే ఫలమేమి? చేతనైనంతవఱకుఁ బ్రతీకారమునకై యుపాయములను వెదకుట యుచితము. నేనిఁక నాప్రయత్నములనే చేసెదను." అని యోచించుకొనియెను.

తిలోత్తమ లేచికూర్చుండి "ఎవరక్కడ?" అని పిలిచెను.

అక్కడనున్నదాసియొకతె శీఘ్రముగవచ్చెను. తిలోత్తమ దాసినిజూచి "కాగితము, కలము మొదలగువానినిదీసికొనిరమ్మ" అనియాజ్ఞాపించెను.

దాసి లేఖ్యసాధనములనన్నిఁటిని దీసికొనివచ్చి తిలోత్తమ యొద్దనుంచి "శరీరమునందలి చమటను దుడిచివేయుదునా? చెదరియున్నముంగురులను సవరింతునా? పాత్రయందు నీరును పోసి తీసికొనిరానా? కట్టుకొనినచీరను విడిచి మఱియొకవస్త్రమును ధరించెదరా?" అని యీవిధములగుప్రశ్నముల నెన్నిఁటినో వైచెను.

తిలోత్తమ "ఇప్పుడేమియువలదు. అమ్మ యెక్కడనున్నది?" అని యడిగెను.

తిలోత్తమ విమలను "అమ్మ" యని పిలుచుచుండును. వీరేంద్రసింహుఁడు స్వర్గస్థుఁడైనపిదప విమలనిజవృత్తాంత మందఱికిని వెల్లడియయ్యెను. ఆమె యొకసామాన్యపరిచారికవలె వాసము సేయుచుండినను వీరేంద్రసింహుఁడు పరిణయమాడినధర్మపత్నియని

యుంధవఱును దెలిసికొనిరి. కటుల్ఖానునిచేతినుండి విడిపించుకొని మందారణమర్గమునకు వచ్చినపిదప మర్గములోనివారందఱు నామె ను యజమానురాలు, ఠాకూరాణి, రాణి, మాత, యని పిలుచుచుండిరి. ఆమెను విమలయని పేరుపెట్టి పిలుచుట కెవ్వరికిని ధైర్యముచాలదు. తిలోత్తమయు నామెను తల్లియనియే పిలుచుచుండును. కాని, వేఱుపేరుపెట్టి పిలుచుటలేదు. తిలోత్తమ "అమ్మ యెక్కడనున్నది?" అని దాసినడిగెను.

దాసి—ఉత్తరపుచావడియందుఁ గూర్చుండి యామెస్త్రీతో నేదియో యాలోచించుచున్నారు. పిలువుమనియెదరా ?

తిలో—వలదు. నీవుపోయి యిప్పుడు రావలసినయావశ్యకత యేమియు లేదనియు, కొంచెముసేపైనపిదప నేనేవచ్చి చూచెదననియు నమ్మతోఁ జెప్పుము.

దాసి యానందముతో వెడలిపోయెను. నాల్గుదినములకుఁ బిమ్మట తిలోత్తమ లేచికూర్చున్నదనియు, మాటాడినదనియు, వ్రాసికొనుటకుఁ గావలసినయుపకరణములను తెప్పించుకొనెననియు నేదియోవ్రాసికొనుచున్నదనియు, నామె యపరిమితానందమునుబొందెను. ఈశుభసమాచారమును విమలకుఁ దెలుపవలయునని యామె పరువెత్తుకొనిపోయెను.

తిలోత్తమ కాగితమును కలమును పుచ్చుకొని యందొకకాగితముపై వ్రాయనారంభించెను. చాలసేపువ్రాసెను. వ్రాసినపిదప నిట్లుచదువనారంభించెను.

" నవాబునందినీ !

అత్యంతదుఃఖకరమగుసమాచారమును నీకుఁ దెలుపుటకై నే నీయుత్తరమును వ్రాయుచున్నాను. నీకు జ్ఞప్తియున్నదా? అలనాఁడు—

వివాహమునాఁటిరాత్రి-ప్రపంచమునందంతటను శ్రేష్ఠమైనయీపు
ష్పరత్నమును, ఈయలంకారరాజము నలంకరింపుము" అని యు
పదేశించియుంటివి. జ్ఞప్తియున్నదా? నాయదృష్టదోషముచే నా
పురుషుఁడిప్పుడు బందీగనున్నాఁడు. లోహశృంఖలములచే బద్ధుఁడై కా
రాగారమునందున్నాఁడు. మానసింహమహారా జనేకకారణముల
చే విరక్తుఁడై గుణమయుఁడగు కుమారజగత్సింహుని యావజ్జీవము
ను కారాగారబద్ధునిఁగాఁ జేసివైచినాఁడు.

ఆపదలువచ్చినప్పు డాత్మీయులు జ్ఞప్తికివత్తురు. కాని నీకును
నాకును పరిచయము రెండుదినములుమాత్రమే. అయినను నాకా
త్మబంధురాలవని నేనెఱుంగుదును. అందుచే నేనిప్పుడీదుఃఖసమా
చారమును నీకు వ్రాయుచున్నాను.

పఠానులకును మొగలాయీలకును సంధిసంస్థాపింపఁబడినపిద
ప నత్యల్పకాలములో యువరాజునకు నీవొకయుత్తరమును వ్రాసి
యుంటివి. ఆయన యాయుత్తరము ననర్ఘమగుసంపదయని మిగుల
జాగరూకతతోఁ గాపాడుకొనుచున్నారు. ఆయన యాయుత్తరమును
బదింబదిగ నాకుఁ జదివి వినుపించుచుండెడివారు. ఆయుత్తరమిప్పు
డును నాయొద్ద రత్నపేటికయందున్నది.

ఆయుత్తరమునందొకచో "ఎప్పుడైన నీహృదయమునకుఁ గ
ష్టముకలిగెనేని, అప్పుడయేషాను స్మరించుకొందువా?" అనివ్రాయఁ
బడియున్నది. రాజపుత్రుఁడిప్పు డత్యంతక్లేశములో నుండియున్నాఁ
డు. సందేహములేదు. అందుచే నాతఁడు మాటిమాటికి నయేషా
ను స్మరించుకొనుచుండునని చెప్పుటకు సందేహములేదు.

యువరాజు నీకుఁ బ్రేమాస్పదుఁడు—నీవు దానిని మరచిపోవు
టకు నిష్టపడుదానవుకావని తోఁచుచున్నది—అనేకలతిక లొకన

హాకారవృక్షము నాశ్రయించును. ఏదిదానిని విడనాడియుండఁగలదు?
ఒకయాశ్రయమునందు యనేకములు వ్యాపించి వృద్ధిపొందఁగలవు.

నీవు స్త్రీరత్నమవని నేనెఱుంగుదును. ఈప్రపంచమున నీతోఁ
బోల్పఁదగినవారెవ్వరును లేరు. నీవంటి స్త్రీరత్నముతో మాటలాడు
ట నిజముగా నాభాగ్యమేయగును. నీవు నిష్కామస్వరూపిణివి.

ఇష్టమువచ్చినప్పుడు నీకుత్తరము వ్రాయుటకు యువరాజునకు
నీవనుజ్ఞనొసంగియున్నదానవు. ఈయవస్థయందాయన కవకాశమును
స్వాతంత్ర్యమును చిక్కియుండినచోఁ దప్పకుండ నీకుత్తరమును వ్రా
సియుండును. అందులకు సందేహము లేదు.

ప్రస్తుతమున సంభవించినయీయాపదయందు నీవేమిచేయఁ
గలవో, ఏమిచేయవలయునో, అది నాకేమియుఁ దెలియదు. నేనావి
షయము నేమియుఁ జెప్పను. ఈప్రపంచమున రాజపుత్రిని క్షేమ
మునుగోరువారున్నచో నీవట్టివారియందగ్రగణ్యవు. అందుచే నీకీస
మాచారమును దెలుపుట నాకు కర్తవ్యము. నాకర్తవ్యమును నెరవే
ర్చుకొనుటకే నేనీయుత్తరమును వ్రాయుచున్నాను.

ఇతరకష్టసుఖములనుగూర్చి తెలుపుటకిదిసమయముకాదు.

ఆవశ్యకమనితోఁచినచో నిష్టమువచ్చినప్పుడు నీవు నాకుత్త
రమును వ్రాయవలయును. సమక్షమునమాటాడవలసినయావశ్యక
తయుండుట యాశ్చర్యముకాదు— నీవీవిషయమున నెట్లాజ్ఞాపించిన
నట్లుచేయుటకు సిద్ధముగానున్నదానను,

ఇట్లు

దుఃఖిని

తిలోత్తమ.

ఉత్తరమును జదివి తిలోత్తమ దానిపై విలాసమును "నవాబు నందిని, అమేషా" అని వ్రాసెను. మరియు నుత్తరముపై వేఱొక ప్రక్క "మందారణదుర్గమునుండి" అని లిఖించెను. నియమానుసారముగ నుత్తరమును దారముతోఁగట్టి ముద్రను వేసెను. పిదప నుత్తరమును చేతియందిడికొని యాగదియందొకటి రెండుమారు లిటునటు తిరుగాడి తటాలున నామె తన హృదయమున—"కర్తవ్యము స్థిరమైనది. ఇకనే కార్యానుష్ఠానమున కారంభము సేయవలయును." అని యనుకొనియెను.

ఎవరియందు చిరకాలము శాంతత, సుశీలత, నిరీహత, పరాజ్ఞానుసారప్రవర్తనము ననుగుణములు వాసము చేయుచుండునో, యట్టి వారియందవస్థావిశేషముచే నాకస్మికముగ నద్భుతదృఢత, స్వాధీనత, స్వతంత్రత, తేజస్విత, కర్మక్షమత, ఏకాగ్రత, దృఢప్రతిజ్ఞ, మొదలగు మహద్గుణములు పొడచూపుచుండును. చరిత్రములయందును జనసమాజమునందును నట్టిదృష్టాంతముల ననేకము మనము చూడవచ్చును. మానవచరిత్రయందాకస్మికముగ నట్టిపరివర్తనము లెట్లు సంభవించుచుండునో తెలిసికొనుటకు మనోవిజ్ఞానశాస్త్రము నెఱింగినపండితశ్రేష్ఠులే తగినవారు. సౌమ్యయు, శాంతయు, వినమ్రస్వభావయు, సంతతపరముఖాపేక్షిణియునగు తిలోత్తమ యీవిధముగా దృఢసంకల్ప యయ్యెను.

ఉత్తరమును చేతియందుంచుకొని తిలోత్తమ యాగదినుండి బయలువెడలిపోయెను.



## తొమ్మిదవ ప్రకరణము.

పఠానులు తమరాజధాని నిప్పుడు స్వర్ణదుర్గమునందు స్థాపించుకొనిరి. పరలోకగతుండైన కటుల్‌ఖానుని తనయులగు ఖాజాసులేమాన్‌ఖానును ఖాజాఅస్మాన్‌ఖానును పాలితతనయయగు నయేషాయు, నితరపురమహిళలును నిశ్చింతతో స్వర్ణదుర్గమునందుండిరి. యుద్ధవ్యాపారములన్నియు నిలిచిపోయెను.

స్వర్గస్థుండైన కటుల్‌ఖానుని తనయు లిరువురును చరిత్రయందు ప్రసిద్ధినిగాంచియుండిరి. వారిరువురకు నెప్పుడైనను రాజ్యసంబంధమయినవివాదము పుట్టునేమోయనెడిసంశయముచే మానసింహమహారాజు చేసినసంధినిబంధనానుసారముగా రాజ్యభారమంతయు తనచేతియందిడుకొని వృద్ధమంత్రియగుఇసాఖాన్ పరిపాలించుచుండెను. ఆతనిశక్తిసామర్థ్యములచే నెచ్చటను విచారము తలసూపుటకవకాశము లేకుండెను. అన్నియును చక్కగ నెరవేర్పఁబడుచుండెను.

అన్నియును సరిగా నడచుచున్నను మానవునిహృదయము దుర్దమనీయమైనదురాకాంక్షచే ననేకసమయములయందు యాతనల ననుభవించుచుండుటయేగాక బుద్ధిపూర్వకముగా విచారములను దెచ్చిపెట్టుకొని యనేకములగుననాగతయాతనలకు లోనగుచుండును. నవాబుకటుల్‌ఖానునియిరువురితనయులస్వభావములు నొకరీతిగా నుండక యత్యంతము భిన్నములై యుండెను. సులేమాన్‌ఖాను సురాపానమునందును సుందరీసంసర్గమునందును కాలమును వినియోగించినచోఁ బ్రపంచమునందలియీజీవితముయొక్కసర్వప్రయోజనములు

ను నష్టీకృతములగునను నమ్మకముగలవాఁడు. ఆతఁడు తననమ్మకమునను సరించి యందులకుఁగావలసిన పదార్థసమూహముచే సర్వదా పరివృతుఁడై యుండి నిశ్చింతభావముతో కాలహరణమును జేయుచుండెను. అతనితమ్ముఁడైన అస్మాన్‌ఖాను ఇంద్రియసుఖాన్వేషణ మత్యంతనీచకార్యమని తలంచెడువాఁడు. మనుష్యజన్మమును పొంది వీరహృదయమును దాల్చి పఠాన్ రాజవంశమున జన్మించి అసిచాలననైపుణ్యమున వన్నెకెక్కి నారీమధ్యమున సురాపానమత్తుఁడై యచేతనావస్థయందు జీవనమును గడపుట మిగులహీనకార్యమని యాతఁడనుకొనుచుండెను.

అస్మాన్‌ఖా నత్యంతమానసికక్లేశముచేఁ గాలమును గడపుచుండెను. మొగలాయీ లిప్పుడు భారతీశ్వరులుగ నున్నారు. మొగలాయీలను భారతీశ్వరులుగా నంగీకరించుటయనిన నస్మాన్‌ఖానుని హృదయమునకు మిగులవ్యథగానుండెను. ఢిల్లీసింహాసనమునకుఁ బఠానులు ప్రభువులు కావలయునని తలంచి కుతుబుద్దీను తనబాహుబలముచే హిందువులను వశము చేసికొని రాజ్యమును జయించి యమితపరాక్రమముతో భారతవర్షమునఁ బఠానులరాజ్యమును ప్రతిష్ఠించియుండెననియు మొగలుఁడగు జేబ రధికబలశాలియై పఠానురాజును పదచ్యుతునిఁ జేసి ఢిల్లీసింహాసనము నాక్రమించెననియు, సంతమాత్రమున మొగలాయీ శ్రీభారతవర్షమునకు న్యాయసంగతులగు భూపతులని చెప్పుటతగదనియు పఠానులస్వత్వములను మొగలాయీలు లాగుకొనిరనియు, భాగ్యదోషముచేఁ బఠానులిప్పుడిట్టిహీనావస్థయందున్నను సదృష్టచక్రము పరివర్తనము నొందినప్పుడు మరల నున్నతస్థితికి రాఁజాలరని చెప్పుట తగదనియు, హీనావస్థయందే సంతుష్టచిత్తులై యుండి దానికిప్రతీకారమును చేయయత్నింపకుండుట

కాపురుషలక్షణమనియు నస్మాన్ఖాను తలపోయుచుండెను.

ప్రస్తుతమున మొగలులకును పఠానులకును జరిగినసంధివిషయమునుగూర్చి అస్మాన్ఖానుఁడు తలపోయనిదిన మొకటియును లేదు. ఈమైత్రి కాతనిహృదయము పూర్ణాంగీకారమొసంగుట లేదు. మానసింహమహారాజుమూలమున జరిగినయీసంధి యఖండనీయమనియు, చిరస్థాయిగానుండఁదగినదనియు నస్మాన్ఖాను తలపోయుట లేదు. ప్రపంచమునందలి యన్నిదేశములలోను జరిగినమైత్రులన్నియు భంగమునొందకుండ స్థిరముగానున్నవా? అనియాతఁడనుకొనుచుండెను. ఇప్పుడు జరిగినసంధికి మొగలులదోషముచేనైననేమి, పఠానులదోషముచేనైననేమి స్వల్పకాలములోనే భంగముతప్పకుండఁ గలుగఁగలదని యస్మాన్ఖాను నమ్మియుండెను. సవాబుకటుల్ఖానునిమరణము, రాజ్యమున నలుప్రక్కలనున్న వోండ్రవిశృంఖలభావము, యథార్థముగా మానసింహుఁడు చేసినగొప్పసన్నాహములు మొదలగునవన్నియు నొక్కమారుగ వచ్చిపడుటచే సంధికంగీకరింపవలసివచ్చినదనియు, నాయవాంతరములన్నియు నంతర్హితములైపోయినపిదపఁగూడ నాసంధి యక్షుణ్ణమై యుండవలయు ననుట సంభావితముకాఁజాలదనియు నాతఁడు యోచించుకొనుచుండెను.

అస్మాననిహృదయమునం దసంతోషము నాటుకొనియుండె ననుట కించుకంతయును సందేహము లేదు. అతనిహృదయమునందలియశాంతికి మఱియొకకారణముకూడఁ గలదు. లావణ్యమయప్రతిమయగు నయేషా యాతనిజీవనసర్వస్వము నపహరించియుండెను. ఆతనిజీవనమునందలి శాంతిసుఖము లామెకృపాధీనములై యున్నవి. కాని, భూలోకదుర్లభమైనయాస్త్రీరత్న మాతనిస్త్రీరత్నముకాలే

మే. అస్మాన్‌ఖానునకు ప్రతిదానము చేయుట కామె తనహృదయ
మున నించుకంతయును స్థానము నొసంగలేదు. ఏదురాకాంక్షయొ
క్క ప్రబలతరశాసనములచే నస్మానునిహృదయ మెల్లప్పుడు నున్మ
త్తమగుచుండెనో, ఉత్తేజితమైన యేమహాశచే భారతవర్ష సింహాసన
లాభమందు ప్రమత్తమైన యాతనిహృదయము కుంఠితమగుచుండె
నో, అట్టియాకాంక్షలను, ఆశలను, సర్వము నయేషాయొక్కయా
త్రీనుగ్రహమునకైన వినిమయము చేయుట కాతఁడు సిద్ధపడియుం
డెను. అయిననా సుందరి తనహృదయమునందాతనికి తావొసఁగలేక
పోయెను. హతాశుఁడగు నాప్రేమికుని యంతర్జ్వాల దుస్సహనీయ
ముగ నుండెను!

అయేషయెవ్వరు? కటుల్‌ఖానునిపాలితకన్య—అయేషా
కటుల్‌ఖానునికాశ్మీరబేగమునకు సోదరుని తనయ—అయేష ఆరు
నెలలవయసులోనుండగా నామెతల్లి లోకాంతరగతురాలయ్యెను.
పత్నీవియోగముచే విధురుఁడగు నామెతండ్రి యాశిశువును తనసో
దరికడనుంచెను. పిదపఁ గొలఁదిదినములలోపలనే అయేషాతండ్రి
యు నీలోకమును వదలిపోయెను. అయేషా తలిదండ్రులు లేనిబాలి
కయయ్యెను. అయినను నామెకట్టిలోపమేమియుఁ గాన్పింపలేదు.
నవాబుకటుల్‌ఖాను, అసామాన్యరూపలావణ్యవతియగు నాకన్య
నతిగారాబముతోఁ జూచుచుండెను. కాశ్మీరబేగమునకు వేఱుసం
తానము లేకుండుటచే నీబాలికను తనతనయగనే భావించుకొని సం
రక్షించుచుండెను. నవాబునకు వేఱుగఁ గొడుకులును గూఁతుం
డ్రున్నను నయేషాపై నత్యంతమమత్వమును గలిగి యౌరససంతాన
ముకంటె నధికముగ నామెను బ్రేమించుచుండెను. సాధారణజనులం
దఱు నామె కటుల్‌ఖానునితనయయనియే భావించుచుండిరి. అయే

పోషయితము తాను కాశ్మీరబేగముగర్భవాసమున జనిప్రించిన నవా బునందినినియే తలంచుకొనుచుండెను.

అస్మాన్‌ఖానును నయేషయు సమవయస్కులు. నవాబు నంతఃపురమునందు వారిరువురును బాల్యమున గౌతుకక్రీడలఁ బ్రొద్దుపుచ్చుచుఁ బెరుగుచుండిరి. అయేషాసౌందర్యము నిరుపమానమై నది. ఆమెసుశీలతయు సాహసమునుగూడఁ గొనియాడఁదగినవి. ఆమెబుద్ధియు ధర్మప్రవృత్తియు నసాధారణములై యుండెను. వయ సుహెచ్చినకొలఁదిని నస్మానామెయం దనురక్తచిత్తుఁ డగుచువచ్చె ను. బాల్యమందలియానురాగము యౌవనమునందు వేఱుస్వాప మును దాల్చెను. అస్మాన్‌ఖాను మెల్లమెల్లగ నయేషాకు దాస్యుఁడ య్యెను.

కటుల్‌ఖాను తనమరణమునకుఁ జాలకాలమునకుఁ బూర్వమే అయేషాజీవననిర్వాహముకొఱకు విశేషధనము నొసంగియుండెను. అయేషాకిచ్చినంతధనమును నవాబుతనయౌరసతనయులకుఁగూడ నీ యలేదు. కటుల్‌ఖానును కాశ్మీరబేగమును నయేషాయం దస్మాను ఖాననురక్తుఁడయియుండెనని తెలిసికొనియుండుటయేగాక మాటల నుబట్టియు ప్రవర్తననుబట్టియు నయేషాకూడ నస్మానునియందాస క్తయైయుండెననికూడ నమ్మియుండిరి. అయేషాసర్వాంతఃకరణముల చేతను నస్మానునకు హితము సేయుచుండును. ఆతనికి ప్రియములైన కార్యములను చేయుటకు సమయములభించినచో నామె యెంతయో సంతసించుచుండును. ఇంతేకాదు, అస్మానుఖానునిసుఖదుఃఖముల యందామె సహానుభూతయగుచుండును. అట్టివేళల నస్మానునిహృ దయహారిణియైన యామోహిని అయేషా సర్వదా అస్మాన్‌ఖానుని యందు తనహృదయప్రాణముల నర్పించియున్నదని తోఁచుచుండు

ను. కాని అయేషాయనురాగము, మమత మొదలగునవియన్నియు సోదరస్నేహము నతిక్రమించియుండ లేదు. అస్మాన్ తనకు స్నేహము యుఁడైన సోదరుఁడని తలంచి యామె యాతనిని సర్వదా ప్రేమించుచుండెను. ఆవిషయము నెవ్వరును దెలిసికొన లేకుండిరి. అపరిమిత ధనసంపద లయేషాకుండియుండుటచే ముందస్మాన్ ఖానామె పాణిగ్రహము చేసికొన్నచో నామె సుఖసౌభాగ్యములు సంపూర్ణతనొందునని బీగమును, కటుల్ ఖానును ననుకొనుచుండిరి. ఇంతలో నవాబు లోకాంతరగతుఁడగుట తటస్థించెను.

అయేషా ప్రణయ మెంతవరకు ప్రగాఢమైనదో యస్మాన్ ఖానెఱుంగును. అతఁడు తన హృదయమునందలి ప్రేమసూచక వాక్యము నామెకొకనే మాత్రము వ్యక్తము చేయఁ జూచినను తత్క్షణముననే అయేషా నిస్సందిగ్ధభావముతో విస్పష్టముగా నాతనియెడఁ దనకుఁ గల హృదయభావములను స్పష్టముగా నాతనికిఁ దెలియఁజేయుచుండెను. అయేషానుడివిన వాక్యము లాతని హృదయమును వాడిశూలములవలె వేధించుచుండెను. ఆతఁడా దుస్సహయాతననుమౌనముతో సహించుకొనుచుండెను.

ఈవిధముగా బహువిధకష్టములచేఁ బీడింపఁబడుచున్నయస్మాన్ ఖానొకనాఁడపరాహ్ణకాలమున దుర్గమునందలి విశాలమైనయొక గదియందుఁ గూర్చుండియుండెను. ఒక ప్రక్క నిష్ఫలప్రణయముచేఁ గలిగినతీవ్రతర యాతన—ఏమి చేయుటకును దోఁచదు. అస్మానుఖా నిహలోకమున తనజీవనము కేవలభారమాత్రమేయని తలంచి దారుణక్లేశము ననుభవించుచుండెను. ఆసమయమునం దాకస్మికముగ నెవరో వచ్చుచున్నట్లు ధ్వనివినవచ్చెను. అస్మాన్ లేచి మార్గమునొద్దకువచ్చి నిలుచఁబడియెను. దీర్ఘములైన తెల్లనినిశ్వాసములతోఁ [illegible]సము

వదనముఁగలిగి గొప్పతలపాగనుదాల్చియున్న మంత్రిశ్రేష్ఠుఁడగునిస్మా
ఖానక్కడకువచ్చెను. అస్మాన్ఖానాతనినియథాప్రకారముగ గౌర
వించెను. వృద్ధుఁడై నయిస్మాఖానును ప్రభువగునస్మాన్ఖానున్న కుచిత
రీతిని మర్యాదలనుజరపినపిదప నిరువురు నుచితాసనములపైఁగూర్చుం
డిరి.

అ—మీరిప్పుడెందులకువచ్చితిరి? క్రొత్తసమాచారము లే
మైననున్నవా?

మం—జగత్సింహునకుఁ గారాగారదండన విధింపఁబడినదను
సంగతి యేలికకుఁ దెలియకుండనున్నదా?

అ—ఆసమాచారము నాకుఁ దెలిసినది. అందువలన మనకే
మైన లాభనష్టములున్నవా?

మం—కొలఁదిగ నుండుననియే చెప్పవలసియున్నది. మాన
సింహమహారాజు మనతోఁజేసినయేసంధిననుసరించి యుభయపక్షము
లయందును కార్యము లింతవఱకును నడపఁబడుచుండెనో, ఆసంధి క
క్బరుఫాదుషా యంగీకరింపలేదని తెలియుచున్నది. మానసింహుఁడు
చేసినసంధి కక్బరుఫాదుషా యంగీకరింపకుండనుండఁజాలఁడనుటయు
నిజము. అయినను నాతనికది సంతోషజనకమైనదికానప్పుడు దాని
నన్యథా చేయుటకు సమయమును చూచుకొనుచుండును.

అ—జగత్సింహునికారాగారవాసశిక్షకును నావ్యాపారమున
కు నేమిసంబంధమున్నదని మీరూహించితిరి?

మం—సంబంధమున్నదనియే నాయభిప్రాయము. జగత్సిం
హుఁడు మననగరమునందు బందీగానున్నప్పు డాతనియెడ మనమున
డపినప్రవర్తనమువలన నాతనికి విచారముకలిగినదని యెంచు
యం[illegible]కాశమేమియు లేదు, మనయందాతఁడు విరక్తిఁజెందియుండ లే

దని చెప్పుట కించుకంతయు సంశయము లేదు. విషయములనన్నిఁటి ని వివరముగా విప్పి చెప్పుటకు నాకిష్టము లేదు. కాని, మనపైఁబగఁదీర్చుకొనుట కాతని కిష్టముగానుండఁజాలదని చెప్పుటకు వేయుకారణము లున్నవనిమాత్రము నాహృదయమునకుఁ దోఁచుచున్నది.

వృద్ధమంత్రి యేయభిప్రాయముతో నీతుదివాక్యములను నుడివెనో ఆయభిప్రాయము నస్మాన్ఖాను తెలిసికొనియెను. జగత్సింహునియం దయేమాకుఁగలయాసక్తిని సూచింపవలయుననునభిప్రాయముతో నట్టిమాటలను వృద్ధమంత్రి నుడివెనని యస్మాన్గ్రహించెను. ఆమాటలనువినుటచే నస్మానునిహృదయమునం దేకకాలమున సహస్రవృశ్చికములు కుట్టినట్లయ్యెను. అతఁడతికష్టముతోఁ దన హృదయభావములను వ్యక్తపడకుండఁ గప్పిపుచ్చుకొని మంత్రిమాటలకుఁ బ్రత్యుత్తరముగ "జగత్సింహుఁడు మనకనుకూలుఁడైయుండుటచే మనకు హితకరమగుమాటల నక్బరునితోఁ జెప్పుట కాతనికవకాశము చిక్కినచో నిప్పుడు నడచుచున్నట్లే యిఁకముందును పఠానులకును మొగలులకును మైత్రినడచునట్లాతఁడు చేయఁగలఁడనియు,నిప్పుడాతఁడు బందీగనుండుటచే మనకుహితము చేయునట్టియవకాశము లేదనియు,మీయభిప్రాయముకాదా ?" అనియెను.

వృద్ధుఁడు సంకుచితభావముతో "సేవకుఁడట్లే యోచించుచున్నాఁడు" అనియెను.

అ.—మీరభిజ్ఞులు. ప్రవీణులు. విశేషించి నాకు జనకసమానులు. అందుచే మీమాట కెదురాడ నాకధికారము లేదు. కాని మిమ్ములనొక్కమాట యడుగుచున్నాను.—ఈసంధివలన మనకుఁ గలిగిన విశేషలాభమేమున్నది? మనము మనబాహుబలముచే శరీరములయందలిరక్తమును వెదజల్లి మనకోశాగారమునందలిధనము

సంతను వ్యయముచేసి పాక్షికముగా వంగదేశమునంతను స్వాధీన
ముచేసికొంటిమి. అప్పుడాధరపురయుద్ధమునందు జయమునుపొంది
మేదినీపురమునను వర్ధమానపురము[illegible] ఇకను మనయధికారము
ను స్థాపించియుంటిమి. ఈసంధితో మనము క్రొత్తగాజయించిన
రాజ్యమునంతను విడిచిపెట్టవలసివచ్చినది. అంతియేకాకుండ జగ
న్నాథునిమందిరమును పూరిమండలమునుగూడ మొగలులస్వాధీన
ము చేయవలసివచ్చెను. అట్టిసంధి లజ్జాస్పదమును, అసహ్యకరమును
నై యున్నది. అక్బరీసంధిని భంగముచేసినను మనమందులకు విచా
రింపవలసినయావశ్యకతయేమియును లేదు.

మంత్రి కొంచెముసేపు మౌనమును దాల్చియుండి పిదప "నే
నావిషయమున నేలికసన్నిధానమున నేపక్షమునను చర్చింపఁజాల
ను, కాని మనమిప్పుడు దుర్బలులమైయున్నామనిమాత్రము మనవి
చేయుచున్నాను" అనియెను.

అ—నిజము! మానసింహున కెదురుగనిలువఁగలిగినబలశా
లులెవరును మనకడ నిప్పుడులేరనుట నిశ్చయము. మీరాలోపము
ను బూర్తి చేయుటకు యత్నింపఁగలరా?

వృద్ధ—ఏలిక యెఱుంగని దిసుమంతయును లేదు. నేనిప్పు
డాభ్యంతరికములైనరాజకార్యముల ననేకవిధముల నిర్వహించుట
లో మునిఁగియున్నాఁడను. అందుచే మరియేకార్యవిచారమునందును
నామనసును ప్రవేశపెట్టుట కవకాశములేకున్నది.

అ—మీహృదయము నారాజకార్యనిర్వహణమునందే యుం
చెదరుగాక! ఈవయసునందు మీహృదయము యుద్ధవ్యాపారములవి
షయమున పనిసేయఁజాలదు. ఈస్థితియందెప్పుడును మీరు సంధిని,
శాంతినే గోరుచుందురనుటకు సందేహము లేదు. మీరు నన్ను క్షమింప

వలయును. వర్తమానమున నడచుచున్నయీసంధి కేవల మనవమానజనకమని నాయభిప్రాయము. అనుకూలమే కానిండు. అసహ్యమైనయీసంధిబంధమునుధ్వంసము చేసి మొగలాయీలకెదురుగ రణక్షేత్రముననిలువఁబడి యుద్ధము చేయుటయే నాకుఁ దృప్తికరము. అందులకుఁ గావలసినవానినెల్ల సిద్ధము చేసి పిదప నావృత్తాంతమును మీకెఱింగించెదను.

మం — ఆవిషయమున నేనిప్పుడేమియుఁ జెప్పను. నేనిప్పుడు విన్నవింపవలసినస్వల్పవిషయమొకటి కలదు. మానసింహమహారాజు శీఘ్రకాలములో పూరికి రానైయున్నాఁడు.

అ — మంచిదే. కాఫరులు కుత్సితకాష్ఠఖండము నీశ్వరుఁడని నమ్ముచుందురు. మొగలాయీశ్యాలకుఁడగుమానసింహుఁడును నాయీశ్వరపూజకై పూరికి వచ్చుచుండెనా?

మం — రావచ్చును. అతఁడు విస్తారసన్నాహముతోడ నేవచ్చుచున్నాఁడు.

అ — ఆతనియిష్టము. సంధిసూత్రానుసారముగఁ బూరిని మనము వారికి విడిచిపెట్టినపిదప బంగాళాదేశప్రసుబేదారుఁడగుమానసింహుఁడు సమారోహుఁడై రావచ్చును. భిక్షుకులునుపోవచ్చును. దానివలన మనకైనదేమి? మనకేమిసంబంధము?

మం — మనకుఁ గొంచెముసంబంధమున్నది. మానసింహమహారాజు పూరికిఁ బోవుచున్నాఁడు. కావునఁ జాలదూర మాతఁడు మనరాజ్యములోపలినుండియే వెళ్లవలసియున్నది.

అ — ఆతఁడిచ్చవచ్చినట్లు వెళ్లవచ్చును. రాజమార్గమునకభ్యంతరము లేదు. ఆతఁడన్నమాటయేమి? అందఱును బోవచ్చును.

మం — అప్పుడు మనము చేయవలసినకార్యమున్నది.

అ — ఏమి కార్యము ?

మం — అతఁడు మన రాజ్యపు టెల్లలోనికి వచ్చినప్పుడు మన మాతనికి సన్మానము చేయవలసిన విధి యున్నది.

అస్మానుని ముఖముపై మేఘము క్రమ్మినట్లయ్యెను.

అ — అది యెందులకు ?

మం — మనము సంధిసూత్రముచే బద్ధులమైయున్నాము. అతనిని సన్మానింపక పోయినచో ఫాదుషా కవమానము చేసినవారమగుదుము. మానసింహుఁ డక్బరుఫాదుషాయొక్క ప్రతినిధి.

అ — ఏ విధమైన సన్మానము చేయవలయును?

మం — మన రాజ్యపు టెల్లలలో నున్నంత వఱకు అతనితోఁ గూడ నుండవలయును.

అస్మాన్‌ఖాను సింహాసనమునుండి లేచి యాగదియందటునటు కొంచెముసేపు పదపరిచారము సేయుచుఁ దటాలున మంత్రి కెదురుగ నిలిచి "అట్టి యవమానమును సహింపఁజాలను. మానసింహుఁడు జగద్విఖ్యాతుఁడైన పరాక్రమశాలియే యగును. మానసింహుని బాహుబలముచే నక్బరున కట్టి గౌరవముండుటయు నిజము. మానసింహుఁ డక్బరుని కుటుంబములోఁ జేరినవాఁడనుటయు వాస్తవమే. మానసింహుఁ డొక దేశమునకు భూపతియు నగును. అట్లయినను నాతఁ డక్బరునకు దాసుఁడే యైయున్నాఁడు. మనమిప్పుడు బలహీనులమైయున్నను స్వతంత్రరాజులము. అక్బరునకు సమకక్షులము. ఘటనాచక్రముచే నిప్పుడు దుర్బలులమై యుండుట నిజమే. అయినను నింతవఱకును మన మక్బరుఫాదుషాతో హోరాహోరిగఁ బోరాడుచు నేయున్నాము — జయాపజయములమాట యట్లుంచుము — కాని, మన మెప్పుడును నేకారణమువలనను నెవరికిని — ఒక్కరికైన

ను—విధానతులమై యుండలేదు. మనమిప్పుడును నోరిస్సాయందు స్వతంత్రప్రభువులము. ఇట్లుండఁగా సక్కరునిప్రతినిధియొక్క పాదుకలను మోసికొనుచు నాతనినాశ్రయించి కూడఁగూడఁదరుగుట కేనెంతమాత్రము నంగీకరింపను" అనియెను.

మం—మహారాజునొద్దనుండి యుత్తరమొకటివచ్చినది. అని చెప్పి యావృద్ధుఁడు తననిలువుటంగీజేబునుండి యొకయుత్తరమును దీసి యస్మాన్ఖానునిచేతియందిడియెను. అందిట్లు వ్రాయఁబడి యుండెను. "మానసింహమహారాజు స్వధర్మపాలనార్థమై పురుషోత్తమక్షేత్రయాత్రను జేయనున్నాఁడు. ఒరిస్సాదేశమున నోరిస్సానవాబులప్రదేశములోఁ బ్రవేశించినతోడనే క్రొత్తనవాబు లిరువురు నాతనిసందర్శనము చేయుదురని నమ్ముచున్నాఁడు" ఉత్తరము, ఇసాఖానునిపేర వ్రాయఁబడియుండెను.

అస్మాన్ఖానాయుత్తరమును చదివి తిరిగి మంత్రి కిచ్చివేయుచు "దీనికిఁ బ్రత్యుత్తర మెట్లువ్రాయవలయునో రేపటిదినమున మీకుఁ దెలియఁజేసెదను. మానసింహుని యాధైర్యము నాకుఁ జాలవిరక్తిని గలుగఁజేయుచున్నది" అనియెను.

మం—నేను సెలవుఁ గైకొనియెదను. నేనిటనుండి వెడలిపోవుటకుఁబూర్వ మేలికసమక్షమున నొక్కమాటను మనవిచేయవలయునని యున్నది.

అ—చెప్పవచ్చును.

మం—మానసింహమహారాజు మొగలులకును బఠానులకును నడుమచేసినసంధియంతయు జగత్సింహుని ప్రయత్నములచే నెరవేరినదిగనున్నది. మనమావిషయమును జ్ఞప్తియందుంచుకొనుట న్యాయము—మరియొక్కమాట—మనమాసంధిబలమువలన ను

త్కలదేశమునకు స్వాతంత్ర్యాధికారమును పొందినవారమైయున్నను మన మక్బరునకు లోఁబడియుండునట్లంగీకరించియున్నాము. మానసింహమహారాజు శిబిరమునకుఁబోయి యాతనిని మనము సన్మానింపవలయును. ఆతనికిఁ గానుకల నొసంగి యాతఁడొసంగు బహుమానముల నంగీకరించి సన్మానముల నందఁజేయవలయును. మనము విధిప్రకారము మానసింహమహారాజున కనుగతులమై యుండవలయును. బాదుషాకు సంపూర్ణముగా లోఁబడియుండి యుత్కలదేశస్వాతంత్ర్యమును పొందియున్నాము. ఇవియన్నియు నింతశీఘ్రకాలములో మఱవకుండ నుండుట మంచిది.

అ—నేనా విషయములను గొంచెమేనియు మఱవలేదు. ఆ కళంకము నాహృదయమును పీడించుచున్నది. ఆయపకీర్తి శీఘ్రకాలములోనే లుప్తమైపోఁగలదు.

ము—(లేచినిలుచుండి) వేఱువిధముగా నవస్థాంతరము సంఘటించువఱకును మానసింహమహారాజక్బరుబాదుషాప్రతినిధియని తలంచి యాతని కుచితసన్మానములను చేయుట మనకు విధి. అట్లు చేయక మనమన్యథా నడచుకొంటిమేని బాదుషాతో మనకు విరోధము తప్పదు. మనమేవిధముచేతను ప్రస్తుతమున నక్బరున కెదురుగ నిలువఁజాలము. ఈవిషయములనన్నిఁటిని యోచించి పిదపకర్తవ్యము నవలంబింపవలయునని నాప్రార్థనము. నాకు శరీరమునందు బలములేదు. వార్ధక్యముచేతను తత్సంబంధములైన యితరవ్యాధులవలనను పీడింపఁబడుచున్నాఁడను. చాలకాలము జీవించియుండగలనని తోఁచదు. జీవించియున్నంతవఱకు మా ప్రభువులకవస్థాంతరము సంభవింపకుండ నుండవలయునని నామనోరథము. సెలవుఁగైకొనిపోయెదను.

సముచితశిష్టాచారములను నిర్వర్తించినపిదప మంత్రి యట
నుండి వెడలిపోయెను.

---

## పదియవ ప్రకరణము.

---

విచారపీడితుఁడైన యయస్మాన్‌ఖాను మెల్లమెల్లగ గదిలోనుండి
యీవలకువచ్చెను. మానసింహునియుత్తరమును నాదేశసూచకమైన
యాజ్ఞాపత్రిక(పర్వానా)గా భావించుకొనియెను. అతఁడు తనహృద
యమునందు "పఠానులు డిల్లీపాదుషాకు వశులై సంగీకరించినను
వారిమనోరథము లేమైన నీడేరెనా? సంధివలన మొగలాయీ లుప
కృతులుకాలేదా? మాతోఁ జేసినయుద్ధమునందు మానసింహునకు న
ష్టముసంభవింపలేదా? స్వర్గస్థుఁడైననవాబు ధారాపురయుద్ధమునందు
మానసింహునోడించి యాతనితనయుఁడైనజగత్సింహుని బందీగాఁ
దీసికొనివచ్చెను. అంతేకాకుండ వంగదేశమునందు విష్ణుపురమువఱ
కును నధికారమునుగూడఁ జేసియుండెను. జగత్సింహుఁడు మా
చేఁజిక్కినప్పు డాతనినేమిచేసినను చేసియుండవచ్చును. అట్లుచేసిన
చో మానసింహునకు మరల సైన్యమునుసమకూర్చుకొనుట కవకా
శము కలిగియుండకపోవును. ఈలోపల నవాబు మరికొంతప్రదేశము
నాక్రమించుకొనినచో మేము వంగదేశమునంతను స్వవశముచే
సికొని యుందుమనుటకు సందేహమించుకంతయును లేదు. కాని యిం
తలో నవాబుబహదూరుమరణము సంఘటితమైనది. ఆకస్మికము
గా సంభవించిన యావిపత్తునందుఁ జిక్కుకొనియుండుటచేఁ గార్యక్రమ
ములవలననేమిచేయుటకు నవకాశము లేకపోయినది. ఆసమయమున

యుద్ధమునకుసిద్ధమగు టుచితముకాదనియెంచి సంధి కంగీకరించవలె సివచ్చినది. పఠానులెప్పుడును భీరువులై యుద్ధమును జేయలేక సంధి బంధమున కంగీకరించియుండ లేదు. రణరంగమునవా రెప్పుడు నసమర్థులని యనిపించుకొనియుండ లేదు. మొగలాయీసైన్యములను నాశనముచేయుటయందు వారెన్నఁడును శ్రాంతులయి యుండలేదు. జగత్సింహుని నాతనితండ్రి శిబిరమునకుఁ బంపి పఠానులు తమయౌదార్యమునుకనఁబరుచుకొనిరి. అట్టిపఠానులవిషయమునసంత నిర్లక్ష్యముచూపి యట్టికఠినాదేశమును బంపి వారు తమకు వశ్యులై యుండిరికదాయని వారియెడ నక్రమముగా వ్యవహరించుట మానసింహున కుచితముకాదు. మానసింహుఁడాయుత్తరమునం దావిధముగా వ్రాయుటకు మారుగ "క్రొత్తనవాబులు నాయాత్మీయులలోనివారుగాఁ బరిగణింపఁబడినవారుగనున్నారు. నేనుత్కలదేశమునందున్నప్పుడు వారిసందర్శనము లభించినచోఁ జాలసుఖినయ్యెదను." అని వ్రాసియుండినచో మేము నిజముగా నుపాయనాదులతోఁ బోయి యాతనిని చూచి యన్యోన్యవిశ్వాసము నభివృద్ధిచేసికొనఁ బ్రయత్నించియుందుము. "అనియనుకొనియెను.

ఈవిధముగా ననేకవిధములైన చింతలచేఁ బ్రపీడితుఁడైన యస్మానునిపాదము లాతనిబుద్ధికి గోచరముకాకుండఁగనే యాతని నంతఃపురమువంకకుఁ దీసికొనిపోయెను. ఆతనిచింతాసూత్రమంతటితో నిలువక ముందునకు సాగుచుండెను. లేను. అట్లెప్పటికిని కాదు; నాసోదరుఁడు వ్యాపారములయం దుదాసీనుఁడై యున్నాఁడు. ఆతఁడెక్కడకును వెళ్లఁడు. నేనును బోను. మానసింహుఁడు మాయధికారప్రదేశములలోఁ బ్రవేశించినప్పు డాతని నెదుర్కొనుటకును నాతని కావశ్యకములైన పదార్థముల నాతని కందించుటకును మానే

పకులలో నుచ్చపదస్థునొకని నియమించెదను. ఉపాయనాదికములే మియ్యవలదు."

ఈవిధముగా నాలోచించుకొనుచు నస్మాన్‌ఖాను తానేయుద్దేశముతో నటుపోవుచున్నదియుఁ దెలిసికొనకుండగనే ముందునకుఁ బోవుచుండెను. గర్వితుఁడైన మానసింహునితనయుఁడు చేఁజిక్కినప్పుడాతనిని నాశముచేయకుండుట యన్యాయమైపోయినదనియు, నయేషా యాతనియెడ ననురాగిణియై యుండెననియు, ఆతఁడామెయం దాసక్తుఁడుగాకపోయినను నంతమాత్రమునఁ దన కేమియులాభము లేదనియు, నాతఁడు ప్రాణములతో నున్నంతవఱకు నయేషా యాతనిని మఱవఁజాలదనియు నాతఁడీప్రపంచమున నున్నంతకాలము నయేషాహృదయమునందుఁ దనకీషణ్మాత్రమును స్థలము దొరకదనియు, జగత్సింహుఁడు తనకుఁ గేవలము శత్రువనియు, నతఁడు బందీయైయున్నను నాతని జీవములతో నుంచుటసరికాదనియుద్వంద్వయుద్ధమునఁ దానోడిపోయినంతమాత్రమున నాశత్రుత్వమును విడుచుట సరికాదనియుఁ, దనకాతఁడుపరమశత్రువనియు, నతఁడు కన్నులకుఁ గనఁబడకపోయినచో నామె యాతనియెడ ననురాగమును గలిగియుండఁజాలదనియు, నాతఁడు మరణించినచో నయేషా యనురాగము తుదముట్టుననియు, మిషచేనైననేమి, బలముచేనైననేమి జగత్సింహుని నాశనముచేయుటయే తనకు వ్రతమనియు, పదింబదిగ నన్నుకొనుచు నస్మానుఖాను ముందునకుఁ బోవుచుండెను.

ఇట్లుపోవుచుండఁగా నాకస్మికముగఁ బ్రక్కగదిలోనుండి రమణీకంఠస్వరముతో "అస్మాన్! అస్మాన్!" అనుకోకిలధ్వని వినవయ్యెను.

వినుటతోడనే యస్మానునిసర్వవిచారగ్రంథులునువిచ్ఛిన్నము

సైపోయెను. ఆతఁడా శబ్దమువచ్చినవైపునకుఁ బరికించెను. కొంచెము దూరములో ప్రౌఢవయస్కయగు నొకసజీవదేవీప్రతిమయుండెను. ఆమెయే నవాబుకటుల్‌ఖానుని కాశ్మీరబేగము—అస్మాన్‌ఖానునకు సవతితల్లి. అయేషాకామె పెంపుడు తల్లి. దర్శనమాత్రముచేతనే యస్మాన్‌ఖానతిభక్తితో నామెపాదములకు నమస్కరించెను.

బే—ఇప్పుడే నీప్రశంస వచ్చినది. నిన్నిక్కడకు రమ్మని వర్తమాన మంపితిని. నీవంతఃపురమునకు వచ్చినచో లోపలకుఁ బిలువవలసినదని మీజననితోఁ జెప్పియుంటిని.

అ—(సవినయముగ) ఆజ్ఞయేమి?

బే—(ఉద్విగ్నభావముతో) ఇట్లునిలుచుండి మాటలాడుటయెట్లు? మాటలాడవలసినవిషయము చాలఁగలదు. నీవు సావధానచిత్తముతో వినవలసియున్నది. గర్భవాసమున జన్మించినకుమారుఁడు దక్క మఱియెవరును బేగములగదులలోనికి రాఁగూడదని నవాబుగారియాజ్ఞ—నీవు నాగర్భవాసమున జన్మించిన బిడ్డవేయని నాయభిప్రాయము. అందుచే నీవు నాగదిలోనికి వచ్చి కొంచెముసేపు కూర్చుండి యావశ్యకములైన కొన్నిసంగతులను మాటలాడవలయును. అందులకు నీకాక్షేపణ మేమున్నది?

అ—(ఇంచుక యోచించి) మీరు నాకు విమాతలైనను, నేను గన్నతల్లిగ భావించి చిరకాలమునుండి భక్తితో మిమ్ము సేవించుచుంటిని. మీరయేషాకు జననీసమానలు. అందుచే మీరు నాకుఁ బూజార్హలు—మహాలులోనికిఁ బ్రవేశించుట నియమవిరుద్ధమే యగును. అయినను మీయాజ్ఞోల్లంఘనము చేయఁజాలను. మీయాజ్ఞానుసారముగ లోపలి కరుదెంచెదను.

బే—బిడ్డా! రమ్ము! నేనాజ్ఞ నొసంగితిని. అందుచే నియమో

క్లింఘున దోషము నీకు లేదు. అంతియేకాకుండ నియమముల నేర్ప రచుట కిప్పుడు నీవే కర్తవు. వచ్చి కూర్చుండుము.

అస్వాత్మనభా నవనతమస్తకముతో మహాలులోఁ బ్రవేశించి గద్దెపైఁగూర్చుండెను. అనతిదూరముననే యొకరత్నకంబళముపైఁ గూర్చుండి " అయేషావిషయమున నొక్కమాట చెప్పెదను " అని యెను.

అస్వాత్మనిహృదయము దుఃఖభావముచే స్పందితమయ్యెను.

అ—ఆజ్ఞయిండు.

జే—నీకు జ్ఞాపకముగనున్నదో లేదో నేను చెప్పఁజాలను. అయేషాపినతండ్రి అపరిమితసంపదలను సంపాదించి వానినయేషాకొసంగి స్వర్గస్థుఁడైనాఁడు. అయేషా యాసంపదలకన్నిటికి నిప్పుడుత్తరాధికారిణి యైనది.

అ—చాలకాలమునకుఁ బూర్వ మీసంగతి నొకప్పుడు విని యున్నాఁడనుకాని యదియిప్పుడు బాగుగ జ్ఞప్తియందు లేదు.

జే—ఔను. చాలకాలమునకుఁ బూర్వమే. ఇప్పటికిఁ బది సంవత్సరములకిందట నయేషాపినతండ్రి లోకాంతరగతుఁడైనాఁడు. అతనిసంపదలకన్నిటికిని నయేషానొక్కతెనే యుత్తరాధికారిణిగాఁజేసి, పంజాబుదేశపుసుబేదారు మీతండ్రికి సమాచారమంపి, దానినంతను నయేషాకొఱకు స్వాధీనముచేసికొనవలయునని వ్రాసియుండెను. స్వర్గస్థుఁడైనవారు అయేషానొక్కదినమైనను విడిచి యుండఁజాలకపోవుటచే నిక్కడివారిలో గొందరి నక్కడకుఁ బంపి యావిభవముతో సంబంధించినవ్యవహారములన్నిఁటిని సరిగా నిర్వహించుచుండెను. ఆసమస్తసంపదలను గాపాడుటకై పోయియుండిన యామనుష్యులిప్పుడువచ్చి, " అయేషా ప్రాప్తవయస్కయై

యుండుటచే నామె స్వయముగా వచ్చి యీయాస్తినంతను స్వాధీనముచేసికొని వ్యవహరింపకపోయినచో నాయాస్తియంతయు దొరతనమువారు స్వాధీనముచేసికొనఁగల" రని చెప్పుచున్నారు. నీవిప్పుడా వ్యవహారమును నిర్వహించుటకు స్వతంత్రుఁడవై యున్నాఁడవు. ప్రస్తుతమునఁ గర్తవ్యమేమియో నీవు నిశ్చయింపవలయును.

అ—ఈసంగతులన్నియు నిప్పుడు మీకెట్లు తెలిసినవి?

జే—అక్కడి మనుష్యులు మనమంత్రికడకువచ్చి యిట్లు చెప్పినారు.

అ—అయేషా గొప్పవంశమునందు జన్మించినదని యెఱుఁగుదును. మీసోదరుల కేమిపని?

జే—మాసోదరులు పంజాబుదేశపు సేనాధిపతులు. అయేషాకు ఆస్తినివిడిచిపెట్టిపోయినసోదరులు జాగీరుదారులై యున్నారు. అయేషాతల్లి సుబేదారునితనయ.

అ—అట్లయినచో నయేషాతల్లి మొగలాయీస్త్రీయును తండ్రి పఠానుఁడునా? ఈపరస్పరవిరుద్ధఘటన మెట్లుసంఘటించినది?

జే—దానికొక్కటేయుత్తరము. బాల్యమునందు తమతమ ప్రణయవిచారమును తెలుపుకొనుటకు లజ్జయుండదు. మీతండ్రిగారు పఠానులు; నేనో, మొగలులకన్యను. ఈఘటన మెట్లుసంఘటించినది?

అ—అదియంతయుఁ దెలిసినది. కాని, అయేషా యిప్పుడుస్వర్గస్థుఁడైన కటుల్‌ఖానునితనయగా నున్నది. పఠానులతనయకు, అందును విశేషించి కటుల్‌ఖానునితనయకు మొగల్‌సుబేదారుఁడాస్తి నిచ్చునెట్లు?

జే—ఆవిషయమున వ్యాఘాతమేమియు నుండదు. అయే

హోతండ్రి అక్బరునకత్యంతము ప్రీతిపాత్రుఁడై యుండెడివాఁడు. ఈ సంబంధమున నక్బరుపాదుషా స్వయముగా నాజ్ఞాపత్రమును వ్రాసియుండుటచే దానినిమార్చుట కెవరికిని సాధ్యముకాదు. అంతేకాక యొకవిధముగా నయేషా యక్బరునకుఁ బరిచితయై యున్నది. పాదుషా దర్బారునందును నంతఃపురమునందును పరోక్షభావముతో ననేకు లయేషానెఱింగియున్నారు.

అ——ఇప్పుడు నేనేమిచేయవలయునని మీయభిప్రాయము?

జే——ఏమిచేయవలయునో నేను యోచనచేయలేదు. చేయవలసినదానిని నీవే యోచించి చేయవలయును. కాని నీకొక్కమాటన్న చెప్పక తప్పని సరియగుచున్నది. అయేషా పంజాబునకుఁ బోవలయునని యిష్టపడుచున్నది.

అ——అదేమి?

జే——ఆమెకిప్పుడు శరీరమునందు స్వస్థత లేదు. బంగాళాదేశమున బందీయైనతండ్రి మరణించుటచేఁ గలిగినశోకమువలననో మరియేకారణముచేతనో అయేషా సంతతమును చింతాకులయై యుండుచున్నది. ఆమె కాహారమునందుఁ బ్రవృత్తియే లేదు. వసనభూషణధారణమునందభిరుచిలేదు. సర్వదా యప్రఫుల్లభావముతో నుండున్న ఆమెశరీరము శుష్కించి మలినమైయున్నది. సెలవైనచో కొన్ని దినములు పంజాబునకుఁ బోయి యుండిన సుఖముగానుండునని యనుచున్నది. స్థానపరివర్తనముచే శరీరమునకుస్వస్థతకలుగవచ్చునని తోఁచుచున్నది.

అ——విశేషవిచారకారణమైనవిషయము. అయేషాయాస్త్రిని పరిపాలించుకార్యము నెట్లయినను నిర్వహింపవచ్చును. కాని, అయేషయే యీస్థలమును విడిచి వెళ్లవలయునని యిష్టపడుచున్నది. అ

మీరు! అయేషా యీపట్టణమును విడిచివెళ్లినచో సర్వము సంధకా రమైపోవును.

జే—నీవయేషాను మిగులఁ బ్రేమించుచున్నావు. నేనును స్వర్గస్థుఁడైననవాబును మీయిరువురిశుభసమ్మేళనమును చూచి నేత్రములను సార్థకము చేసికొనవలయునని యాశపడుచుండెడివారము. నవాబు స్వర్గస్థుఁడైనాఁడు. అభాగ్యనైననేను జీవించియున్నాను! ఆ యాశ యింకను దీరలేదు. ఏదియెట్లుజరుగునో చెప్పఁజాలను. అయేషాస్థితిఁ జూచినచో నిట్లున్నది. నీవు సర్వదా చింతాయుక్తుఁడవై యన్యమనస్కుఁడవై యగపడుచున్నావు. నీవు మహలులోనికి వచ్చుట మానితివి. నిత్యము నయేషాను చూచుటతోడనే కాలమ్ముగడపునీవిప్పు డామె విషయమునుగూర్చి యుచ్చరింపనైనమానితివి. మీయిట్టిభావములను జూచుచున్ననాకు మనసులోఁ జాలఁగష్టముగా నున్నది.

అ—తల్లీ! నాయపరాధ మిసుమంతయును లేదు. అయేషా కొరకుఁ బ్రాణములనైన విడుచుటకు సిద్ధముగానున్నాఁడను. కాని తల్లీ! అయేషామనసునందే జ్వాలనుదయింపఁజేసికొని తానుభస్మమగుచున్నది. నన్ను భస్మముచేయుచున్నది. ఆజ్వాలలు మీకుఁగూడఁ దగిలి మీరుఁగూడఁ గష్టములకు గుఱియగుచున్నట్లున్నది. ఇప్పుడామాట యట్లుంచుఁడు. అయేషాయవస్థకు నాహృదయవిషాదమనికమగుచున్నది. అయేషా యిప్పు డెచ్చటనున్నది.? నేనామెను జూడవలయును.

జే-ఇంతకు రెండుగడియలకుఁ బూర్వమామెయిచ్చటనేయున్నది. ఉద్యానవనవిహారమునకుఁబోయియుండునని తోఁచుచున్నది. పంజాబుప్రయాణమునుగూర్చినీయభిప్రాయమునెప్పుడువచ్చి చెప్పెదవు!

ఆ — ఆయేషానుజూచి యామెహృదయభావములను తెలిసి కొనినపిదప నాయభిప్రాయమును మీకు విన్నవించెదను. నేనిప్పుడు సెలవుఁగైకొనియెదను.

అస్మాన్‌ఖాను విమాతచరణములకు నమస్కరించి మెల్లమెల్లగ వృక్షవాటికాభిముఖుఁడై వెడలిపోయెను.

---

## పదునొకొండవ ప్రకరణము.

---

ఉద్వేగవిషముచే జర్జరితుఁడై మృతప్రాయుఁడైన యస్మాన్‌ఖాను మెల్లమెల్లగఁ బోయి వృక్షవాటికలోపలఁ బ్రవేశించెను. ఆయేషా యెచ్చటనున్నది? వాపీతటసోపానావళిపై నామె తరచుగ విశ్రమించుచుండును. కాని యిప్పు డామె యట లేదు. లతాకుంజమందలి శిలాసనమున ననేకసమయముల నామె యొంటరిగఁ గూర్చుండుచుండును. కాని యిప్పు డారూపలతిక యటఁ గాన్పింపలేదు. చంపకవృక్షచ్ఛాయయందలి శిలాసనమునఁ గూర్చుండి యనేకసమయములయందామె విశ్రమించుచుండును. కాని యానవీనచంపకవల్లి యచ్చటను గాన్పింపలేదు. అనేకసమయములలో నయేషా విశాలవకుళపాదపసమీపమున నొంటరిగఁ గూర్చుండుచుండును. కాని, యానిరుపమానసజీవపుష్ప మిప్పు డచ్చటను వికసించియుండలేదు. గులాబీపూలచెట్లయడవిలోని కప్పుడప్పుడు పోయి యామెపుష్పములు నేరుచుండుటకలదు. కాని సకలకుసుమశోభాహారిణియైన యాసుందరి యిప్పుడచ్చటను లేదు. అట్లయినచో నయేషా యెచ్చటనున్నది ?

ఱెప్పవేయకుండఁ బరికించినను నెవరును కంటికిఁ గనఁబడుట

లేదు. విచారహృదయముతో నస్మానుఖాను ప్రమదావనమధ్యము
న నున్నప్రాసాదాభిముఖుఁడై ముందునకుఁ బోయెను. అచ్చట నొ
కదాసి యాతని కెదురుగవచ్చి యత్యంతగౌరవముతో నభివందన
ము చేసి "ప్రభూ! నవాబునందిని యీగృహమునందున్నది" అనివి
న్నవించెను.

అస్మానుఖాను మిగులమెల్లగ నడుగులనిడుచు లోపలఁ
బ్రవేశించెను. లోపల నడుగిడినతోడనే ముఖమును ద్రిప్పి రెండడు
గులు వెనుకకువైచెను. అయేషా యేకాకిని; శిథిలవసన; నిద్రిత. ఆస్థి
తియందు లోపలకుఁబోవుట యనుచితమని తలంచి యాతఁడు వెనుక
కుఁ దిరిగివచ్చెను. కాని, యదియెంతటిశోభాకాంతి! మర్మరప్రస్తరస
మాచ్ఛన్నమైనయావిశాలగృహమునందు ముఖమలుతలదిండుపై శి
రమునిడుకొని భూశయ్యయందయేషా నిద్రితయై పడియుండెను. ప్ర
పంచమునందలిసమస్తశోభారాశియును సృష్టియందలియావద్రమణీ
యతయునువిధాతృనియపరూపనిర్మాణకౌశలమంతయును నిద్రితయై
యున్న యారమణీదేహమునందొక్కసారిగఁ జేరినట్లు కన్పట్టుచుండె
ను. ఆసుందరి యించుక మ్లానయై, విశుష్కయై యుండెను. అందుచే
నయేషాసౌందర్యమున కేమైనఁ గొఱఁతసంభవించెనా? ఇంచుకంత
యును గొఱఁత లేదు. దివాకరునితీక్ష్ణాలోకనముకంటె సుధాంశునిమ్లా
నమగుస్నిగ్ధకాంతి యెట్లధికతరరమణీయమైనదియో, మిగులస్వచ్ఛ
ముకాకుండ నాచ్ఛాదనాంతరాళమున నుజ్వలముగ వెలుంగుచున్నదీప
మెట్లునయనవినోదకరమో, అట్లే అయేషారూపరాశియును మ్లాన
మై శుష్కమై యున్నను విశేషశోభాయమానమై ప్రకాశించుచుండె
ను. సుషుప్తియందున్నయాసుందరి మోహినీదేవతవలె నెట్లువిరాజిల్లు

అస్మాన్ ఖానుగృహములోనికిఁ బ్రవేశించినతోడనే విగళితవసనమైన యాశోభామయి కనంబడెను. ఆయుత్తరక్షణముననే యాతఁడు వెనుకకుఁ దిరిగివచ్చెను. హృదయరాజ్ఞియగు నామాధుర్యరాశి నింకొకమారు చూడకుండ నాస్థలమును విడిచిపోవుట కాతనికి సాధ్యముకాకుండెను. ఆతఁడు ద్వారముకడ నిలుచుండి యయేషా నిద్రించున్న భువనమోహనశరీరమును చూడవలయునని నయనసంచాలనము చేసెను.

అదేమి?—అయేషా వక్షఃస్థలముపై నదియేమి? నవీనఘనకృష్ణకేశరచితవేణివలె సూక్ష్మాగ్రములుగల యొక పదార్థ మయేషా దేహముపై నొకవైపునుండి వేఱొకవైపునకు విస్తృతమైయున్నది. అదియేమి? అస్మాన్ ఖానున కాపదార్థముయొక్క యొకభాగము మాత్రము కాన్పించినది. ఆపదార్థము నేలపైనుండి లేచి క్రమముగా నాసుందరి వక్షఃప్రదేశమునుండి దేహముయొక్క మఱియొక ప్రక్కకుఁబోయియుండెను. అక్కడనున్న భాగ మాతనినేత్రములకు గోచరముకాలేదు. ఆతనినేత్రములకుఁ గనఁబడినభాగము సూక్ష్మాగ్రమైయున్నను క్రమముగ స్థూలాకారమును దాల్చెను. అదియేమివస్తువై యుండవచ్చును? రజ్జువో కాక కేశరజ్జువో యైయుండవచ్చునా? అయేషా శరీరముపైకి రజ్జువెట్లువచ్చినది? అస్మాన్ ఖానునకు విశేషముగ యోచనలారంభమయ్యెను. ఆతనికిఁ గలిగినయాశోభాసౌందర్యసందర్శనాపేక్షపోయి హృదయమున సంశయము జనియించెను. ఆతఁడు వ్యాకులితుఁడై తోడనే వెనుకకుఁ దిరిగివచ్చెను. కొంచెము దూరములోనున్న దాసిని శీఘ్రముగఁ దనకడకు రమ్మని సంజ్ఞచేసెను.

వచ్చినయామెతో నస్మాన్ ఖాను "నవాబునందిని నిద్రపోవుచున్నది. అందుచే నేను లోపలకుఁ బోఁగూడదు. నీవు జాగ్రతగ

ధ్వనిచేయకుండ లోపలికిఁబోయి యామెశరీరముపైనున్న దేదియో చూచి వేగముగరమ్ము. నాకుఁజాలభయమగుచున్నది." అని చెప్పెను.

ఆమె నిశ్శబ్దముగా లోపలికిఁబోయి యానిమిషముననే యత్యంతభయముతో వెనుదిరిగివచ్చి "మహాప్రభూ! ఏమిజరుగనున్నదో చెప్పఁజాలను. నవాబుతనయ యేమాత్రము కదలినను సర్వనాశనము సంఘటింపఁగలదు. ఆమెశరీరముపైనున్న దొకప్రకాండకాలసర్పము." అనిచెప్పెను.

అస్మాన్ మాటనువిని క్షణకాలము విచలితుఁడై పిదపఁ బశ్చిమాభిముఖముగా నిలుచుండి కరుణామయుండైన భగవంతుని తనపై దయచూపుమని ప్రార్థించెను. పిదపఁ దనకాలిజోడునక్కడవిడిచి "నీవు కదలకుండ నుండుము. మాటాడకుము. అల్లరిచేయవలదు" అని దాసికాజ్ఞయొసఁగి నిశ్శబ్దముగా నాగృహమునఁ బ్రవేశించి చూచెను. సాక్షాద్యమునివలె భయంకరమైన కాలసర్పమయేషాపైపునను వక్షస్థలవామపార్శ్వమునను జేరి సుఖముగా విశ్రమించియుండెను. అయేషా కాలుసేతులుకదపినను, లేక, యే దేనొకపైపునకొత్తిగిలఁబ్రయత్నించినను, మృత్యుస్వరూపమైనయాసర్పము తనపడగనువిప్పియామెసుకుమారశరీరమును కఱచివేయును. ఎంతటిభయానకమైనయాపద!

అప్పుడస్మాన్ ఖాను స్థిరబుద్ధిగలవాఁడయ్యెను. "సర్పదంశనముచే నయేషా జీవనము తుదముట్టిపోవును. విషజ్వాలచే భువనరత్నము మహాప్రస్థానమును చేరిపోఁగలదు. అస్మాన్ ఖాను నిశ్చేష్టుఁడై నిలుచుండి మిడుతుమిడుతుమని చూచుచుండెను. అట్లెన్నఁడును సంభవింపదు— అదియసంభవము—అంతటియస్వాభావికమైనయాప

మృత్యువుచే నయేషాజీవనము పరిసమాప్తమగుటయే విధాతయభిమతమైనచో నంతకుఁబూర్వమే యస్మాకునిప్రాణములు పరలోకమును జేరియుండవలయును. తరువాత జరుగవలసినదేదియో జరుగునుగాక!" అని స్థిరముచేసికొని మిగులజాగరూకతతో నప్పుడే యుసంతలోఁ గాలోపమైనయాసర్పముయొక్క వాలమునుబట్టుకొని యీవలకువచ్చెను. ఆక్షణముననే యాకాలసర్పము విద్యుచ్ఛక్తివేగముతో విచలితమై పడగనువిప్పి వెనుకకుఁ దిరిగెను. అస్మాకు తనహస్తమును కొంచెముదూరముగాఁ జాచెను. సర్పమస్మాకును కఱచుటకై తలయెత్తి బుస్సుమని భయంకరధ్వనులను జేయుచు సూదులవలెనున్నతన రెండునాలుకలను మాటిమాటికీవలకుఁ జూపుచుండెను. అదియయేషానువీడి కొంచెముదూర మీవలకు వచ్చుటినుజూచి యస్మాకుఖాను సుశిక్షితుఁడైనపాములవానివలెఁ గౌశలముతోఁ గఱచుటకువీలులేనంతటి దూరములో నిలుచుండి చేయునెత్తుచు పామునుమరికొంత దూరముతీసికొనివచ్చి మిగులనైపుణ్యమున నుడిచేతితో దానితలను బలముగానదిమి పట్టుకొనియెను. ఈమాటనుజెప్పుటకుఁ బట్టినకాలములో నూరవవంతుకాలములోపలనే యీపనియంతయు జరిగిపోయెను. తోడనే యాసర్ప మాతని దక్షిణహస్తమును బలముగాఁ జుట్టుకొనియెను. చేతిమణికట్టు మొదలు కంఠమువఱకును జుట్టుకొనియెను.

అస్మాకుఖానాయవస్థయందే యచ్చటనే మోకాళ్లనేలపైనానికూర్చుండి పాముచుట్టుకొనినకుడిచేతితో నెడమచేయినిజేర్చి రెండుచేతులును బైకెత్తి "దేవాదిదేవా! నీమహిమను సంపూర్ణముగాఁ దెలిసికొనినవారెవరు? నీవు నావంటియల్పప్రాణిమూలమునఁ బ్రపంచమునందంతటను సర్వశ్రేష్ఠమైన జీవనసారరత్నముయొక్క

ప్రాణరక్షణమును జేసితివి. అది నీయపారకృపాకటాక్షముకాదా!"
అని స్తోత్రముచేసెను.

సర్పముచుట్టుకొనియున్నచేయి మిగులనొప్పియెత్తుచుండెను. అస్మానుఖాను మెల్లమెల్లగ నిశ్శబ్దముగ గృహమునుండి యీవలకు వచ్చెను.

మార్గముకడనిలుచుండియున్నదాసి భయానకమైన యీ కార్యములన్నిఁటిని బ్రత్యక్షముగాఁజూచి భయముచే నడలుచు నటనిలువఁబడి "మహాప్రభూ! మీరు ధన్యులు. ఇప్పుడేమియుపాయము? పామును చేతినుండి తీసివేయుట యెట్లు?" అనియెను.

"దీనిని చేతినుండి విడిపింపశక్యముకాదు. దీనిని ఖండఖండములుగ ఖండించినఁగాని పట్టువిడువదు."

"కుడిచేతికి కట్టినట్లున్నది. దానిని ఖండించి తీసివేయుట యెట్లు?"

"ఎడమచేతితోఁ గత్తినిపట్టుకొని ఖండింపఁగలను—ఇతరుల సాహాయ్య మక్కఱలేదు. మఱియెవరును రాఁగూడదు. బీగము చూచినచోఁ జాలనలజడి పొందును. ఎవరును జూడకుండ నాకొకకత్తిని తీసికొనివచ్చి యిచ్చెదవా? మిక్కిలిశీఘ్రముగా రావలయును. త్వరగాఁ బొమ్ము."

దాసియు "చిత్తము" అని వెడలిపోయెను. సర్పము గట్టిగాఁజుట్టుచుండుటచే నాతనికి యాతన మిక్కిలిహెచ్చయ్యెను.

దాసి కత్తిని తీసికొనివచ్చెను. అస్మానుఖానామెతో "నీవీపామును జూచుచుచుండవలసినపనిలేదు. నవాబునందినియొద్దకుఁ బొమ్ము. ఆమె మేలుకొన్నను నీసంగతినామెకుఁ దెలియనీయకుము" అనియెన

"చిత్తము. నేను సన్నిధానమునం దుండనక్కఱలేదా? నా వలనం గావలసినపని యేమియును లేదా"

"నీవలనం గావలసినకార్య మేమియును లేదనియే తోంచు చున్నది. కావలసినచోం బిలిచెదను. నీవు నవాబునందినియొద్దకుం బొమ్ము. ఆమెకింతలో మెలకువరాదు. వచ్చిన నామె కీసమాచార ము తెలియంగూడదు."

దాసి లోపలకుం బోయెను. కాని, యస్మాన్‌ఖానునిహస్తము నుండి యానాగపాశ మెట్లువిడిపోవునో చూడవలయునను కౌతూహ లమ్ము నామె యడంచుకొనలేక ద్వారము లోపలిప్రక్క నిలుచుండి యస్మాన్‌ఖాను చేయుకార్యముల నన్నింటిని జూచుచుండెను.

అస్మాన్‌ఖాను మిగులనేర్పుతో నెడమచేతం గత్తినిధరించి సర్పదేహమును ఖండింపందొడంగెను. అది యతిభయంకరమైన లో మహర్షణకార్యమై యుండెను. ఆవిషయమునుగూర్చి విస్తారముగా వర్ణనముసేయుట ప్రస్తుతమున కావశ్యకము కాదు. సర్పశరీర మ నేకస్థలములయందు నఱకంబడియెను. కాని ఖండింపంబడిన యే భాగమును సంపూర్ణముగా విచ్ఛిన్నమై విడిపోలేదు. ఆచురియ సూ క్ష్మాగ్రభాగ మంగీని భేదించికొని తనశరీరముపై గాయముచేయు ననుభయముచే సర్పశరీరము ముక్కలుముక్కలుగా విడిపోవునట్లు తుదవఱకును ఖండింపలేదు. సర్పరక్తముచే నాతనిదుస్తులయం దచ్చ టచ్చట రక్తమయ్యెను. ఖండఖండములుగా ఖండింపంబడిన యాస ర్పశరీరము పరస్పరసంబగ్నమైన యొకమాలికవలె వ్రేలాడుచుండె ను. అయినను నరకంబడిన ప్రతిఖండమును భయంకరముగం గద లుచుండెను. దానినిచూచి యస్మాన్‌ఖాను లేచినిలుచుండెను. స ర్పశరీరము వ్రేలాడుచు నేలను దాకుచుండెను. దానిదేహమంత

యు ముక్కముక్కలుగ నరకఁబడియెను. నోటియొద్ద స్వల్పదూరము నరకఁబడలేదు. పిదప రెండుచేతులతోను సర్పము నెత్తి యధికబలముతో దూరమందున్న యొకస్థలమునకు విసరిపారవైచెను. ఆస్థలమునందుఁ బడిన యాపాముమొండెము పటపటకొట్టుకొనుచు మాటిమాటికి నోటిని తెరచుచుండెను. ఆసర్పరాజముయొక్క దుర్దశ నస్మాన్ఖాను ప్రత్యక్షముగాఁ జూచి దానినిగూర్చి యిప్పుడు చేయవలసినదేమియు లేదని యోచించి యాతఁడు చేతులను కాళ్లను గడుగుకొనుటకై సరోవరాభిముఖుఁడై వెడలిపోయెను.

---

## పండ్రెండవ ప్రకరణము.

---

సహాబుసందినియగు నయేషాకు నిద్రాభంగమయ్యెను. దాసి యెదురుగఁ బోయి నిలుచుండి వందనము చేసెను. అయేషాయభిప్రాయానుసారముగ దాసి యామెదుస్తులను సవరించి పిదప గులాబియత్తరుచే సిక్తమైన యొకవస్త్రమును దీసికొనివచ్చెను. అయేషా యాకరవస్త్రముచే మొగమునుదుడిచికొని దాసితో " మోతీ ! నీవిక్కడ నెంతసేపటినుండియున్నావు? " అనియెను.

మోతి—అమ్మా! మీరిక్కడకు వచ్చినప్పటినుండియు నే నిచ్చటనే యున్నదానను.

అ—ఇప్పుడు నేనొకకలఁగంటిని. ఎవఁడో యొకఁడు నన్నుముట్టుకొనినట్లును, ఆతనిదేహ మత్యంతశీతలమైయున్నట్లును గనఁబడినది. నీవు నాదేహముపైఁ జేయివైచితివా ?

మో—అమ్మా! లేదు.

అ—ఇక్కడకు మఱెవ్వరైనవచ్చిరా?

మో—ఔను! హుజూర్ వచ్చినారు.

అ—వచ్చినవారెవరు?

మో—నవాబుసాహేబు.

అయేషా కుపితఫణినివలె ఫూత్కారముసేయుచు "ఏనవాబు సాహేబువచ్చినాఁడు? నేను నిద్రించుచున్నదానను. నాదుస్తులుసడలి శరీరమును సరిగాఁగప్పియుండలేదు. నేనాస్థితియందున్నప్పుడు వారెందులకువచ్చినారు? ఇప్పుడాయన యెక్కడనున్నాఁడు?" అనియడిగెను. మోతీ భయముతో "సంగతులనన్నిఁటిని విన్నవింపకూడదని నాకాజ్ఞయైనది. అమ్మా! ఆయనయిప్పుడు వసారాలో నుండవచ్చును" అనియెను.

అయేషా లేచినిలుచుండెను. క్రోధహేతువుచేఁ బార్శ్వము నకుఁ ద్రోయఁబడినయామెకేశము మిగులసుందరముగఁ గన్పట్టుచుండెను. అతివిస్తృతములైన యామెనేత్రములు నిద్రాభంగమువలనను, క్రోధమువలనను కొంచెమెఱ్ఱవడియుండెను. అనతిదీర్ఘమైన యామెశరీరము కొంచెముచంచలమైనట్లు కన్పట్టుచుండెను. రాజరాజమోహిని కెంతయపరూపకాంతియున్నది! ఆమె "విషయములనన్నిఁటిని విశదముగాఁ జెప్పకుండ నిషేధమున్నదా? అయిన నాతఁడితరసామాన్యులవలెఁ జెడుగుచేయవలయుననుసభిప్రాయముతో నిద్రించుచున్న సమయమున నాగదిలోనికిఁ బ్రవేశించెనా? ప్రవేశించి యజ్ఞానావస్థలోనున్న నన్ను గాఁగిలించుకొనియెనా? రమ్ము. నడువుము. ఆతఁడెక్కడనున్నాఁడో నాకుఁ జూపుము" అనియెను.

కుపితయు, నభిమానినియు నైనయయేషా ఆగదినుండి బయ

లువెడలెను. మోతియు నామెవెనుక నే వచ్చుచుండెను. నవాబు రాయాం
దస్మానుఖాను లేఁడు. ఆయేషా "మోతీ! నవాబిచ్చట లేఁడు. ఎచ్చ
టనున్నాఁడో చూడుము." అనియెను.

మోతియుఁ గొంచెము దూరము ముందునకుఁ బోయి చూచె
ను. అస్మానుఖాను కాలుచేతులనుగడుగుకొనివచ్చి సరోవరతీరప్రదే
శమునందుఁ గూర్చుండియుండెను. మోతి చూచివచ్చి "అమ్మా!
ఆయన సరోవరతీరమునందున్నారు." అనియెను.

ఆయేషా యచ్చటకుఁ బోయెను. మోతి యప్పుడొకవిషమ
వ్యాపారము సంఘటింపనున్నదనియుఁ దానాసమయమున సమక్షము
నందుండు టనుచితమనియుఁ దలంచి ముందునకేగక యచ్చటనే ని
ల్చుండియుండెను.

అస్మానుఖా నయేషాయలంకారశింజితధ్వనులను ద్వారము
నుండివిని లేచినిలుచుండెను. నవాబునందిని మరింతసమీపమునకువ
చ్చుటనుజూచి యస్మానుఖాను తనహృదయమున "నేనిప్పు డేమి
మాటలాడవలయును?" అని యోచించుకొనుచుండెను. కాని, యాతఁ
డేమాటయు మాటలాడవలసినయావశ్యకతయే లేకపోయెను. ఆయే
షా మిగులసమీపమునకువచ్చి క్రోధకంపితమగుచు నుత్తేజితస్వరము
తో "నవాబ్ సాహేబ్! మీకిది యుచితమేనా? నేను నిద్రితను;
శిథిలవసనను; ఒంటరిగనున్నదానను. నేనాయవస్థయందున్నప్పుడు
మీరు నాగదిలోపల కెందులకుఁ బ్రవేశింపవలసివచ్చినది? మీరు
పూజ్యులనియు మహాపురుషులనియు హీనకార్యములయందుఁ బ్రవే
సింపరనియుఁ జాలకాలమునుండి నమ్మియున్నదానను. ఇప్పుడు మీ
రేకారణముచే నాయనుమతిలేనిదే నేనునిద్రించుచున్నప్పుడు నాగ
దియందుఁ బ్రవేశించునీచవృత్తి కొడంబడితిరి?" అనియెను.

అస్మా — (అధోవదనుఁడై ధీరస్వరముతో) నేను నాబుద్ధిపూర్వకముగ లోపలకు రాలేదు. ఒకగొప్పయపాయము సంభవింపనై యుండుటచే లోపలఁ బ్రవేశింపవలసివచ్చినది.

అ — (పూర్వమువలెనే క్రోధపరవశయై) మీ కది యుత్తమకార్యమేనా? ఎంతటియపాయముసంభవించినను సంతఃపురమునందు నిద్రితయైనస్త్రీయున్నగృహములోని కొంటరిగఁ బ్రవేశించుటకు మీకధికారము లేదు. ప్రవేశించి యంతటితోడనే నీవు తృప్తుఁడవు కాలేదు. నీవు నాశరీరమును దాకితివి. ఛీ! ఛీ! నీవొనరించినకార్యము నిందితమైనది.

అస్మా — అయేషా! నీవు నన్నకారణముగ నసంగతముగఁ దిరస్కరించుచున్నావు. నీవు నుడివినట్టియకార్యములనొనర్చుట కస్మాన్ఖానెప్పుడును సమర్థుఁడై యుండలేదు. అతఁ డట్టినీచమానవుఁడు కాఁడు.

అ — మరల నట్టియసత్యములను నుడువుటకు నీకుసిగ్గువొడముచుండుటలేదా? నీవిప్పుడు నవాబుగానున్నాఁడవు. అంతఃపురమునందు నీకుఁ బూర్ణాధికారమున్నది. అయినను పురస్త్రీలపై నీవిట్టియత్యాచారములను నడపుటకుఁ బూనికొనినచో నస్మాన్ఖాన్! నీ పాపకార్యములచే నీరాజ్యసంపదలన్నియు రసాతలమునకంటు నడుగంటిపోవునని నిశ్చయముగాఁ దెలిసికొనుము.

అస్మా — (అవనతశిరస్కుఁడై) అయేషా! నీవు నన్ను నిష్కారణముగ నిందించుచు దారుణవ్యథపాలు సేయుచున్నావు. నీవు నిద్రితవై యసావధానస్థితియందుంటివని తెలిసికొని లోపలకు రాకుండ నీవలనే యుంటిని. ఈవిషయము ద్వారము కడనున్నదాసి పూర్ణముగ నెఱింగును. కాని నీవొకగొప్పయపాయమునకు గుఱియై

యున్నావని యెఱింగి గత్యంతరము లేకపోవుటచే లోపలకు రావల
సివచ్చినది. అప్పుడు నీశరీరమును స్పృశించితిననుమాట యసత్య
ము. నిన్ను బాగుగాఁ జూచుటకైనను నవకాశము లేదు. నీతిరస్కా
రము నాహృదయమునుబట్టి వేధించుచున్నది. అయినను నేనేయపా
యమునిమిత్తముగా నీవున్నమందిరములోపలికిఁ బ్రవేశింపవలసివ
చ్చెనో దానినెప్పటికిని దెలుపఁబోను. నీదాసికావిషయము తెలియు
ను. కాని దానిని నీకుఁదెలుపవలదని తీవ్రముగ నాజ్ఞాపించితిని. అ
యెహా! నేనునీచకార్యములయందుఁ బ్రవేశించితినని నిందించి నీవు
నాహృదయమున కత్యంత తాపమును గలుగఁజేసితివి. జగదీశ్వరుఁ
డు నీకుమంగళమొనగూర్చుఁగాతమని ప్రార్థించుచున్నాఁడను. కాని
నీనిష్ఠురవాక్యములవలనను నాయందునీవగపఱచినయవిశ్వాసమువలన
ను నాహృదయగ్రంథి విచ్ఛిన్నమైపోవుచున్నది. సమాధిస్థలమందలి
మన్నుతోఁగూడ మన్నైపోవువఱకును నాహృదయజ్వాల కెన్నఁడును
నాశనముకలుగదని తోఁచుచున్నది.

అస్మాన్నుఖా నొక్కనిట్టూర్పునువిడిచి ముఖమును మఱియొక
వైపునకుఁ ద్రిప్పుకొనియెను.

అ—అస్మాన్! నామాటలచే నీవు హృదయవ్యథననుభవిం
చుచున్నావని నేనెఱుంగుదును. కాని యీదినమునందలి నీప్ర
వర్తనమూలమున నాహృదయము మిగులదుఃఖమునొందుచున్నది. నీ
వు చెప్పఁగూడదని నిషేధించినరహస్యమును జెప్పకపోయినచోఁ జా
లకాలము నీవు బాధపడుచుండుటయే గాక నిర్మలచరిత్రముగల నీవం
టిమహాపురుషుని నవిశ్వాసియని తలంచుచుండుటచే యావజ్జీవము
ను యాతననుభవించుచుండుటకుఁ గారణమగును. అస్మాన్! నీవు
నామందిరములోఁ బ్రవేశించుటకుఁ గారణమేమో యెఱింగించు ట

త్యావశ్యకము.

అస్మాన్ఖా నవనతశిరస్కుఁడై చాలసేపుయోచించి పిదప “ అయేషా ! నాజీవమున్నంతవఱకుఁ దెలుపఁగూడదని నిశ్చయము చేసికొనినవిషయము నిష్టములేకపోయినను నీబలవంతముచేఁ జెప్ప వలసివచ్చుచున్నది. ఇఁక నేమిసేయుదును ! నాతోరమ్ము” “అని యెను.

అస్మాన్ఖానుముందునడచిపోవుచుండెను. అయేషా యాతని వెన్నంటి పోవుచుండెను. ఇరువురును ఖండఖండములుగఁ దెగిపడియు న్నసర్పశరీరముకడకుఁ బోయి నిలుచుండిరి. అస్మాన్ఖాను అయే షా! అదేమియో చూడుము” అనియెను.

అయేషాచూచివడఁకుచు “ అదియొకభయంకరకాలసర్పము. దానినిప్పట్టుకొని యారీతిగ ఖండించినవారెవరు? దానితలయిప్పుడును కదలుచున్నది. ఎంతభయంకరముగానున్నది?” అనియెను.

అస్మాన్—నీవస్వస్థతగానున్నావని నీతల్లివలన నెఱింగి నిన్నుఁ జూచుటకును నీతోఁగొన్ని యితరవిషయములనుగూర్చి యాలోచించు టకును నిచ్చటకు వచ్చితిని. లోపలకుఁబ్రవేశించినతోడనే యొంట రిగ నిద్రించుచున్న నీవు నాకన్నులఁబడితివి. ఆనిమిషముననే నేనీవల కుఁ దిరిగివచ్చితిని. నీశరీరముపై నాసర్పము పండుకొనియుండెను. నే ను బాగుగా దృష్టించి చూడకపోవుటచే నదిసర్పమో మఱియేదైన పదార్థమో తెలిసినదికాదు. తోడనే నీదాసినిపిలుచుకొనివచ్చుటకై వచ్చి యామెను లోపలకుఁబంపితిని. ఆమె లోపలకుఁబోయి చూ చివచ్చి సర్పమేయని చెప్పినది. ఆమాటవినుటతోడనే నాకుయుక్తా యుక్తవిచక్షతాజ్ఞానము నశించిపోయినది. నీవేమాత్రమజాగ్రత్తవ హించినను సర్పదష్టవగుదువనెడివిచారముచే నేనున్మత్తుఁడనైపో

యిత్తిని. గత్యంతరము లేకపోవుటచే లోపలఁబ్రవేశింపవలసివచ్చిన
ది. అట్లుప్రవేశించి దానినిబట్టుకొని యిట్లు ఖండఖండములుగాఁ
జేసితిని. నీప్రాణముసంరక్షణము సేయుటలో నాప్రాణమును బోఁగొ
ట్టుకొనుటయనునది యొకయల్పవిషయమగుటచే దానిని నీకుఁ దెలు
పుటకు నేనిష్టపడనైతిని. కాని యవిశ్వాసరూపమైన నీతీక్ష్ణవిషజ్వాలల
కాఁగలేక యావద్వృత్తాంతమును దెలుపవలసివచ్చినది. అయేషా! ని
న్ను నిజముగాఁ బ్రేమించుచున్నవాఁడెవ్వఁడు నితరసామాన్యమా
నవులవంటివాఁడు కాఁజాలఁడు.

అయేషా యీ వాక్యములనువినినతోడనే యాకాశమువంక
దృష్టినిగుడ్చి చేతులనుముకుళించుకొని కాతరస్వరముతో "ఓ పరమే
శ్వరా! నీదయ లేదు. నీవిప్పుడత్యమూల్యమైన యస్మాన్ఖానునిప్రా
ణమును భయంకరాపదనుండి రక్షణమొనర్చుట నిజముగా నాయ
దృష్టము" అని భగవంతునిస్తుతించి పిదప సజలనయనయై యస్మా
న్ఖానునికడకువచ్చి యాతనిహస్తమునుబట్టుకొని "అస్మాన్! ఈ
సామాన్యస్త్రీనిమిత్తములోకమునకమూల్యమైన నీజీవనమును మహా
పదలలోఁద్రోయుటయేమి? నీవు చాల నన్యాయకార్యమును చేసి
తివి. సర్పము నాశరీరమును చుట్టుకొనియెనని నాకిప్పుడు తెలిసినది.
నిద్రావేశముచే నింతవఱకును నెవఁడో మనుష్యుఁడు నాశరీరమును
స్పృశించెనని యనుకొనుచుంటిని. అస్మాన్! నీవు నాపైఁ జిరకాలము
నుండియు ననుగ్రహమును జూపుచున్నాఁడవు. ఆకరుణకుఁ బరిమితి
లేదు. అజ్ఞానముచే నిన్ను నేననేకవిధముల దూషించితిని. అన్నా!
దయయుంచి నాయపరాధములను క్షమింపవా?" అని వేఁడుకొని
యెను.

అయేషా యిట్లుచెప్పుచు నశ్రుపూర్ణనయనయై యస్మానుని

పాదములపైఁ బడియెను. అస్మాన్ఖా నత్యాదరభావముతోఁ జేయూతయిచ్చి యామెను లేవఁదీసెను.

అ——నిన్ను క్షమించుటయా! నీవాడిన యానిష్ఠురవాక్యములునాకర్ణములయందమృతమువలె సోకుచుండ నీతిరస్కారమును గూర్చి నేనాగ్రహించు టెట్లు? అందుచే క్షమించుటను గూర్చి చెప్పకుము. కాని నీవు భ్రాంతిఁ జెంది యవిశ్వాసిననియు, చరిత్రహీనుఁడననియు, నీచస్వభావుఁడననియుఁ దలపోయఁ జొచ్చితివి. ఆకారణముచే నేనిట్లు ముక్తకంఠుఁడనై ప్రతిఘటించి మాటలాడవలసివచ్చినది.

అయేషా మాటలాడకుండ నధోవదనయై నిలుచుండియుండెను. అస్మాన్ఖాను చెప్పనారంభించెను. "నీవొకదినమున——అయేషా!——జ్ఞప్తియందున్నదా——వంగదేశమునందలి మనస్కంధావార కారాగారమునందున్న జగత్సింహునిమెడల నీహృదయమునఁ నెలకొనియున్న ప్రబలప్రేమసంబంధమైన వాక్యములను ఘంటాపథముగా నుద్ఘోషించియున్నావు——జ్ఞప్తియందున్నదా?——నీయానిశిత శరసన్నిభవాక్యములను మాఱుమాటాడకుండ విని సహించుకొనియుంటిని. ఇప్పుడును నీరవుఁడనై సహించుకొనియున్నాను. అయేషా! ఇప్పుడు నీవాడిన నిష్ఠురవాక్యములకు నోరువిప్పి ప్రత్యుత్తరమొసంగుట వలనఁ బ్రణయవిషయము ప్రకటితమైనది. దానిని విని నీవు నన్ను మిగుల నసహ్యముగా నైనఁ జూడుము! నాజీవితమరణములును సుఖదుఃఖములును నీచేతిలోనున్నవి.

అయేషా నీరవయు నధోముఖియునై యుండెను. అస్మాను చెప్పఁ దొడంగెను. "అయేషా! వినుము. నేను——అత్యాచారిని, అవిశ్వాసిని, కలుషితస్వభావుఁడను——అయినచో నీయాతిరస్కారనిష్ఠుర వాక్యములను వినినప్పుడు నిరుత్తరుఁడనై యుండను. మిషచేనైననే

మి, బలము చేనైననేమి,—ఎప్పుడో యొక దినమున నిన్ను నా భోగ్య పదార్థమునుగాఁ జేసికొనియుందును. తండ్రియు నిన్ను నాకిచ్చి వివాహము సేయవలయునని యభిలాషపడుచుండెడివాఁడు. నీజననియు నీకును నాకును పరిణయము కానందులకై దుఃఖితయగుచున్నది. అందుచే నిన్ను నేను బలాత్కారముగఁ బరిణయమాడినను నన్నెవ్వరును నిందింపరు. అయిన నామార్గము నవలంబించుటకు నాకెన్నఁడును నిష్టము కలుగలేదేమి? నేను నిన్ను మిగులఁ బ్రేమించుచున్నాఁడను. అంతటి ప్రేమమును కలిగియుండుటచేతనే నీయిష్టమునకు విరోధముగాఁ బ్రవర్తింపఁజాలకున్నాఁడను. నీచిత్తము ప్రసన్నము కాక పోయినచో నిన్ను నాజాయగాఁ జేసికొనుటకు నాకు సాధ్యము కాదు.

అ—(అస్ఫుటస్వరముతో) నీవు చిరకాలమునుండియు నాపైననుగ్రహమును జూపుచున్నాఁడవు.

అస్మాన్—నేను చెప్పవలసినదింకను సంపూర్ణము కాలేదు—వినుచుండుము—ప్రత్యుత్తర మొసంగవలసిన యావశ్యకము లేదు. నేనిప్పుడు నవాబును. అంతఃపురమునందు నాయాజ్ఞ నిరంకుశమైనది. నామాట కెదురు లేదు. నీదేహము మాత్రమే నాకావశ్యకమైనచో—అయేషా! నేను చోరునివలె సమయమును గనిపెట్టి నీశరీరసంస్పర్శనము సేయుటేల? ఇచ్ఛామాత్రమున నెల్లరుఁ జూచుచుండ నిష్టమున్నట్లే వ్యవహరించుచు బలాత్కారముగా నీతోఁ గ్రీడింపఁగలను. నేను భ్రమపడియైన నట్టివిషయమైన యోచనలు చేయుట లేదేమి? ప్రేమయున్న తావున నత్యాచారము సంభవించునా? హృదయవిహీనమైన నీదేహముతోఁ బ్రణయవిహీనమైన సుఖమునందాసక్తి లేకుండఁ బ్రవర్తించుటకు నాకిష్టము లేదు. నా ప్రణయము గంభీరమైనది—ప్రగాఢమైనది—మరియు ననంతమయినది.

అ—నీవు వైనస్వభావుఁడవు. దాని నితరులు తెలిసికొనిన తె
లిసికొందురుగాక; తెలిసికొనకపోయిన పోనిమ్ము. నేను నీస్వభావము
ను బాగుగా నెఱుఁగుదును. దానిని బాగుగా నెఱిఁగియుండియు నందు
లకు వ్యతిరిక్తముగా నిష్ఠురములాడి యందులకు ప్రతిఫలముగ న
నాంతరికవ్యథ ననుభవించుచున్నదానను.

అస్మాన్—నేను చెప్పఁదలఁచినదింకను గలదు. నాజనకున క
నేకపట్టమహిషులు కలరు. ఇంతేగాక యుపపత్నులనేకు లుండియు
న్నారు. నవాబుఘాదుషహాకది గౌరవమున కేకారణమైనది. కాని నిం
దనీయముగా లేదు. నాకు వివాహయోగ్యమైనవయసు మితిమీరిపో
యినది. అయినను నేనింకను వివాహబంధముచే బద్ధుఁడనుగా లేదేమి?
నిన్నుఁ బొందవలయుననెడి యాశచేతనే యస్మాన్ఖానింకను వివా
హితుఁడుగా లేడు. నిన్ను పొందఁజాలకపోయినచో నాయదృష్టమునం
దు చిరబ్రహ్మచర్యమే బ్రహ్మ విధించినట్లు తోఁచుచున్నది. ఈమ
హాప్రపంచమున నత్యంతసౌందర్యవతులగుస్త్రీలు లేకపోలేదు. గుణ
వతులగుయువతులకును నభావము తటస్థింపలేదు. కాని, అయేషా! మ
ఱియేమహిళయైనను నాపట్టమహిషిగానోపుననుమాట యప్రస్తుత
ప్రశంస. మఱియేవనితను కన్నెత్తిచూచుటకు నాకిష్టము లేదు. నీ
రూపమునుజూచిచూచి నాకన్నులు తనివొందనేరకున్నవి. నీగుణపా
శముచేఁ జితప్రతిమాకారుఁడనై పోయితిని. నీపైనున్నవలపుచే
మోహాంధుఁడనై పోయితిని.

అయేషా కన్నులనుండి ముక్తాఫలసదృశములైన యశ్రువులు
జలజల రాలిపడి నేలపైఁ బ్రవహింపఁదొడంగెను. అస్మాన్ఖాను చె
ప్పఁదొడంగెను. "ఇంకను వినుము. అయేషా! నాసోదరుఁడు విలాససా
గరమున దోఁగితేలుచున్నాఁడు. తారకావేష్టితచంద్రునివలె సాం

దర్యచాతుర్యవిలాసినులనడుమఁగూర్చుండి కాలముగడపుచున్నాఁ
డు. అతని భోగలాలసానలమున సురమొదలగునవి ఘృతమువలె
నాహుతియగుచున్నవి. రాజకీయవ్యాపారములయం దాతని యని
ష్టభావము ప్రకటితమగుచున్నది. అయిన నాతని కేకళంకమును లే
దు. నీనిష్ఫలప్రేమపిపాస కీజీవనమసారమగు మరుభూమిగాఁ జేయకుండ
మాయున్నవలె సకలసుఖములననుభవించుచుఁ గాలముగడపవలయు
నని నాహితమును గోరుస్నేహితు లనేకులుబోధించుచున్నారు. అ
దెంతటి దురాలోచన! ఎవఁడునిన్ను చూచుచుండునో, ఎవనిహృద
యమున నీమాధురీరూప మంకితమై యొప్పుచుండునో, విధాత శు
భసమయమున నసాధారణసృష్టియందు నిన్ను సృష్టించెనని యెవఁ
డు తెలిసికొనునో, పుణ్యమయమై సర్వగుణాధారమైన నీమూర్తి
యెవనిహృదయమున ననుపమేయముగఁ బ్రతిష్ఠింపఁబడియుండునో,
అట్టియాతఁడు పాపకార్యములను జేయసాహసించునా? అట్టియా
తఁడు నీచసంసర్గమునందును, నసహ్యాభోగవిలాసములయందును మ
నిఁగి నిన్ను మఱచిపోవయత్నించునా?

అయేషా నీరవయు, నధోముఖియునై యుండెను. ఆమెనేత్ర
ములనుండి పడుచున్నకన్నీరింకను నేలపైఁ బ్రవహించుచునేయుండె
ను. అస్మాన్ఖాను మోకాలూని యయేషాసముఖమునఁ గూర్చుం
డియుండెను. ఒకప్రక్క ప్రాణరహితమై భయంకరముగాఁ గాన్పిం
చుచు ఖండఖండములుగాఁ బడియున్న సర్పకళేబరముండెను. వేఱొ
కప్రక్క నారీకులరాజ్ఞియు, సుందరీశిరోమణియు నైనయయేషా
నిలుచుండియుండెను. నడుమ నత్యంతశోభామయమగువిశాలవక్ష
ముతో వీరశ్రేష్ఠుఁడైన యస్మాన్ఖా నంజలిబద్ధుఁడై యిట్లనిచెప్పఁ
దొడంగెను. "అయేషా! ప్రాణేశ్వరీ! నాహృదయదేవతా! నా

జీవనమును దగ్ధముసేయుట నీకుచితమేనా? చిరకాలమునుండి నన్ని ట్లు వ్యథలనొందించుచుండుట నీకు ధర్మమేనా? సుందరీ! ఇహ సంసారమునఁ బ్రేమకుఁ బురస్కారము లేదా? ప్రతిదానము లేదా? జీవనసర్వస్వదానమునకు విలువ లేదా?

అయేషా యప్పు డతిసమాదరభావముతో నస్మానునిహస్త ములనుబట్టుకొని యిట్లనియెను. "అస్మాన్! నీప్రేమ నిరుపమా నమైనది. ఇహసంసారమునం దేయువతి నీప్రేమమునననుభవించునో యామె ధన్య. ఈజగత్తునందుఁ బ్రేమకుఁ బురస్కారమేయున్న చో నీకదిప్రాప్యముకాఁగలదు. నీవు దేవతాస్వరూపుఁడవు. నేనంటి నో? ఒకసామాన్యవనితను. అమూల్యమైన నీప్రేమమును నాపై నుంచుట యపాత్రదానమగును."

ఇట్లుచెప్పి యయేషా యూరకుండెను. అస్మానుఖాను "చెప్పు ము. ప్రాణేశ్వరీ! నీవాక్యములచే నాహృదయమున నమృతప్రవా హము పొంగిపొరలుచున్నది. చెప్పవలసినదానిని పూర్ణముగాఁజె ప్పి మతిముగింపుము" అనియెను.

అ—నీకు నాయాత్మసమర్పణముగావించుటకు నాకు సాధ్య మేయైనచో నీచరణసమీపమున విక్రీతదాసినై పడియుందును. కా ని, హా! అకటకటా!—నేను మరణింపలేదేమి?—అస్మాన్! నీవు నన్నాసర్పముఖమునుండి యేలరక్షించితివి?

అయేషానోటనుండి యిఁక ముందుమాట వెడలలేదు. ఆమె యచ్చటి నిలువకుండ యావలికి వెడలిపోయెను.

అస్మానుఖానచ్చటనే కూర్చుండియుండెను. దీర్ఘనిశ్వాసము నువిడిచి తనలోఁదాను "అదేమాట! చిరకాలమునుండియుఁ గఠోర మైనయాజ్ఞయొక్కటేమాట! ఆత్మహత్యచేసికొందును. రణక్షేత్ర

మునం దీజ్వాలను నివృత్తిచేసికొందునుగాక !" అనియనుకొనియెను.
హతాశుఁడైన యస్త్రఖాను కాతరభావముతో నవనత మస్తకుఁడై యటనుండి వెడలిపోయెను.

---

## పదుమూఁడవ ప్రకరణము.

---

మానసింహమహారాజు బహుజనపరివృతుఁడై పుణ్యతీర్థమైన పూరినగరమునకుఁ బురుషోత్తమదర్శనార్థమై యేతెంచెను. సముద్రోపకూలమున విస్తీర్ణమైనయొక విశాలప్రదేశమున నాతనినివాసమునకొఱకనేకపటమండపములు స్థాపింపఁబడియెను. వస్త్రావాసములన్నియు ననేకవర్ణములతోఁ బ్రకాశించుచు నతిరమణీయముగాఁ గన్పట్టుచుండెను. అవియన్నియు ననర్ఘరత్నకంబళములతో నావృతములై పైభాగమున నలంకరింపఁబడిన స్వర్ణకలశములతోడను పతాకపంక్తులతోడను, సుశోభితములై యుండెను. దాసదాసీజనము, నంగరక్షకులు, నశ్వారూఢులు, మావటీండ్రు, శతఘ్నిప్రయోగకులు మొదలగు ననుచరులనిమిత్తము నాల్గుప్రక్కలను వస్త్రగృహములు నిర్మింపఁబడియుండెను. పశుపాలకులకును, అశ్వము, హస్తి, ఒంటె మొదలగు పశుసముదాయమునకును యథాస్థానములయందు యథాయోగ్యములైన నివాసస్థానములు నిర్ణీతములై యుండెను. నానాస్థానములయందు నానారూపములైన భాండారములును, పాకశాలలును స్థాపితములై యుండెను. మహారాజు స్కంధావారము మొత్తముమీఁద క్రోశార్థపరిమితభూఖండము నావరించుకొనియుండెను. వస్త్రావాసములచే నిర్మితమైన యాస్కంధా

వారము విన్యాసకౌశలమున సౌధములచే శోభించుచున్న యొక గొ
ప్ప నగరమువలెఁ గన్పట్టుచుండెను.

మహారాజుతోఁగూడ ముగ్గురు రాణులు వచ్చియుండిరి. అం
దొకతె యోధపురరాజుతనయయగు నూర్మిళ. ఊర్మిళ మానసిం
హమహారాజునకుఁ బ్రధానమహిషి కాకపోయినను ప్రధానప్రణయ
భాగినియై యుండెను. మానసింహమహారాజునకుఁ జాలమంది భార్య
లుకలరు. ఆతఁడు బాదుషహాకార్యములకొఱ కనేకసమయముల
యం దనేకస్థలములకుఁ బోవలసివచ్చుచుండెను. సర్వత్ర భార్యలనం
దఱను గూడఁదీసికొనిపోవుట సంభవించుటలేదు. సంభవమేయైన
నందఱను దీసికొనిపోవఁడు. అయినను నూర్మిళమాత్ర మెల్లప్పుడు
నాతనితోఁగూడ నుండును. రణక్షేత్రమందుండెడి స్వల్పకాలముత
క్క మిగిలిన యెల్లవేళల నామె ఛాయవలె మానసింహుని విడువ
క సంచరించుచుండును. మర్యాదయందును, పదవియందును, గౌరవ
మునందును జగత్సింహునిజనని సర్వప్రధానమహిషియై యుండెను.
కాని యామె మహారాజుతోఁగూడ నెల్లతావులకుఁ బోవనిష్టపడదు.
ఆమెయెడల మహారాజు ప్రణయమును జూపుటకంటె హెచ్చుగా గౌ
రవమునే చూపుచుండును. ఆదరించుటకంటె హెచ్చుగ భయపడు
చుండును. మానసింహమహారాజు వంగదేశమునకు సుబేదారుఁడయిన
ప్పుడు జగత్సింహునిజనని మానసింహునితో వంగదేశమునకు రా
లేదు. పురుషోత్తమక్షేత్రమునకు మానసింహునితోఁగూడ వచ్చి
న మఱియిద్దరుభార్యలతో మనకథకు సంబంధమేమియును లేదు.

మహారాజు శ్రీక్షేత్రమున నొకవారముదినము లుండవల
యునని సంకల్పించుకొనియెను. రెండుదినములు గడచిపోయినవి.
మానసింహుఁడు ప్రతిదినము నుదయమున భార్యలతోఁగూడ దేవ

మందిరమునకుఁ బోవుచుండెను. అచ్చట స్నానము పూజ మొదలగునవి పూర్తియగునప్పటికి రెండుజాములగుచుండెను. అదియైనపిదప ననేకసహస్రస్వర్ణముద్రలనుదానముచేయుచు నానుయాత్రికులతోఁ గూడ మహారాజు పటమండపములలోని కరుదెంచుచుండెను. ప్రతిదినమును జగన్నాథస్వామిపూజార్చనము, మంగళహారతులు మొదలగునవి మహారాజుపేరుతో సంకల్పముచేయఁబడి యత్యంతశోభాయమానముగా జరుగుచుండెను. ప్రతిదినమునను దూరదేశమునుండి వచ్చినయాత్రికులకందఱకు మహారాజుద్రవ్యముతో సమారాధనలు జరుగుచుండెను. పఠానులతో జరిగినసంధిననుసరించి పూరినగరముయొక్క యధికారము మానుమహారాజహస్తగతమయ్యెను. ఒరిస్సాదేశమునందలి మిగిలినభాగమునందంతటను పఠానులు స్వతంత్రరాజులై యుండిరి. ఒరిస్సాదేశమును పఠానులు జయించుటకుఁబూర్వ మాదేశమును దేవవంశపుహిందూరాజులు పరిపాలించుచుండిరి. ఇప్పుడావంశమున రామచంద్రదేవుఁడనునాతఁ డుండెను. పూరికైవశమైనతోడనే మానసింహమహారాజు ఒరిస్సాదేశమునకుఁ బూర్వపుభూపాలురవంశములోనివాఁడైన రామచంద్రదేవునకు దానిపై శాసనకర్తవ్యభారము నొసంగెను. రామచంద్రదేవరాజు మానసింహునిసుఖసౌకర్యములకుఁ గావలసినవన్నియును సమకూర్చుచుండెను. అందుచే మానసింహున కించుకంతయును ప్రవాసకష్టము గాన్పించుటలేదు. మహారాజు రామచంద్రదేవునిగుణములకు మెచ్చుకొని కృతజ్ఞుఁడై యుండెను.

నవాబునులేమానుగాని, అస్మానుఖానుగాని వారిదేశపుటెల్లలకడ మానసింహు నెదుర్కొనియుండలేదు. అతఁడు పూరినగరమునకువచ్చినపిదపనైన నెవరునురాలేదు. మంత్రిఖాజాయిసాఖాను

నుఁ రాలేదు. నవాబుకుటుంబములోనివాఁడగు నొకమనుష్యుఁడువ
చ్చి యొకయుత్తరమునుదెచ్చి మానసింహునకిచ్చెను. ఆయుత్తర
మునం దిట్లువ్రాయఁబడియున్నది. “ఒరిస్సానవాబులు మహారా
జసందర్శనముచేయఁజాలమికిఁ జింతిల్లుచున్నారు. మహారాజు పూరి
యందున్నప్పు డస్మాన్‌ఖాను తనపనిమీఁదవచ్చి యాతనిసందర్శన
ము సేయఁగలఁడు. మహారాజున కేవిషయమందైన ననుకూలమ
య్యెనేని యది నవాబులకుఁ దెలిసినతక్షణమే దానికిఁ దగినయేర్పా
టులుచేయఁగలరు” ఉత్తరమునుజూచి మానసింహుఁడు సంతుష్టచి
త్తుఁడుకాలేదు. పూర్వము మానసింహుఁడు వ్రాసినయుత్తరము
నుజూచి యస్మాన్‌ఖానును సంతుష్టచిత్తుఁడుకాలేదు. పైయుత్తర
మస్మాన్‌ఖానునియభిప్రాయానుసారముగ వ్రాయఁబడినది. ఖాజా
యిసాఖాను కఠినరోగముచే బాధపడుచున్నాఁడనియును, నాతఁడు
జీవించుట కష్టమనియు నుత్తరము తెచ్చినవానివలన మానసింహుఁ
డు తెలిసికొనియెను.

పఠానులయుత్తరమును వారిప్రవర్తనమును నసంతోషజనక
ముగ నున్నను మానసింహుఁడు పూరినగరమునఁ బరమానందము
తోఁ గాలమును గడపుచుండెను. ధర్మక్షేత్రమున నివసించియున్న
ప్పుడు ధర్మబుద్ధిప్రభావముచే మనోమాలిన్యము చాలవఱకుఁ దగ్గి
పోవును. మానసింహునకును నట్లే ప్రేమము, భక్తి, దయ, శాంతి,
యనురాగాకర్షణము మొదలగునవి జనియించుటచే నాతనిచిత్తక్షే
త్రము నిర్మలమై యుండెను.

పూరిక్షేత్రమునున్నప్పుడు మూఁడవనాఁటిప్రదోషసమ
యమున మానసింహుఁడు జగన్నాథస్వామిమంగళహారతిని దర్శించి
బిడారమునకుఁ దిరిగి వచ్చి మెల్లమెల్లగ నూర్మిళాదేవియున్నపట

మందిరములోపలఁ బ్రవేశించెను. అటనొక గొప్పమండప ముండెను. చిత్రిత విచిత్ర చందనకాష్ఠావరణముచేఁ బరివేష్టితమైన యామండపోపరిభాగము స్వర్ణసూత్రసమన్వితములై నవిచిత్రసూక్ష్మాలంకృతములగు వస్త్రములచే నావృతమై యుండెను. నేలపై నంతటను పలకలను పరచి వానిపై నొకవైపునుండి మఱియొకవైపువఱకు నతిమనోహరమైనరత్నకంబళము వేసియుండెను. అపూర్వమైనయావస్త్రగృహామధ్యమున వెండిమంచముపై పాలనురగవలెనున్న మృదుశయ్య విరచింపఁబడియుండెను. యథోపయుక్తస్థానములయందుఁ గుర్చీలు సోఫాలు మొదలగునవి యమర్పఁబడియుండెను. అచ్చటచ్చట నత్యుత్తమములగుస్ఫటికపాత్రములయందుదీపములు వెలుఁగుచుండెను. నానావిధసుగంధములచే మందిరమంతయు నలరారుచుండెను. మందిరములోపలకు జనులెవ్వరును వచ్చుటలేదు.

మానసింహమహారా జాగృహములోపలఁ బ్రవేశించెను. ఆతనివెనుక విసనకఱ్ఱలను చేఁబూని యిరువురు బానిసలు కూడవచ్చిరి. ఇంకొకసేవకురాలు బంగారుపాత్రములో నీరును దెచ్చెను. ఇంకొకతె తాంబూలపుఁబళ్లెమును జేతఁబూని వచ్చినిలుచుండియుండెను.

మహారాజుక్లాంతుడై వచ్చి శయ్యపైఁ బండుకొని “ రాణియెచ్చటనున్నది ? ” అనియడిగెను.

దాసి — మహారాజుగారి భోజనపదార్థముల సిద్ధముచేయించుటకు వంటలక్కయొద్దకు వెళ్లియున్నారు. ఇప్పుడేవచ్చెదరు.

మహా — తాంబూలమును నీవునిప్పు డక్కఱలేదు. నీవు పోవచ్చును.

ఉదకమును తాంబూలమును దెచ్చినవారిరువురును వెడలిపోయిరి. వ్యజనధారిణులు మాత్రమాజ్ఞానుసారముగ బాగుగ విసరుచుండిరి.

ఇంతలో మహారాజ్ఞియు లోపలకు వచ్చెను. ఆమె ప్రౌఢవయస్క. కాని ముప్పదిసంవత్సరములకు మించినవయసుగలదానివలెఁ గాన్పించుటలేదు. ఆమె కొంచెము పొట్టిగ నుండును. కాని, యింకఁ గొంచెము పొడవుగనుండు నేని యామె శరీరసౌందర్యమున కించుక హానిగలుగు నేమో యని తోఁచుచుండును. ఆమెశరీరము స్థూలమై యుండ లేదు. కాని, దేహమునం దెచ్చటను లోపము కాన్పించుట లేదు. ఆమె శరీరమునందంతటను లావణ్యము నిండి తొణుకులాడుచుండెను. పంచవింశతివర్షప్రాయమగు దేశీయయువతిశరీరమునందుఁ గన్పట్టులావణ్యమువలెనే మహారాజ్ఞి శరీరలావణ్యమును సముజ్జ్వలమై కన్పట్టుచుండెను. ఆమె మెయిచాయ బంగారమునుధిక్కరించుచుండును. ఆమె శరీరమునందలి రక్తము కాలు చేతుల వ్రేళులలనుండి పోవునేమో యని తోఁపించుచుండును. నేత్రములు యువతీనేత్రములవలెనే యుజ్జ్వలములై యుండెను. లలాటమున రేఖామాత్రము లేదు. కృష్ణవర్ణ కేశరాశి కబరీబద్ధమై యుండెను. భగవంతుఁడొసంగినరూపము నభివృద్ధిచేసికొనుటకై మహారాజ్ఞి కృత్రిమాయాసమును పడుచుండక పోయినను, ఆమెసౌందర్యమున కించుకంతయును హానికలుగ లేదు. కాని, ఉర్మిళాదేవిమాత్రమా విషయమునందును మిగుల యత్నించుచునేయుండెను. ఆమె కబరియందు ముత్యాలహారమును ధరించియుండెను. కబరిపై భాగమునుండి వామలలాటమునకును వజ్రఖచితమైన భూషణము వ్రేలాడుచుండెను. కర్ణములయందు నేత్రములను మిఱుమిట్లుగొలుపు కర్ణాభరణములుండెను. వానికి ముక్తాసమన్వితములైన కుచ్చులుండెను. కంఠమున నమూల్యమైన ముత్యాలహారము—హస్తములందు నవరత్నఖచితములైన కంకణములు, బాహువులయందలి మనోహరములగు బా

జిబంధులు. మరియు దేహముపై యథోపయుక్తములైన భూషణం-
ము లుండెను. చరణములయందు మనోహరశబ్దములనీను మంజీరము-
లుగలవు. అతిసూక్ష్మమైనబంగారపుజరీతోఁగూడిన నిలువుటంగీ
వంటి పావడ నామెధరించియుండెను. మరియు నామెముక్తాలంకృత
మైన పీతవర్ణపుఁగంచుకమును తొడిగికొనియెను. దానిపై నచ్చట
చ్చట దూరదూరముగ బంగారపుపూవులు రచింపఁబడియుండెను.
ఊర్మిళాదేవి హాస్యమయియు ప్రసన్నవదనయునగాక పరిహాసనిపుణ
యుఁగూడనై యుండెను.

ఆమె తనశరీరశోభాసౌందర్యమును విలోకించుకొనుచు లో
పలకుఁ బ్రవేశించెను. కాని యిప్పుడామెయొక్క తెయే రాలేదు.
ఆమెవెనుక పరమసుందరియైన యువతియొక్కర్తుకూడ వచ్చియుండె
ను. ఆయువతి యవనతవదన—ధీర—మందగమన—

మహారాజ్ఞివెనుక నమ్రవదనయైయున్నయాయువతిని మాన
సింహుఁడు చూడలేదు.

మాన—ఒక్కనిమిష మీభువనమోహినిని జూడకుండ నుం
డుటకంటె నొకటిరెండుదినములు భోజనములేకుండ నుపవాసముం
డుట చాలమేలు.

ఊర్మిళ—ఏమహానుభావులుండుటచే నాకిదియంతయు విలా
సమయముగ నగపడుచుండునో, యట్టిమీకు విందుచేయుటుచితము.
ఆపనిలోనుండుటచేతనే నేనాలస్యముగ వచ్చితిని.

మాన—కాని, సుందరీ! ఏయదృష్టశాలి నీయధరసుధారస
పానముచే సమర్థుఁడయ్యెనో యట్టివానికి విందులతోఁ బ్రయోజన
మేమున్నది?

ఊ—ముసలివారైనకొలఁదిని హాస్యరసముపృద్ధియై పొంగి

పొరలుచున్నదికాఁబోలును !

మాన — అందుల కొకకారణ మున్నది. ఒకయేడు వయసు హెచ్చినకొలఁదిని చిన్నపిల్లవై యీవయసునందిట్లు రసవతివై యుండు నిన్నుఁ జూచుటచే హాస్యరసము దానియంతట నదియే యుబికి పొరలుచున్నది.

మహారాజువాక్యములు క్రమక్రమముగా మేరమీరి గాఢతరములగునని తెలిసికొని యూర్మిళ యొకవైపునకు జరగి నిలుచుండెను. అంతట నామెవెనుకనున్న నవీనబాలిక మహారాజుదృష్టిపథమునఁ బడియెను. ఆతఁ డతికుతూహలభావముతో "ఈబిడ్డయెవ్వరు ?" అనియడిగెను.

ఊ — ఈమె చాలకాలముక్రిందట నాకుఁ బరిచితమైయున్న నానెచ్చెలితనయ. మహారాజునకు వందనముచేయవలెనని వచ్చినది.

నవీనయు నత్యంతసంభ్రమముతోఁ జీరను సవరించుకొని వచ్చి మానసింహునిపాదముల కెఱగి యాతనిపాదధూళిని తనశిరసున ధరించుకొనియెను. ఆమెనేత్రము లించుక బాష్పావృతములయ్యెను. కాని, యాసంగతి నెవ్వరును గ్రహింపలేదు. ఆబాలికయు శిరసును బాగుగవంచుకొని మహారాజ్ఞికడకువచ్చి నిలుచుండెను.

మాన — ఈబాలిక సాక్షాల్లక్ష్మివలెనున్నది. రూపమునందును మిగుల సౌందర్యవతి. నీకీమె యెక్కడదొరకినది ?

ఊ — ఈబిడ్డ తల్లితోఁగూడ జగన్నాథస్వామిదర్శనమునకై వచ్చినది. ఈమధ్యాహ్నమున నాస్నేహితురాలు నన్నుఁజూచుటకై వచ్చి చూచివెళ్లిపోయినది. నేనీబాలికను విడిచిపుచ్చుట కంగీకరింపనైతిని. ఈమెను గొన్నిదినములు నాకడనుంచుకొందునని చెప్పి యామెను బంపివేసితిని.

మా — మంచిపనిచేసితివి. ఈబిడ్డ మిగులసుశీల. అత్యంత-కోమలస్వభావముకలది. లక్షణములన్నియుంజూడఁ జాలభాగ్యవతి-వలెఁ గన్పట్టుచున్నది. ఈమెకుఁ బరిణయమైనదా ?

ఊ — పరిణయమైనది. ఆవిషయమున మహారాజునసమక్షమున నేనొకయభియోగమును తేవలసియున్నది. అది యిప్పుడు వలదు. వేఱొకదినమున మనవిచేసెదను.

మా — నీయిష్టమువచ్చినట్లు చేయుము. ఈబిడ్డ కననుకూల మేమియు లేకుండునట్లు తగినయేర్పాటులను గావించితివా ?

ఊ — కావించితిని.

మహారాజు శయ్యపైఁబరుండుచు "చాల నుడుకుగనున్నది. చెమట శరీరమునుండి ప్రవహించుచున్నది" అనియెను.

ఊర్మిళ వేఱొకదాసినిపిలువవలయునని యత్నించుచుండెను. ఆమంచముప్రక్క నొకవీవనపడియుండెను. బాలిక మెల్లమెల్లగ ముందునకుఁబోయి యావీవనన్గైకొని మహారాజునకు వీవఁదొడంగెను.

మహారాజు "బిడ్డా ! నీకెందులకు ? పరిచారికలువచ్చెదరు. నీచేయి నొప్పియెత్తును" అనియెను.

యువతి యతిమధురస్వరముతో "మీసేవలభించుట నాకుఁ బరమసౌభాగ్యము" అనియెను.

మహారా జూర్మిళనుద్దేశించి "ఈబాలికపేరెవ్వరు ?" అని యడిగెను.

ఊ — రాజలక్ష్మి.

మా — మిక్కిలిసొగసైనపేరు. నిశ్చయముగా నీమె రాజలక్ష్మియే యగును. ఈలక్ష్మి యెవనియింటనుండునో, ఆతఁడు లక్ష్మి

తోఁగూడినర్వాజగుటకు సందేహము లేదు.

ఇంతలో నిరువురుపరిచారికలు వచ్చిరి. మహారాజు "నీవు వీవనను విడువుము. వారు విసరెదరు. నీకుఁ గష్టమెందులకు ?" అనియెను.

రాజలక్ష్మి—కష్టము లేదు. మీయాజ్ఞకు వ్యతిరేకముచేయరాదని నేనీవీవనను విడుచుచున్నాను.

రాజలక్ష్మి వీవననటనుంచి మెల్లమెల్లగజరగి యూర్మిళవెనుకకు వచ్చి నిలువఁబడియెను.

ఊ—భోజనము సిద్ధముసేయుమనియెదరా ? రాత్రిప్రొద్దుపోయినది.

మహా—నీయిష్టము.

రాజలక్ష్మి యూర్మిళహస్తమునుబట్టుకొని యస్ఫుటస్వరముతో "అమ్మా! ఆజ్ఞయిమ్ము. నేనుపోయి యన్నియును జక్కగా సిద్ధముచేసెదను." అనియెను.

ఊర్మిళయుమహారాజుముఖమును జూచుచు "మంచిది. నీవుపోయి చూడుము. నేనును వెంటనే వచ్చెదను" అనియెను.

రాజలక్ష్మి వెడలిపోయెను. కొంచెముసేపయినపిదప మానసింహమహారాజూర్మిళతోఁగూడ భోజనశాలకేగెను. వారక్కడకు వచ్చునప్పటికే రాజలక్ష్మి యన్నికార్యములను చక్కగా సిద్ధముచేసియుంచెను. అదిచూచి మహారాజు మిగుల సంతృప్తుఁడయ్యెను.

అదిమొదలు రాజలక్ష్మి మహారాజునకుఁ దఱచుగా నుపచారములుసేయుటయందు నియుక్తయగుచుండెను. మహారాజంతఃపురమునకువచ్చినతోడనే రాజలక్ష్మిచేసిన ప్రతికార్యమును సర్వాంగసుందరమై మహారాజున కత్యంతసంతోషదాయక మగుచుండెను.

అందుచేత మహారాజునకు శుశ్రూష సేయుభారమంతయు రాజల క్ష్మిమీఁదనే పడియెను. మూఁడుదినములకే, రాజలక్ష్మిచే యనికార్యములయందు మహారాజున కించుకంతయును తృప్తిలేకుం డెను. ఆమె చేసినకార్యమే యుత్తమమయినదని మహారాజు తలం చుచుండెను.

---

## ప దు నా ల్గ వ ప్ర క ర ణ ము.

---

విజ్ఞాననిధియు వృద్ధుఁడు నైనపఠానులమంత్రి ఖాజాయిసాఖా ను కాలదేవతకాహారమైపోయెను. సామాన్యమైనజ్వరమువచ్చి త న్మూలమున నుదరామయవ్యాధిపీడితుఁడైన యాతనిజీవిత మంత లో నంతమైపోయెను. నవాబులగు సులేమానస్మాన్ఖాను లిద్దరును. ఖాజాయిసాఖానునెడల భక్తిశ్రద్ధలనె గలిగియుండెడివారు. వారిరు వురును మంత్రిసమాధికార్యముల నత్యంతశ్రద్ధతో నెరవేర్చిరి. ఆ తనికిబదులుగ మంత్రిపదవియందు ఖిజర్ఖానును నియమించిరి. ఖి జర్ఖాను సాహసికుఁడు. యుద్ధప్రియుఁడు. ఆతఁడు నవాబుఅస్మాన్ ఖానున కత్యంతము ప్రీతిపాత్రుఁడై యుండెను. ఈనూతనామా త్యునకు నలువదియారువర్షములకంటె నెక్కుడువయసులేదు. అ స్మాన్ఖాను, నీతఁడు ననేకవిషయములలో నేకాభిప్రాయులగుచుం డిరి. అందుచేతనే యస్మాన్ఖానీతనిని మంత్రిపదవియందు నియో గించెను.

సులేమానును, అస్మానును వేఱువేఱుస్వభావములుకలవారు

నీ మొట్టమొదట చెప్పియున్నాము. మంత్రిఖాజాయిసఖాను లో కాంతరగతుఁడైనపిదప నవాబులిరువురును చేరి యాలోచించి యిఁక ముందు రాజకార్యములు మంత్రిమీఁదఁ బెట్టకుండ నస్మాన్‌ఖాను స్వయముగనే నెరవేర్చుచుండున ట్లేర్పాటుచేసికొనిరి. సులేమాన్ ఖాను రాజకార్యవేత్తకాకపోవుటచే నాతఁడాభారమును వహింపని ష్టపడలేదు. అతఁడు భోగవిలాసములయందుఁ బ్రిమత్తుఁడై యం దుల కనువగునుపకరణములకు న్యాఘాతముకలుగకుండ జరుగుచు న్నచోఁ దాను చరితార్థుఁడనగుదునని తలపోయుచుండెను. అస్మా నుఖాను చేసినయేర్పాటులకు వ్యతిరేకముగ నాతఁడేమియు మా టాడుటలేదు.

ఆయేర్పాటుల ననుసరించి కార్యములు జరుగుట కారంభమ య్యెను. అస్మాన్‌ఖానునిపేర రాజ్యవిధులు, శాసనపాలనములు ని ర్వహింపఁబడుచుండెను. ఆతనిపేరుతో రాజాజ్ఞ ప్రచారమగుచుం డెను.

ఈసమాచారములన్నియు మానసింహమహారాజునకుఁ దెలి యవచ్చెను. పురుషోత్తమపట్టణమునకు వచ్చిననవాబుదూత వీనిన న్నిఁటిని మహారాజునకు విన్నవించుటయేగాక నవాబువ్రాసినయు త్తరమును మానసింహున కిచ్చెను. మానసింహుఁడు రాజ్యసంబం ధమైన యాపరివర్తనలను తత్క్షణమే యక్బరుపాదుషహాకు వ్రాసి పంపించెను.

పురుషోత్తమునందు మానసింహుఁ డొకవారముదినము లుం డఁదలఁచుకొని వచ్చెను. ఆతఁడువచ్చి యప్పుడే పదిదినములైనది. అయినను శిబిరములనెత్తుట కాజ్ఞయిడలేదు. ఆవిషయమునఁదనయ భిప్రాయము నాతఁడెవ్వరితోడను వ్యక్తపఱచినట్లు గన్పట్టుటలేదు.

మానసింహుఁడు రామచంద్రదేవునితో నొరిస్సాదేశశాసనాదివిషయములనుగూర్చి యప్పుడప్పుడాలోచించుచుండెను. వారుతుదకిట్లని స్థిరపఱచుకొనిరి—"అస్మాన్ ఖానువర్తమానసంధినియమముల కింకనెన్నియోదినములు కట్టువడియుండఁడు. ఆతనిప్రకృతి యత్యంతదుర్దమనీయమైనది. ఆతఁడత్యంతతీవ్రస్వభావముగలవాఁడు. అందుచేఁ బ్రస్తుతావస్థతో సంతృప్తినొంది యుండఁజాలఁడు. మరియు నాతఁడు ప్రస్తుతమున మానసింహునివిషయమున నడపినవ్యవహారమంతయు నౌద్ధత్యప్రదర్శకమై సంవాదలక్షణసూచకముగఁ గన్పట్టుచుండెను. ఆతఁడు వచ్చి మానసింహమహారాజును జూడలేదు. మానసింహుఁడు వ్రాసినయుత్తరమునకు సరియైనప్రత్యుత్తరము నీయలేదు. ప్రవాసమునందున్నపుడు మానసింహునకుఁ గావలసినవానినిగూర్చి విచారించి కనుఁగొనుటయు లేదు. ఇదియంతయుఁ బరికించి చూచినచో నవాబు ఫాదుషహాగౌరవానురాగముల నభిలషించుచున్నట్లు కాన్పించుటలేదు. మానసింహునివిరాగభావము నాతఁడు గ్రహియించినట్లు లేదు. ఆతనిమైత్రియతను దృఢపఱచుకొనవలయునను నభిలాష యాతనికున్నట్లు తోఁచుటలేదు. సంధియగుటకుఁబూర్వము మానసింహుఁడు యుద్ధమునకు సిద్ధముకాలేదు. ఇప్పుడాతఁడు యుద్ధమునకు సిద్ధమై యుండెను. అయినను సంధికి వ్యతిరేకముగ యుద్ధముసేయుటయందాతని కిష్టము లేదు. పఠానులు సంధినియమములను మీఱక పోయినచో యుద్ధమునకు దిగకూడదని మానసింహుఁడు నిశ్చయించుకొనియెను.

నవాబిప్పుడు మహారాజును జూడవలయునని పూరీనగరమునకు విచ్చేసెను. సన్మానప్రదర్శనార్థమై యాతఁడు రాలేదు. ఆతని కాయభిప్రాయమే యున్నచో మొదటనే వచ్చియుండును. ఈరాక

కు నేఁటికారణములున్నవి. నవాబు తనవిషయమునుగూర్చి మాటలాడవలయునని తలంచి యందుకొఱకై వచ్చి తనరాకను మానసింహునకెఱింగించెను.

అపరాహ్ణకాలమున మహారాజు సభామండపమునం దాసీనుఁడై యుండెను. మిత్రమండలియుఁ బరివారజనమేకాకుండ మహారాజగు రామచంద్రదేవుఁడుకూడ వచ్చుటనుండెను. ఆసమయమున నస్రత్‌ఖానచ్చుటకు వచ్చెను.

నవాబువచ్చుసమయమునకు సరిగా భేరీ, నగారా, కాహళ మొదలగువాద్యధ్వనులు ఘోషించెను. తూర్యధ్వనులయ్యెను. మహారాజటనున్నవారితో మండపద్వారమువఱకు వచ్చెను. వందిమాగధులు హెచ్చరికలను దెల్పుచుండిరి. ఆక్షణముననే యస్రత్‌ఖాను వారిసందఱ నెదుర్కొనియెను. మహారాజాతనిని యథావిహితశిష్టాచారములతో గౌరవించెను. నవాబుకొఱ కొకవిచిత్రసింహాసనము వేయఁబడియుండెను. అస్రత్‌ఖానందుపైఁ గూర్చుండెను.

ఎట్టిసుందరసౌమ్యమూర్తి!—కొంచెము చింతాభావము—కొంచెముసందిగ్ధభావము—అందుచే నించుక మ్లానభావముతోనున్న యస్రత్‌ఖానునిమూర్తి యెంతశోభామయమైయున్నది? అతిమనోహరములగునుడుపులచే నాతనిశరీరము సమాచ్ఛన్నమైయుండెను. వామపార్శ్వమున నవరత్నఖచితమైన యొరయందుఁ గూర్పఁబడిన ఖడ్గము కటినుండి నేలనుదాకుచు వ్రేలాడుచుండెను. మస్తకమున నత్యంతశోభామయమైన యుష్ణీషము ప్రకాశించుచుండెను.

నవాబుపరివారమునందు ప్రతిమనుష్యునిగూర్చియు, క్షేమసమాచారము మొదలగుకుశలప్రశ్నలైనపిదప మానసింహమహారాజు పరలోకగతుఁడైనమంత్రియిస్సాఖానునివ్యాధి, మరణము, సమాధి,

మొదలగువానిని గూర్చి చాలసేపడిగి తెలిసికొని ప్రధానశిరోమణి
యైన యాతనిచేఁతలను గొంతసేపు కీర్తించి పిమ్మట "ఒరిస్సాదేశ
మునకువచ్చియున్నను నాకు, ఒరిస్సాదేశపునవాబులసందర్శనము ల
భించునని నేననుకొనలేదు. ఇప్పుడు మీరాక మాయదృష్టసౌభాగ్య
ములకుఁగారణమని తలంచుచున్నాను." అనియెను.

మహారాజాడిన శ్లేషపూర్ణమైన యీ వాక్య మమాత్యునిహృద
యమునకుఁ దట్టెను. అతఁడించుక సేపు చింతించి "మహారాజులు ని
జమానతిచ్చినారు. మాపై దయయుంచి మమ్ముఁ జూచునాకాంక్ష
యుండుటచేతనే మాకు దర్శనమొసంగి మమ్ములను గృతార్థులనుజే
సినారు. ఆత్మీయులసందర్శనలాభము సౌభాగ్యప్రదమనితలంచుటకు
సందేహములేదు. కాని, యాత్మీయులలోఁ బరిగణింపఁబడు సదృష్ట
ముమాకులేకపోయినది. అట్లేయున్నచో "హాజరుకావలయును"
అను "హుకుము" వచ్చియుండదు. ఎవరు హుకుమునకు దాసులో,
అట్టివారిదర్శనము మహాభాగ్యముగాఁ బరిగణించుట కవకాశములే
దు" అనియెను.

మానసింహునకు సంపూర్ణప్రత్యుత్తరమే వచ్చినది. సంపూ
ర్ణమునకుహెచ్చుగనే వచ్చినట్లెంచవచ్చును. ప్రత్యుత్తర మస్పష్టమై
నదికాదు. శ్లేషపూర్ణముకాదు. ద్వ్యర్థిబోధకముకాదు. మానసింహుఁ
డు కొంచెమువిసుఁగుకొని స్పష్టముగాఁ జెప్పవలయుననియే నిశ్చయ
ముచేసికొని "హుకుమునకుదాసుఁడుగూడ నొక్కొక్కసమయము
నఁ బరమాత్మీయుఁడగును. అదివానిగుణమునుబట్టియు, దక్షతను
బట్టియు నుండును. నవాబులు లోఁబడియుండుట కొప్పికొనిరి. వా
రలాత్మీయులగుటయుఁగాకపోవుటయు వారియిచ్ఛాధీనమైయుండును"
అనియెను.

అస్మాన్‌ఖాను మిగులదుఃఖాక్రాంతుఁడయ్యెను. ఆతనిమొగ మెఱ్ఱవడియెను. మానసింహుఁ డాతనిసమక్షముననే యాతఁడు హాకుమునకు దాసుఁడైనట్లుస్పష్టముగాఁ జెప్పినట్లయ్యెను. అస్మానుని యోర్పునకు మేర లేదు. పరాక్రమము, సాహసము, వీరత్వము, నాతని కడసంపూర్ణముగనుండెను. సర్వసామాన్యముగా నామహాగుణములతో సహనము చిరవిరోధమును గలిగియుండును. కాని యస్మాన్‌ఖానునిహృదయక్షేత్రమునమాత్రము పరస్పరవిరోధగుణములు స్వేచ్ఛగా,వర్ధిల్లుచుండెను. అయేషాప్రేమ వ్యాపారమునందు,. అస్మాన్‌ఖానుని యసాధారణసహిష్ణుతాగుణసంచయము నిత్యమును మనకుఁ గాన్పించుచునేయున్నది. ఇప్పుడును నస్మాన్‌ఖా నసాధారణమైనయోర్పుతో స్థిరభావమును దాల్చియుండెను. ఆతఁడుచాలసేపు నీరవుఁడైయుండి పిదప నీవిధముగఁ బ్రత్యుత్తరమిచ్చెను.

"వంగదేశపుసుబేదారగు నోమానసింహబహదూర్! నేను మీతో వాదములాడుటకురా లేదు. మీవంటివారితోడి వాగ్వాదము నాకుశోభింపదు. అనేకమహావిషయములనుగూర్చి మీతో నాలోచింపవలయునని నాకభిలాషకలదు. అవి యుభయులకు నిష్టానిష్టసంబంధమును గలిగియున్నవై యున్నయవి. కాని దౌర్భాగ్యవశమున మీరిప్పు డేభావముతో మాటలాడఁబ్రారంభించిరో యాభావమును దెలిసికొనినపిదప మీతో నావిషయములనుగూర్చి యాలోచించుట యుక్తముకాదని తోఁచుచున్నది. నేనిప్పుడే మీశిబిరమునుండి వెడలిపోవుచున్నాఁడను. కాని మీకడ సెలవుఁగైకొనుటకుఁబూర్వము మీతో నొకమాట చెప్పుటకు బాధ్యుఁడనైయున్నాఁడను. ఆవిషయము నాగృహకృత్యసంబంధమైనది. దానిని వెల్లడిసేయుట సిగ్గులచేటు. అయినను ధర్మమును, వివేకమును, న్యాయపరతయు, మీ

కావిషయమును దెలియఁ జేయ నన్నువేవిధముల పురికొల్పుచున్న వి. అందుచే దానిని మీకెఱింగించుట నాప్రధానకర్తవ్యము. మీ రుదానిని విననిష్టపడియెదరా? ”

మా—మీరు చెప్పునది వినుటకు నాకాక్షేపణమేమియును లేదు. మీతో నేవిధమునను విరోధమును తెచ్చిపెట్టుకొనవలయు ననునభిప్రాయము నాకు లేదు. మీరు నాతో సఖ్యభావమునువీడ కుండ నుండుట వివేకకార్యమని మీకుఁ బదింబదిగఁ జెప్పుచున్నాఁ డను.

అ—ఆసంగతులన్నియు నిప్పుడువలదు. అప్రియకరములగు నామాటలనుగూర్చి యాలోచించుటకు నాకిప్పు డిష్టము లేదు. నేను మిమ్ముల నొకవిషయమునుగూర్చి యడుగఁదలఁచినాఁడను. మీరు మీతనయుఁడైన జగత్సింహునకు యావజ్జీవకారాగారవాసశిక్ష వి ధించియున్నారు. ఆవీరపురుషున కేకారణమువలన నట్టిశిక్షవిధించి రో యాకారణములలో నవాబునందినియగు నయేషాప్రణయప్రకా శముకూడ నొకకారణముగాఁ గైకొనిరని వినియున్నాఁడను. అది స త్యమేనా ?

మానసింహుఁడు కొంచెము వెనుకముందుచూచి పిదప “ అ యేషాయందనురాగియై యామెహృదయమునఁ బ్రేమోత్పాదన మొనరించుట జగత్సింహునియపరాధములలో నొకమహాపరాధమే యగును. కాని యాయొక్కయపరాధమునకే యాశిక్ష విధింపఁబ డలేదు. అతఁడవిధేయుఁడై రాజకార్యములయందశ్రద్ధను చూ పినాఁడు. మరియు శత్రువులతో స్నేహసూత్రమున బద్ధుఁడైనాఁ డు. అవియన్నియు గొప్పయపరాధములు. అందుచే నాతని కా దండన విధింపఁబడినది ” అనియెను.

అ—ఆతనికి విధింపఁబడినదండననుగూర్చిగాని, శిక్షయొక్క యుక్తాయుక్తములనుగూర్చిగాని, యాతఁడు చేసినకార్యములనుగూర్చిగాని, వానియందలి ప్రయోజనమునుగూర్చిగాని మాటలాడుటకు నాకిప్పు డేమియు నధికారములేదు. ఆసంగతులన్నియు నాకుఁ దెలియును. అందుచే వానిని విని, వానినిగూర్చి మాటలాడినందువలన నాకేమియుఁ బ్రయోజనములేదు. జగత్సింహుఁడు నాకు శత్రువు. అనేకకారణములచే నేనాతనిహితమును గోరను. కాని నీచమానవులవలె నిష్కారణముగ శత్రుపున కధఃపతనముగలుగుచుండ నేను చూడఁజాలను. ఏమనుష్యుఁడైన నితరుఁ డపరాధములేనిదే నిర్నిమిత్తముగా దూషితుఁడగుచుండఁజూచి యూరకుండఁగలఁడా? అందుచే నారహస్యమును మీకుఁ దెలుపనుద్యుక్తుఁడనైతిని.

మహా—మీయభిప్రాయమును స్పష్టముగాఁ జెప్పవచ్చును.

అ—అయేషాప్రణయసంబంధమున జగత్సింహుఁడు సంపూర్ణముగా నిరపరాధి. మనోవాక్కాయకర్మములచే నాతఁ డెప్పుడు నయేషాయందుఁ బ్రణయమును గనఁబరుపలేదు. అయేషా తనంతటతానే యాతనియెడ ననురాగిణియైనది. ఆప్రణయవృత్తాంతము నయేషావలన వినినపిమ్మటఁగూడ నాతఁ డెప్పుడును తనహృదయమున నామెప్రేమకుఁ దావీయలేదు. ఒక్కదినమునందైనను ప్రణయసూచకములగుమాటలాడి, అయేషాయుత్సాహమునాతఁ డభివృద్ధిపరుపలేదు. జగత్సింహుఁడు నాకుఁ బరమశత్రువైనను సత్యముకొఱకును న్యాయముకొఱకును, ధర్మముకొఱకును నేనీమాటలను మీకుఁ దెలుపుటకు బాధ్యుఁడనై యున్నాఁడను. నేనాకర్తవ్యమును నిర్వహించి నామనోభారమును దీసివేయఁగలిగితిని.

మహా—అట్లయినచో మీకు జగత్సింహునితో ద్వంద్వయుద్ధ

మేలసంప్రాప్తమైనది ?

అస్మాన్‌ఖాను లజ్జాయుక్తమగుచిఱునగవుతో " ఆవృత్తాంతమునుగూడ మీరు తెలిసికొంటిరా ? మేలేమైనది. అయేషానాజీవనమునకు ధృవతార. అయేషాను లక్ష్యమునందుంచుకొని నేను ప్రాణములను నిలుపుకొనుచున్నాఁడను. కాని, అయేషాహృదయము జగత్సింహునితో సంపూర్ణముగా నిండియున్నది. ఆహృదయమునం దీనిర్భాగ్యున కించుకంతయును తావులేదు. అందుచే జగత్సింహుఁడు నాకు వధ్యుఁడు. పరమశత్రువు. జగత్సింహుని పేరి ప్రపంచమున విలుప్తమైపోయినచో నయేషాహృదయమునం దేమియును లేకపోవును. అప్పుడాస్థానమున నాకించుకతావు దొరకఁగలదు. ఇదియే తుదియాశ. ఆయాశను నాహృదయముననిడికొని ప్రాణధారణము సేయుచున్నాఁడను. జగత్సింహు నాద్వంద్వయుద్ధమునఁ బరాజయము నొందింపలేకయేపోయితిని. మంచికాలముసంప్రాప్తమైనప్పు డాతనిని నాశనము చేయవలయునని నాసంకల్పము. జగత్సింహుఁడు యావజ్జీవము కారాగారమునఁదుండునేని నామనోరథము నీడేర్చుకొనుటకు సమయము దొరకదు. ఆతఁడు జీవించియున్నచో నయేషా యాతనిని మఱచిపోవుననునాశ నాకు లేదు. జగత్సింహునిమరణమే నాకు వాంఛనీయమైనది.

మా—మీశత్రుత్వము మిగుల నద్భుతమును గలుగఁజేయు నదిగ నున్నది. మీశత్రువుపై నారోపింపఁబడినమిథ్యాపవాదమును పోఁగొట్టి యాతనినిర్దోషతను సప్రమాణముగ ధృవపర్చితిరి. అట్లయ్యును నిత్యము నాతనిమరణము మిగులనాత్రముతో నెదురుచూచుచున్నారు.

అ—ధర్మశాసనము, స్వార్థప్రయోజనము, ఈ రెండు ప్రవృ

త్రులకును వశవర్తనుఁడనగుటచే మీావిచారణవిషయమున మిగుల భీతిల్లుచున్నాఁడను. కాని, యీమాటలతో నిప్పుడు ప్రయోజనము లేదు. నేను చెప్పవలసినది పూర్తియైనది. ఇఁక సెలవుఁ గైకొని యెదను.

మా — రాజకీయవిషయమున నొకటిరెండుమాటల నడిగెదను. మీావలన నేను తెలిసికొనవలసినయంశములున్నవి. మీాకాతిథ్యసత్కారములను జేయవలయునని నాకభీష్టముగలదు.

అస్మత్ఖాను సింహాసనమునుండి లేచి "రాజకీయవిషయమునఁ బత్రికనుగాని, దూతనుగాని పంపినచోఁ గార్యము నెరవేరఁగలదు. మిగిలియున్న దాతిథ్యవిషయము—ఎవరు హుకుమునకుదాసులో యట్టివారివిషయమున శిష్టాచారములను నడపక పోయినను హానియుండదు. నేనిప్పుడే వెడలిపోయెదను" అనియెను.

అచ్చటనున్నవారికందఱకును "సలాము" చేసి గౌరవించి యస్మత్ఖాను మండపమునుండి వెడలిపోయెను.

మానసింహమహారాజు, రామచంద్రమహారాజు, మిగిలినమిత్రులు మొదలగువారందఱును "పఠానులకును మొగలాయీలకునుగలసంధి కవసానము సంభవించుటకిఁక నెంతయోకాలము పట్టదు" అని యనుకొనిరి.

మానసింహుఁ డించుకయుద్విగ్నచిత్తముతో సభనుముగించి జగన్నాథస్వామికి హారతిసమర్పించుటకై పోవుప్రయత్నము చేయఁ జొచ్చెను.

## నవాబు సందిని.

## పదునైదవ ప్రకరణము.

---

మానసింహుఁ డోరిస్సాదేశమునుండి వెడలిపోయెను. స్వర్ణదుర్గమునందున్న నవాబగు నస్మాన్ఖానునకు సర్వవృత్తాంతములును తెలిసినవి. నవాబుయొక్క గుప్తచారులు చెట్టుచెట్టునందును గుట్టగుట్టయందును నివసించియుండిరి.

నవాబు మానసింహమహారాజునుజూడవలయునని పోయియుండెను. కాని యందలిఫల మేపక్షమువారికిని సంతోషజనకముగా లేదు. నవాబు మహారాజునుజూచుటకు పూరికివెళ్లినపిదప మహారాజోరిస్సానువిడిచి వెళ్లుటకుఁబూర్వము మహారాజొకనాఁడువచ్చి నవాబునుజూడవలసియున్నదనియు, నట్లుచేయనిదే యోరిస్సానుండి వెడలిపోవుట సరిగానుండ లేదనియు, నదిపఠానులహృదయమునకుఁ జాల బాధాకరముగ నుండెననియు వేఱుగఁ జెప్పనక్కరలేదు.

అస్మాన్ఖానునకు సంధినియమములను కొలఁదికాలములోనే భంగముచేయవలయునను నభిప్రాయముకలిగెను. అవమానజనకములగు నాకార్యములకు సహించికొనుచు సంధిని సంరక్షించుట యసంభవము. సామాన్యముగా జనులందఱును పఠానులే సంధికి భంగముకలుగఁజేసిరని యనుకొందురని యస్మాన్ఖానెఱుంగును. కాని ప్రకృతప్రస్తావమున మానసింహమహారాజే సంధినియమములను విచ్ఛేదముచేసెనని చెప్పెదరు.

నవాబు రణసన్నాహములనన్నింటిని జేయుచుండెను. యుద్ధమున జయముగలిగినను, అపజయముగలిగినను సరియేకాని యుద్ధముచేయనిదే మాత్రము మొగలాయీలయధికారము నంగీకరించుట

కె స్మాన్ఖానున కిష్టము లేదు. ఆతఁడా విషయమున విశేషప్రయ త్నములను జేయుచుండెను. ఆతనినూతనామాత్యుఁడు నావిషయమున నధికముగ శ్రమపడుచుఁ బనిసేయుచుండెను.

దుర్గమునందలి యొకప్రాసాదమున నస్మాన్ఖానొక్కఁడును గూర్చుండి యేదియో యోచించుకొనుచుండెను. ఇంతలో నాప్రాసాదమునకుఁ జేరియున్న యంతఃపురద్వారము తెఱవఁబడియెను. లోపలినుండి "ఇప్పుడు నవాబుగారొక్కరే కూర్చుండియున్నారు. ఒక్కింతసేపు నేను నవాబుగారిసన్నిధికి రావచ్చునా ?" అనియెవరో యడిగినట్లయ్యెను.

అది యయేషాకంఠస్వరము. అయేషాయొకదినమునందైనను లోపలిమహాలునువీడి యివ్వల కాలుఁబెట్టియుండలేదు. ప్రతినిమిషమునను మనసునందామెను ధ్యానముసేయుచున్న యస్మాన్ఖాను సైత మామెనుచూచుటకు లోపలకుఁ బోయి యామెకు విరక్తి కలిగించుటకు భయపడుచుండెను. అట్టియయేషా యిప్పుడు తనంతట తానే యొంటరిగవచ్చి యస్మాన్ఖానుని చూడనిష్టపడుచుండెను. అస్మాన్ఖానా కంఠస్వరమును వినినతోడనే చకితుఁడై "అయేషా ! వచ్చిచూచుట కనుజ్ఞను వేఁడుచున్నావా ? నేఁడేమియాశ్చర్యమైన మాట ! చూడవలసినయావశ్యకమేయున్నచో నీవు స్మరించినంత మాత్రమున నీసన్నిధినుండనా ? రమ్ము. ఇచ్చట మఱెవ్వరును లేరు" అనియెను.

నవాబులేచి ద్వారముకడకేగెను. అయేషాయును నవనతశిరస్కయై యాగదిలోని కరుదెంచెను. నవాబాగది తలుపును తానే మూసివచ్చి" అయేషా! ఇదేమి! నాయదృష్టము. నీవిచ్చటకువచ్చుటెందులకు? ఎవరిచేనైన నించుకవర్తమానమంపినచో నేనేవచ్చి

యుండునుగదా! నీవు తొందరపడి యిట్లువచ్చుటకుఁ గారణమేమి?” అనియడిగెను.

అయేషావదనము విషాదపూరితమైయుండెను. ఆమె దీర్ఘనిశ్వాసమునువిడిచి యవనతముఖియై “రావలయుననివర్తమానమంపినచో నీకుఁ దొందరకలుగదని యెఱుంగుదును. కాని యనేకవిషయములనాలోచించి నేనే నీకడకు వచ్చితిని. నేనెప్పుడును నిన్నుస్మరించుచుండుట లేదని నీకు జ్ఞప్తియందున్నచో నంతియేచాలును. అట్లుకానిచో నీకు విషమభ్రమకలుగును. ఆమాటలవలన నిప్పుడు ప్రయోజనము లేదు. నీకొక్కమాట చెప్పవలయునని వచ్చితిని.” అనియెను.

అస్మాన్—చెప్పుము. నీమాటలను వినుటయన్న నాకుఁ బరమానందము. నిలుచుంటివేమి? ఇచ్చటఁ గూర్చుండి చెప్పవలసినదానిని చెప్పుము.

అయేషాయును పీఠమునధిష్ఠించెను. నిలుచుండిమాటలాడినచో మెదడుసరిగానుండదనియోచించి పీఠముపైఁ గూర్చుండెను. కూర్చుండి మౌనయై జారిపోయిన మేలుముసుంగును రెండు చేతులతోడను సవరించుకొనఁదొడంగెను. అస్మాన్ కొంచెము సేపాగిపిదప “చెప్పుము! అయేషా! చెప్పుము. ఏమి చెప్పవలయుననివచ్చితివో, దానిని చెప్పుము” అనియెను.

అయేషాయును పట్టుకొనిన మేలుముసుంగునువిడిచి “నీవుకొన్ని దినములనుండి రణసంబంధములగుప్రయత్నములను విశేషముగఁ జేయుచున్నాఁడవు. అనర్థకమైనమాటలను నీతోఁ జెప్పుటకిప్పుడు సమయముకాదు. నేను చెప్పవలసినమాటలను మఱియొకప్పుడు చెప్పెదను” అనియెను.

అస్మాన్—“అయేషా! నీవిప్పుడు చెప్పకపోయినచో నన్నతి

కష్టములలోఁ దోసినదానవగుదువు. నీవు చెప్పునది సంపూర్ణముగా సనర్థమును కలుగఁజేయునదియైనను దానిని చాల సార్థకమైనదిగా నే ను దలంచెదను. ఎట్టిపనులున్నను వానినన్నిఁటిని రసాతలములోని కిణఁగఁదొక్కి నీమాటలను వినుటకెప్పుడును నేను సిద్ధముగానుందు ను. ఆవిషయమునెఱిఁగియుండియుఁ జెప్పవలసినదానిని జెప్పక నీవి ట్లనుమానించెద వేమి?

అయేషయు నెడమచేతితో నల్లని జీర చెఱఁగును బట్టుకొని కు డిచేతితో దానిని మెలివేయనారంభించెను. నోటినుండి మాట వెడలుట చాల బాధాకరముగనున్నట్లు తోఁచుచుండెను. అస్మాన్ ఖాను "చెప్పు ము. అయేషా! చెప్పఁదలచినదానిని చెప్పుము. నీవు చెప్పునది శుభమైన నశుభమైన దానిని వినుటకు నేను మిగులనువ్విళ్లూరుచుందును" అనియెను.

ఆయేషాయును చీరచెఱఁగును విడిచి "నీవు నాపైఁజూపుచున్న యనుగ్రహమునకు మేరలేదు. దానిని బోలునది మఱియేమియును లేదు. కాని, నేను నీకేమియు నుపకారమును జేయలేక పోవుచున్నదాన ను" అని చెప్పియూరకుండెను.

అస్మాన్—అయేషా! నేను నీపై నెట్టియనుగ్రహమును జూ పియుంటినో నేనెఱుంగను. కాని నీవు నన్ను నీహితైషినిగ భావించుట యే నాకుఁ బరమసౌభాగ్యము. కాని, దానికొఱకు "నేను నీకు కృత జ్ఞురాలనై యుందును" అని చెప్పుట సరికాదు. నీవు నాకుఁ బరమహితై షిణివి. నీవీనవాబునియంతఃపురమునకలంకారమవు. నీవందఱకును ప కారిణివై యుంటివి. అట్టినీవిప్పు డిట్లేల నుడివెదవు?

అయేషాయవనతముఖియై "అకృతజ్ఞతాధీనంబులైన యీ దేహప్రాణంబులతో నిచటనుండరాదని తలంచుచున్నదానను." అ నియెను.

అస్మాన్ లేచినిలుచుండి యార్తస్వరముతో "నీవిచటనుండకుండుటకే యోచించినచో, బలవంతముగా నిన్నిటనుంచుకొనుటకెవరికి సాధ్యము ? నాకిష్టముండెనేని నీప్రయత్నమునకభ్యంతరముకలుగఁజేయఁగలను. అట్టియభ్యంతరముమాట యట్లుండనిమ్ము. నీయిష్టమునకు విరుద్ధముగా నేకార్యముచేయుటకును నాకుమనసొప్పదు. అయేషా! నీవిప్పుడు నాతోఁజెప్పవలసినమాటయిదియా! నీవిచ్చటలేకపోయినచో మఱియెవరుందురు? నీవిచ్చటనుంటివిగనుకనే యధముఁడగునీయస్మాన్సుఖానింకను ప్రాణములతోనుండఁగలిగినాఁడు. నాదురదృష్టముచే నిన్నుఁబొందఁజాలకున్నాఁడను. కాని, యింకను నాకాయాశపోలేదు. ఈదేహమునఁ బ్రాణములున్నంతవఱకు నీయనుగ్రహమునుపొందగలుగుదుననునాశ నన్నువీడదు. నాహృదయమునందాయాశ నెల్లప్పుడును పోషించుకొనుచున్నాఁడను. ఆయాశయే నాపరమసుఖమునకుఁ గేంద్రస్థానమై యున్నయది. అస్మానునియాయాశాలతను తుంచివేయుట నీకానందమా ? —అయేషా! ఆతనియావద్హృదయమును సంపూర్ణముగాఁ జూర్ణముసేయుటెందులకు? అయేషా! మమ్ములనువీడి మఱియెచ్చటకుఁబోయెదవు ?" అనియెను.

అయేషా ప్రత్యుత్తరమునొసంగుటకుద్యుక్తయై "అస్మాన్ !" అనియెను. ఆమెకంఠస్వరమించుక వికృతమయ్యెను. ఇంచుకసంక్షుభితమయ్యెను. ఆమె కొంచెముసేపూరకుండి మరల మాటాడనారంభించెను. "అస్మాన్ ! నీహృదయముమిగుల మహత్తరమైనది. అత్యుదారమైనది. నీవలపును నసమానమైనది. మానవలోకమునందంతట నదిదుర్లభమైనది. కాని—" అని చెప్పి యయేషామరల నూరకుండెను.

అస్మా—(ఆతురముతో) "కాని, యనఁగానేమి? అయేషా!

అయే— కాని దురదృష్టవశమున నీవు నన్నుఁ బ్రేమించి నీ మనస్సును కేవలము తాపమునకు గుఱిచేసికొనుచుంటివి. ఈపాపాణమును బ్రేమించి నీవు నిరంతరము ననేకయాతనలపాలఁబడుచున్నాఁడవు. ఈయభాగిని నీసమక్షమునుండి యంతర్హితమైనచో మనయిరువురకునుగూడ శుభమనియే తోఁచుచున్నది.

ఇట్లు చెప్పి యామె యూరకుండెను. అస్మాన్‌ఖానాహ్వాదయవిదారకవాక్యముల నతిధీరభావముతో విని చాలసేపు మౌనమును దాల్చి యూరకుండి పిదప నిట్లు చెప్పనారంభించెను. "అయేషా! కాతరుఁడగు నీతనిపాణోత్క్రమణావస్థపాలు సేయుటవలన నీకుఁ గలుగులాభమేమి? ఏభవనమందయేషావసియించియున్నదో, ఆభవనమున్ననే యీయధముఁడును వసించియున్నాఁడు. ఆతని కదిగూడ నొకపరమానందకరవిషయమైయున్నది. అయేషా! ఆనాయానందమును హరింపఁజేయుటవలన నీకుఁ గలుగులాభమేమి? ఇష్టమైనప్పుడు దూరమునుండియే యయేషానుజూడఁగలను. లేదా దూరమునుండియే యయేషాకంఠధ్వనినివినఁగలను. అదినాకుఁ బరమసుఖదాయకము. అయేషా! నన్నాసుఖమునుండి వంచించుటవలన నీకగునుపకారమేమి?"

అయే—అస్మాన్! నీవుధీరుఁడవు. బుద్ధిమంతుఁడవు. ధీరభావముతో యోచించిచూడుము. దానివలన నుపకారముకాఁగలదు. అదర్శనమువలనను దూరమునందుండుటవలనను నీకష్టములకుఁ గారణమైనదానిని నీవు మఱచిపోఁగలవు.

అస్మాన్—(నవ్వుచు) ఎంతటిభ్రాంతి! అయేషా! చూడకపోవుటవలనను, దూరమునందుండుటవలనను ప్రణయాస్పదులనెప్పుడైన మఱచిపోవుట తటస్థించునా? ఈనగరమునందున్నను నేనెప్పుడు

ను నీసన్నిధికి వచ్చియుండలేదు. వంగదేశమునుండి తిరిగివచ్చినపిదప నేను నిన్నొక్కసారిమాత్రమే చూచియుంటిని. అంతకాలము నీదర్శనలాభములేకపోయినను నాహృదయమునకించుకంతయును నేపరివర్తనమును గలుగలేదు. అట్టిపరివర్తనమేయున్నచో నీవు ప్రేమించుచున్నవానిని చూచి చాలకాలమైనదిగదా—నీవాతనిని మఱచిపోలేదేమి?

అయే—పురుషులకనేకములగు నవలంబనములును, ననేకములగులక్ష్యములును ననేకములగుకాంక్షలు నుండును. వనితలకుఁ బ్రేమయొక్కటియే యాటవస్తువు. వారనాయాసముగాఁ బ్రేమబంధము నల్లుకొనఁగలరు—నేను ధైర్యముతోనుంటిని. అంతియేగాక భగవంతుని బ్రార్థించుచుంటిని. నీవీపాషాణస్త్రీని సులభముగా మఱచిపోవుదువుగాక!

అస్మా—దురాశ—అయేషా! అదియొకదారుణదురాశ. నాయీయాకాంక్ష నాసమాధిమృత్తికతోఁ జేరిపోయినప్పుడేమో చెప్పఁజాలను—కాని యీశరీరమునందు శ్వాసమాడుచున్నంతవఱకు నిన్నుమఱచిపోవుదు ననునాశ నాకులేదు. మొట్టమొదటనే చెప్పియున్నానుకదా! ఆశయే నాకు బలమునుకలుగఁజేయుచున్నది—నేను దానిని ప్రయత్నపూర్వకముగఁ బోషించుచున్నాఁడను. దారుణతాపముచేఁ బాషాణముకూడ కరగిపోఁగలదు. ఈశ్వరసంకల్పముచే మరుభూమియందును సముద్రముద్భవింపఁగలదు. అయేషా! ప్రాణములతో జీవించియున్నచో నొకప్పుడైన నస్మాన్ ఖానునిప్రేమప్రగాఢతను గ్రహింపఁగలవు. అస్మానుని ప్రేమించుట కిష్టమున్నదానవైన నగుదువు. అప్పుడీయదృష్టవంతుఁడు ధన్యాత్ముఁడు కాఁగలఁడు.

అయేషా — నీప్రేమ మిగుల మహత్తరమైనది. అత్యుదారమైన ది. అతిప్రగాఢమైనది. ఆవిషయమును నేను మొదటనే చెప్పియుం టిని. నేను దానిని గ్రహింపలేదని యనినచో నీవు నాహృదయము ను సరిగాఁ దెలిసికొనలేదని యర్థము. నీనిమిత్తమైనాప్రాణములను విడుచుటకుసయితముసిద్ధముగానున్నాను. నాప్రాణముత్సర్గీకృతమై పోయినది. నివేదితమైనపదార్థమును తిరిగి దానముచేయుటకు నాక ధికారములేదు. దేనినిచ్చివైచితినో దానిని తిరిగి గ్రహించుటకు నాకుసాధ్యముకాదు. సుఖముగానీ — దుఃఖముగానీ — నేనుమనస్సునం దైనను ద్విచారిణినిగాఁజాలను. అస్మాన్! నీవు మొదటినుండియు న న్ను క్షమించుచున్నాఁడవు. ఇప్పుడును నన్ను క్షమింపుము. వ్యర్థము గా నీయభాగినిపైనాశచే నీసుఖమునకు భంగముకలుగఁజేసికొనవల దని, నిన్ను వినీతభావముతో వేఁడుకొనుచున్నదానను. మఱియు నా దొకప్రార్థన. నీకిష్టమైనకన్యనువరించి నీజీవనమునుసుఖమయముగాఁ జేసికొనుము. నిరర్థకముగా నీఘనిని నాసించి ముగ్ధుఁడవై లోకోపకా రమునకుఁబ్రయోజనకరమైననీజీవనమును ధ్వంసముచేసికొనకుము.

అస్మాన్ — అయేషా! నాజీవితమరణములయందు నీవు నాకుఁ బూజనీయవు. నిన్నుఁబొందజాలకపోయినను — ఇదివఱకు నాయాత నను నెమ్మదిగసహించుకొనుచువచ్చినట్లే — ఇఁకముందునుసహించు కొనఁగలను. కాని, యొకతుదిప్రయత్నమునుచేసి చూచివిడిచెదను. నీవెవనినిప్రేమించుచుంటివో, ఆభాగ్యవంతునినాస్వహస్తములతో వ ధియించెదను. పిదప నీవు స్వతంత్రవుకావచ్చును. అప్పుడు నేను నీ యనుగ్రహమునకుఁ బాత్రుఁడనైనను గావచ్చును. అప్పుడునునామ నోభీష్టము సిద్ధింపకపోయినచో నస్మాన్ఖానుని ప్రతిద్వంది నాశన మైపోయెనుగదా యను సంతోషముతో సుఖనమ్యెదను.

అయేషా — ఈప్రపంచమునందమంగళప్రవాహమును వృద్ధి నొందించుటకై అయేషా జన్మించినట్లు తోఁచుచున్నది. నిన్ను నేను మిగులఁ బ్రేమించుచున్నదానను. నీవు సుఖివై యుండఁ జూడవలయునని నాయాశ. అదియే నాప్రధానప్రయత్నము. కాని, విధాత యీయభాగినియదృష్టమునం దాసౌభాగ్యమును వ్రాయ లేదని తోఁచుచున్నది. నేను చెప్పఁదలఁచినది సమాప్తమైనది. ఇఁక సెలవుగైకొనియెదను. ఈజీవితమునందు మరల నిన్నుఁ జూడఁజాలనని తోఁచుచున్నది. ఒకవేళ నెప్పుడైనను నీకు విశేషాపదసంభవించినప్పుడు నావలనఁ గలుగునుపకార మేదైన కలదేని నేనప్పుడువచ్చెదను. దానిని దెలిసికొనుము. సోదరా! అస్మాన్! నన్ను దుఃఖిని యగునీసోదరినిగా భావింపుము. వలదు. వలదు. వలదు — సర్వప్రయత్నములచేతను నన్ను మరచిపోవ యత్నింపుము.

అస్మాన్ఖానధోముఖుఁడై యయేషా చెప్పుచుండెడి హృదయవిదారకవాక్యములను వినుచు భయానకములగునానావిధకల్పనలయందు ప్రమత్తుఁడై యుండెను. ఆతఁడు తలయెత్తి చూచునప్పటి కయేషా యచ్చట లేదు. అస్మాన్ఖాను నిట్టూర్పుపుచ్చి రెండుచేతులతోడను శిరసును బట్టుకొని "ఓహో!" అనియనుకొనియెను.

మొదటిభాగముసంపూర్ణము.

శ్రీరామచంద్ర.

# న వా బు నం ది ని.

## ద్వి తీ య భా గ ము.

### మొదటిప్రకరణము.

జగత్సింహుఁ డెచ్చటనున్నాఁడు? పాట్నానగరమునందలి లోహకారాగారమున సంకెలలచే బంధితుఁడై పడియున్నాఁడు. అట్లుండిన యాపౌరుషశాలి ప్రణయసంబంధమయినయొకస్వప్నమును గాంచెను. కారాగారమంతయు గాఢాంధకారమయము. శృంఖలములచే నిబద్ధుఁడైయున్నయావీరుఁ డొకచాపపైఁ గూర్చుండియుండెను. అత్యంతకఠోరమైన యీదుర్దశ కవసానములేదా? ఆతఁడిఁక నెన్నఁడును సూర్యచంద్రులను చూడఁజాలఁడా? అయిన నాతనిజీవనసర్వస్వమైన తిలోత్తమతో నొకసారియైనను మరలఁ గలసికొనకుండునా? ఆకారాగారాంధకారమున నాతనిజీవితము సమాప్తమై పోవునా? ఎల్లయాశలకు నదియేతుదియా?

ధైర్యముతో నిరీక్షించినచో నీదుర్దినము నిజముగా దూరమై పోఁగలదు. జగత్తునం దెప్పుడెచ్చట నెవ్వరికి దుర్దినములు చిరస్థాయిగా యున్నవి? అని మధురభాషిణియైనయాశాదేవత యాతని చెవియం దూఁదెను. జగత్సింహుఁడు గడచిపోయినతనజీవితచారిత్రమును జ్ఞప్తికిఁదెచ్చుకొని యోచించిచూచుకొనియెను. అత్యల్ప

కాలములో నాతనిస్థితియం దెట్టివిపర్యయములు సంఘటిల్లినవి ! ఆ తఁడు వానినన్నిఁటి నతిక్రమించి మరల సౌఖ్యముల ననుభవింప లేదా ? మరల లక్ష్మి సంప్రాప్తముకాదా ?

అతనికష్టసుఖములనుగూర్చి యోచించువా రెవ్వరు ? అతని యాక్లేశభారమునువహించి హృదయవేదననను భవించువా రెవ్వరు? తనవిపద్వార్తనువిని తిలోత్తమ యత్యంతచింతాభరాక్రాంతయగు ననియు, నాబాలిక యెట్టియాతనలననుభవించుచున్నదోయనియు, రుణమైనదుశ్చింతచే నామె హృదయశరీరము లెట్లువసన్నములైపో యినవో యనియు నాతఁ డాలోచించుకొనియెను. ఆదురవస్థయందుఁ దనకష్టముకంటెఁ దిలోత్తమనుగూర్చినచింతయే జగత్సింహునకు మిక్కిలి బాధాకరమయ్యెను. ఎవరివలననైనను దిలోత్తమసమా చారము వినివచ్చినను, ఎవరినోటనైనఁ దనకుశలవార్త తిలోత్త మకుఁ దెలియచేయఁగలిగినను, జగత్సింహుఁడు కొంతవఱకు నిశ్చిం తుఁడై యుండును—ఆతనికిఁ గొంచెము శాంతియు, సుఖమును గలి గియుండును. కాని, దాని కుపాయమేది ?

జగత్సింహుఁ డీపరిక్లేశముచేతను, చింతచేతను, దినములను జరుపుచుండెను. దినములపై దినములు సాగిపోవుచుండెను. కాని యాతనియాశ లేమియు ఫలింపలేదు. ఫలింపకున్నను, ఆశమాత్ర మాతనిని విడిచిపోలేదు. నిద్రలేకుండ సర్వదా చింతతోడనే రా త్రులు జరగిపోవుచుండెను. అతిక్లేశముచే—చేయుటకుపనిలేకుండఁ గనే—పగలుగడచిపోవుచుండెను. కాని, యాశమాత్రముపోవుట లేదు.

ఒకదినమునఁ బ్రాతఃకాలమునందు జగత్సింహున కించుక కునుకుపట్టెను. రాత్రియంతయును దిలోత్తమకొఱ కత్యంతము

చింతించుటచే నలసియున్నయాతని నేత్రములప్పుడే కించుక మూతపడియెను. కాని యతఁడాయవస్థయందైనను నిశ్చింతుఁడై సుఖము ననుభవింపలేదు. ఆస్వల్పనిద్రయందును తిలోత్తమసంబంధమైనయ స్పష్టోద్వేగము క్షీణభావముతో నాతనిహృదయవీథికి వచ్చుచుండెను.

ఇంతలో నాకస్మికముగఁ గారాగారపుటినుపతలుపును తట్టు ఘర్ఘరశబ్దము జగత్సింహునకు వినవచ్చెను. కాని, యాతని కాశబ్దము వేఱుకేతిగఁ దోఁచెను. అత్యంతకఠోరమైన యాశబ్దమాతని కర్ణములకుఁ దిలోత్తమ మంజీరసంబంధమగు మధురధ్వనివలె వినఁబడియెను. నిద్రావివశతచే ముద్రితనయనుఁడైన యాతఁడు "ప్రియతమయగుతిలోత్తమ కుసుమమాలను హస్తమునఁదాల్చి నవ్వుచునవ్వుచు ముందునకు జరగి తనయొద్దకు వచ్చినట్లును, తాను "నీయిష్టానుసారముగఁ గత్తినివిడిచిపెట్టితిని. పుష్పమాల తిరిగి తెగిపోవునన్నభయములేదు." అని చెప్పినట్లును నొకస్వప్నమునుగాంచెను.

తెఱవఁబడినమార్గమునఁ గారాగారరక్షకుఁడు లోపలకువచ్చి రాజపుత్త్రునిశయ్యకడనిలుచుండి మధురస్వరముతోఁగూడిన సంభ్రమముతో "యువరాజా!" అని పిలిచెను.

కారాగారరక్షకుఁడు పిలిచినశబ్దమాతనిచెవినిఁ బడెను. కాని, దానినాతఁడు వేఱుభావముతో గ్రహించెను. తిలోత్తమ "ప్రాణేశ్వరా!" అని పిలిచినట్లాతనికి వినవచ్చెను.

కారారక్షకుఁడు మరల "యువరాజా!" అనిపిలిచెను.

రాజపుత్రుఁడు "పోవలదు. పోవలదు. భయమేమి?" అనిపలుకుచు నుద్వేగముతో శయ్యనుండి లేచి నిలుచుండిచూచెను. ఎదురుగ నప్రియమైనకారాగారరక్షకునిమూర్తి గనఁబడియెను. తిలో

త్తమయెక్కడ? ఏసుందరికాపదలు సంభవించెనని తెలిసి తాను పరు వెత్తమొదలిడెనో, యాతిలోత్తమయేది? పిదప జగత్సింహునకుఁ బ్రకృతస్థితి గోచరమయ్యెను. ఆతఁడు విసుఁగుకొని మనసునందు "అకటకటా! స్వప్నమందైనను సుఖమునుభవించుట కీనిర్భాగ్యుఁడు నోచిపుట్టలేదుకాఁబోలు!" అని యనుకొని కాతరభావముతోఁ జదికిలఁబడియెను. కారాగారరక్షకుఁడు వినీతభావముతో నాతనికి వందనము చేసెను.

జగత్సింహుఁడు నేత్రములను తుడుచుకొని "కారాగారరక్షకా! తెల్లవారునప్పటికే నీవు తెచ్చినసమాచారమేమి?" అని యడిగెను.

కారా—(వినయముతో) మీరు కారాగారమునకువచ్చిన యొకటిరెండు దినములలో నొకసన్యాసివచ్చి యప్పటినుండియు మిమ్ములను జూడవలయునని ప్రయత్నించుచున్నాఁడు.

జగ—సరియే. తరువాత?

కారా—మీదర్శనముకొఱ కాతనిని లోపలకు రానిచ్చుటకు నేను సాహసింపఁజాలకపోయితిని.

యువ—అట్లయినచో నామాట నాకుఁజెప్పుటెందులకు?

కారా—ఆసన్యాసి యిప్పుడువచ్చి "చూచుటకునన్ను లోపలకుఁ బోనీయవైతివేని, ఆసంగతి మహారాజునకుఁ దెలిసి యాతఁడు మిగులవిరక్తుఁడగును. మఱియు రాజకార్యమునకు విశేషహాని సంభవించును." అని చెప్పుచున్నాఁడు.

యువ—నేనేమి చేయవలసియున్నది?

కారా—ఆతనికి దేవరసందర్శనముచేయించు టుచితమని యోచించుచున్నాఁడను.

జగ—అయినచో నది నాకుఁ దెలుపుటెందులకు?

కారా—అసన్న్యాసిని లోపలకువిడిచిపెట్టినచో యువరాజున కసంతుష్టికలుగవచ్చును. యువరాజునకు మంగళమగునని మేముచేయఁబోవుకార్య మమంగళమైననుగావచ్చును.

యువ—(కొంచెమయోచించి) నాకిప్పుడుగలిగిన యమంగళముకంటె గొప్పయమంగళము వేఱొకటియున్నట్లు నాకుఁదోఁచుటలేదు. సన్న్యాసితఁడు వచ్చిచూచినను నాకు హానివృద్ధులేమియు సంభవింపవు. నీకాక్షేపణము లేకపోయినచో నీకిష్టమువచ్చినవానిని లోపలకు విడిచిపెట్టవచ్చును. అందువలన నాకు సంతోషమేగాని విచారమేమియు లేదు.

కారాగారరక్షకుఁడు వందనముచేసి వెడలిపోయెను. జగత్సింహుఁడొంటరిగఁ గూర్చుండి యోచింపనారంభించెను. విడివడునాశయేమియుఁ గాన్పించుటలేదు. మహారాజు స్వయముగా యావజ్జీవకారాగారవాసశిక్షవిధించినప్పుడాతనియాజ్ఞను త్రిప్పుట కెవరికి సాధ్యము? శతసహస్రకారణములు గాన్పించినను మహారాజు తానాడిన మాట కన్యథాచేయువాఁడుకాఁడు. న్యాయమునకును, ధర్మమునకును గట్టువడినచో నాతఁడట్లన్యథాచేయఁగూడదు. అన్యథాచేసినచో నాతనిపదగౌరవమును శాసనశక్తియుఁ దృణీకృతములై పోవా? ఆతనిప్రతాపము క్షీణించిపోవును. అతనిన్యాయపరతయుఁ గర్తవ్యనిష్ఠయుఁ బరిహాసయోగ్యములై పోవును.

అట్లయినచో జగత్సింహుఁడువిడివడుట కుపాయమే లేదా? ఆతఁడిట్లే చిరకాలము కారాగారమునందు జీవితమును గడపవలయునా?—విడివడుట కొకయుపాయముకలదు. ఘాదుషహాయనుగ్రహమున్నచో నన్నికార్యములును జక్కఁబడును. అతఁ డనుగ్రహించి జగత్సింహునివిషయమున ననుకూలముగ నాజ్ఞయొసంగినచోఁ దన

కిష్టమున్నను లేకపోయినను మానసింహమహారాజు దానికిం బ్రతివా దమును జేయఁడు. కాని, యాకార్యమును చేయువారెవరు? ఢిల్లీశ్వరుఁడు బాదుషహా దర్బారునకీజగత్సింహునివిజ్ఞాపనమును గొనిపోయి విన్నవించువారెవరు? ఎవరిమాటయైన నచ్చట వినువారెవరు? దర్బారునకుఁ బోయి జగత్సింహున కుపకారముసేయునిమిత్తము ముందం జవేసి వచ్చువారెవరు?

అప్రసన్నవదనుఁడును, సన్యాసివేషధారియు నగునొకపురుషుఁడవనతశిరస్కుఁడై మెల్లమెల్లగ నాకారాగారములోపలఁబ్రవేశించెను. ఆతనిని జూచినతోడనే జగత్సింహుఁడాతని గుర్తించి భూమిపై కెఱగి వందనముచేసి "ఇదేమి! మీరిచటకెటువచ్చితిరి?" అనియడిగెను.

ఆయాగంతుకుఁడు మనకుఁ బరిచితుఁడైనయభిరామస్వామియే.

అభి—నాకిచ్చట చాలసేపు నిలిచియుండుట కధికారములేదు. అందుచే సర్వమును నీకు సంక్షేపముగా నెఱింగించెదను. నీకీదండన విధింపఁబడినవార్త నాకుఁ దెలిసినమరుచటిదినముననే మందారణదుర్గమును విడిచి వచ్చి యదిమొదలిచ్చటనే యున్నాఁడను.

జగ—మందారణదుర్గసమాచారము లేమైన మీకుఁ దెలిసినవా?

అభి—తెలిసినవి. అందఱును కుశలముగానున్నారు. కాని యందఱును విచారముతో నున్నారు. తిలోత్తమదుఃఖమునకు మితి లేదు.

జగ—మీరిచ్చటకువచ్చినపిదప మందారణదుర్గసమాచారము లేమైన వచ్చినవా?

అభి—వచ్చినవి. ఒకనెలకిందట నాశిష్యుఁడైన గజపతి యి క్కడకు వచ్చినాఁడు. ఆతనిచే విమల యొక్కయుత్తరమంపినది. ఆ యుత్తరమువలన నటసందఱును శోకాకులచిత్తులై యున్నట్లు తెలియవచ్చినది. తిలోత్తమ జీవించియున్నదనియు నతికష్టముమీఁదఁ గాలమును గడపుచున్నదనియు నాప్రయత్నముచే నీవిచెఱనుండి విముక్తినొందుదువనునాశతో నామె ప్రాణములనునిలువఁబెట్టుకొనుచున్నదనియు నాయుత్తరమువలనఁ దెలిసినది.

జగత్సింహు డధోవదనుఁడై యించుకసేపుయోచించి పిదప "మీరిన్నిదినములనుండి యిట నెందులకుంటిరి.?" అని యడిగెను.

అభి—నిన్నుఁ జూడవలయుననునాశచేతను నీవువిడివడుట కేదైన నుపాయము నాలోచింపవలయుననియు నుంటిని.

జగ—మీ మొదటియాశ యెట్లుసఫలమైనది?

అభి—కారాగారరక్షకునకు విశేషబహుమానముచేసి వశముచేసికొని కొంచెముసేపుమాత్రము నిన్నుఁ జూచుటకాతనియను మతినిబడసితిని.

జగ—మీ రెండవప్రయత్నము సఫలమగునని తోఁచుటలేదు. మీరావిషయమున వ్యర్థముగా శ్రమపడనభిలషింపుచున్నారు.

అభిరామస్వామి తనజోలెనుండి యొకకాగితమునుదీసి "నిరాశపొందవలదు. నిజముగా నా రెండవయాశయు సఫలముకాఁగలదు. ఈకాగితముపైఁ జేవ్రాలుంచుము. నేను లేఖినిని సిరాను దెచ్చితిని. పాదుషహా దర్బారునందు నాప్రయత్నము నిష్ఫలముకానేరదు" అనియెను.

జగ—అచటప్రయత్నముచేసినచో మనయాశ సఫలీకృతముకాఁగలదనుమాటనిజమే. కాని యాకార్య మెవరివలననిర్వహింపఁ

బడుదును? మీ రెవరిసాహాయ్యమును బడసితిరి?

అభి — ఎవరికార్యమును చేకొనియుండెనో, ఎవరియుత్సాహ ప్రయత్నములచే నేనిప్పు డీకార్యమును చేయుచుంటినో, ఎవరియర్థ వ్యయమువలనను సత్యాసక్తి వలనను మనకార్యములన్నియు నెరవే ర్పఁబడుచుండెనో, ఆవ్యక్తియే సమస్తమును నెరవేర్చునని నాకు న మ్మకమున్నది.

జగ — ఆవ్యక్తి యెవరు ?

అభి — నవాబునందిని — అయేషా.

జగత్సింహుఁ డాశ్చర్యముతో "అయేషాయా? ఆమె సాహా య్యమును మీ రెట్లుబడయఁగలిగితిరి?" అని యడిగెను.

అభి — నేను బడయలేదు. ఆమె నిన్ను చెఱసాలనుండి విడిపిం చుటకై ప్రాణాంతప్రయత్నములను జేయుచున్నది. ఆమెయే యిప్పు డు నాకధికారిణియైయున్నది. ఆమె యిప్పుడు పాట్నానగరమునందు న్నది. నీవిజ్ఞాపనమునుదీసికొని యామె స్వయముగా డిల్లికేగును. అచ్చట సర్వమును చక్కఁజేసికొనివచ్చును. నీవిజ్ఞాపన మర్పించుట తోడనే నిన్ని చెఱసాలనుండి విముక్తి చేయుట కాజ్ఞకాఁగలదు. అం దులకు సందేహము లేదు.

జగత్సింహుఁడు తనలో " అయేషా! చిరహితైషిణివైన యోయయేషా! నీశ్రమ నిశ్చయముగా సఫలముకాఁగలదు. కృత ఘ్నుఁడైనయీనరాధమునికొఱ కిచ్చుటకువచ్చి నీవశేషకష్టములన నుభవించుచున్నావు. ఈఋణమును జన్మజన్మాంతరములయందైన ను నేను దీర్పఁజాలను." అని యనుకొని ప్రకాశముగా " స్వామీ! అయేషాసందర్శనము సేయుటకేనిర్భాగ్యున కేయుపాయమును లేదా?" అని యడిగెను.

అభి—ఉపాయమున్నను నవాబునందిని నిన్నుఁ జూచుట క్లిష్ట పడుటలేదు. పరస్పరసందర్శన మిరువురకును క్లేశకారణమని యామె దృఢాభిప్రాయము. సీనిమిత్తము ప్రాణములను విడుచుటకుఁ గూడ నామె సిద్ధముగానున్నది. కాని, నిన్నుఁ జూచుటకుమాత్ర మామె కించుకంతయు నిష్టములేదు. తక్కినమాటలను సమయాంతరమునఁ దెలిపెదను. ఆలస్యముచేయకుండ నీవీకాగితముపైఁ జేవ్రాలుంచుము.

స్వామి తెచ్చిన లేఖినితో నాతఁడాకాగితముపై వ్రాలుచేసెను. స్వామియు నాకాగితమును బుచ్చుకొని నలఁగిపోకుండ జోలెయందు పెట్టుకొనియెను.

కారా—సన్యాసిగారూ ! చాలసేపైనది. ఇంత సేపటనుండుటకు మనము మొదట మాటాడుకొనియుండలేదు.

అభి—పోయెదను. యువరాజా ! నాకు సెలవిమ్ము. భగవంతునికృపచే శీఘ్రముగనే శుభసమాచారమును దీసికొని మరల నిన్నుఁ జూడగలుగుదునను ధైర్యముతో నున్నాఁడను.

జగత్సింహుఁడు వందనముచేసెను. సన్యాసి వెడలిపోయెను.

---

రెండవ ప్రకరణము.

---

మానసింహమహారాజు సైన్యసమేతుఁడై శ్రీక్షేత్రము నుండి పాట్నానగరమునకుఁ బోయి యట నియమితకర్తవ్యకార్యములయందు నివిష్టచిత్తుఁడయ్యెను. మహారాజుతోఁగూడ శ్రీక్షేత్ర

యాత్రికుఁ బోయినవారందఱును దిరిగివచ్చిరి. ఇంకొకవ్యక్తికూఁ
డ నధికముగా వారితో వచ్చియుండెను. ఆవ్యక్తి మహారాజునాదఁ
రమునకును స్నేహమునకును బాత్రమైన రాజలక్ష్మి.

మహారాజు వెనుదిరిగివచ్చుటయేమో నిజమే. కాని, యాతఁ
నిచే ప్రసన్నతమాత్ర మొరిస్సాసముద్రమునందు విడిచిపెట్టఁబ
డినది. దానికేమికారణమో చెప్పుటకు వీలులేదు. ఒకవేళ నాఁ
డా ప్రసన్నతను జగన్నాథస్వామిపాదసమీపమున విడిచిపెట్టి వచ్చి
యుండవచ్చును.

మొగలులకును పఠానులకును జరిగినసంధిసంబంధముచే మా
నసింహుఁడు కొన్నిదినములవఱకును నిశ్చింతుఁడై యుండెనుగాదా!
ఆసంధిబంధము శీఘ్రకాలములోనే భంగమైపోవునను విషయముసం
దాతనికిసుమంతయు సందియములేదు. కాని, యది యెవరిదోషము?
అస్మాన్‌ఖాన్ మానసింహులిరువురిలో సంధిభగ్నము సేయుటకు కార
కులెవరు? దానికిపఠానులే కారకులనుటకు సందేహము లేదు. పఠాను
లు మిగులనుద్ధతులు. అస్థిరచిత్తులు. అందుచే వారీసంధిబంధమునకు
లోఁబడియుండఁజాలరని సులభముగాఁ దెలిసికొనవచ్చును. విశేషిం
చి యస్మాన్‌ఖాన్ ధైర్యసాహసములం దసదృశుఁడు. అట్లే వీరత్వ
మునందును దృఢత్వమునందును నందఱ కాశ్చర్యమును బుట్టించు
చుండువాఁడు. అట్టివానియధికారమునను స్సైనికు లొకేవిధముగ
సంతుష్టులై యుండఁజాలరా? మానసింహాదులే—అనఁగా మొగలా
యిపక్షమువారే సంధినియమముల నుల్లంఘించి కళంకమును దెచ్చి
పెట్టికొనిరనుమాట నిజము. అందుచేఁ దప్పున్నను, లేకపోయినను
సంధిని తృణీకరించినవిషయమునఁ బఠానులే యపరాధులని చరిత్ర
ములయందేమేమో వ్రాయఁబడినది.

అయిననీసందర్భమున నొకవిషయముమాత్రము బాగుగా జ్ఞప్తియందుంచుకొనవలసియున్నది. మానసింహుఁ డుద్ధతస్వభావముతో నస్మాన్‌ఖానునకు వ్రాసినయుత్తరమునందు "నీవు నీరాజ్యపుటెల్లకడకువచ్చి నాయాగమనమును నిరీక్షించుచు నన్నెదురుకొనవలయు" నని వ్రాయుట యుక్తమేనా? పూరిక్షేత్రమున తనదర్శనమునకు వచ్చినప్పు డస్మాన్‌ఖానునితోఁ దృణీకారభావమున మాటాడఁదొడంగుట మానసింహునకుచితమేనా? మానసింహుఁ డీకీతిప్రశ్నలనుగూర్చి తనహృదయమున మాటిమాటికి యోచనలఁ జేయనారంభించెను. అందుచే నాతనిహృదయము ప్రసన్నమై యుండలేదు.

మానసింహుఁడు కుమారజగత్సింహునకు యావజ్జీవకారాగారవాసశిక్ష విధించియుండెను. వీరపురుషున కుచితమగురీతి నాతఁడు కార్యము నేమో చేసివైచెను. దానికి సందేహము లేదు. ఆతని యా నిష్పాక్షికకార్యానుష్ఠానమునకు సమస్తసైన్యాధిపతులు, సైనికులు నాయకులు, సేవకులు, సందఱును నాశ్చర్యపడిరి. వారిసమక్షమున నాతనికర్తవ్యపరాయణతయు, గౌరవమును మిక్కిలియభివృద్ధిఁజెందినవి. అక్బరుషాదుషహాసైతము వీరోచితమైనయాకృత్యమును జూచి హృదయమునందు మానసింహునిగూర్చి మిక్కిలి మెచ్చుకొనియెను. జరిగినదంతయు నుత్తమమేయగును. కాని, యందువలన నాతని హృదయము ప్రసన్నతవహించినదా? యౌవనవయోధర్మముచేఁ బ్రకృతికి వశమైపోయినప్పుడు జరిగినయపరాధములకై యోగ్యుఁడైనవీరపుత్రునకు యావజ్జీవకారాగారవాసశిక్ష విధించుట తండ్రి కుచితమైనకార్యమేనా? అత్యంతక్రూరతమమైనయాయాజ్ఞను చేసి నప్పటినుండియు మానసింహునిహృదయమునకు స్తిమితభావము

లేదు. కాని తనహృదయాందోళనము నాతఁడు మాటలచేఁగాని
పరివర్తనచేఁగాని వ్యక్తపడనిచ్చుటలేదు. ఒకనాఁడు మహారాజ్ఞి
ఊర్మిళాదేవి సాహసించి సాశ్రునయనయై మహారాజుకడ జగత్సిం
హునిపక్షమున క్షమాపణమును వేఁడుకొనియెను. మహారాజందుప
లన సంతుష్టచిత్తుఁడుకాలేదు. అందుచే నాఁటనుండియు జగత్సిం
హునిప్రస్తావన మడఁగిపోయెను.

కొన్నిదినములకుఁబూర్వము పూరినగరమునందు, అస్మాన్
ఖాను జగత్సింహునిప్రస్తావనముదెచ్చెను. అత్యంతోదారస్వభావము
తో నస్మాన్ఖాను జగత్సింహుఁ డన్నివిషయములయందుఁగాకపో
యిన నొక్కవిషయమునమాత్రము నిర్దోషియని స్పష్టముగా వా
క్రుచ్చి సమర్థించియుండెను. జగత్సింహుఁడు బుద్ధిపూర్వకముగఁ
గాకపోయినను, విధివశముచేఁ బ్రణయవిషయమున నస్మాన్ఖాను
నకుఁ బ్రతిద్వంద్వియైయుండెను. అట్టిశత్రుఁడైనను జగత్సింహుని ని
ర్దోషిత్వమును బ్రకటించుటకై శ్రమపడివచ్చిన యస్మాన్ఖాను
గొప్పపరాకాష్ఠగలవాఁడని తోఁచుచున్నది. ఆవిషయమున నస్మాన్
ఖానొకగొప్పమహానుభావుఁడని మానసింహుఁడు గ్రహించెను.

నవాబుకన్యయందలి ప్రణయవిషయమున జగత్సింహుఁ డె
ట్లునిరపరాధియో యట్లే తక్కినవిషయములయందుఁగూడ నాతఁడు
నిరపరాధియైయుండుట యసంభవముగానేరదు. జగత్సింహునాకస్మి
కముగాఁ బట్టి బంధించి కారాగారమునఁ ద్రోసివేసిరి. సంగతులన
న్నిటిని రుజువుచేసి తననిర్దోషతను స్థాపించుకొనుటకు జగత్సింహున
కవకాశమీయలేదు. ఆతఁడు దోషియని నిర్ధారణచేయఁబడినరాజ
కీయవిషయములనుగూర్చి యవకాశమిచ్చి విచారణజరిపినను బాగు
గ నుండును. అందులకు నవకాశమీయలేదు. విచారణయును లేదు.

ఒక్కతప్పుమాత్రము సహింపవీలులేనిది. క్షమింపనర్హము గానిది. జగత్సింహుఁడు తండ్రికిఁ దెలియకుండ వీరేంద్రసింహునితనయను బరిణయమాడెను. ఆకార్యమతిగర్హితమైన దైనను దానికి యావజ్జీవకారాగారవాసశిక్షమాత్ర ముచితమైనదికాదు. ఇట్లుయోచించుకొనుచుండ మానసింహునకు తన యౌవనప్రారంభకాలమున జరగినయొకవిషయము జ్ఞప్తికివచ్చెను. తోడనే యాతఁడించుకలజ్జపడియెను.

విచారముచే నస్వస్థహృదయుఁడైన మానసింహుఁ డూర్మిళాదేవిమందిరమున కేగెను. ద్వారముకడ కేగునప్పటికూర్మిళయుఁ జిఱునగవుతోఁగూడినవదనముతో నాతని కెదురేగిదర్శనమొసంగెను.

మాన—మహారాజ్ఞీ! ఒంటరిగఁ గూర్చుంటివేమి? నీరాజలక్ష్మియేది?

ఊ—నారాజలక్ష్మియా? అట్లయినచో రాజలక్ష్మికిని మీకును నేమియు సంబంధములేదా?

మాన—అట్లుచెప్పరాదు. రాజలక్ష్మి కేవలము నాయాదరమునకుఁ బాత్రురాలు. నేనామెను చాలప్రీతితోఁ గారవించుచుందును. ఏది రాజలక్ష్మి?

మహారాజు మంచముపైఁగూర్చుండి పిదప పండుకొనియెను.

ఊ—మీరు వచ్చితిరని యెఱింగి కాలుచేతులును ముఖమును గడిగికొనుటకై చల్లనినీటిని తీసికొనిరావలయునని వెళ్లినది. నీరు సరిగాలేకపోయినచో మీరాగ్రహపడెదరు.

మా—ఔను. నిజము. సేవకురాండ్రు నీటియందు గులాబియత్తరువును కర్పూరమునుజేర్చి మిగులఁగటువుగాఁ జేసి తీసికొనివచ్చెదరు. ఆనీటిని నోటఁబోసికొననెవరికిసాధ్యము? రాజలక్ష్మి

యట్లుచేయదు. అన్నియును చక్కఁగాఁజేయుచుండును. మనఃపూర్వకమైనభక్తితో నామె నాసేవను చేయుచుండును. నేనాబిడ్డను మిగులప్రీతితోఁ జూచుచున్నాను.

మహారాజు తుదిమాటముగియకుండఁగనే రాజలక్ష్మి నీటినితీసికొని లోపలకువచ్చెను. మానసింహునియావాక్య మామెచెవిని బడియెను. తనసంబంధమైనప్రస్తావన జరుగుచున్నదని గ్రహించెను. లజ్జయు నానందమును జేరుటచే నామెముఖము విశేషకాంతిని దాల్చెను.

ఊ—ఏలిక రాజలక్ష్మిని ప్రీతితోఁ జూచుచున్నారు. అది యామెయదృష్టమే యగును. కాని, నేనేమిచేయవలయునో యది నాకు గోచరించుటలేదు. మహారాజునకుఁ జాలసంతానమున్నది. వారందఱును నన్ను తల్లివలెనే భక్తితోఁ జూచుచున్నారు. కాని, రాజలక్ష్మి నన్ను "అమ్మా!" యనిపిలుచుచుండును. ఆమెప్రేమాస్పదములగుభక్తిశ్రద్ధలనుజూచి నేనామె నౌరసతనయగా భావించుకొనుచున్నాను. ఇట్టితల్లిగానుండుసుఖమును నేనిదివఱకెన్నఁడు ననుభవించియుండలేదు.

ఇట్లుచెప్పునప్పు డామహారాజ్ఞినేత్రములు జలధారాకులములయ్యెను. కంఠస్వరము సంక్షుబ్ధమయ్యెను.

మాన—రాజలక్ష్మి నిశ్చయముగా మిగులస్నేహపాత్రురాలు. నీవామెను నీయంతఃపురమునందలిపరివారములో నొకతెనుగాఁ జేర్చుకొనుటుచితము. నేనావిషయమున నిప్పుడేయేర్పాట్లుచేసెదను.

ఊ—అదియెట్లగును? మహారాజా!

మాన—రాజలక్ష్మితలిదండ్రుల కామెను మనయొద్దనుంచునట్లుత్తరవులనొసంగెదను.

ఊ—రాజలక్ష్మిసంబంధు లెవరును నీవిషయమునుగూర్చి యాక్షేపింపరని నాయభిప్రాయము.

మాన—అట్లయినచో నీకళవళమునకుఁ గారణమేమి ?

ఊ—రాజలక్ష్మిని మనయొద్దనుంచుకొనుట మనకెంతయావశ్యకమో, ఆమెసౌఖ్యమునుగూర్చి యోచించుటయు మనకంతయావశ్యకమే. రాజలక్ష్మి రూపమునందును, గుణమునందును, నసదృశురాలే కాని యొక్కవిషయమునందుమాత్ర మామె దురదృష్టవంతురాలు. ఆమెభర్త యామెను గ్రహింపఁడు.

మాన—ఏల ?

ఊ—భర్త మొట్టమొదట నెంతోయాదరముతో నామెను బరిణయమైనాఁడు. ఎంతో మమతతో నామెను జేఁబట్టినాఁడు. కాని, యిప్పుడామె నీచవంశసంజాతయనుకారణముచే గ్రహించుటకయోగ్యయని చెప్పుచున్నాఁడు.

మాన—ఏమి? వంశసంబంధమైనదోష మేమైన నున్నదియాయేమి ?

ఊ—నేనెఱిఁగియున్నంతవఱ కంతటిదోషమేమియు నున్నట్లు కాన్పింపదు. ఒకవేళ దోషమున్నను నాబిడ్డచేసినయపరాధమేమున్నది? రాజలక్ష్మి సాక్షాల్లక్ష్మీస్వరూపయనుటకు సందియములేదు: వంశదోషముమాటఁబట్టుకొని గుణవతియైనభార్యను విడనాడుట భర్తకు న్యాయమేనా ?

మాన—నిజముగా భర్తయట్లుచెప్పి విడనాడుట మిగుల గర్హింపఁదగినకార్యము. కేవలమధర్మము. ఏకారణముచేతను నట్టిగుణవతియైనభార్యను కష్టపెట్టుట భర్తకుఁగాని యాతనిస్వజనులకుఁగాని యుచితముకాదు. రాజలక్ష్మిభర్త యెవరు? ఏమిపనిచేయుచున్నాఁడు?

ఊ—మీపరిపాలనమునందు మీకధీనుఁడైన యొకసైనికుఁడుగా నున్నాఁడు. ఆర్యపుత్రు లనుగ్రహించినచో రాజలక్ష్మికష్టములు దూరమైపోవును.

మాన—నాకధీనుఁడైన సైనికుఁడేనా? అట్లయినచో నందులకుఁ దగినయేర్పాటులనుగావించెదను. ఆమెభర్తను నాతనియాత్మీయబంధువుల నొప్పించి యామెనాదరముతో గ్రహించుటకుఁ దగినయేర్పాటులుచేసెదను. అది నిశ్చయమని నమ్ముము. నీవావిషయమున నిశ్చింతవైయుండవచ్చును. కాని యందువలన మనకేమిజరగును? రాజలక్ష్మిభర్త యామెనుగ్రహించినచో భర్తతోడ నామెయుఁ బోవునుగదా! నీసమీపమున నామె యుండుటెట్లు? నీవామెకుఁ దల్లివైనందునఁగలుగు సౌఖ్యములన్నియు సంతటితోఁ దుదముట్టునుగదా!

ఊ—మహారాజా! అదేమి? మీయనుగ్రహముచే నన్నియును సుఖమయములేయగును. ఆసైనికుఁడు మీసమీపముననే యుండును. ఈబిడ్డయు మనయొద్దనేయుండును. ఆమెముఖమున హాసముపొంగిపొరలుటను నేనుచూచుచుందును. ఆమె సుఖమున నా సుఖమున్నది. పగలంతయు రాజలక్ష్మి మహారాజుసేవయందుండును. అప్పుడు నాసంతోషమునకు మితియుండదు. మహారాజా! మీరు పరమధార్మికులు. న్యాయశీలురు. ధర్మపరాయణులు. దయయుంచి రాజలక్ష్మిదుఃఖములను దూరముచేయరా? మీచరణములనాశ్రయించియున్న యీదీనురాలిప్రార్థనమును జెవియిచ్చి యాలకింపరా?

మహారాజ్ఞినేత్రములనుండి బాష్పములు ప్రవహించుచుండెను. మానసింహుఁ డత్యంతాదరభావముతో నామెహస్తమునుబట్టుకొని యిట్లు చెప్పఁదొడంగెను. "మహారాజ్ఞీ! నేను నిశ్చయము

గా నీమనోరథము నీడేర్చెదను. దానికేయాక్షేపణమును ప్రతివాదమును జెప్పను. నీయిష్టానుసారముగా రాజలక్ష్మిని సుఖవతినిగాఁ జేయుట కెట్టికార్యమైనను జేయరానిదిగాఁ దలంపను. అందుచే సరివారిలోఁ గాని సాధారణులతోఁగాని నేను హీనుఁడనుగాఁ బరిగణింపఁబడుట తటస్థించినను, జనసమాజమునుండి బహిష్కరింపఁబడుట సంభవించినను నేనావిషయమున వెనుదీయను.

పిదప మహారాజ్ఞి చీరనుసవరించుకొని మానసింహునిచరణములనుబట్టుకొని "మహాప్రభూ! అట్లయినచోఁ దిలోత్తమను మీకోడలినిగా గ్రహించి మీప్రతిజ్ఞను గాపాడవలయును" అని వేఁడుకొనియెను.

తత్క్షణమే రాజలక్ష్మియు నశ్రులోచనయై వచ్చి మహారాజు పాదములపై శిరసునిడి యశ్రువర్షమును గురియింపఁదొడంగెను.

మానసింహుఁ డాశ్చర్యముతో "నాకుఁగోడలా? అదేమి మాటయూర్మిళా!" అనియెను.

ఊర్మిళ చేతులుముకుళించుకొని "ప్రభూ! ఔను. రాజలక్ష్మి జగత్సింహునకు వివాహితయైనధర్మపత్ని" అనియెను.

మాన—అట్లయినచో రాజలక్ష్మి వీరేంద్రసింహునితనయయా? ఓహోహో! ఈమెపేరు తిలోత్తమయా?

ఊ—ఈరాజకులవధువు పేరు తిలోత్తమయే.

మానసింహుఁడు చాలసేపుతలవాల్చుకొని చింతించి పిదప నిట్లనియెను. "ప్రియా! వినుము. నీదీనప్రార్థనమును నేను నిరాకరింపను. నేనాడినమాట నసత్యముచేయను. తిలోత్తమ నాకుఁ గోడలగుటకు సర్వవిధముల యోగ్యురాలు. దానికిసుమంతయు సందియము లేదు. నేనామెను సమాదరభావముతో గ్రహించెదను. ఇది

మొదలు తిలోత్తమకు రాజమహిషికివలెనే యుచితమర్యాదలన్ని యు సరిగాజరుగునట్లేర్పాటుచేసెదను. ఇఁకముందామె నిత్యమును నీతోనుండఁగలదు."

తిలోత్తమయుఁ గన్నీళ్లనుతుడిచికొని గద్గదకంఠయై మానసింహునిపాదధూళిని గ్రహించి శిరసునధరించుకొని దూరముగాఁబోయి ముఖమును చీరచెఱఁగుచేమూసికొని యేడువఁదొడఁగెను. ఊర్మిళయు మహారాజుచరణసాన్నిధ్యమునుండి దూరముగావచ్చి యాతనికిఁ బ్రణామముచేసి "ఈదాసి చిరకాలమునుండియు మహారాజు కరుణాలాభముచేఁ జరితార్థయగుచున్నది. ఇప్పుడు చూపినయీయనుగ్రహ మీదాసిజీవనాంతమువఱకును మఱచిపోవదు. ఇదిచిరస్మరణీయమైనకార్యము" అని విన్నవించెను.

మాన — అమ్మా! రాజలక్ష్మీ! నీవిప్పుడు నిజముగా నాకుఁ దల్లివి. మాతృకార్యమును జేయుము. నాకాఁకలివేయుచున్నది. అమ్మా! భోజనమునుసిద్ధపరుపుము.

తిలోత్తమయు నాతనిభోజనవిషయమునఁదగినయేర్పాట్లను జేయుటకు వెడలిపోయెను.

---

## మూఁడవప్రకరణము.

---

పాట్నానగరమునకువచ్చినకొన్నిదినములకుఁ బిదప మహారాజు పాట్నానగరమందొకధనికుఁడగుపఠానునిగృహమున నతిథిభావముతో నవాబుకటుల్ఖానునితనయయగునయేషా వచ్చియున్నదను సమాచారమును గూఢచారులమూలమునఁ దెలిసికొనియెను. మానసిం

హుఁ డాసమాచారమునుగూర్చి యనేకవిధముల నాలోచింపఁదొ
డంగెను. కాని, యందుమూలమున నేమేనియాపద సంభవింపనున్న
దనిగాని, తాను ముందుగ మేల్కొని చేయవలసినకార్యములున్నవ
నిగాని యాతనికిఁ దోఁచలేదు. ఒరిస్సాదేశపుపఠానులకును మొగ
లులకును సంధిసంబంధములున్నవి. అందుచేఁబఠానులు సామాన్యు
లుగాని, గొప్పవారుగాని, మొగలాయీలరాజ్యములోనికి వచ్చుచుఁ
బోవుచు నుండవచ్చును. అందులకాక్షేపణ మేమియు లేదు. కాని
వనాబుసందిని, సుబేదారునకు సమాచార మెవరిచేనైన నందఁజేసి
నచో యథారీతిగ నామె నెదుర్కొని యామెకుఁ దగినబిడారములు
మున్నగునవి సిద్ధముచేసి కుశలవార్తనరసి యామెపటకుటీరములో
పలకుఁ గావలసినవాని నన్నిఁటిని కూడఁబెట్టి పంపుట మానసింహు
నకావశ్యకమై యుండును. కాని యామె యాభావముతో రాకపో
వుటచే నాసంబంధమున మానసింహుఁడు చేయవలసినదేమియు
లేకపోయెను.

పఠానులనేకులుపాట్నానగరమునఁ దమతమకార్యములకొఱ
కు నివసించియుండిరి. అనేకు లున్నతస్థితియందుండుటయేగాక వారి
లోఁ జాలమంది మిగుల సంభ్రమశాలురై యుండిరి. భారతవర్షము
నందు మొగలులకును పఠానులకును గలవివాదము చాలదినములకుఁ
బూర్వమే ముగిసిపోయినది. ఢిల్లీసింహాసన మిబ్రిహింలోఢీతోఁ
బఠానులచేతినుండి వీడిపోయినది. దావూదుఖాను బంగాళాదేశపు
సింహాసనమును బోఁగొట్టుకొని యొరిస్సాదేశమునకుఁ బలాయనుఁడ
య్యెను. ఒరిస్సాదేశమునఁ బఠానులు స్వాధీనతకై యిప్పుడును
యుద్ధములలో మగ్నులై యున్నవారు. కాని, బంగాళాదేశపుఁబఠా
న్లు లనేకదినములనుండి తమయప్రతిమానవిధేయనియతి కధీనులై

మొగలాయీలప్రజలై యుండిరి. బంగాళాదేశమందలి పఠానులు మనస్సునందు లేకపోయినను పైకసంతోషాగ్నిని బయల్పడనీక యుడఁచుకొని జీవయాత్రను గడపుకొనుచుండిరి. అందుచే ఆయేషా రహస్యాగమనమును, పఠానునిగృహనివాసమును మానసింహునిసందేహమున కవకాశమును గల్గింపలేదు.

ఒకవారమైనపిదప భయానకమైనయొకవార్త మానసింహునిచెవులఁ బడియెను. దానితో నాతనిశాంతియంతయు ధ్వంసమైపోయెను. నవాబస్మాన్‌ఖానును సులేమాన్‌ఖానును వచ్చి పూరినగరమును ముట్టడించినారనియు, రామచంద్రమహారాజు పలాయనుఁడైనాఁడనియు నాతనికి వార్తవచ్చెను.

ఆవార్త నిజమైనది. అస్మాన్‌ఖాను సంధిపత్రముపై మొదటనుండియు నసంతుష్టచిత్తుఁడై యున్నాఁడని మనమెఱుంగుదుము. మానసింహునివ్యవహారమునెడల నాతఁ డత్యంతవిరక్తుఁడై యున్నాఁడనికూడ మనమెఱింగియున్నాము. ఆతని సోదరుఁడగు సులేమానుఖా నావృత్తాంతములనన్నిఁటిని విని యుత్తేజితుఁడై సంధిబంధములను ద్రెంపివేయుట కంగీకరించెను. మానసింహుఁడు వెడలిపోయినకొన్నిదినములలోపలనే వారిరువురును పూరిపట్టణమును ముట్టడించిరి.

అస్మాన్‌ఖానునియుద్ధతభావము మానసింహునకుఁ జాలవిరక్తిని గల్గించెను. ఆతఁ డొక్కమారుగఁ బఠానులసందఱ నేలఁగలిపి ప్రపంచమునఁ బఠానుశబ్దము లేకుండఁ జేయవలయునని సంకల్పించుకొని తానే స్వయముగ నొరిస్సాపైకి యుద్ధమునకుఁ బోవలయునని నిశ్చయముచేసికొనియెను. సైన్యమునకును సేనాధిపతులకును సిద్ధముగానుండవలయునని యుత్తరువులఁ జేసెను.

పఠానుల నందు విశేషించి యస్మాన్‌ఖానునిజయించి మర్మ
భేదితునిగాఁ జేయుట కొక్కయుపాయమున్నది. అయేషా యాతని
యంతఃపురమునం దంతయాదరభావముతో నుండకపోయినను నస్మా
న్ఖానునకామె యత్యంతము ప్రియభాజనమై యుండెను. అందు
చే నామెనవరోధించిరేని యస్మాన్‌ఖానునకుఁగాతర మధికమగును.
అప్పు డాతనిని యుద్ధమున సర్వనాశనము సేయవచ్చును. ఆతనిని
సుభముగాఁ గడతేర్చుటకు సుకరముగనున్న యాయుపాయము
ను విడిచిపెట్టుటకు మానసింహున కిష్టము లేకపోయెను.

అయేషా ప్రచ్ఛన్నభావముతోఁ దాజఖానునివానియింట వా
సముసేయుచుండెను. తాజఖాను, కటుల్‌ఖానునికాశ్మీరబీగమునకు
సమీపబంధువుఁడు. ఆసంబంధముచేఁ దాజఖానును నాతనిభార్య
యు నప్పుడప్పుడు కటుల్‌ఖానునిమందిరమునకుఁ బోయివచ్చుచుండె
డివారు. అందుచే వారియం దయేషా మిగుల గౌరవమును నభి
మానమును, బంధుభావమును గలిగియుండెను. ఆకారణముచేఁ దాజ
ఖానునిభార్య యయేషాను తనయింటికి రమ్మని యడుచు వేఁడుకొను
చుండెను. చాలకాలమున కిప్పు డాకస్మికముగ నయేషా యామెకు
త్తరమునువ్రాసి పాట్నానగరమునకు వచ్చెను. తాజఖానుఁడు నాత
నిభార్యయు నామె నత్యంతగౌరవముతోఁ జూచుచుండిరి. అయేషా
యును నచ్చట మిగుల నానందముతోఁ గాలమును గడపుచుండెను.

సాయంకాలమైనపిదప మొగలాయిసైనికులువచ్చి తాజఖా
నునిగృహమును ముట్టడించిరి. తాజఖా నేసంగతియు నెఱుఁగఁడు.
అందుచే నాతఁడానిగ్రహమునకుఁ గారణమునుగూర్చి తెలిసికొనఁ
బ్రయత్నించెను. కాని, ముట్టడివేసినవారిలో నెవరును దానికిఁ గల
కారణమును తెలుపఁజాలకపోయిరి. తాజఖాను మహారాజు దర్శన

ముచేసికొనుట కనుజ్ఞ వేఁడికొనియెను. ముట్టడివైచినవారందఱు
కంగీకరించిరి.

మఱునాఁడు ప్రాతఃకాలమున భటులచేఁ బరివేష్టితుండై
తాజఖాను బంగాళాబీహారుదేశములకు సుబేదారయిన మానసింహు
నికడకుఁబోయెను. ఆతనిగృహమునందు నవాబుకటుల్ఖానునితన
య యున్నదనియు నామెను బట్టుకొనుటకై ముట్టడివైవఁబడినదని
యు నవాబునందినిని మొగలాయీలకప్పగించినచో ముట్టడిమాని
వేయఁ బడుననియు తాజఖానున కెఱింగించిరి. ఆప్రస్తావనము కే
వల మసంగతముగానున్నదని తాజఖాను తనహృదయమున ననుకొ
ని తాను వర్తకముచేసికొనువాఁడననియు ననేకులు తనయింటికె
ప్పుడును వచ్చుచుఁ బోవుచుందురనియు నది నిలిచిపోయినచోఁ దన
కును నితరులకును విశేషధననష్టము సంభవించుననియు మహారాజు
నకు విన్నవించుకొనియెను. మానసింహుఁడయేషా నొప్పింపక
పోయినచో నేమాటలను విననొల్లననియు,అయేషా కేవిధమగునమ
ర్యాదయును జరుగదనియు నామెస్థితికిఁ దగినమర్యాదలతో నంతః
పురమున నుంచెదననియు తాజఖానునకు తెలియఁజేసెను. తాజఖా
ను "నాప్రాణముల నెవరైనఁ గైకొనినను సరియే, కాని, యింటికివ
చ్చినయామెను విడువనొల్ల" నని విన్నవించెను. అందుచే నాతఁడు
భటులతోఁగూడ మరల నింటికిఁ దీసికొనిపోఁబడియెను.

అయేషా కీసమాచారములన్నియుఁ దెలియవచ్చెను. ఆమె
తాజఖానునికడకేగి తనకు మానసింహునిఁజూడవలసియున్నదని చె
ప్పెను. చూచుటకుఁ గాలమును స్థలము నేర్పడియెను. యథాసమ
యమున నిరుపురుపరిచారికలు తాజఖానునిసమేతముగా భటులచేఁ
బరివేష్టితమైనశిబిక నిర్దిష్టస్థలమునకుఁ బోయెను. నిర్భీకహృదయమై,

యసంకుచితభావముతో నయేషా మానసింహుని కెదురుగవచ్చి ని
లుచుండెను.

సజీవదేవీమూర్తియే గౌరవముతోఁ దనశోభామహిమలను
బ్రసరింపఁజేయుచు ముందునకువచ్చియున్నదని మానసింహునకుఁ
దోఁచెను. ఆమెసమీపమునకువచ్చినతోడనే మానసింహుఁడు "అ
మ్మా! నీవునాతనయవు. నేను రాజనీతిప్రయోజనార్థము నీకుఁ గ
ష్టములను గలుగఁజేయవలసివచ్చినది. నీవు నాతనయవని భావించు
చున్నాఁడను. అందుచే నీవు చెప్పవలసినదానిని నిస్సంకోచభావ
ముతోఁ జెప్పవచ్చును." అనియెను.

అ—తండ్రీ! మీరు నన్నవరోధించుటకు నిశ్చయించిన
ట్లున్నది. తండ్రియవరోధమునందు (అంతఃపురమునందు) తనయ
స్వల్పకాలము వాసముసేయుట యసంగతముకాదు. నేను సంతుష్ట
చిత్తనై మీయంతఃపురమున నివసించియుండెదను. ఆసంబంధమున
నేను చెప్పవలసిన దేమియును లేదు.

మా—నీవు చెప్పవలసిన దేమియును లేదు. కాని నేను విన
వలసినది చాలఁగనున్నది. నీవునాప్రశ్నలకు నిజమైనయుత్తరముల
నొసంగితివేని నేను సుఖినయ్యెదను.

అ—అయేషాజీవితమునందు దాచియుంచఁదగినఘటనములే
వియు లేవు. ఆకారణమున నసత్యములను నుడువుట కించుకంతయు
నావశ్యకము లేదు. మీరు వినవలసినసంగతుల నడుగవచ్చును.

మా—నీవు నీయాత్మీయులనువీడి యొరిస్సానుండి పాట్నాన
గరమునకేలవచ్చితివి?

అ—(కొంచెము యోచించి) నిజమునే జెప్పెదను. మీకొమ
రుఁడైనజగత్సింహుని చెఱనుండి విడిపింపవలయునను నభిప్రాయము

తో నిటకు వచ్చితిని.

మానసింహుఁడు తనపుత్త్రికారాగారవిముక్తికై యించుక వ్యాకులపడుచుండెను. పైకి వెల్లడిచేయకపోయినను హృదయము నం దందుల కుపాయములను వెదకుచుండెను. ఇప్పుడందులకు సహజమైనసదుపాయము దొరకినదని మనస్సునందు సంతుష్టుఁడయ్యెను.

మా — నీవందుల కేయుపాయములనవలంబించుచున్నావు ?

అ — యువరాజుకడనుండి షాదుషాకు విజ్ఞాపనపత్త్రికను పంపించుట —

మా — నేను సుబేదారుఁడను. నాకుఁ దెలియకుండ షాదుషాకు విజ్ఞాపనము పంపుటకుఁ బ్రయత్న మేల చేసితివి ?

అ — మీవలన నీవిషయమున నేయుపకారమును జరుగదు. మీరు స్వయముగా బహిరంగమైనసభలోఁ గూర్చుండి యపరాధియని నిశ్చయించి, యువరాజునకు దండవిధానమును జేసియేయున్నారు. ఆమొదటిమాజ్ఞకు విరోధముగాఁ జేయుటకు మీకిప్పుడిష్టముండదు. ఒకవేళ నిష్టపడినచో సర్వత్ర సమాదృతమై విఖ్యాతినొందినమీనామ మత్యంతపరిహాసమునకు గుఱియైపోవును. మహారాజుగారి మర్యాదను గ్రహించి రాజపుత్త్రినియావేదనపత్త్రమును నాతని జనకునియొద్ద సమర్పింపక తండ్రికంటె నుచ్చపదస్థుఁడగుపాదుషహాకడ కంపుటకు నిర్ధారణచేసితిని.

అయేషాయిచ్చిన ప్రత్యుత్తరమునకు మహారాజు పరితుష్టుఁడై "ఆవేదనపత్త్రము సిద్ధమగుటక వకాశము కావలదా?" అనియడిగెను.

అ — ఆవేదనపత్త్రము సిద్ధమై కుమారజగత్సింహుని చేవాలుంపఁబడి వెడలిపోయినది. అది యిప్పుడే ప్రయాగనుదాటి ముందునకుఁ బోయియుండవచ్చును.

మా—ఆకాగితము కారాబద్ధుఁడై యున్న జగత్సింహునిదొం
గచేవ్రాలుంపఁబడినదియా?

అ—లేదు. మహారాజా! దొంగచేవ్రాలుచేయుట కగత్య
ములేదు. కారాబద్ధుఁడైయున్నకుమారజగత్సింహుఁడు స్వయముగా
సమస్తవిషయములను చదువుకొని చేవ్రాలుంచినాఁడు.

మా—కారాగారమునందున్నయాతనికడ కావిజ్ఞాపనపత్రి
మెట్లుపోయినది?

అ—ఆవిషయమున నాకుఁ గొంచెము కష్టముకలిగినది. అం
దుచే కారాగారాధ్యక్షునకు విశేషద్రవ్యమిచ్చి వశముచేసికొన
వలసివచ్చినది.

మా—నీవు మిగుల బుద్ధిమంతురాలవుగను, కార్యకుశలినివిగ
ను గన్పట్టుచున్నావు. కాని ముఖ్యవిషయమున నేమిచేసితివి? ఆవే
దనపత్రిము ఘాదుషహాదర్బారునకుఁ బోవుటెట్లు? అదియేగొప్ప
సందేహము—ఆవిషయమున నేమైన నేర్పాట్లను గావించితివా?

అ—మహారాజా! ఆవిషయమునఁగూడఁ గావలసినన్నియే
ర్పాటులైనవి. విజ్ఞాపనపత్రిము దర్బారునకుఁ జేరుటకును, చేరిన
వెంటనే ఘాదుషహా చేతికందుటకును, నందినతోడనే యనుకూలము
లైనయుత్తరవులగుటకును దగినయేర్పాటులను గావించితిని. కార్యా
నుకూలమగుట కించుకంతయును సందేహములేదు.

మా—నీయుద్దేశమేమి? నీవాయసమసాహసకార్యము నిర్వ
హించుట కేలపూనుకొంటివి? దానినిగూర్చి తెలిసికొన నభిలాషప
డుచున్నాఁడను.

ఆయేషా యవనతమస్తకయై యోచించుచుండెను. ప్రశ్న
కుత్తరమురాలేదు.

మా — నీకాపరీక్షకొరకు మారుగ నుత్తరమీయుట కిష్టము లేనట్లు తోఁచుచున్నది. నేనావిషయమున నిన్ను మరలఁ బ్రశ్నింపను. నీవెప్పుడైనను జగత్సింహుని కారాగారమునందుఁ జూచియున్నావా?

అ — లేదు.

మా — నీసమాచారము నెప్పుడైన నాతనికివర్తమానమంపితివా?

అ — లేదు.

మా — నీప్రయత్నములచే జగత్సింహునకు విముక్తియైన పిదప నిజముగా నీవాతనినిజూడనొల్లవా?

అ — చూడను —

అయేషాప్రణయవిషయికవిద్యమానము లేమియు మానసింహునకుఁ దెలియకుండ లేదు. అయేషాయొసఁగినప్రత్యుత్తరములను వినినపిదప నాతఁడాయనుపమాననారీరత్నము జగత్సింహుని యందనురక్తయైయున్నదని తెలిసికొనియెను. ఇంతేగాక జగత్సింహుఁడు తనహృదయమున నయేషాయెడ తదనురూపమైనయనురాగమును గలిగియుండలేదనియు, నందుచేతనే యామె యంతవఱకును జగత్సింహునిఁ జూచియుండలేదనియు, నిఁకముందును జూడనిష్టపడుటలేదనియు నందులకాయబల నితాంతమనఃపీడితయైయున్నదన్నియుఁ గూడ మానసింహుఁడు స్పష్టముగాఁ దెలిసికొనియెను. తనయునకుఁ గారాగారవిముక్తియైనపిదప నానారీరత్నముయొక్క మనఃక్లేశమును బారఁదోలుటకై శక్తివంచనములేకుండఁ బ్రయత్నముచేయ్యవలయునని మానసింహుఁడు మనసున సంకల్పముచేసికొనియెను.

ప్రణయసంబంధమైనవిషయముల నింకను దెలిసికొనవలయు

నను నభిప్రాయముతో మానసింహుఁడు తనతనయుఁడగు జగత్సిం
హుని కృతఘ్నుఁడనియు, నరాధముఁడనియు నుడివి పిదప "అమ్మా!
నీ వాతనినిమిత్తమై యంతటియాయాసము నెందులకుఁ బొందెదవు ?"
అని యడిగెను.

ఆయేషా నీరవయు, నధోముఖియుఁ జింతాకులస్వాంతయు న
య్యెను.

మాన — తల్లీ ! సామాన్యప్రశ్నల కుత్తరమిచ్చుటకు సందే
హించుచుంటివేమి ?

ఆ — మహారాజా ! మీరొకకట్టెపుల్లనుగూర్చి " పయులకొ
ఆకు దగ్ధమై నీవెందులకుభస్మమయవయ్యెదవు? " అనిప్రశ్నించినబా
గుగనుండును. జగత్సింహుఁడకృతజ్ఞుఁడుగాఁడు. నరాధముఁడును
గాఁడు. ఆతఁడత్యంతధర్మపరాయణుఁడైన మహాపురుషుఁడు.

మా — బిడ్డా ! ఆయేషా ! నీవు రమణీలోకమునకంతకును
రత్నమవు. నీకు సౌఖ్యముగలుగఁజేయుటకై నేననేకవిధములఁ బ్ర
యత్నించెదను.

ఆ — అతిప్రగల్భవలె మహారాజంతటివారిసమక్షమున నిలు
చుండి విశేషముగా మాటలాడితిని. కాని, నేనామాటలను నామ
నఃపూర్వకముగా నుడివియుండ లేదు. మహారాజుగారియాజ్ఞయైనప్పు
డు చెప్పకపోయినచో నాగ్రహమువచ్చుననుభయముచే నానాలు
క లజ్జావిహీనయై విశేషముగా మాటలాడినది. అందుకొఱకు మ
హారాజుచరణసమక్షమున క్షమాపణమును వేఁడుకొనుచున్నదా
నను.

మా — ఆయేషా! రాజకార్యార్థము నిన్నుఁ గొన్నిదినములవ
ఱకును నిర్బంధములో నుంచవలసివచ్చినందులకు నేనెంతయో దుః

క్షించుచున్నాఁడను. కాని, అమ్మా! నిన్నుఁజూచి నీతో మాటాడినపిద
ప నామన సన్యథాపరిణమించినది. ఇప్పుడా విచారమువలదు. ఒరి
స్సాదేశమునఁ బఠానులతో యుద్ధముప్రారంభమైనది. రేపటిదినము
ననే నేనక్కడ కేగుచున్నాఁడను. యుద్ధము సమాప్తమగువఱకును
నీవు నాయొద్ద నుండవలయును. ఆయుద్ధసంబంధమున నీవు చెప్పవలసి
న దేమైనఁగలదా?

అ—నేను చెప్పవలసిన దేమియును లేదు. సంధివిగ్రహశాసన
పాలనములన్నియు రాజసంబంధమైనవి. మేము స్త్రీలము. మాకవి
యేమియుఁ దెలియవు. నేనావిషయమున మాటాడుటేల?

మా—నవాబస్మాన్‌ఖానున కాసంబంధమునఁ దెలియఁజేయ
వలసిన దేమైనఁ గలదా?

అ—తెలియఁజేయవలసిన దేమియును లేదు. నవాబు స్వతః
తేజస్వి; సాహసికుఁడు. పరాక్రమవంతుఁడు. ఆతనిబుద్ధి కేదితోఁచు
నో, యేకార్యమునందాతఁడు ప్రవర్తింపనుద్యమించునో యట్టివాని
విషయమున నావంటివారాలోచనఁజెప్పనుద్యమించుట మహాసాహ
సము. అతఁడు చేయఁబూనినకార్యముయొక్క పరిణామమును ఫలా
ఫలములు నాతఁడు బాగుగా నెఱుఁగును. ఆతఁడందులకు సిద్ధముగాఁ
గూడనుండును.

మా—అంతపర్యంతమును నీవీయంతఃపురమునందే యుండవ
లయును. ఊర్మిళాదేవి నీకుఁగావలసినవన్నియు సమకూర్చి నీక్షేమ
ము నరయుచుండును. యుద్ధానంతరమున నేను మరలవచ్చి నిన్నుఁ
జూచెదను. నేనిప్పుడు బహుళకార్యాంతరనిమగ్నుఁడనై యున్నాఁడ
ను. వెడలిపోయెదను. నీవు తాజఖాను నాతనిగృహమున కంపివే
యుము.

మహారాజు వెడలిపోయెను. తాజఖాను మరలఁ దనగృహము నకేగెను. అతనిగృహము కావలివారినుండి విముక్తినొందెను.

---

# నాల్గవ ప్రకరణము.

---

ఒరిస్సాదేశమున విషమసమరానలము ప్రజ్వలితమయ్యెను. పఠానులు సంధినియమములను బాటింపక పూరినగరము నాక్రమించుకొనిరి. రామచంద్రదేవరాజాయుద్ధమునకు సన్నద్ధుఁడై యుండకపోవుటచే నతిసులభముగా పూరినగరము పఠానులవశమైపోయెను. రామచంద్రదేవుఁడు పూరినివిడిచి పలాయనుఁడై పోయెను. సర్వవృత్తాంతములును మానసింహునకు వర్తమానమంపి యాతఁడంతటితో నిశ్చింతుఁడై యుండెను.

మానసింహుఁడు విశేషప్రయత్నములతో నొరిస్సాకు బయలుదేరివచ్చెను. వర్ధమానమునుండి సైదుఖానుగూడ విశేషసైన్యములనుదీసికొని యొరిస్సాకు రానారంభించెను. సంధినియమములకు భంగముచేసినారనుక్రోధ మొకటి---ఇంతియెగాక హిందువులకుఁ బ్రధానతీర్థక్షేత్రమగు పురుషోత్తమనగరము నాక్రమించుట యొకటి— విశేషించి యస్మాన్‌ఖానునినితాంతగర్వోద్రేకము—వీనియన్నిఁటి మూలముగను పఠానుకులమును సర్వనాశముచేయవలయునని మానసింహుఁడు దృఢనిశ్చయుఁడయ్యెను.

పఠానులును తమప్రయత్నములయందేమియుఁ గొఱఁతలేకుండఁ జేసికొనిరి. ధరపురవిజయియైన యస్మాన్‌ఖాను, సంధినియమములకు భంగముకలిగినతోడనే యుద్ధము తప్పక సంప్రాప్తమగు

నని యెఱిఁగియున్న వాఁడగుటచేఁ జాలదినములనుండి యుద్ధసంబంధ ములగు నాలోచనలను జేయుచు సంపూర్ణముగా రణసన్నద్ధుఁడ య్యెను. యుద్ధవిషయములన్నియును చరిత్రలయందు వివరముగా వర్ణింపఁబడియున్నవి. మేమిట నాయుదంతమంతయును వర్ణించి చెప్ప నావశ్యకము. ప్రస్తుతకథతో సంబంధించినంత పఱకు సంక్షేపము గా నాయంశముల నిట సూచించెదము.

వనపురసమీపమున మొగలాయీలకును పఠానులకును తు ములయుద్ధము ప్రారంభమయ్యెను. పఠానులు రణరంగమునకు విశే షముగ నేనుఁగులను దెచ్చిరి. మొగలాయీలనేక శతఘ్నులనుదీసికొని వచ్చిరి. వాని పెళపెళ శబ్దములను వినినతోడనే కరిబృందమునకుగుం డెలవియఁజొచ్చెను. మావటీండ్రు కరిసంకులసంరంభము నణఁపలే కపోయిరి. ఆమత్తగజములొక్కమారుగ విశృంఖలవృత్తి చెలరేగి సమీపసైన్యములఁ జిందరవందరఁజేయుచు నాల్గుదిక్కులకును బాఱి పోవఁదొడంగెను. యుద్ధాంగణమునకు ముందుగ నేనుఁగులనుంచిన యవివేకముచేఁ బఠానుసైన్యవ్యూహము భంగమయ్యెను. అనేక సైనికు లేనుఁగులకాళ్లక్రిందఁబడి ప్రాణములంగోలుపోయిరి.

అయినను పఠానులొకరినొకరు హెచ్చరించుకొని మరల ర ణోన్ముఖులైరి. కాని, మొట్టమొదటిప్రయత్నమంతయు భంగమైపో వుటచే రెండవసారిచేసినయీరణమునందు హతోత్సాహులైపోయి రి. యుద్ధము భయంకరముగ నేజరగినది. కాని, తుదకుఁ బఠానులు పరాజితులైపోయిరి. వనపురమునందట్లు ఘోరరణముజరగెను. ఆ రణముమూలముననే వనపురము చరిత్రలయందుఁ బేరుఁగాంచినది. వనపురరణమున జయమొందినమానసింహుఁ డంతటితో శాంతచి త్తుఁడుకాలేదు. ఒరిస్సాదేశమునఁ బఠానులప్రాముఖ్యమును నాశ

నముచేయవలయునని యాతఁడు సంకల్పించుకొనియెను. ఆతఁడు క్రమక్రమముగ దుర్గమువెనుకదుర్గమును, నగరమువెనుకనగరము నాక్రమించుకొనఁజొచ్చెను. జలేశ్వరమును, కటకమును మొగలాయీలయధీనమయ్యెను. ప్రతిదుర్గమునందును మొగలులపతాక మెగురనారంభించెను. మొగలుల స్వర్ణదుర్గము మొగలాయీలవశమైపోయెను. ఇఁకఁజేయునదిలేక యస్మాన్‌ఖాను పరాజయమునొప్పుకొనవలసివచ్చెను. నవాబు సులేమాన్‌ఖానును నస్మాన్‌ఖానును, అక్బరునధికారమునంగీకరించి యాతనికి సామంతులై కప్పముగట్టుట కంగీకరించిరి. ఒరిస్సాదేశము సంపూర్ణముగా మొగలాయీల రాజ్యమునఁ జేరిపోయెను.

ఒరిస్సావిజయసమాచారము యథాసమయమున నక్బరునకుఁ దెలిసెను. సస్యశాలినియు, రత్నగర్భయు నగునాప్రదేశము చాలకాలమునుండి మొగలాయీల కశాంతిని, నుద్వేగమును బుట్టించునదిగ నుండెను. ఇప్పుడది సంపూర్ణముగ మొగలులస్వాధీనమైనందునఁ నక్బరుపాదుషహా సంతోషమునకు మితిలేకుండెను. అదిమొదలు మానసింహమహారాజు బంగాళా, బీహారు, ఒరిస్సాదేశములకు సుబేదారుగా నేర్పఁబడుచుండెను. రామచంద్రదేవుఁడుమొదలగు పూర్వభూపతు లవిచలచిత్తులై మొగలాయీపక్షము నవలంబించి వారికి సామంతులై తమపదగౌరవములను నిర్విచారముగాఁ గాపాడుకొనుచువచ్చిరి.

అస్మాన్‌ఖాను హతాశుఁడై పోయెను. అట్టిదుర్గతిసంభవించునని యాతఁడెప్పుడు ననుకొనియుండలేదు. కారణము ప్రారంభమైనదిమొదలు లాతనిచిత్తము స్థిరముగానుండక నానావిధయాతనలకును, దుశ్చింతలకును, విచారములకును, నాకరమయ్యెను. యుద్ధారంభము

నకించుకపూర్వ మయేషా యంతఃపురమునువీడి వెడలిపోయెను. అయేషా యస్మాన్ఖాను నేభావముతోఁజూచుచున్నను, నామె యాతనిప్రాణములకుఁ బ్రాణమై సకలానందములకును సకలోత్సాహములకును సకలప్రయత్నములకును కారణభూతురాలై యుండెనని చెప్పుటకుసందేహము లేదు. అయేషాయును నస్మాన్ఖానును బాల్యమునుండియు నొక్కచోనాడుకొనుచు హాస్యపరిహాస్యములను జేసికొనుచు విహారముసేయుచుండెడివారు. వారిరువురు నొక్కచోఁ బెరిఁగిపెద్దవారైరి. ఆమెపై నస్మాన్ఖానునకుఁ గలప్రీతివిశ్వాసములకు మేరలేదు. ఆతనిప్రేమ కవధిలేదు. అట్టియయేషా యిప్పుడంతఃపురమును వీడిపోయినది. ఆతనిసాహసోత్సాహములన్నియు నాతనివిడిచి యామెతో మాయమైపోయినవి. అంతటినిరాశతోడను నసంతుష్టితోడను వ్యాకులహృదయముతోడను చేసినకార్యములకు విరుద్ధఫలమే లభియించెను. అస్మాన్ఖాను నిజముగ నవసన్నుఁడైపోయెను.

---

## ఐదవప్రకరణము.

కారాగారవాసియైనజగత్సింహుని విముక్తినొందించుటకై విజ్ఞాపనపత్రికాదులనుదీసికొని యభిరామస్వామి డిల్లికిఁ బయనమయ్యెను. ఆతనితోఁగూడ నైదుగురురక్షకులు బయలువెడలిరి. బయలుదేరినవారందఱు నాస్తికులై యుండిరి. అనేకస్థలములయందనేకులకు లంచములీయవలసినయవసరముండును. పాదుషహా దర్బారున

కు విజ్ఞాపనపత్రమునుగొంపోవుటయన సామాన్యమగుపనికాదు. దా
ని కెంత యోద్రవ్యము వెచ్చింపవలసియుండును. అందుకొఱకయే
షా యనేకరత్నములను, విశేషధనమును నభిరామస్వామి కిచ్చియుం
డెను.

అయేషా యింకను ననేకసదుపాయములను జేసెను. ఫాదుష
హా యంతఃపురమునందును దర్బారునందును గలయనేకులతో నదివ
ఱకామె పరిచయమునుగలిగియుండెను. ఆపూర్వపరిచయమును జ్ఞప్తి
కిఁదెచ్చుచు నామె వారి కుత్తరములనువ్రాసియిచ్చెను. ఇంతియే
గాక మానసింహునకు సోదరియు, జగత్సింహునకు మేనత్తయు న
గుబేగమున కొకవినయపూర్వకవిజ్ఞాపనమును వ్రాసి యామెకరుణా
విలోకనమును ప్రసరింపఁజేయుటకై వేఁడికొనియెను. ఆమె వ్రాసిన
యుత్తరములన్నియు వారలకుఁ జేర్పఁగలిగినచోఁ గార్యసాఫల్యమ
గుట కించుకంతయును సందియము లేదు. ఆమె యేకొఱంతయు లేకుం
డఁ జేయవలసినప్రయత్నములనన్నిఁటినిఁ జేసెను.

అయేషా కొన్నిదినములుగడచినపిదపఁ దాను స్వయముగ
ఢిల్లీకిఁబోవలయుననికూడ నిశ్చయించుకొనియెను. బహుశః ఆమె
ఢిల్లీకిఁ బోవుటకుఁ బూర్వమే యభిరామస్వామి కార్యమునుసఫలము
చేసికొని తిరిగివచ్చునని యందఱు ననుకొనుచుండిరి. ఇంతలో నా
కస్మికముగ మానసింహమహారాజునాజ్ఞాప్రకారమ మయేషా పాట్నా
నగరమున బందీగానుండవలసివచ్చెను. మానసింహుఁడు యుద్ధవిష
యములలో మునిఁగియుండెను. అందుచే నయేషా యటనుండి కద
లుట కవకాశము లేకపోయెను. అయిన నామె యసంతుష్టచిత్తయై
యుండలేదు. ఎందువలన ననఁగా—ఆమె తనయభీష్టసిద్ధికిఁ గావలసి
నప్రయత్నములన్నియుఁ జేసినపిదపనే మానసింహుని యంతఃపుర

మున నవరుద్ధయయ్యెను. కొంతకాలమే కాదు—బ్రదికియున్నంతవ
ఱకును బందీగనుంచినను నామెకు విచారము లేదు. కర్మమయమును
నుత్సాహమయమును నానందమయమునగు జగత్సింహునిజీవన మం
ధకారమయమైన కారాగారమునందు నష్టమైపోవుచున్నది. ఆతని
నాయంధకారమునుండి విముక్తినొందించుటకై యావజ్జీవమును నా
తనిస్థానమునఁ గారాగారమునం దుండవలసివచ్చినను నయేషా సం
తోషచిత్తముతో నందులకు సిద్ధముగానుండును.

ఐదవదినమున నభిరామస్వామియు నాతనితోఁగూడవచ్చిన
యైదుగురువీరులును గుఱ్ఱములనెక్కి కానపురమునకు వచ్చిరి. అక్బ
రుషాదుషహా డిల్లీనుండి యాగ్రకువచ్చెనని యభిరామస్వామి క
చ్చటఁ దెలియనయ్యెను. ఆసమాచారము తెలియుటతోడన్నే యభి
రామస్వామికిఁ బట్టరానిసంతోషము కలిగెను. వెదకఁబోయినతీవ
పదములఁదగిలినట్లయ్యెను. అచ్చటనుండి రెండుదినములలోనే యా
గ్రకుఁబోవచ్చును. విధాత యనుకూలుఁడై యున్నాఁడనియు, నే
విషయమునందు ప్రతికూలత లేదనియు నభిరామస్వామి సంతోషిం
చుచుండెను.

వారందఱును కానపురము చేరునప్పటికి మధ్యాహ్నకాలము
తిరిగిపోయెను. అశ్వము లాయాసమునొందుచుండెను. అశ్వారోహ
కులును క్షుధాతురులై దప్పిఁగొనియుండిరి. అభిరామస్వామి యం
గడివీధికి సమీపప్రదేశమునందలియొక గొప్పవటవృక్షముక్రింద నా
శ్రమమును గల్పించుకొనియెను. తక్కినయశ్వారోహకులు కొంచె
ముదూరములో మఱియొక చెట్టున కశ్వములను గట్టివైచిరి. స్వామి
వీపునకుఁ గట్టుకొనినచర్మమును నేలపైఁ బఱచిదానిపైఁ గూర్చుండెను.
జగత్సింహునివిజ్ఞాపనమును, నయేషాయిచ్చినయుత్తరములును, నా

ము. యొసఁగినధనరత్నములును తనయుత్తరీయమున మూటగట్టి దా
ని నాతఁడు తనవక్షోభాగమునఁజేర్చి కట్టుకొనియెను. ఆతఁడామూ
టను విప్పి చర్మాసనము క్రిందనుంచి దానిపైఁ దనశిరసుంచి పండు
కొనియెను.

రక్షకులుగావచ్చినవారు తమతమ చెంబులను, పగ్గములను దీ
సికొని సమీపముననున్న బావిలోనినీటిని తోడుకొని ముఖమును, గా
లుచేతులను గడిగికొనిరి. వారు వరుసగా గుఱ్ఱములకు సేవచేసిరి.
పిదప వారిలో నిరువురు గుఱ్ఱముల కాహారమునుదేఁబోయిరి. వారం
దఱు నొకేజాతివారు. ఒకవంటకమునందు వారందఱును గలిసిభు
జించెదరు. కాలుసేతులను గడిగికొనినపిదప నొకఁడుప్పు, పప్పు మొ
దలగుపదార్థములను దీసికొనివచ్చుటకై యంగడికిఁ బోయెను. ఇం
కొకఁడు వంటఁజేయఁదొడఁగెను. ఐదవవాఁ డభిరామస్వామికడకు
వచ్చి "ప్రభువారిసేవకొఱ కేమిసిద్ధముచేయవలయును?" అనియ
డిగెను.

అభిరామస్వామి "కొంచెము పిండిలోఁ బంచదారనుగలిపిపు
చ్చుకొనియెదను. నానిమిత్త మేమియును జేయవలసినపనిలేదు. మీ
రుతెచ్చినదానిలోఁ గొంచెమైనను జాలును. వేఱుగ నేమియు నక్క
ఱలేదు" అనియెను.

అడుగవచ్చినవాఁడు వంటచేయువానికి సాహాయ్యముసేయు
టకై వెడలిపోయెను. గుఱ్ఱములనుజూడఁబోయినవారు రెండుమోపు
ల గడ్డినిగోసి తమబట్టలలోఁగట్టి దానిపై నీటినిజల్లి తోడివాండ్రి
తో గుఱ్ఱములనుదీసికొని నీటివసతియొద్దకు వచ్చిరి. భోజనమునకుఁగా
వలసినపదార్థములను దేఁబోయినయాతఁడు యథేష్టముగాఁబదార్థము
లనుగొని తీసికొనివచ్చెను. వంటచేయువారిలోనొకఁడు వానినన్నిఁ

టిని దీసికొని యభిరామస్వామికొఱకు కొంచెముపిండియుఁ బంచదారమొదలగునవి వేరుగనుంచి మిగిలినవానితో వంటకము చేయనారంభించెను. వంటప్రారంభమయ్యెను. గుఱ్ఱములను మేపఁబోయినవారు వానికిఁ జక్కఁగ నాహారమిడి తమకాలుచేతులను గడుగుకొన నారంభించిరి. ఎల్లెడఁ జీఁకటులుక్రమ్మనారంభించెను.

సాయంకాలమయ్యెను. రక్షకు లంగడికిఁబోయి దీపపుసామగ్రినిదెచ్చి దీపములనువెలిగించిరి. భోజనమునకు సర్వమును సిద్ధమయ్యెను.

రాత్రియెనిమిదిగంటలైనది. ఆకస్మికముగ నంగడివీథియందొకగొప్పకోలాహలముత్పన్నమయ్యెను. "పోయినది ! అగ్నిహోత్రము ! నీరు ! నీరు ! తెండు ! తెండు !" ఈమొదలగుశబ్దములు హెచ్చుగవినవచ్చుచుండెను. అందఱిదృష్టియును నావైపునకే పోయెను. అతిభయంకరముగాఁ గన్పట్టుచుండెను. అంగడివీథి కగ్నిహోత్రము ముట్టుకొనియెను. "హా! హా ! ఏమైనది ? అయ్యో ! సర్వమును నాశనమైనది" ఈమొదలగుహృదయవిదారకశబ్దములు నిరంతరమును వినవచ్చుచుండెను. చూచుచుండగనే యగ్నినాల్గుమూలల వ్యాపించెను. చీఁకటిలో నాయగ్నిశిఖ లగ్నిమయశైలమువలెఁ గన్పట్టుచుండెను. అగ్నిశిఖలు నభోమండలమున కంట వ్యాపించెను. ఆపైని నాల్గుదిక్కులకును బరువులెత్తుచున్నమంట లగ్నిశైలముపైఁ బరువెత్తు వహ్నివిహంగములవలెఁ దోఁచుచుండెను. సర్వభక్షకుఁడగునగ్నిభగవానుఁడు తనసహస్రజిహ్వాలను విస్తరించి సర్వభక్షణకార్యమునం దుద్యుక్తుఁడయ్యెను. భయంకరములగుచీత్కారధ్వనులును నార్తనాదములును దిఙ్మండలమంతయు వ్యాపించి కలగుండువడఁజేయుచుండెను.

అభి — అయ్యో! అన్నలారా! చూచినఫలమేమి ? విపద్గ్రస్తులకు సాహాయ్యము చేయువారు లేకపోయినచో మీరుపోయి యాప్రయత్నములను జేయుఁడు.

ఈమాట ముగియకపూర్వమే రక్షకులందఱును సిద్ధముగానున్న పదార్థముల నట్లేవిడిచిపెట్టి మండుచున్న యంగడివీథికిఁ బరువెత్తుకొనిపోయిరి. అభిరామస్వామి యచ్చటనే నిలుచుండి మనోవ్యథాజనకమగు నాదారుణవ్యాపారమును జూచుచుండెను.

ఇంతలో నొకయార్తనాద మాకోలాహలమునంతను నతిక్రమించి వినవచ్చెను. అది నారీకంఠస్వరము. హృదయభేదకమై యీక్రిందివిధముగ వినఁబడియెను. "అయ్యో! నాబిడ్డ! నాసర్వస్వము. రక్షింపుఁడు! కాపాడుఁడు. నేను మీకు దాసినయ్యెదను. అయ్యో! నాబిడ్డ! కాపాడనిచో నాతోఁడు! లేదేని నన్నాయగ్నిలోఁద్రోసివేయుఁడు! అయ్యోబిడ్డా!"

అభిరామస్వామి యాయార్తనాదమునువిని యేమియుఁదోఁచక జ్ఞానశూన్యునివలెనై యతిశీఘ్రముగ నాశబ్దము వీతెంచుచున్న వైపునకుఁ బరువెత్తికొనిపోయెను. అతిసాహసముతో నుసత్త్వప్రాయుఁడైనయభిరామస్వామి యాయగ్నికుండమునఁబడియెను. ఆబిడ్డ రక్షింపఁబడియెను. పరుండినిద్రించుచున్నయాబిడ్డ నెత్తుకొని వక్షస్థలమున గదియించి పట్టుకొని నిర్విఘ్నముగా నీవలకుఁ బరువెత్తుకొనివచ్చెను. అతనిదేహ మనేకస్థలముల నగ్నిచుట్టుముట్టుకొనియెను. కాని, యాతఁడు దానిని గన్నెత్తిచూడలేదు.

రాత్రి పండెండుగంటలకు వీతిహోత్రునియాటోప మించుక యడఁగెను. రక్షకు లభిరామస్వామినిజూచి యాతనితోఁగూడ తమవిశ్రమస్థానమునకు వెనుదిరిగివచ్చిరి. అందఱును ధూళిధూస

రిక్తగాత్రులై దగ్ధప్రాయములైన దేహములతో సమీపముననున్న
వటవృక్షముక్రింది కరుదెంచిరి. కాని, యెంతభయానకము ! గుడ్డా
ములలో నొక్కటియు నచ్చట లేదు. అగ్నిభయముచే బగ్గములఁ
ద్రెంచుకొని యెచ్చటికైన పారిపోయియుండునా ? రక్షకులు సిద్ధ
ముచేసికొనిన కూర, పచ్చడి, రొట్టె, మొదలగునవి యేమియు న
చ్చట లేవు. కుక్కలు, నక్కలు తినిపోయియుండవచ్చును. చెంబు
లు మొదలగువస్తువులుకూడ లేవు. అట్లయినచో దొంగలెవరైన
వచ్చియుండవలయును. అభిరామస్వామి యాందోళనముతోఁ దన
చర్మాసనమునెత్తి చూచికొనియెను. అచట నుత్తరీయమునఁగట్టిన
మూట లేదు. ఆవిజ్ఞాపనపత్రమును లేదు. ఆయుత్తరము లేమియు
ను లేవు. ఆధనరత్నములయందొక్కటియును లేదు. “హా ! ఏమై
పోయినవి ? ” అనియనుకొనుచు నిశ్చేష్టుఁడై యభిరామస్వామి య
చ్చటనే కూలఁబడియెను.

---

## ఆఱవ ప్రకరణము.

---

అంధకారమయమైన కారాగారమునందుఁబడియున్న జగత్సిం
హుఁడు తనకతిశీఘ్రకాలములోనే విముక్తిగలుగునని యొకకలగాం
చెను. ఆనందపంజరమున బద్ధమైయున్నయయేషా హృదయమునం
దు తనహృదయేశ్వరునకు సుఖానందములు గలుగుననెడియాశను గ
ల్పించుకొని సంతసించుచుండెను. మానసింహమహారాజు దారుణ
యుద్ధవ్యాపారనిమగ్నుఁడై యుండియు నితరప్రయత్నములచేఁ దనత
నయునకుఁ గారాగారబంధము తొలఁగిపోవునని యాశపడుచుండెను.

వారియాశలన్నియు వ్యర్థములై పోవునని యెవ్వరు ననుకోన లేదు. ఎవ్వరు ననుకొనియుండని యొకయపూర్వకార్యముమూలమున నాయాశలన్నియు వ్యర్థములై పోవునని వారిలో నొక్కరైన నెప్పుడును దలపోసికొనియుండ లేదు.

అభిరామస్వామియు నాతని యనుచరులు నారాత్రి యేమియుఁ జేయకుండ నూరకుండిరి. పరిశ్రమమూలమున నాదినమెల్లనేమియు భుజింపకుండుటవలనను, ఉత్కంఠమూలమునను వారందఱును ప్రాణముల నఱచేతనిడుకొని వటవృక్షముక్రింద నారాత్రి పడియుండిరి. మఱునాఁటియుదయముననే లేచి చోరులు పట్టుకొనిపోఁగా మిగిలినసామగ్రులను గైకొని యాయార్గురుపథికులును నగరమునందలికొత్వాలుకడకుఁబయలుదేరిపోయిరి.

కొత్వాలు యమదూతవలె నత్యంతభయంకరుఁడుగా నుండెను. ఆతనియెదుటకుఁబోయి నిలుచుండి మాటలాడుటకు జంకనివారరుదు. అభిరామస్వామి చాలమంది ఫాదుషహాలదర్బారులకుఁబోయి చూచియున్నవాఁడు. ఈకొత్వాలునిదర్బారు ఫాదుషహాలదర్బారులకంటెఁ జాలభయానకస్థానమని యభిరామస్వామికిఁ దెలియదు. కొత్వాలుపదవిలోని యనేకులు కారణమున్నను లేకపోయినను తమప్రభుత్వాధికారమును జూపి తమకెదురుగవచ్చినమనుష్యులను బట్టి దండించి తమధర్మమును విధ్యుక్తముగా నెరవేర్చినట్లు సంతోషించుచుందురు. అట్టివారిలోఁ జేరినయద్భుతచర్యలుగల యాకొత్వాలుకడ కభిరామస్వామి తన యనుచరులతోఁగూడఁ బోయి నిలుచుండెను.

అభిరామస్వామిచేసినయభియోగవిషయములనన్నిఁటిని విని యాకొత్వాలు "వీరందఱును నితరదేశమునుండివచ్చినచోరులు.

ఈసన్యాసి నిశ్చయముగా ప్రాఁతచోరుఁడు. (K. D.) సుప్రసిద్ధచోరుఁడు. అందుచేతనే యీతఁడు సన్యాసివేషమునుదాల్చి నిజస్వరూపమును గప్పిపుచ్చ యత్నించుచున్నాఁడు. వీరందఱు నిచ్చటకు దొంగతనముచేయుటకై వచ్చియున్నారు. తమదుష్కృత్యములు వెల్లడియగునను భయముచేఁ దమసాత్వికత్వమును లోకమునకు ముందే తెలుపవలెననుకృత్రిమోద్దేశముతో నీయభియోగమును జేయుటకై వచ్చినారు" అని నిశ్చయముచేసెను. అత్యంతసమర్థుఁడగు నా కొత్వాలీరీతిగ నొకవిలక్షణసిద్ధాంతమును జేసికొని తత్క్షణమే "ఈసన్యాసిని, అనుచరులను గొంపోయి చెఱసాలలో వేయుఁడు." అని తనసేవకులకాజ్ఞయొసంగెను.

అభిరామస్వామి ఘోరవిపత్తునఁ బడియెను. చోరుల వృత్తాంతము తెలియనిమ్ము, తెలియకపోనిమ్ము—పోయినవస్తువులు దొరకనిమ్ము దొరకకపోనిమ్ము—అతనికిప్పుడవియేవియు నక్కఱలేదు. అవకాశముచిక్కినేని పాట్నానగరమునకుఁ బోవలయును. పోయిన చో సంగతులన్నిఁటిని నవాబునందినికిఁ దెలిపి విహితకార్యములను జేయవచ్చును. అందువలన కొంతకాలము వ్యవధియగును. పదిదినములధికముగఁ గాలవిళంబము కావచ్చును. అంతకాలము పనియాఁగిపోవును. కాని పదిదినములు వ్యవధియైనందువలన నష్టమేమియును లేదని యాతఁడనుకొనియెను.

అభిరామస్వామి కొత్వాలునితో నొకవిషయమునుగూర్చి యేమియో చెప్పఁదొడంగెను. కాని, యాతనిమాటను వినువారెవరు? స్వామినోటనుండి మాట రాకపూర్వమే కొత్వాలు "ఈచోరులను గొనిపోయి కారాగారమునఁద్రోయుఁడు." అని కర్కశభావముతో నాజ్ఞయొసంగెను. అభిరామస్వామి విపదంబుధిలోఁ బడిపోయెను. అ

నుచరులతోఁగూడ బందీకానలసివచ్చెను.

ఆచెరసాల కసవుతో నిండి దుర్గంధమయమై యంధకారావృతమై భయంకరముగా నుండెను. అందుఁగూర్చుండి వారందఱు నీక్రీతిగ యోచింపఁదొడంగిరి. "ఇఁకముందు మనలనందఱను వీరు ఖాజీకడకుఁ గొనిపోయెదరు. ఖాజీసాహెబు కొత్వాలుమహాశయునికంటెఁగూడ సూక్ష్మదర్శి. అందుచే మనకిఁకఁ గారాగారవాసశిక్ష తప్పదు. కావున మనమెట్లయిన నిచ్చటనుండి తప్పించుకొనిపోవుటయే శ్రేయ" మని యోచించుకొనిరి. ఎట్లయినఁ బారిపోవలయునని సిద్ధాంతము చేసికొనిరి. కాని, దానికేమియుపాయమున్నది? పలాయనమైపోవలయునని నిశ్చయించుకొనినపిదప నొకఁడు "ఆగదిగుమ్మమునకువైచిన యినుపకమ్మి పరిశోధించి నూడఁగొట్టవచ్చుననియు, ఆకమ్మి నాధారముచేసికొని యొకనిపైనొకఁడెక్కి గోడపైనున్న కిటికి నూడఁగొట్టవచ్చుననియు పిమ్మట దానినుండి యొక్కరొక్కరుగ నందఱు నావలకు దాటిపోవచ్చుననియు నాలోచనము చెప్పెను. అదిసంభవమేయని యందఱు నొప్పుకొనిరి. మొదటనాలోచన చెప్పినయాతఁడు తలుపుబందు నూడఁదీయఁదొడఁగెను. క్రిందటి దినమున వారెవరును భుజించియుండలేదు. అగ్నిమూలమున మిగులశ్రమఁగొని దగ్ధప్రాయులై యుండిరి. ఈదినమునను నన్నములేదు. మొదట నాలోచన చెప్పినయాతఁడు నుడివినరీతిగ నన్నియు ననుకూలమయ్యెను. క్రమక్రమముగ నొకనిపైనొకఁడు నిలుచుండి శ్రమపడి యెట్లయిననేమి గోడపైనున్న వెలుఁగునిచ్చుకిటికితోవను పెద్దదిగాఁజేసిరి. నిర్విఘ్నముగా నందఱు నీవలఁబడినచో నాయార్వురిలో ముచ్వురు మరలఁ బాట్నానగరమునకేగి నవాబునందినితో జరిగినయావదుదంతమును దెలిపి యామెయాజ్ఞానుసారముగ

ముందుకార్యములను నిర్వహింపవలయుననియు, అభిరామస్వామి మి-
గిలినయిరువురితో నాగ్రానగరమునకుఁ బోయి, ఏయుపాయముచే
నైనను షాదుషహాదర్బారునందు జగత్సింహుని విషయమునుగూర్చి
ప్రస్తావింపవలయుననియు, మఱియుసమయమునిరీక్షించుచు నయేషా
యాజ్ఞానుసారముగాఁ గార్యమును నిర్వహించుకొఱ కచ్చటనే యుం
డవలయుననియు నేర్పాటులను చేసికొనిరి. అర్ధరాత్రమున రంధ్ర
పథమున నొక్కొక్కఁడుగ నీవలఁబడి యెవరికిని గనఁబడకుండ మి
గులజాగరూకతతో వారందఱును బలాయనులైరి. రాత్రియంత
యును విసుఁగులేకుండ నడచి నగరమునకుఁ జాలదూరమునందున్న
యొకమహారణ్యమధ్యమునకు వచ్చి చేరుకొనిరి. సూర్యోదయము
నకుఁ బూర్వమే వారు రెండుతెగలుగ విడిపోయి ముగ్వురు పాట్నా
నగరాభిముఖులై నడచిరి. అభిరామస్వామియు మఱియిద్దరును నా
గ్రాభిముఖులై పోయిరి. అందఱును భిక్షావృత్తి నవలంబించిరి. ఔ
రా! కాలమహిమ! తానొకటిదలఁచిన దైవమొకటిదలఁచెనుగదా!

పాట్నానగరాభిముఖులైపోయినవారు యథాకాలమున గ
మ్యస్థానమును జేరఁగలిగిరికాని వారేకార్యమునుఁ జేయలేకపోయిరి.
వారు తిన్నగా తాజఖానునిగృహమునకువచ్చి కనుఁగొనిరి. నవా
బునందిని బందీయై మానసింహమహారాజు ప్రాసాదమున నున్నట్లు
వారికిఁ దెలియవచ్చెను. ఆమెను జూచుట కవకాశము లేదు. కారా
గారవాసియైనజగత్సింహుని దర్శించుటకును వారికి శక్యముకాక
పోయెను. అందుచే వారికిఁ జేయునదిలేక కార్యాంతరముల నవ
లంబించి పొట్టపోసికొనుచు జీవమును నిలుపుకొనుచుండిరి.

ఇఁక నిచ్చట నభిరామప్రముఖు లరణ్యమార్గమునుబట్టి యా
గ్రాభిముఖులై తమప్రయాణమును సాగింపనారంభించిరి. మధ్యాహ్న

వేళఫలములు మొదలగు వన్యపదార్థములతోడను, నదీజలముతోడను హాయ తమక్షుత్పిపాసలను నివారణచేసికొనుచుండిరి. రాత్రులు చెట్ల పై కొమ్మలలో నొకదానికిఁ దమదేహమును భద్రముగాఁ గట్టుకొని కునుకుచు గడపుచుండిరి. ఈవిధముగ రెండుదినములు గడచిపోయి నవి. మూఁడవనాఁటియుదయమునకు వారలాగ్రానగరసమీపమందలి యమునానదికుత్తరభాగముననున్న మహారణ్యమునకు వచ్చిరి. ఆస్థల మున కుత్తరపుదిక్కుననుండు వేఱొకఘనారణ్యమునుండి యొకమా ర్గము వచ్చి యభిరామస్వామిమొదలగువారువచ్చినమార్గముతో నచ్చటఁ గలిసికొనియెను. వారచ్చటకువచ్చుట కించుకపూర్వ మ శ్వారోహకులుకొందఱామార్గముగుండవచ్చి వెళ్లినట్లుఁ గన్పట్టు చుండెను. పదచిహ్నములను బరికించిచూచినచో నొకటిరెండునిమిష ములకుఁ బూర్వమే యశ్వము లాదారిని బోయినట్లు తోఁచుచుం డెను. అట్టిమహారణ్యమున నట్టిసమయమున నశ్వారోహకు లట్లుపో వుటకుఁ గారణమేమో తెలిసికొనవలయునని యభిరామస్వామి తన యనుచరులతో వడివడిగ ముందునకు నడచిపోయెను. ఇంచుకదూ రమేగునప్పటికి గుఱ్ఱములు దక్షిణపుదిక్కునకు మరలి వేఱుమార్గము నఁ జనినట్లుగఁ గన్పట్టెను. ఆమార్గమున బోవుట కభిరామస్వామి కిష్టములేకపోయినను తనకౌతూహలమునుదీర్చుకొనుటకై తనయను చరులతో నాతఁ డామార్గమున జనియెను.

కొంచెముదూరముపోయినపిదప నాతని కశ్వపదాంకమొ క్కటియును దృష్టిగోచరముగాలేదు. ఆపార్శ్వమందలి ఘనవనాంత రమున నొకప్రక్క గుల్మలతాదులు తునిఁగియు వృక్షశాఖలు వి ఱిగియు గన్పట్టెను. అచ్చట తీగెలు నాకులు మొదలగునవి తునిసి పడియుండుటఁజూచి యచటఁ మనుష్యులెవరో తిరుగాడుచున్నారని

యు. గుఱ్ఱములు మేయునప్పు డవియట్లు చెదరిపడియుండవచ్చునని యు నభిరామస్వామి యూహించి తెలిసికొనియెను. అతికుతూహల భావముతో మరికొంత దూరము ముందునకుఁబోయి తనరక్షకులలో నొకనిఁజూచి "మిగులజాగ్రత్తగఁబోయి విశేషము లేమియో తెలిసి కొని త్వరలోరాఁగలవా ? "అనియభిరామస్వామియడిగెను.

అభిరామస్వామియు నొకపరిచరుఁడును నొకరహస్యస్థలమును గురుతుగానేర్పఱచికొని యచ్చటఁ గూర్చుండియుండిరి. రెండవవాఁ డచటినుండి బయలువెడలి ధ్వనియగుచున్న యామార్గముబట్టి పోయె ను. ఇఁట వీరిరువురు నొకమూహూర్తకాలముఁ గూర్చుండి "ఆతఁ డింకనురాలేదేమి చెప్పుమా?" అని యోచించుకొనుచు కళవళమొం దుచుండిరి. ఇంతలో నాతఁడును వచ్చెను.

అభి—"ఏమైనఁగనఁబడియెనా?"

"ఒక్క—శుభసమాచారము"

"ఏమది?"

"మనయాఱుగుఱ్ఱములు—"

"(ఆశ్చర్యముతో) ఏమి! చెప్పుము. చెప్పుము."

"నేను బాగుగాఁ బరికించిచూచితిని. ఆయశ్వములాఱును మనవియేయగును. లేశము ననుమానము లేదు."

"మనుష్యులెందఱున్నారు?"

"పదిమందియున్నారు. మన చెంబులు మొదలగు సామానులన్నియు వారికడనున్నవి. వానినన్నిఁటిని బాగుగాఁ జూచితిని."

"అస్త్రశస్త్రము లేమైన నున్నవా?"

"అందఱియొద్దను కత్తి, చురియ, మొదలగునాయుధములున్నవి."

అభి — ఇప్పుడు తెలిసినది. మనసర్వస్వమును దొంగిలించినవారు వారేయగుదురు. వారినిబట్టికొనినచో మనవస్తువులన్నియు దొరకఁగలవు.

ఒకఁడు — ఔను. అందుల కించుకంతయును సందియము లేదు. కాని, యదియెట్లుసంభవమగును?

అభి — మీారిరువురు నీయడవియందేయుండి చోరులను జూచుచుండవలయును. అట్లుచేయుటకు మీాకేమైన సందియమున్నదా?

ఒకఁడు — అట్లేచేయవచ్చును. కాని మీారేమిచేసెదరు?

అభి — ఈమార్గముగుండఁబోయి కొంచెముపశ్చిమముగఁదిరిగి నడచినచో నట యమునానదికలదు. యమునానదినిదాటినచో నాగ్రకుఁబోవచ్చును. నేనాగ్రకుఁబోయి యచ్చటినుంచినర్కారు సిపాయీలను తీసికొనివచ్చెదను.

రెండవ — మరల కొత్వాలుకడకుఁబోయి చెప్పవలయునా యేమి?

అభి — అవును. చెప్పవలయును. కాని యన్నితావులయందును కానపురపుమహాత్ముని వంటికార్యదక్షులును, యుక్తాయుక్తవిచక్షణులునే యుందురని తలంపవలనుపడదు. ఆగ్రానగరము రాజధాని, అచ్చట కుశాగ్రబుద్ధులును వివేకవంతులు నుందురు. కొత్వాలువలనఁ గార్యసిద్ధికాకపోయినచో మనకింక వేఱుమార్గము లేనేలేదని తలంపరాదు.

రెండవ — మీారు తిరిగివచ్చువఱకును, లేదా మీాసమాచారము మరలమాకుఁ దెలియువఱకును మేమిచ్చటనేయుండి చోరులగతివిధానములను తెలిసికొనుచుందుము. కాని దొంగలిచ్చటనుండి వెడలిపోవుచుండినచో మేమేమిచేయవలయును?

అభి—మంచిమాటనడిగితివి. మీలోనొక్కఁడు చోరులను వెంబడించి వారివెనుకనే దూరముదూరముగఁ బోవుచుండవలయును. ఒక్కఁడిక్కడనే యుండవలయును. తస్కరు లిటనుండి వెడలిపోయి, వేఱొకతావున విడిసినతోడనే వారివెనుకనేపోయి వారు నివసించినస్థలము, మార్గముమొదలగువానినిగూర్చి తెలిసికొని యాతఁడు మరలనిక్కడకువచ్చి యిక్కడనున్నవానితో నావివరములనన్నిఁటిని దెల్పి మరల ముందునకుఁబోవుచుండవలయును.

మొదటి—మీయుద్దేశము తెలిసినది. మేమట్లే కార్యములను నెరవేర్చుచుందుము. కాని యాచోరులు చాలదూరముపోయినచో వెనుకకువచ్చి మరల ముందునకుఁ బోవుట కెట్లువీలుపడును? తుదకు వారియానుపానులు తెలియకుండఁ బోవునుగదా!

అభి—అదియు నాలోచింపవలసినదే. ఇప్పుడేడుగంటలైనది. నేనాగ్రాకుఁ జేరునప్పటికిఁ బండ్రెండుగంటలగును. అచ్చటఁ గార్యములన్నియుఁ జక్కనగునప్పటికి రెండుగంటలకాలముపట్టవచ్చును. సాయంకాలమగునప్పటికిఁ దప్పకుండ నేను మరల నిక్కడకు వచ్చెదను.

అట్లయినచో నిఁక నేమియు సంశయింపనక్కఱలేదు. ఆచోరులు మూఁడుదినములనుండి నడచినడచి వచ్చి యిక్కడ విడిసియున్నారు. వారెవ్వరు నంతగా కాతరమునొందుచుండుట లేదు. వారీనాఁడిచ్చటనే యుందురనుటకు సందియము లేదు.

అభి—వారిక్కడనే యుందురని నానమ్మకము. వారిక్కడనేయుండి యొక్కొక్కఁడే యాగ్రాకుఁబోయి క్రమక్రమముగ నశ్వములను రత్నములను విక్రయించెదరు. వారికాయుద్దేశమే లేకపోయినచో రాజధానియగునాగ్రామార్గమునుబట్టి వచ్చి యింతసమీ-

పములో విడియరు.

మొదటి—విూరు సెలవిచ్చినది సరియైయుండుననియే తోఁచు చున్నది.

అభి—విశేషముగ మాటలతోఁ బ్రయోజనము లేదు. నేని ప్పుడేపోయెదను. సాయంకాలమునకు రాకపోయినచోఁ దుదకుఁ దె ల్లవారుసరికైనను నేనొక్కఁడనైనను తప్పక వచ్చితీరెదను. సందే హము లేదు. విూరు జాగరూకులై యుండవలయును.

అభిరామస్వామి వెడలిపోయెను.

---

## ఏడవ ప్రకరణము.

---

పాట్నానగరమున మానసింహమహారాజుచే నేర్పఱుపఁబడిన యొక మహాభవనమునం దయేషా సంపూర్ణస్వేచ్ఛతో నివసించియుం డెను. ఊర్మిళామహారాజ్ఞియు ననేకవిధముల నామె సుఖముగాఁగా లముగడపుటకు సదుపాయములనన్నిఁటిని సరిగా చేయించుచుం డెను. ఆమె స్వయముగ ననేకపర్యాయము లయేషాకడకువచ్చి చూచిపోవుచుండెను. చాలసేపామెతోఁగూర్చుండి మాటలాడుచుం డును. ఈప్రపంచమున నయేషాతో మాటలాడి ప్రీతిజెందనివారె వరు? అయేషాహృదయమునందలిసద్భావములను దెలిసికొని యూ ర్మిళ యత్యంతము విమోహితయయ్యెను.

రెండు నెలలుగడచిపోయినవి. సుఖదుఃఖసమ్మిశ్రితమైనకాల ము సమభావముతో గడచిపోవుచుండెను. పఠానులపరాజయవృ త్తాంతము లనుదినమును క్రొత్తక్రొత్తగ నయేషాకుఁ దెలియవచ్చు

చుండెను. స్వచ్ఛందమైన కారాగారమునందున్నను, సంతతమును
మొగలాయీలవిజయవృత్తాంతములును వానితోడనే యస్మాన్‌ఖా
నుని భయానకములగు ననంతపరాజయోదంతములును వినవచ్చు
చుండుటచే నయేషాహృదయము మిగులకళవళమొందుచుండెను.
అస్మాన్‌ఖాను విపద్గ్రస్తుఁడై యుండెను. ఇట్టికష్టకాలమునఁ దానొరి
స్సాదేశమును వీడివచ్చుట సరికాదనియు, నిట్టిసమయమునఁ బితృభ
వనమును వీడియుండుట తనకు శ్రేయస్కరముగాదనియు, నబాబగు
నస్మాన్‌ఖానునివిడిచి దూరముగానుండు టుచితముకాదనియు, నా
మె యోచించుకొనుచుండెను. ఈసమయమున నామె సమీపమున
నందున్నచో నస్మాన్‌ఖా నంతటియుత్సాహశూన్యుఁడై యుండఁడు.
వివేకావివేకవిచారమునఁ దప్పుమార్గమును ద్రొక్కియుండఁడు.
పఠానులపరాజయమునకుఁ దానేకారణమని యయేషా తనమనసున
భావించుకొనుచుండెను. అస్మానుఖా నయేషాయెడల నత్యంతకరుణా
మయుఁడు, అవిచలితప్రేమమయుఁడు. అట్టిసుహృద్వరున కట్టియా
పదలువచ్చినప్పుడు దూరమునసుండి చూచుచు నూరకుండుటచేఁ
దాను మిగులఁ గృతఘ్నురాలనని యామె తలపోయుచుండెను.

ఒరిస్సాదేశమున మానసింహమహారాజా సంపూర్ణవిజయ
మునొందినాఁడనియు, అస్మానుకాను సర్వవిషయముల నక్బరుషా
మహా యధికారపాశముచే బద్ధుఁడై యున్నాఁడనియు నయేషాకు
తెలియవచ్చెను. అందుచే నస్మానుఖానింకనుప్రాణములతో నిలిచి
యున్నాఁడని యామె తెలిసికొనియెను. తేజస్వియు, సాహసికుఁడు
నగు నావీరాగ్రేసరుఁడు ప్రాణములతో నిలిచినామెపాలిటికిసర్వము
నున్నట్లే మను. ఉత్కళవిజయియైన మానసింహుఁడు పాట్నానగరా
భిముఖుఁడైనాఁతనియుఁ త్వరలోనే రాజధానికి వచ్చుననియు నయే

పోకు వార్త వచ్చెను.

రాజనైతికప్రయోజనార్థమై తా నవరుద్ధనైతినని యయేషా తెలిసికొనియెను. ఆమె తనచేఁజిక్కినదనువార్త తెలిసికొనినచో నయేషా యుద్ధముచేయక తమయధికారమున కంగీకరించునని మానసింహుఁడు యోచించుకొనియెను. మఱియొకవిధముగ నయేషాయవరోధము మానసింహునికార్యసిద్ధికి సాహాయ్యమే యయ్యెను. అయేషా తనసమీపముననుండకపోవుటయేగాక మానసింహునిచే నవరుద్ధయయ్యెననువార్తనువిని యస్మాన్ఖాను విచలితుఁడై విషయజ్ఞానరహితమును హితాహితవివేకశూన్యము నగు కార్యములను చేసెను. అందువలన మహారాజున కనుకూలఫలమేలభించెను. అది యెట్లయినఁగానిమ్ము. ప్రకృతమున నారాజనైతికప్రయోజనము ముగిసినట్లు తోఁచుచున్నది. బహుశః మానసింహమహారాజు పాట్నాకుఁ దిరిగివచ్చినతోడనే యయేషాను విడిచిపెట్టఁగలఁడు.

ఈమొదలగుచింతనలతోడను, ఆశలతోడను నయేషా కాలము గడపుచుండెను. మూఁడుగంటలవేళ సుసజ్జితమైనయొకప్రాసాదమున నయేషాయొక్కతె యెకూర్చుండి ముందుజరుగఁబోవు తనస్థితిగతులనుగూర్చి యేమేమో యోచించుకొనుచుండెను. ఇంతలోఁ బార్శ్వమునందున్నద్వారముకడ నొకపరమసుందరనారీమూర్తి యయ్యెమెకు దృష్టిగోచరమయ్యెను. ఆస్త్రీ లోపలకువచ్చెను. అయేషాయును సంభ్రమముతోఁ బీఠమునుండి లేచి యాస్త్రీమూర్తికెదురుగఁ బోయెను. ఆస్త్రీయును వేగమ్ముగా ముందునకువచ్చి యయేషావక్షమునఁబడియెను. ఆసుందరులిరువురును జాలసేపు పరస్పరాలింగనముఁజేసికొని యట్లే నిలువఁబడియుండిరి. వారిరువురినే

త్రములనుండియు నశ్రుధారలు పరంపరగా వచ్చుచుండెను. క్రొత్తగావచ్చిన యాసుందరి తిలోత్తమయే !

అయేషా మొదట మాటలాడుటకుఁ బ్రారంభించెను. “నేను నిన్ను మరలఁజూచుట సంభవించునని యెన్నఁడు ననుకొనలేదు. నీ యదృష్టము ప్రసన్నమైనది. నీకు నీమామగారిగృహమునఁ దావు దొరకినదనుశుభసమాచారమును విని సంతోషించితిని.”

అయేషావక్షఃప్రదేశమునుండి తిలోత్తమ తనమస్తకము నెత్తికొనియెను. అపారవివేకమును, అనుపమానతేజస్వితను సూచించునయేషాముఖమండలమువంక నొకసారి యామె తనదృష్టిని సారించి “అదృష్టమెట్లుప్రసన్నమైనది ? ఆయన యింకను గారాగారమునందే యుండిరిగాదా !” అనియెను.

చీరచెఱఁగునుముఖముపైఁ గప్పుకొని చిన్నబిడ్డవలెఁ దిలోత్తమయేడువనారంభించెను. అయేషా యామెహస్తమును బట్టుకొని ముఖమును, నేత్రములను దుడిచి పిదప నామెను తనసమీపముననున్నపీఠముపైఁ గూర్చుండఁబెట్టికొని తానామెపార్శ్వమునఁ గూర్చుండి “విచారింపకుము. వీరపత్నులెన్నియోదుఃఖములను దుర్దశల ననుభవింపవలసియుండును. ఎంతయోధైర్యవతులై యుండవలయును. ఈసామాన్యవిపత్తునకే యింతకాతరమునొందుచుంటివా?” అనియెను.

తి—ఇంతటిక్లేశముతోఁ గాలమునుగడపుటెట్లు ? నాయీదుఃఖమునుజెప్పుకొనుటకు నాకీప్రపంచమున నెవ్వరునులేరు. అందుచే నీకడ నాదుఃఖమును జెప్పుకొనుటకై వచ్చితిని.

అ—మంచిపనిచేసితివి. “సోదరీ ! నిన్నుఁజూచుటచే నేను చాలసుఖినైతిని. నీయీదుఃఖదినములు త్వరలోనే పూర్ణముగా గడ

చిపోవును. రాజపుత్త్రికకు శీఘ్రకాలములోనే విముక్తిగలుగును.

తి—నీవట్లూహించుటకుఁ గారణములేవైనఁగలవా ?

అ—అభిరామస్వామి విజ్ఞాపనపత్త్రమును డిల్లీకిఁ గొంపోయి నాఁడు. ఆవిజ్ఞాపనము వ్యర్థముకాఁజాలదు.

తి—అతఁడు డిల్లీకెప్పుడువెళ్లినాఁడు ?

అ—రెండునెలలకుఁ బైగానైనది.

తి—అయినచో నింతయాలస్యమేమి ?

అ—మధ్య విఘ్నములుగల్గుటకుఁ గారణమేమియుఁ గాన్పింపదు. పాదుషహాదర్బారునుండి యాజ్ఞాపత్త్రికరావలయునన్నచోఁ గాలవిళంబముకాకమానదు. సోదరీ ! రెండునెలలుగాదు—నాల్గునెలలైనను బాధకమేమి ?

తిలోత్తమయించుకయాశ్చర్యపడి మనసులో "ఇదేమిపేరిమ ప్రదర్శకమైనమాట! నేనెవనినిమనసారఁ బ్రేమించుచుంటినో, యట్టి నాహృదయేశుఁడు శృంఖలాబద్ధుఁడై యంధకారమయమైనకారాగారమునందున్నాఁడు. ఆవిషయము తలఁపునఁబారినచో హృదయము వ్రక్కలైపోవుచున్నది. ఒక్కముహూర్తము—తుదకొక్కనిమిషమైనను ముందుగ నాతనికి విడుగడయయ్యెనేని, యది నాకుఁ బరమలాభముగాఁ బరిగణించుకొనెదను. నవాబునందిని రెండునెలలకుబదులుగ నాల్గునెలలను లెక్కించుచున్నదేమి?" అని యనుకొని ప్రకాశముగా "అక్కా! సర్వమును బోఁగొట్టుకొనినమైనను యువరాజు నీముహూర్తమునఁ జెఱసాలనుండి విడిపింపఁగలిగినచో నదియే మేలని నా యభిప్రాయము. రెండునెలలైనపిదప యువరాజు సకలైశ్వర్యములతోడను, కారాగారమునుండివిముక్తినొందునన్నను, అది కోరఁదగినదికాదని నాకుఁదోఁచుచున్నది" అనియెను.

అయేషాచిఱునగవుతో “ ప్రణయమహిమచే హృదయము సకట్లు తోఁచుచుండుటనిజము ” అనియెను.

తి—అట్లయినచో నీవు వేరువిధముగాఁ దలంచుటేమి?

అయేషా యించుకసేపధోముఖియై చింతించి పిదప నిట్లుచెప్పనారంభించెను. “ రాజపుత్రుఁడు వీరాగ్రగణ్యుఁడని నేనెఱుంగుదును. వీరులు తమదేహము తీక్ష్ణమైనకత్తిచేగాయపరుపఁబడినను దానినించుకంతయు మాత్రనగాఁ బరిగణింపరు. తమశిరస్సునొక్కపెట్టున తెగవ్రేయుటకై శత్రువులఖడ్గ మరుదెంచుచున్నను దానినిజూచి యించుకంతయును విచలితులుగారు. అట్టిమహాత్ములకు లోహశృంఖలములుగాని యంధకారమయమైనకారాగారముగాని లేశమాత్రమును భయజనకములుగాఁజాలవు. అజ్ఞానులగుమనవంటియాత్మీయజనులకది కష్టతరముగాఁదోఁచి దుఃఖించుచుందురు. ఆకష్టానుభవమునకుఁ గేవలము స్వార్థపరత్వముదక్క వేఱుకారణము లేదు. మనమనేకపర్యాయములు ప్రేమాస్పదునిహృదయమునకంటె నాతని శరీరమును మిక్కిలిగాఁ బ్రేమించుచుందుము. అందుచేతనే మనమాతనినిచూడఁజాలనప్పుడును, లేదా యాతఁడు మనసమీపమున లేనప్పుడును మనము మిగులవ్యాకులపడుచుందుము. అట్టియుద్వేగము వలనఁ బ్రయోజనమేమో నాకుఁ దోఁచుటలేదు.

తి—నీవు చెప్పినదంతయు సత్యము. వాస్తవముగా రాజపుత్రునిక్షణవియోగమునుసైతము నేనుసహింపఁజాలను. అది స్వార్థపరత్వముయొక్క ఫలమైనచో నిజముగా నేను స్వార్థపరనేయగుదును. అక్కా! నిన్నొక్కవిషయమునుగూర్చియడుగ సాహసించుచున్నదానను. నీవును రాజపుత్రుని యథేష్టముగాఁ బ్రేమించుచుంటివిగదా? నాకంటె నీవును [illegible] దేమి?

అయేమాయవసంతముఖియై తిలోత్తమహస్తమును బట్టుకొని యెను. పిదప దనముఖమును వేఱుదిక్కునకుఁద్రిప్పుకొని యిట్లనియె ను. "సోదరీ! నీవాక్యములను విని నేను సంతుష్టచిత్తనగుట లేదు. నేను యువరాజును ప్రేమించుచున్నాననుమాట నిశ్చయము. ఆ నా ప్రేమ యనంతమైనది; అపారమైనది; గభీరమైనది. కాని, యీ ప్రపంచమునందావిషయము నెవ్వరు నెఱుఁగరు. ఎఱుంగవలసినసంభ వమును లేదు. దైవవశమున నాహృదయమించుక విచలితావస్థ యందున్నప్పుడు యువరాజుసమక్షమున నేనే దానినివ్యక్తముచేసితి ని. అట్లుచేయవలసివచ్చినందులకు నేనెంతయో సిగ్గునొందుచున్నదా నను. ఆవిషయమును నీవెవరితోడను చెప్పఁదగదు. నీవు పలుమారు యావిషయమునుజ్ఞప్తికిఁదెచ్చుకొనుచుండవలదు. నీవాసంగతిని బూ ర్ణముగా మఱచిపోవలయును. ఇవే నాప్రార్థనలు.

తి—అక్కా! అదేమి? దానిని మఱచిపోఁగలవా? ఆవిష యము నితరులకేల తెలుపఁగూడదు? ప్రేమ దోషాకరమైనదికా దు. ప్రేమించినచోఁ బాపమున్నదా? అందులకు నీవేలసిగ్గుపడు చుంటివి?

అ—సోదరీ! నీకునేఁజెప్పునదేమన,—ప్రేమ, లేక ప్రణయ మనునది ప్రాయములలోఁ బ్రాణపదార్థము. అతిసావధానముగఁ బ్రయత్నపూర్వకముగ వానిని ప్రాణములలోసమిడ్చి యుంచఁదగి నపదార్థమని తెలిసికొనవలయును. దానిని బహిరంగముచేసి ప్రపం చమంతటను వెల్లడిసేయుచువచ్చిరేని యది నిస్సారమైపోయి తుద కుఁ బరిహాసాస్పదమగును. అప్పుడది లజ్జాహేతువగును.

తి—ప్రణయము ప్రాణపదార్థమనుమాటయేమో నిశ్చయ మే. కాని, మనమెవరిని బ్రేమించుచుంటిమో, యతనికావిషయము

తెలిసినందువలన దోషమేమి? అతనికా ప్రేమ తెలియకపోయిన చోఁ బ్రేమించుటవలన సుఖమేమి?

అ—సోదరీ! అట్లయినచో నది పరిణయమును క్రయవిక్రయవ్యాపారమును జేయుట కారంభించినట్లగును. మన మెవరిని బ్రేమించుచుంటిమో వారికా ప్రేమను తెలియఁజేయఁదలంచితిమేని మన పరిణయమునకు బదులుగ నాతని పరిణయము నాకాంక్షించుచున్నామనుట స్పష్టము. పరిణయమునకుఁ బరిణయమును బడయఁగోరినప్పుడంగడియందలి యితరపదార్థములవలెనే పరిణయముకూడ నొక వ్యాపారపదార్థముగాఁ బరిణమింపఁగలదు. నేను నీకొక పదార్థము నిచ్చినప్పుడు నీవు దానికి బదులుగ వేఱొక పదార్థమును నాకొసంగితివేని యది యంగడివ్యాపారమనిపించుకొనును. మిక్కిలిపవిత్రమైన యమూల్యపరిణయమును, బదులువస్తువునుకోరి విక్రయించి యంగడిపదార్థమునుగాఁ జేయుట కేవలము లజ్జాకరమని నాయభిప్రాయము.

తిలోత్తమ తనహృదయమున పరిణయసంబంధమగు నాభావమతిమధురమైనదనియు, నత్యుచ్ఛ్రితమైనదనుట కించుకంతయును సందియము లేదనియుఁ దలంచి పిదప "మనమెవనిని బ్రేమించుచుంటిమో యాతని సుఖముకొఱకైనను నా పరిణయము నాతనికిఁ దెలుపుటుచితము" అనియెను.

అ—ఉచితమేయగును. కాని, చూడుము! మనమెవనిని బ్రేమించుచుంటిమో యాతఁడా ప్రేమననుభవించుట కాతురపడుచున్నప్పుడును ప్రేమాభావముచే దరిద్రుఁడై యున్నప్పుడును మాత్రమే మనప్రాణములయందలి పరిణయమును సంపూర్ణముగ నాతనికిఁ దెలుపుటుచితమగును.

తి—కాని, అక్కా! మనము స్త్రీలము. ప్రేమించుచుండు

టియే మనపని. మనమెవనిని బ్రేమించుచుంటిమో యాతఁడు ప్రేమాభావముచే దరిద్రుఁడుకాకపోయినను మనము సకలాంతఃకరణములచేతను నాతని నేల ప్రేమింపఁగూడదు? నిరంతరమును బ్రణయప్రవాహమున నాతని నేల తేలునట్లుచేయుచుండఁగూడదు?

అ—ప్రేమింపఁగూడదని నేను చెప్పుటలేదు. మనసర్వాంతఃకరణములచేతను ప్రేమించుచుండుటకు మనకధికారముకలదు. కాని, మనమెవనిని బ్రేమించుచుంటిమో యాతనికి మనప్రేమను దెలియనీయరాదు.

తి—అక్కా! నీవట్లనుచున్నావేమి? పురుషునిహృదయము సముద్రమువంటిది. ఆసముద్రమునందు మనప్రణయఘటములను ముంచి మనకుఁ గావలసినప్రణయము నేల తెచ్చుకొనఁగూడదు? మనుష్యజీవితమునందు సర్వమునకును ప్రణయము ప్రధానసుఖవిషయముగనున్నది. వలపుచేవలచుటయును, వలపుచేవలపించుటయును ననునీరెండును మనుష్యునకాతనిజీవితమునందు సర్వశ్రేష్ఠమైనయధికారములు. అక్కా! అయేషా! నీవు రాజపుత్త్రుని ప్రాణమువలె మనసారఁ బ్రేమించుచుంటివనుమాట నిశ్చయము. అట్లయినప్పుడు నీవు ప్రకాశముగా నాతనిని బ్రేమించి యేలసుఖపడఁగూడదు? రాజపుత్త్రుని మఱవరైనఁ బ్రేమించినచోఁ దిలోత్తమ దుఃఖించునని నీవొకవేళతలంచియుండవచ్చును. నీవట్లుయోచించినచో,—అక్కా! ఆసంబంధమైనయోచన కేవలము భ్రమాత్మకమైనదని నిశ్చయముగాఁ జెప్పుచున్నాను. నీయంతటిగుణవతియు, హితైషిణియు నగుస్త్రీ యువరాజును ప్రేమించినదనువిషయమును స్మరించుకొనినంతమాత్రముననే నాహృదయము పొంగియానందముచే నాదేహముపులకలెత్తుచుండును. నీవును నేనును నొ

కగుత్రియందుండు కెందుపూవులవలె వికసించియుండవలయునని నేను
సదా కోరుచుందును. శోభామయమైనయొక యుద్యానమునఁ బూవు
లెన్నివిధముల వికసించుటలేదు? ఒకగిరిహృదయమును భేదించుకొ
ని యెన్ని నిర్ఝరిణులు హృదయరంజకముగ గలగలధ్వనులను జేయు
చుఁ బ్రవహించుచుండుట లేదు? ఒక్కసాగరమున నెన్ని నదులు త
మ దేహముల నర్పించుకొనుచుండుట లేదు? నీవెవనిని బ్రేమించుచుం
టివో నేను నాతనినే ప్రేమించుచున్నదానను. ఇఁకముందు శరీర
ములు వేరయినను మనమిరువురము నొకేప్రాణముగలవారమై యొ
కేసహానుభూతికలవారమై యుండుటుచితము. అక్కా! నీవుకూ
డ యువరాజువక్షఃప్రదేశమున "కోహినూరు" వలె నెందులకుఁ
బ్రకాశింపఁగూడదు?

ఇట్లు చెప్పి తిలోత్తమ యయేషాకంఠమును గౌఁగిలించుకొని
యెను. అయేషాయు నాదరభావముతో నా మెగడ్డమును బట్టుకొని
నీవంటిసరళహృదయయగు స్త్రీనోటనుండి వచ్చువాక్యములన్నియు న
తిమధురములై హృదయరంజకము సేయుచుండును. నీవంటిగుణవతి
యైనసహధర్మిణి పార్శ్వవర్తినియైనప్పుడు యువరాజుజీవితమునందొ
కప్పుడును దీర్ఘనిశ్వాసమును విడువవలసినయావశ్యకముండఁజాలద
ని నానమ్మకము. కాని, సోదరీ! నీకొక్కభ్రమయుండెనని నాకుఁ బొ
డగట్టుచున్నది. నాప్రణయమును వేఱొకస్వతంత్రమార్గమున బెట్టి
నేనత్యంతము సుఖమునొందుచున్నదానను. ప్రేమించుటను నేనె
ఱుంగుదును. ప్రేమించి యమితానందమును నేననుభవించుచున్న
దానను. ప్రేమను సంపాదించుటకుఁగాని ప్రేమాడంబరమును గ
నపఱచుటకుఁగాని నాకిష్టములేదు. సోదరీ! నావిషయమును గూర్చి
యిఁక నీవెప్పుడును యోచింపవలదు. నేను క్లేశమునొందుచున్నానని

తలంచి నీవు విచారపడవలదు." అనియెను.

తి—(దీర్ఘనిశ్వాసమునువిడిచి) ఈసారి నీప్రాణసంయమన మెట్లుచేయఁగలదానవో నేనెఱుంగఁజాలకున్నాను. ఈప్రపంచము నం దెవ్వరును నిన్నుఁబోలినవారు లేరు.

అ—(విషాదసూచకమగుచిఱునగవుతో) నేను పాషాణహృదయను. ఈశుష్కనీరసపాషాణహృదయమున నీకోమలతకు స్థలము లేదు. ఆమాటల నటుంచుము. మనము చాలసేపటినుండి మనసంబంధములగుమాటలనే మాటాడుకొనుచున్నాము. రాజపుత్రునికారాగారవిముక్తి విషయమున నేను నిశ్చింతనై యున్నాను. నీవుకూడ నావిషయమున నిశ్చింతవై యుండవలయునని నాయభిప్రాయము.

తి—ఆవిషయమున నీకు సందియములేనప్పుడు నాకు విచారమేమిటులకు ?

పిదప నయేషా ప్రేమభావముతోఁ దిలోత్తమను గాఁగిలించుకొని యిట్లుచెప్పనారంభించెను "నాయీజీవితమున మరల నిన్నుఁ జూచుభాగ్యము నాకుండదు. నాసోదరుఁడు యుద్ధమునందుఁ బరాజితుఁడైనాఁడు. మహారాజుగారియనుగ్రహమువలన నేనిటనుండివిముక్తినొందినతోడనే యొరిస్సాదేశమునకు నాయన్నయొద్దకేగెదను. ప్రకృతమున సంభవించినయనేకకారణములచే నిఁకముందుఁ బఠానులును, మొగలాయీలును సద్భావముతో నుందురనునాశ నాకులేదు. బహుశః పఠానులు నశించిపోవుదురనియే తోఁచుచున్నది. పఠానులతోఁగూడ నయేషాపేరు విలుప్తమైపోయినను పోవచ్చును. ఒకవేళ నాకు మరణము సంభవించినచో మీకాసమాచారము తెలియుటకూడ సందేహముగాఁదోఁచుచున్నది. నాకు నీయీదర్శనమే తుదిసందర్శనమని నేను తలంచుచున్నదానను.

తి—అక్కా! అంతటిమాట యనఁబోకుము. చిరకాలము నిన్నుఁ జూచుచుండఁగలననెడియాశతో నున్నాను. చిరకాలము నా సుఖదుఃఖములు నీకుఁ దెలుపుచుండెదను. ఆపదలయందు నీసాహాయ్యమును వేఁడుకొనుచుండెదను. సంపత్కాలము వచ్చినప్పుడు నీతో సమభాగినినై సుఖానుభోగములనందెదను. అంతటికఠోరవాక్యములను పలికి నాయాశలన్నిఁటి నొక్కమాఱుగ నేలనిర్మూలముచేసెదవు?

అ—సోదరీ! మానవులు తమహృదయములయందాశాకాంక్షలు లేకుండఁజేసికొనినచో వారికది మంగళదాయకమగును. ఆశాకాంక్షలను త్రోసివేయుటకు నామనస్సునకు శక్తి కలదు. అందుచేత నేను కాతరమునొందుచుండుటలేదు. నీవును నానిమిత్తమై కాతరమునొందవలదని ప్రార్థించుచున్నాను.

ఇంతలో దాసియొక్కర్తు వచ్చి "మహారాజ్ఞిగారు మిమ్ములను దీసికొనిరమ్మని యాజ్ఞాపించినారు" అని విన్నవించెను.

తోడనే తిలోత్తమ లేచి నిలుచుండి యయేషాతో "నేనిఁకనిట నుండుట కవకాశము లేదు. భర్తృజననియగు నూర్మహాలాదేవిగారి యనుగ్రహముచే నిన్నుఁజూచుభాగ్యము నాకు లభించినది. అది యదృష్టముగా భావించుకొనుచున్నదానను. కాని, అక్కా! ఇందుచే నాకు సుఖముగలుగలేదు. నీవీదేశమునుండి వెడలిపోవుటకుఁబూర్వమింకొకసారి వచ్చిచూచెదను. అప్పుడు నీహృదయము వేఱుమార్గముననుసరించుటనుజూచి సంతోషించెదను. ఇప్పుడు నాకు సెలవొసంగుము" అనియెను.

అ—ఇంకొకసారి చూడఁగలిగినచో నేనును సుఖవతినయ్యెదను. నాహృదయము వేఱుమార్గముత్రొక్కుటను నీవు నాయీజ

నత్రమునందు చూడఁజాలవు. నీకు సర్వదా సకలసుఖములను గలుగఁ జేయవలయునని యీశ్వరుని ప్రార్థించుచుండెదను. మహారాజ్ఞి గారికి నాయనంతప్రణామములను నివేదింపుము. నేనీదేశమునువిడిచి వెళ్లుటకుఁ బూర్వము మనమింకొకసారి కలిసికొనఁగలిగితి మేని చరితార్థనయ్యెదను.

తిలోత్తమయు విషణ్ణభావముతో సెలవుఁగైకొని వెడలిపోయెను.

---

## ఎనిమిదవప్రకరణము.

---

ఒరిస్సాదేశమునుజయించి మానసింహమహారాజు పాట్నానగరమునకుఁ దిరిగివచ్చెను. అతఁడయేషాను సంపూర్ణముగా విడిచిపెట్టలేదు. కాని, పూర్వముకంటె నధికముగ స్వాతంత్ర్యమునొసంగి యింకకొలఁదికాలములోనే యామెను విడిచిపుచ్చెదనని చెప్పియుండెను. ఇంచుక స్వాతంత్ర్యమువచ్చినతోడనే యయేషా పాట్నానగరమునందలి యాత్మీయుల సమాచారములను తెలిసికొనియెను.

తాజఖానునికుటుంబములోనివార లయేషాను చూడవచ్చిరి. వారు చెప్పినదానినిబట్టి యభిరామస్వామిదౌత్యము నిష్ఫలమయ్యెననియు నాతనిచేతికొసంగినవిజ్ఞాపనపత్రము, ధనము, రత్నములు, వస్త్రములు, మొదలగునవన్నియును కానపురసమీపమున దొంగలచేతిలోఁబడిపోయినవనియు, నచ్చటనుండి యాతనితోఁగూడ వెళ్లిన మువ్వురురక్షకులుపాట్నాకు వెనుదిరిగివచ్చిరనియు, మనయభిరామస్వా

మియును మఱియు రుస్తుమును ఢిల్లీ కేగిరనియు నయేషా తెలిసికొనియెను. ఆసంగతులను వినినపిదప నామె తానచ్చటనుండి శీఘ్రముగ విముక్తినొందవలయునని తొందరపడఁజొచ్చెను. తానే స్వయముగ ఢిల్లీకిఁ బోవలయునని యామె నిశ్చయము చేసికొనియెను.

ఒకనాఁటిమధ్యాహ్నమున నయేషా యొంటరిగఁగూర్చుండి యొకయుత్తరమును వ్రాసెను. అంతవఱకును నామె కాస్వాతంత్ర్యము లేదు. ఆమె యెవరికిని నుత్తరములను వ్రాయఁగూడదు. ఎవరి యొద్దనుండియు నుత్తరములనుఁ దెప్పించుకొనఁగూడదు. ఇప్పుడట్టి స్వాతంత్ర్యమామెకు లభించినది. ఉత్తరము నించుకసేపటిలోనే వ్రాసిముగించెను. ఆయుత్తర మస్మానుఖానునకు వ్రాసెను. వ్రాసి యిట్లుచదువఁదొడంగెను.

"సోదరా! అస్మాన్!

అనేకయుద్ధములలో నీకుఁ బరాజయము సంభవించినదని విని యున్నాను. కాని, నేనావార్తవలన విశేషవిచలితను గాలేదు. ఏమనిన, నీహృదయబలమునందు నాకు విశేషవిశ్వాసమున్నది. రణరంగమునఁ బరాజయముగలిగినను నీహృదయమును జయించువీరు లెవ్వరును ప్రపంచమునందింతవఱకును పుట్టియుండలేదు.

నిన్ను విడిచి చాలదూరము వచ్చియుండుటవలన నేను మిగుల నన్యాయకార్యమును జేసినదాననగుచున్నాను. స్నేహమయమైన నీయాశ్రయమును విడిచివచ్చుటకు నాకించుకంతయు నధికారము లేదు, అట్టియధికార మిప్పుడును లేదు—ఇఁకముందునుండదు. చాల దూరము వచ్చినపిదప నాయపరాధ మెంతమహత్తరమైనదో నేను తెలిసికొంటిని. అందుమూలమున ననేకయాతనలకు లోనగుటయే గాక నిత్యమును నన్ను నేనే నూరారుమారులు నిందించుకొనుచున్నా

చూసను. నేనాస్వాతంత్ర్యమును గైకొనినందువలన నీహృదయమున కుఁ జాల వ్యథఁగలుగఁజేసితినని తలంచుచున్నాను. ఇంతేగాక, యం దుమూలమున నీచిత్తస్థైర్యముకూడ పోయియుండునని యూహించుచున్నాను. నాయెడలఁ జిరకాలమునుండి నీవు కరుణామయుఁడవై యున్నాఁడవు. నాయపరాధము క్షమింపఁదగినదికాదు. అందులకు సందేహము లేదు. కాని నీవు నన్నుఁ దప్పక క్షమించి యనుగ్రహించెదవని ధైర్యముతో నున్నాను. నాయీధైర్యము విఫలమగునా ?

నేనెందుకొఱకు నిన్ను విడచి వెడలివచ్చితినో యాప్రయోజనమును నీవు తెలిసికొనవలసిన యావశ్యకము లేదు. నాయాస్తినిగూర్చిన వ్యాపారములను చక్కఁజేసికొనుటకై కరుణామయమైననీయాశ్రయమును విడిచివచ్చితినని మాయమ్మవలన నీవు వినియుందువు. కాని తుచ్ఛములైన ధనసంపదలనాశించి, యయేషా స్నేహమయమైన నీసాన్నిధ్యమును విడిచిరాలేదు. నీయనుగ్రహముతో నీ ప్రపంచమునందలి సమస్తసంపదలను వినిమయముచేసికొనుట కయేషాకు సంభవముకాదు.

అత్యవసరమైనయేకార్యముకొఱకు నేను నీభవనమును విడిచి వచ్చితినో యాకార్య మింకను ముగియలేదు. ఆకర్తవ్యకార్యము స్వల్పకాలములోనే నెరవేరునని తోఁచుచున్నది.

నేనును శీఘ్రకాలములోనే నీకడకరుదెంచెదను. నేనెప్పుడెట్టులు వచ్చునదియు వెనుకనుండి నీపేర వ్రాసెదను.

అపారమగు నీస్నేహమువలనను, కృపవలనను నాదరమువలనను నార్ద్రీభూతమైననాప్రాణము, నాదారుణాపరాధమువలనఁ గలిగిననీక్రోధముచే శుష్కమైనదగునా ?

నీకూ సంభవించినదశావిపర్యయమునుగూర్చి నేనంతగా చిం

తించుచుండుట లేదు. ఈ రాజగౌరవమును దేవరియందును జిరస్థా యిగా నుండునది కాదు. ఆవిషయమును నేను బాగుగా నెఱుంగుదు ను. అది వచ్చుటకును బోవుటకు విశేషకాల మావశ్యకము లేదు. కాని, హృదయమహాత్మ్యమును నౌన్నత్యమును మాత్ర మెవ్వరును సులభముగాఁ బొందఁజాలరు. వానిని పొందినవాఁడే మానవులలో ధన్యతముఁడు నీహృదయ మసాధారణసద్గుణగణాశ్రయమని నేను బాగుగా నెఱుంగుదును. ఐహికములగు నైశ్వర్యసంపదలకు హాని వృద్ధులు తటస్థమైనప్పు డందుమూలమున నీకుఁ గలుగులాభనష్టము లేమియును లేవు.

ఈయవస్థాంతరమునందున్నప్పుడు నీకు సంభవించెడి యాతన లను, ఆపదలను నీవెంత ధైర్యముతో సహించుచుందువో నే నెఱుంగు దును. నీధైర్యమును సామర్థ్యమును, ఓర్పును, నసాధారణములైన వి. అవస్థాపరివర్తనము మూలమున వర్తమానకాలమున నీకు సంభ వించిన కష్టములకంటె వేయిరెట్లధిక కష్టకారణమైన హృదయజ్వాల ను పైకిఁ గనఁబడకుండ నీవు ధైర్యముతో మౌనముగా సహించు కొనుచు వచ్చుచుండుటను నేను బాగుగా నెఱుంగుదును. అందుచే నల్పమైనయీప్రకృతావస్థయందు నీవు ధైర్యము చెడియుండవనియే నాదృఢవిశ్వాసము.

ఈదుస్సమయమునం దతిశీఘ్రముగా నీయొద్దకు రావలయు ననియు, నవస్థాంతరమునందు నీహృదయము చెక్కుచెదరకుండఁ బర్వ తమువలె స్థిరమైయుండుటను గన్నులారఁ జూడవలయుననియు, నావశ్య కమైనచో సాహాయ్యముచేసి నీకు సంతోషముఁ గలుగఁజేయవలయు ననియు నేనెంతయో తొందరపడుచున్నదానను. స్థానాంతరమునకు వ చ్చిన నేను స్వల్పవిపత్తునకు లోనైతిని. దానిని నీవు వినియేయుందు

వ్రే. అందుచే నావిషయమునుగూర్చి యీయుత్తరమున వ్రాయలేదు. కాని తన్మూలమున నాకేమియు నష్టముకలుగలేదు.

చాలఁగా వ్రాసితిని. నాశతాపరాధములును చిరకాలము నుండి క్షమించుచువచ్చుచున్నాఁడవు. అతివినీతభావముతో మరల నాయీయపరాధములను క్షమింపవలయునని వేఁడుకొనుచు నుత్తరమును ముగించుచున్నదానను. క్షమింపుము.

ఇట్లు
అభాగిని.
అయేషా"

ఉత్తరమును సరిగా నస్మానుఖానున కంపుటకై తాజఖానునికడకంపెను. వేరువిషయములనుగూర్చి చెప్పవలసినదంతయు తాజఖానునకుఁ జెప్పుటకై నమ్మకముగలయొకమనుష్యునితోఁ జెప్పి యుత్తరమునాతనిచేతికిచ్చి పంపించెను.

ఆమె యచ్చటనే కూర్చుండి చింతామగ్నయయ్యెను. తాను శీఘ్రముగా నాయవరోధమునుండి విముక్తినొందుట యావశ్యకమైయుండినను, అందునిమిత్తము మానసింహుని వేఁడుకొనుట మంచిదని యామె యోచింపలేను.

---

# తొమ్మిదవ ప్రకరణము.

---

ఏదినమునమధ్యాహ్నమున నయేషా యస్మానుఖానునకుత్తరము వ్రాసెనో యానాఁటిసాయంకాలమున గొంచెమురాత్రియైనపిదప నూర్మెహాదేవియును మానసింహుఁడును రాజాంతఃపురమునకు రావ

లయునని యమేషాకు వర్తమానమంపిరి. అమేషాయును సంతుష్ట చిత్తయై యచ్చటకువచ్చుట కంగీకరించెను.

అమేషా రాజనగరునకు వచ్చినదనువార్త తెలియుటతోడనే యూర్మిళాదేవి ద్వారమువఱకు నేగి యామె నత్యంతసమాదరభావముతో నెదుర్కొని గౌరవించి తీసికొనివచ్చెను. అమేషా మహారాజ్ఞితోఁగూడ విశాలమై, మనోహరమైన యొకప్రాసాదములోనికరుదెంచెను. అచ్చట నొకరత్నసింహాసనముపై మానసింహుఁడొంటరిగఁ గూర్చుండియుండెను.

అమేషా లోపలికరుదెంచినతోడనే మానసింహమహారాజు సింహాసనమునుండి లేచి ముందునకువచ్చి యామెకూర్చుండుటకై యొకపీఠము నామెకుఁ జూపించెను. అమేషా కూర్చుండక యధోవదనయై మహారాజ్ఞిపార్శ్వమున నిల్చుండియుండెను. మహారాజ్ఞి యత్యాదరముతో నమేషాచేయిపట్టుకొని యటనున్న యొకపీఠము కడకుఁ దీసికొనివచ్చి దానిపై నొకప్రక్కఁ దానుగూర్చుండి యమేషాను వేరొకప్రక్కఁ గూర్చుండఁబెట్టికొనియెను.

పిదప మహారాజు తనసింహాసనముపైఁగూర్చుండి యమేషానుగూర్చి యిట్లుచెప్పఁదొడంగెను.

మా—బిడ్డా! నిన్నింతవఱకనేకకష్టములకు గుఱిచేసినందులకు నేనెంతయో సిగ్గుపడుచున్నాఁడను. ఈనిమిషముమొదలుకొని నీయిష్టమువచ్చినట్లు మెలంగవచ్చును. ఒకరాజకార్యవిషయమున నిట్టియుపాయమునవలంబించి నిన్నింతకష్టపెట్టుట గొప్పతప్పిదమేయగును. నీయవరోధమును తొలగించి స్వాతంత్ర్యమునొసంగితిననుసంగతిని నేనే నీకడకువచ్చి చెప్పవలయునని యనుకొంటిని. కాని, మహారాజ్ఞి నిన్నుఁజూడవలయునని యాశపడుచుండుటచే నావాంఛ

భీష్టానుసారముగ నిన్నిటకు రక్షించుటకై తొందరనొసంగుచు వర్తమానములనంపితిని.

అ—జననిమహారాజ్ఞి నన్ను స్మరించుచుండుట నాపరమసౌభాగ్యము. మహారాజుగారు సన్నీయవరోధమునుండి విడిపించినందులకు నేనెంతయుఁ గృతజ్ఞురాలనై యున్నాను.

మా—అమ్మా! ఇఁకముందు నీవేమిచేసెదవు? ఎక్కడకేగెదవు? ఎచ్చటనుండవలయునని నీయభిప్రాయము?

అ—బహుశః డిల్లీకేగెదను.

మా—డిల్లీయందుండవలెనని నీయభిప్రాయమా?

అ—అదేమి? అట్లుయోచించుచున్నారు?

మా—నీకు డిల్లీయందు పరిచితులనేకులున్నారని నేనెఱుంగుదును. బాదుషహాకూడ నిన్నెఱిఁగియుండునని తోఁచుచున్నది. నేనెఱిఁగియున్నంతవఱకు మొగలాయీలతోడనే నీకు విశేషసంబంధమున్నది.

అ—అందుచేత నేను డిల్లీయందుండుటయే శ్రేయస్కరమని తోఁచుచున్నదా?

మా—అంతేకాదు. భారతవర్షమునఁ బఠానులప్రాబల్యము విలుప్తమైపోయినది. ఒరిస్సాయందు నీతోసంబంధముగలిగియున్న పఠానులందఱు నిప్పుడతిదైన్యావస్థనొందియున్నవారు. అందుచే నీవు వారియాశ్రయమును విడిచిపెట్టుట విధియైయున్నది.

అ—(కొంచెము యోచించి) ఇప్పుడు మహారాజుగారు సెలవొసంగినదంతయును వినినపిదప నేనిప్పుడు పఠానులయాశ్రయమును విడువకుండటయే మంచిదని తోఁచుచున్నది. నాకెవ్వరు మొదటినుండియు నాశ్రయభూతులైయుండిరో, ఎవరు ప్రతిపాలకులైయుం

డిరో, నాయందెవరపారస్నేహకృపాదరములను గలిగియుండిరో, నాసుఖదుఃఖములయందెవరు సమభాగులై యుండిరో అట్టివా రిప్పుడు ఘటనాచక్రముయొక్క పరిభ్రమణముచే హీనావస్థనొందియున్నారని వారిని విడనాడుట న్యాయమగునా? వారలిప్పుడు హీనస్థితియం దున్నారుగనుకనే యవిచ్ఛిన్నముగా నేను వారితోఁగూడ నుండుట నాకత్యంతావశ్యకము. ఉచ్చదశయందున్నప్పుడు కూడనుండువారు వేనవేలుందురు. హీనావస్థయందున్నప్పుడు కూడనుండువారే బంధువులు. కృతజ్ఞులు.

మహారాజావాక్యములనువిని యించుకయప్రతిభుఁడయ్యెను. సరియైనప్రత్యుత్తరమునొసంగుటకు సమర్థుఁడుకాకపోయెను. మహారాజ్ఞియగునూర్మిళాదేవి తనవిభునియవస్థనెఱింగి యయేష్టాతో "నీవెచ్చలకును బోవలసినయావశ్యకము లేదు. నీవు మావస్తువవు. మాకాత్మీయవు. బిడ్డా! మాయొద్దనేలయుండఁగూడదు?" అనియెను.

అ—అమ్మా! నాపై నీకుఁగలయనుగ్రహమునకు మేర లేదు. కాని, నాప్రాణాకర్షణయు, నాకర్తవ్యబుద్ధియు నేను వేఱుమార్గమునుబట్టిపోవునట్లు నాకుపదేశము చేయుచున్నవి.

మా—ఒరిస్సాదేశమునకుఁ బోవలయునని నీకుద్దేశమున్నప్పుడు నీవు డిల్లీకిఁబోవుటెందులకు?

అ—కుమారజగత్సింహుని కారాగారమునుండి విడిపించువిషయమై యవసరములగుప్రయత్నములు సేయుటకు.

మా—అందునిమిత్తమిదివఱకే విజ్ఞాపనపత్రమంపఁబడెనని వినియున్నాఁడను. ఇప్పుడు నీవు మరల నచ్చటికిఁ బోవలసినయావశ్యకమేమి?

అ—దౌర్భాగ్యవశమున నావిజ్ఞాపనపత్రికాదులన్నియును జోరులచే నపహరింపఁబడినవి.

మా—మరలఁ గ్రొత్త విజ్ఞాపనపత్త్రమును వ్రాసి దానిపై నాతనిచే వ్రాలుచేయింపవలదా ?

అ—అక్కఱలేదు. నేనే స్వయముగాఁబోయి దర్బారునం దీవిషయమును బ్రస్తాపించి ప్రయత్నముచేసినచో విజ్ఞాపనపత్త్ర మక్కఱలేకుండఁగనే కార్యసిద్ధికాఁగలదని నానమ్మకము.

మానసింహుఁ డయేసానుడివినతీరున కార్యసిద్ధియగుట క భ్యంతరముండదని మనసునందనుకొని యిట్లనియెను.

మా—రాజాజ్ఞచే దండితుఁడైనయొకమనుష్యునకు నీవారీతి గ సాహాయ్యముసుచేసి యతిగర్హితకార్యమును జేయుచున్నావు. నీ వు స్త్రీవగుటచే నీయపరాధము నొకసారి క్షమించినాఁడను. మరల మరల నదేరీతియపరాధములు చేయుచున్నచో క్షమింపవలనుప డదు. నీవాప్రయత్నమును విడిచిపెట్టుము. నీవాప్రయత్నమును విడువకున్నచో నిన్నుఁగూడ దండింపవలసినవాఁడనగుచున్నాను.

అ—నన్నుదండించుటకు మీకు సంపూర్ణాధికారముకలదు. కాని, మీ రెప్పుడునట్లుచేయరు.

మా—ఏమి ?

అ—ప్రపంచమునం దెప్పుడును హితముచేయువారిని దం డించువారుండరు.

మా—నీవు నాయధికారము నుల్లంఘించి దానికి విరుద్ధమైన కార్యములను జేయుచున్నావు. నీవు మొట్టమొదట నాకుఁ దెలియఁ జేయకుండ నాయాజ్ఞనుబడయకుండ రాజదండనచేదండితుఁడైనయొ క మనుష్యునకు సాహాయ్యమును జేసితివి. అందువలన నిన్ను హితము

చేయుదానినిగాఁ బరిగణించు టెట్లు ?

అ—మహారాజుగారు వాక్కుచే సెలవొసంగునది యంతయును సత్యమేయగును. కాని, వారిమనోభిప్రాయముమాత్ర మట్లున్నదా? నిజముచెప్పవలసివచ్చినచో యువరాజును దండించుటయనునది యపారమైన మీరాజనీతికౌశలమును సూచించుటయే యని చెప్పవలయునుగదా! అందఱియెదుటను, విశేషించి యక్బరుషాహు మహాసమక్షమునందు మీరాజభక్తియును న్యాయనిష్ఠయుఁ గర్తవ్యపరాయణతయు స్పష్టముగాఁ దెల్లమగుటకై యొకసామాన్యకారణమును నెపముచేసికొని మీప్రియపుత్త్రిని నాజన్మాంతము బందీగా నొనర్చితిరి కాదా? ఇప్పటికనేకదినములనుండి మీహృదయమున యువరాజునకేయుపాయముచే విముక్తిగలుగునా యనుయోచన యుదయించి నిరంతరమును మీరు వ్యాకులపడుచుండుట లేదా? అట్లయినప్పుడు స్వతస్సిద్ధముగ మీకుపకారమును జేయనుద్యమించిన యీయబల మీకు యథార్థముగా హితకారిణియగునో కాదో నిజమానతిచ్చి యనుగ్రహింపవలయును.

మా—నీవు చెప్పినది సత్యమో యసత్యమో యావిచారణతో నిప్పుడు ప్రయోజనమేమియు లేదు. నీవు నాయిష్టానిష్టములను దెలిసికొని యాకార్యమునందు ప్రవృత్తవుకాలేదు. నీస్వార్థముకొఱకు రాజ్యనిబంధనలకు వ్యతిరేకముగాఁ గార్యమును చేయఁదొడఁగితివి. అందుకొఱకు నిన్నేల దండింపఁగూడదు ?

అ—నేను స్వార్థమునకే రాజపుత్త్రిని విముక్తికై ప్రయత్నించుచుండవచ్చును. కాని, యీకార్యమునందుమాత్రము నాస్వార్థపరతయును మహారాజుగారిస్వార్థపరతయును సమానములైనవి. అందుచే నాప్రయత్నము మహారాజుగారికి హితకరమైనది. అట్టి

సందర్భమున నన్ను మీరు దండించినచో మీహృదయమెప్పుడును సంతోషమును బొందఁజాలదు.

మానసింహమహారాజు మాటకు సరిగా మాటనందించుటకు సమర్థురాలుగానుండనసమర్థుఁడై యూరకుండెను. ఊర్మిళామహారాజ్ఞియు "నీవంటిగుణవతియగు కన్యను నేనెప్పుడును విడిచిపెట్టఁజాలను. నిన్నుఁ గోడలనుగా గ్రహించి సంసారమును చక్కగా నిర్వహించెదను." అనియెను.

అయేషాయును లజ్జచే నధోముఖియై యుండెను. ఊర్మిళాదేవి మరల నిట్లు చెప్పఁదొడంగెను. నీవు యవనకన్యవను నాక్షేపణము మాకేమియును లేదు. మహారాజుగారిదివఱకే ముసల్మానులసంబంధమును జేసియున్నారు. మరల నాసంబంధమభివృద్ధినొందినచో నష్టమేమియును లేదు." అనియెను.

అయేషా యధోముఖియై కూర్చుండియుండెను. ఊర్మిళాదేవి మరలఁ జెప్పనారంభించెను. "అమ్మా! మాటాడవేమి? నీరూపమును, గుణమును, బుద్ధియు ననదృశములు. నిన్నెవరుతమయాత్మీయురాలని చెప్పుకొందురో వారే ధన్యులు; వారే సుఖులు. నేనాసుఖము ననుభవింపకుండ విడిచిపెట్టఁజాలను—

అ—మీరు నాయందుఁ జూపుచున్న యనుగ్రహమునకుఁ బారము లేదు. నేను మీసేవకురాలను, కాని.

ఇట్లు చెప్పి యయేషా యూరకుండెను. ఊర్మిళ "కానియేమిటి? చెప్పుముతల్లీ!" అనియెను.

అ—కాని, నేనట్టియనుగ్రహమును బొందుటకుఁ దగినదానను కాను. నాకర్తవ్యమును, నాజీవితముయొక్క భవితవ్యగతియును నిదివఱకే దృఢముగా నిశ్చితములై యున్నవి.

మా—నీవు ఢిల్లీకిఁ బోవుటకుఁ బూర్వము జగత్సింహునిఁ జూడఁదలంచుచుండుట లేదా ? ఇష్టమున్న యెడలఁ గారాగారమునం దాతనిఁ జూచుటకు నీకిప్పుడే యాజ్ఞయొసంగెదను.

అ—అందువలన నేప్రయోజనమును గాన్పించుచుండుట లేదు. దయచేసి మీరిప్పుడే నాకు సెలవొసంగవలయును. రేపటియుదయముననే బయలుదేరి వెళ్లెదను. చేయవలసినకార్యము లనేకము లున్నవి.

ఊ—నీవీరాత్రి యిచ్చటనే యుండవలయును; రమ్ము. నిన్ను నాకోడలియొద్దకుఁ దీసికొనివెళ్లెదను. నీవామెయొద్దనుండవలయును. అచ్చటనీతో మాట్లాడెదను. రమ్ము.

అయేషాయును సంభ్రమముతో లేచి మహారాజునకు వందనము చేసెను. మహారాజ్ఞియు నామెహస్తమును దనహస్తముతోఁ బట్టుకొని యామెను దీసికొనివెళ్లెను.

మానసింహుఁడు గమనశీలయగు నయేషానుజూచుచు హృదయమునందు "ఆశ్చర్యమాశ్చర్యము ! ఈమెరూపసంపద దేవకన్యనుబోలియున్నది ! ఎంత సాహసము ! ఎట్టితీక్ష్ణబుద్ధి ! ఎట్టివాక్పటుత్వము ! ఎట్టినిర్భీకత ! ఆహా! ఇంతియేకాదు; ఎంతకోమలత్వము ! ఎంతసరళత ! ఎంతమధురత! ఎంతలజ్జాశీలత ! ఈసుకుమారి యేకులమునకుఁ గోడలగునో, యాకులము ధన్యతమమైనది. నాకంతటిమహాభాగ్యముకల్గునా ? " అనియనుకొనియెను.

## పదియవ ప్రకరణము.

---

అభిరామస్వామి మఱునాఁడు దయమగుసరికి కొత్వాలునితోడను మఱికొందఱుసిపాయిలతోడను యమునానదీపరిసరారణ్యమునకరుదెంచెను. చోరులందఱు నచ్చటనేయుండిరి. బిడారములనెత్తియుండకపోవుటచే వారందఱును సులభముగాఁ బట్టువడిరి. వారు దొంగిలించితీసుకొనిపోయిన ధనము, రత్నములు, విజ్ఞాపనపత్రము, ఉత్తరములు, పాత్రలు, మొదలగుసామానులన్నియు వారియొద్దనే యుండెను. ఆవస్తువులనేకాకుండ నశ్వములు, వస్త్రములు మొదలగువాని నన్నిఁటిని కొత్వాలుస్వాధీనముచేసికొని యింకను మిగిలినవస్తువులుసహితముగ దొంగలనుబట్టి బంధించి నగరమునకుఁ గొనితెచ్చెను. అభిరామస్వామియును దనయిరువురుసహచరులతోడను కొత్వాలుననుసరించి నగరమునకువచ్చెను.

అన్నియును సరిగానడచినవికాని, యభిరామస్వామియభీష్టసిద్ధిమాత్రము కాలేదు. తనధనరత్నాదులనన్నిఁటిని తనకొసంగవలయునని యాతఁడు కొత్వాలుతో విన్నవించుకొనియెను. వస్తువులుసహితముగాఁ జోరులు విచారణనిమిత్తము ఖాజీకడకంపఁబడిరనియు, విచారణమైనపిదప వస్తువులుగలవారి కీయవచ్చునని వారియుత్తరువుకావలసియుండుననియు, ఉత్తరువైనపిదపఁగూడ నీవస్తువులుమీవైనట్లు మీరు సప్రమాణముగా రుజువుచేయవలసియుండుననియు, నప్పుడైనను మీరీవస్తువులకు పూఁట యీయవలసియుండుననియు కొత్వాలాతనితోఁ జెప్పెను. అదివిని యభిరామస్వామి దశతాళప్రమాణమగునీటిలో మునిఁగినట్లయిపోయెను.

అభిరామస్వామికడ నొక్కపిడికాసయినను లేదు. కాని, స
న్యాసివేష మనేకవిషయములలో మానవునకు విశేషసాహాయ్య
ము చేయుచుండును. క్షుత్పిపాసానివారణార్థమాతఁడు భిక్షాటనము
సేయ నిశ్చయించుకొనియెను. ఆతఁ డొకయుచ్చపదస్థుఁడగు రాజ
పుత్రసైనికునియొద్దకేగి తనయవస్థయును జరిగినయాపద్వృత్తాంత
మును జెప్పి యేమైన ద్రవ్యసాహాయ్యముఁ జేయుమనియు, ఈమహా
పదనుండి విడివడుటకు సరియైనయాలోచనను జెప్పుమనియు వేఁడు
కొనియెను. ఆసైనికపురుషుఁడు స్వామి యవస్థనువిని యాతనక్ష
ణమే యొకరూపాయనొసంగి వస్తువులు మరల లభించెడివిషయమై
విహితమైనసాహాయ్యమును శక్తికొలఁదిఁ జేసెదనని వాగ్దత్తముచే
సెను.

నగరమునకు సమీపమునందున్న యమునానదీతీరమందలి యొ
కవృక్షచ్ఛాయయం దభిరామస్వామియు నాతనియనుచరులును తమ
జఠరజ్వాలలను కొంతవఱకు నివారణచేసికొనిరి. అచ్చటనే నివాస
ముగా నుండుటకు నిశ్చయించుకొని తనయనుచరులనిరువుర నటనుం
డనియమించి స్వామి మరలనగరమునకేగెను. నగరమునకేగి తనకుఁ
గనఁబడినగొప్పవారితోనెల్ల తనదుఃఖసమాచారమును జెప్పుకొనఁ
దొడంగెను. హిందువుఁడుగానీ మహమ్మదీయుఁడుగానీ యెవరుకనఁ
బడినను వారితోనెల్ల మానసింహునితనయుఁడగుజగత్సింహునకుఁ జెం
డ్రి శిక్షవిధించుట, ఆతనినివిడిపించుటకై తానువిజ్ఞాపనపత్రముం దె-
చ్చుట, ఉత్తరముమూలముగ నవాబునందినియగు నయేషా సాహా
య్యముం జేయుటయేగాక ధనము, రత్నములఁగూడ నొసఁగుట, కా
నపురారణ్యమున సర్వమును చోరులచే దొంగిలింపఁబడుట, ఒకమ
హోపాయముచేఁ జోరులనుగనిపెట్టి యావార్త కొత్వాలునకువిన్న

పించుట, కొత్వాలువారిని పట్టిబంధించుట, కొత్వాలావస్తువులను త
నకీయకపోవుట మొదలగునీసంగతులనే యేకరువుపెట్టుచుండెను. అ
భిరామస్వామి యిట్లందఱితోడను జెప్పుచుండుటచేఁ గొలఁదిదినము
లలోనే యీయుదంతము నగరమంతటను వ్యాపించెను. అత్యల్పకా
లములో నుచ్చపదస్థులైనగొప్పయధికారులకందఱకును నీసంగతుల
న్నియుఁ దెలియవచ్చెను. మొదటిదినమున ధనసాహాయ్యమును జే
సినసైనికునియొద్దకుఁబోయి ప్రతిదినమును నభిరామస్వామి యాత
నినిదర్శించుచుండెను. అతఁడును శీఘ్రకాలములోనే యభీష్టసిద్ధి
యగునని యభిరామస్వామికి ధైర్యము చెప్పుచుండెను.

ప్రతిదినమునను రెండువేళలను తప్పకుండ నభిరామస్వామి
కొత్వాలుకడకుఁబోయి చూచుచుండెను. కొత్వాలును తోడనే
సమస్తమును నెరవేర్చునట్లు మాటలు చెప్పుచుండెను. అతిచింతా
కులుఁడైయున్నయభిరామస్వామి శిరస్సుపై, ధైర్యము, సహాను
భూతి, సాహాయ్యముకొఱకువాగ్దానము, మొదలగున వనుదినమును
వర్షించుచుండెను. కాని, క్రియమాత్ర మించుకంతయును జరుగుట
లేదు. ఇంచుమించుగ మూఁడునెలలీరీతిగ గడచినవి. ఈనడుమ న
యేషా యాగ్రకువచ్చినదను వార్తనువిని యభిరామస్వామి తనమ
నోభీష్టము నెరవేరుట కనుకూలోపాయములు తటస్థించినవని సంత
సించెను.

అభిరామస్వామి విశేషప్రయత్నములనుజేసి యయేషానివ
సించియున్నస్థలమును దెలిసికొనియెను. స్థలమేమో తెలిసినది. కా
ని, యామెదర్శనముమాత్రము లభించినదికాదు. అయేషా యా
గ్రకువచ్చి యొకగొప్పయుమ్రావునిభవనమున విడిసియుండెను.
అభిరామస్వామికచ్చట ప్రవేశించుటకు మార్గములేదు. అనేకప్ర

యత్నములు చేయఁగాఁజేయఁగా నొక్కపరిచారిక స్వామివార్తను నవాబునందిని కెఱింగించెదనని చెప్పి వార్తను గొనిపోయెను; కాని, యామె తిరిగి రాలేదు. మఱియెవరును వచ్చి యమేషాయభిప్రాయము నభిరామస్వామికిఁ దెలుపలేదు. చేయునది లేక యభిరామస్వామి వికలచిత్తుఁడై యచ్చటనుండి తిరిగివచ్చెను.

అమేషాను చూడకపోయినను, నామె సమాచార మేమియును నాతనికిఁ దెలియకపోయినను, నభిరామస్వామియభీష్టసిద్ధి కనుకూలములగు నేర్పాటులు వానియంతటనవియే సులభముగా జరుగునని యాతఁడనుకొనుచుండెను. మఱునాఁడుదయమున నభిరామస్వామి కొత్వాలునుజూడఁబోయెను. కొత్వా లింతకుపూర్వమునకంటె హెచ్చుగౌరవముతో నభిరామస్వామినిఁ జూచి "చోరులయొద్దఁ దొఱికిన యుత్తరములు మొదలగునవి పంపవలయునని హుజూరుధర్బారునుండి సర్కారాజ్ఞయైనది. ఆజ్ఞానుసారముగా నాకాగితములన్నియు నచ్చటకంపఁబడినవి. ధనము, రత్నములు, నాయొద్దనున్నవి. వాని విషయమై యుత్తరవులేవియుఁ గాలేదు" అనియెను.

అభిరామస్వామియు నచ్చటనుండి తిరిగివచ్చి కార్యములన్నియును నమేషాప్రయత్నముచేఁ జక్కగా జరిగిపోవుచున్నవని యనుకొనియెను. తానన్ని దినములు ద్వారద్వారముకడకుఁబోయి తిరిగి విన్నవించుకొనినను సానుకూలముకాని కార్య మిప్పు డాకస్మికముగ ననుకూలమగుచుండుటకుఁ గారణమేమని యోచించుకొనియెను. అన్ని దినములైనపిదప యువరాజువిజ్ఞాపనపత్రము గమ్యస్థానముచేరినదని తెలిసికొని నిశ్చింతుఁడయ్యెను.

అభిరామస్వామియును మఱునాఁడు కొత్వాలుని జూడనేగెను. తానిఁక నాగ్రాయందుండవలసిన యావశ్యకము లేదనియు, నిష్ప

మున్నచో స్వదేశమునకుఁ బోవచ్చుననియు, తానాగ్రాకువచ్చిన కార్యవిషయమై యథాసమయమున నుత్తరవులీయఁబడుననియు, నాయుత్తరవులు సర్కారుమూలమునఁ జేరవలసినస్థలమును జేరుననియు నభిరామస్వామి కొత్వాలువలనఁ దెలిసికొనియెను.

అభిరామస్వామి యచటనుండితిరిగివచ్చి యెట్లయిననయేసాను జూచిపోవలయునని తలంచి యందులకువలయుప్రయత్నము లొనర్పఁజొచ్చెను. కాని యాప్రయత్నములవలనఁ బూర్వమువలెనే ఫలమేమియును లేకపోయెను. వర్తమానము నామెకెఱింగించుటకై చెప్పిపంపుటకుఁగూడ నవకాశములేక విఫలమనోరథుఁడై తిరిగివచ్చెను.

మఱునాఁడుదయమునఁబోయి మరలఁ గొత్వాలుదర్శనము చేసెను. స్వామియు, నాతనితోఁగూడవచ్చినరక్షకులును, పంచుకొని పుచ్చుకొనుటకును, మార్గమధ్యమున వలసినవ్యయము చేసికొనుటకును నైదువందలస్వర్ణముద్రికలనిచ్చుటకు కొత్వాలు సిద్ధముగానున్నట్లును స్వామియిఁకఁగష్టపడి యాగ్రాయందుండుటవలనఁ బ్రయోజనమేమియును లేదనియును, దొంగలకు విశేషదండనవిధింపఁబడుననుటకుసందేహము లేదనియు, వారివిచారణకాలమునందు స్వామియుండవలసిన యావశ్యకత లేదనియు, నవసరమున్నచో గుఱ్ఱములను స్వామి తీసికొనిపోవచ్చుననియు, లేదా వానినచ్చటనే విక్రయించుకొనిపోవచ్చుననియుఁ గొత్వాలువలన నభిరామస్వామికిఁ దెలియవచ్చెను.

ఆవిషయములనుగూర్చి యేమిచెప్పుటకును నభిరామస్వామి కేమియుఁ దోఁచలేదు. మఱునాఁడు మరలఁబోయి యభిరామస్వామి కొత్వాలుని జూచెను. అభిరామస్వామియభీష్టసిద్ధివిషయమున

నించుకంతయును సందియము లేదనియు, దొంగలచే నెత్తుకొనిపోఁబ
డినధనము, రత్నములు మొదలగువానివిషయమున నాతఁడు చేయవ
లసినకార్య మేమియును లేదనియును, నావిషయమున నాతనిసంబంధ
మదివఱకే ముగిసినదనియుఁ గొత్వాలెఱింగించెను.

యువరాజువిషయమునఁ గాబోవునాజ్ఞనుగూర్చి యేమియు
నభిరామస్వామికిఁ దెలియలేదు. దానిచ్ఛాయయైనను దెలిసినఁగాని
యాతనికి సంతుష్టిలేదు. ఆవిషయమున బిందుమాత్రమైనను నాతని
కిఁదెలియలేదు. కాని, యనుకూలమగునాజ్ఞయియ్యఁబడునని మాత్ర
ము తెలిసెను. మూఁడు నెలలకాల మభిరామస్వామి యెంత ప్రయత్నిం
చినను నొక్కరైన నావిషయమును గమనింపరైరి. అయేషా యాగ్రా
కువచ్చినతోడనే యందఱును నావిషయమునే గమనించుటయేఁగాక
యాతనిస్వవిషయమునఁగూడఁ గార్యమనుకూలముగా జరగినది. అ
యేషా యెవరియవలంబనముచే నాకార్యముల నట్లు జరపుచున్నదో
యావిషయమై యిసుమంతయు నభిరామస్వామికిఁదెలియదు. కాని,
యీకార్యములన్నియు నయేషాప్రయత్నములవలననే చక్కఁబడిన
వనుట కించుకంతయును సంధియము లేదు.

అయేషాకడ సెలవుఁగైకొనిపోవలయునని యభిరామస్వామి
మఱియొకసారి యుమ్రావుమహాశయునియింటికడ కేగెను. ఆమెద
ర్శనముకాలేదు. అయేషా యభిరామస్వామికి ప్రణామపురస్సర
ముగా నిట్లువర్తమానమంపెను. "ఈజన్మమునందిఁక మీరు నన్ను
జూడఁజాలరని తోఁచుచున్నది. యువరాజగుకుమారజగత్సింహుఁ
డాతనిస్వజనులతోఁ గుశలముగా నుండవలయునని సదా నేను కోరు
చుందును. ఆతనినిగాని, యాతనితోఁగూడనుండువారినిగాని నేను
జూడవలసినయావశ్యకము లేదు. నావిషయమై మీరెవ్వరును వ్రా

కులపడవలదు. నాసమాచారములేమియు నీకమీఁద మీకు వచ్చు సంభవము లేదు. నాకు చిరకాలమువఱకు సెలవొసంగుఁడు"

హృదయభేదకములగు నావాక్యములనువిని యభిరామస్వామి కన్నులనీరుఁబెట్టుకొనియెను. కాని, చేయునదేమియును లేదు. మఱు నాఁడు కొత్వాలుకడకేగి ధనమును, గుఱ్ఱములను దీసికొని యిరువురు సహచరులతోఁగూడ నప్రసన్నమనస్కుఁడై వెడలిపోయెను.

---

## పదునొకొండవ ప్రకరణము.

---

ఒరిస్సాదేశమునందలి కటకనగర మనేకకారణములచేఁ జరిత్రలయందుఁ బ్రసిద్ధివహించినది. శిల్పసంబంధములగు ననేకకార్యములచే నానగరము జనసమాజమునందు సుపరిచితమై యుండెను. అత్యంతశోభామయమైనయానగర మొకానొకకాలమునఁ జాలఁ బ్రతిష్ఠవహించినది. అనేకకాలములలోఁ జరిత్రకారులదృష్టినాకర్షించువిశేషకార్యముల కానగరము రంగభూమియై ప్రకాశించుచువచ్చెను. ఆర్యులు, పఠానులు, మొగలులు, మహారాష్ట్రులు వీరందఱికాలములలో నానగరము మిక్కిలి ప్రాధాన్యము వహించినందులకు నిదర్శనములిప్పటికి నానగరమున విరాజిల్లుచున్నవి.

కటకనగరప్రాంతమునఁ బ్రవహించెడిది మహానది. విశాలమునందు పద్మా, మేఘనానదులతో సమానము కాకపోయినను నెప్పుడును నీరులేక శుష్కించిపోయియుండుట లేదు. మహానదీనిర్మలప్రవాహ మెప్పుడును తాల్మియు మృదుభావమునుఁగలిగి మనోహరముగఁ బ్రవహించుచుండును. దానిమధురకల్లోలధ్వని నిరంతర

ఘమును వినువారలహృదయముల నాకర్షించుచుండును. నానాదేశ
ములనుండివచ్చినపడవలు విశేషముగ నానదిపై నానగరప్రాంత
మునఁ దేలియాడుచుండును. ఒకపడవనుండి కూలిమనుష్యులు ప
ణ్యద్రవ్యములను మోసికొనివచ్చి యొడ్డునఁ జేర్చుచుండిరి. ఒకప
డవలో కూలిమనుష్యులు విశేషాయాసముతో ననేకవిధములగు వ
స్తువులను తీరమునుండికొనిపోయి వేయుచుండిరి. ఒకొక్కపడవ
నుండి పథికులు విశేషాయాసముతో దిగి యొడ్డునకుఁ బోవుచుండిరి.
స్థానాంతరగమనాభిలాషులు మఱికొంద ఱతివేగముతో నాపడవ
లోని కెక్కుచుండిరి. ఒకొక్కస్థలమున దీర్ఘకాలప్రవాసులగుకొంద
ఱు మనుష్యులు చాలకాలమునకుఁ బునర్దర్శనభాగ్యములభించుటచేఁ
బరమానందముతోఁ దమబంధుమిత్రులఁ గలిసికొని యానందించు
చుండిరి. ఒకొక్కస్థలమునందు ప్రియజనులు వీడిపోవుకాలమున
హృదయములయందుఁ బొడసూపెడి వియోగచింతాసూచకముల
గుచేష్టలు వారివారిముఖభావములఁ బొడగట్టుచుండెను. ఒకపడవ
తీరమునువిడిచి దూరమునకుఁబోయి జలములలోఁ దేలియాడుచుం
డెను. ఒకొక్కపడవ చాలసేపు నదీవక్షస్థలమున నాట్యముచేయు
చుఁ జేయుచుఁ గూలమును చేరి నిట్టూర్పునువిడచుచు నిలుచుం
డెను.

నగరమునకఅర్ధక్రోసుదూరములో నదీతీరమున నసా్రన్‌ఖాను
ప్రచారముఁ జేయుచుండెను. అనుచరులిద్దఱుమాత్రము సశస్త్రులై యా
తనికిఁగొంచెము దూరములో నిలుచుండియుండిరి. నవాబునిల్చుండి
యున్నస్థలము జనశూన్యమై యుండెను. నవాబుమూర్తి విషణ్ణమై
పరాజయమువలనను హీనావస్థచేతను విచారగ్రస్తమైయున్నట్లుగా
న్పించుచుండెను. నవాబునడయాడుచు నొకొక్కసారి యొకచో

నిల్చుండుచు నదివైపు చాలదూరమువఱకుఁ బరీక్షించిచూచుచుం డెను. అతఁడు ధరించినవస్త్రము లతిసామాన్యములైనవిగ నుండెను. ఒకపాయిజామా, యొకశిథిలమైనపంజాబుచొక్కాయి, శిరస్సుపై నొకసామాన్యమైనయుష్ణీషము. అన్నియును బెల్లనివి—పరిశుభ్రమైనవి—పాదములకు జలతారుజోడు—కటిప్రదేశమునకత్తి లేదు. అతఁడు నిరస్త్రుఁడై సామాన్యములైనదుస్తులనుధరించియుండెను. స్వభావముచే సౌందర్యముకలవాఁడగుటచే నెల్లప్పుడును సకలభావములయందును మనోహరుఁడుగనే కన్పట్టుచుండును. అస్మన్ఖానా వేషముతోఁ జాలసుందరపురుషుఁడుగఁ గన్పట్టుచుండెను.

భాద్రపదమాసము—ప్రొద్దుతిరిగినది. అపరాహ్ణమైనను వేఁడిగాలివిసరుట లేదు. అస్మన్ఖాను తిరుగాడుచున్నతోపునందనేకములగు గొప్పవృక్షములు చక్కగా పెఱిగి ప్రకాశిల్లుచుండెను. నవా బతిశీతలముగనున్న యావృక్షచ్ఛాయను ప్రచారము సేయుచుండెను. నదిపైనుండిబయలువెడలినమారుతమతిశీతలమై వృక్షచ్ఛాయను మఱింత చల్లఁబడి నవాబుశరీరమును సోఁకుచుండెను. అటునిటు నడయాడుచున్న యాతఁ డాకస్మికముగ నొకసారి యట్లె నిలువఁబడియెను. నిలువఁబడి మిక్కిలియాత్రముతో దృష్టిపోయినంత దూరము నదివంకఁ బరీక్షించిచూచెను. పిదప నావైపునుండి తనదృష్టి నిమరల్చి ముఖము నిటుతిప్పుకొని యుత్కంఠభావముతోఁ బాదచారణముచేయఁదొడఁగెను.

అయేషాయొక పెద్దపడవపైఁ గటకనగరమునకు వచ్చుచుండెనన్నివార్తవచ్చెను. మార్గమధ్యమున నేయాటంకమును సంభవింపకుండునేని యాపడవ యప్పటికెప్పుడే కటకనగరము వచ్చియుండవలసినది. ఆసంగతినెఱింగి యస్మన్ఖానాసమయమునకు సరిగా

నదీతీరమునకు వచ్చి తనహృదయేశ్వరి యాగమనమును నిరీక్షించు
చుండెను. నౌక రావలసినకాలము మీరిపోయి చాలసేపైనది. కాని,
యది యెచ్చటను గాన్పించుట లేదు. అస్మాత్ఖా నుద్విగ్నుఁడగుచు
నచ్చటనే యుండెను.

తుదకు విశేషదూరమున నదీగర్భమునందుఁ జాలపడవలు
పరువెత్తుకొనివచ్చుచుండుట యాతఁడు చూచెను. నీటిపైఁ దేలి చా
లదూరమున వచ్చుచుండుటచే నవి పక్షులవలెఁ గన్పట్టుచుండెను.
అస్మాత్ఖాను స్థిరదృష్టితో వానినిఁ జూచుచుండెను. పడవలు మ
రింతదగ్గరగా రానారంభించెను. అందైదు పెద్దనౌకలును రెండుచిన్న
పడవలును గనఁబడియెను. అన్నియును జాలవేగముతోఁ బరువెత్తు
కొని వచ్చుచుండెను. అస్మాత్ఖాను వానివంకఁ దదేకదృష్టితో
వీక్షించుచుండెను. వానియందొక పెద్దనౌక తక్కినవానికంటెఁ నె
క్కుడు మనోహరముగ నలంకరింపఁబడియుండెను. ఆ పెద్దపడవయం
దే నవాబునందిని యుండెనని స్థిరము చేసికొని యస్మాత్ఖాను తన
శిరోవేష్టనమునుదీసి పైకెత్తి విసరి యల్లాడించుచు సంజ్ఞనుజేసెను.
గొప్పదైనయానౌకయందలియొక గవాక్షద్వారము తెరువఁబడియె
ను. ఆగవాక్షమునుండి స్వర్ణసూత్రరచితమైన వస్త్రరాజమొకటి
జారుచు నసదృశమైనయొక కోమలహస్తముచే నదిపట్టుకొనఁబడి మె
ల్లగనటునిటు నాందోళనమునొందుచుండెను.

అస్మాత్ఖానానందపరవశుఁడై చంచలపదములతో మెల్ల మె
ల్లగ నాజలయానాభిముఖుఁడై నడవఁజొచ్చెను. పడవలు తమపా
లకులతోడను, శరీరరక్షకులతోడను, దాసదాసీజనముతోడను, సా
మగ్రిమొదలగువానితోడను నిండినిబిడీకృతములై యుండెను. అ
యేపాయున్న పెద్దనౌకయందు మఱెవరును జనులున్నట్లు నవాబున
కుఁ దోఁచలేదు.

అస్త్రనఖాను గవాక్షముగుండ పరిఫుల్లకమలసదృశమైన యయేషాముఖమండలమును స్పష్టముగాఁ జూచెను. ఇరువురును బరస్పరమభివాదనము చేసికొనిరి. ఆనందజ్యోతిచే నిరువురివదనములును ప్రదీప్తములయ్యెను.

అయేషాయాజ్ఞానుసారము పడవనడపువారు కష్టపడి చాలసేపు వేగముగాఁ బడవను నడపఁజొచ్చిరి. నౌకలును, చిన్నపడవలును వేగముగా ముందునకుఁ బరుగెత్తుకొనివచ్చెను. అయేషాయున్న నౌక శీఘ్రగమనమును వీడలేక మెల్లగా వచ్చుచుండెను. మిగిలినజలయానములన్నియు ముందైనవి. అయేషాయున్ననౌక వెనుకఁబడియెను. ఆనౌకను నడపుసేవకులు తమయశక్తతకుఁ జాలసిగ్గుపడి శక్తివంచనలేకుండ శ్రమపడుచు నౌకను నడపుచుండిరి. కాని, ఫలములేకపోయెను. ఎంతశ్రమపడినను నౌక నడచుచుండకపోవుట కాశ్చర్యపడి కళాసులందులకుఁ గలకారణము నరయఁజొచ్చిరి.

వారాకారణమును నిర్ణయించుటకుఁ బూర్వమే యస్త్రనఖాను, నౌక, నీటిపైభాగమున నెంతయుండవలయునో, యంతయుండలేదనియు, నింతేగాక క్రమక్రమముగ నది నీటియందు మునుగుచుండెననియు, నీటిపైఁదేలియున్నభాగము మిక్కిలితక్కువగనున్నదనియు గ్రహించెను. పడవనడపువారి కది గోచరముకాలేదు. నౌకయడుగుభాగ మంతభద్రముగా లేదని వారెఱుంగుదురు. ఇప్పుడాభాగమే మఱింతపాడైపోయినది. అడుగుభాగము దృఢముగానుండలేదనుమాటనిశ్చయము. కాని, యది కదలిపోవునను భయము వారికి లేదు. నవాబునందినియాజ్ఞాప్రకారము చాలతొందరగ పడవనునడపుటచే నత్యంతవేగముతోఁగూడినజలప్రతిఘాతమువలనను, విశేషబలముజూపించి నడపుటచేఁగలిగిన విషమాందోళనమువలనను

నౌకకాదుర్దశసంభవించినది.

అస్మాన్‌ఖాను వ్యాకులచిత్తుఁడై యాతురముతో నీటిలోనికి దుమికెను. అయేషా గవాక్షమునుండి నవాబు చేసినకార్యమునుజూచి యుద్వేగముచేతను, ఆశ్చర్యముచేతను, నిశ్చేష్టయైపోయెను. నీటదుమికినయస్మాన్‌ఖాను "నవాబునందినీ! శీఘ్రముగా పడవగదినుండి యీవలకు వెడలిరమ్మ—ఇంచుకంతయు నాలస్యముసేయవలదు. ఆగదియందింకను నెవరోయున్నట్లున్నది. ఈవలకురండు" అనియెను.

అప్పు డస్మాన్‌ఖానెదబంటినీటియం దుండెను. పడవయందలి గదిలో నయేషాతోఁగూడ నింకొకస్త్రీయుండెను. కారణమునడుగకుండ నయేషాయును తత్క్షణమే కూడనున్నయామెతో నీవలకువచ్చిచూచెను. తానున్ననౌక మునుఁగుట కిఁకనెంతోకాలము పట్టదని యామె తెలిసికొనియెను. పడవనడుపువారు నౌక మునింగినచో నవాబు తమప్రాణములనుండనీయఁడని యెఱుంగుదురు. మునుఁగకుండఁ గాపాడుట కుపాయమేమియుఁ గానిపించుటలేదు. అందుచే వారుదాసీనులై యుండిరి.

అయేషా నవాబువంకఁ జూచి "ఏమిచేయుచున్నావు? నీటిలో దుముకుటెందులకు? అస్మాన్! తీరమునకు శీఘ్రముగాఁ బొమ్ము! ఇదియే నాప్రార్థనము" అనియెను.

అస్మాన్‌ఖానంతలో నీదుటకారంభించి "నిన్నుపైనెత్తుకొని తీరమునకుఁబోయెదను. లేనిచో, నీతోఁగూడ—" అనియెను.

మాటపూర్తి కాలేదు. ఇంతలో నౌకలోనివారు గందరగోళము చేయనారంభించిరి. అయేషాతోఁగూడనున్నస్త్రీ యేడువఁదొడంగెను. అయేషా చేయూడించుచు నస్మానుఖానును వెనుకకుదిరిఁగి పొమ్మని సంజ్ఞచేసెను. పడవమునిఁగిపోయెను.

నౌకమునుఁగుటతోడనే భయానకమైనసుడియొకటి బయలు దేరెను. ఘూర్ణాయమానమైనయావారిరాశిమధ్యమున మఱియొక మనుష్యుఁడు మునిఁగిపోయెను. నవాబసామ్రన్ ఖానీఁదుచు నానదిపైన ఁడవలేదు. నౌకాసేవకు లీఁదుకొని తీరమునకు వచ్చిచేరిరి. మిగిలిననౌకలును పడవలు నాయావర్తమునఁ జిక్కి దానియందే గిఱ్ఱుమని తిరుగుచు నాపదకు లోనైనవి. మఱియొకపడవయందలికొందఱుమనుష్యులు వస్త్రములనువిప్పిపాఱవైచి నదిలో దుమికిరి.

అసామ్రనుఖాను పైకితేలెను. కాని, మిగులకాతరుఁడై యుండెను. ప్రాణావసానసమయమున మానవునినోటనుండివచ్చెడితీరుననే యసామ్రనుఖానునోటనుండి యుచ్ఛ్వాసనిశ్వాసములు వెడలుచుండెను. మాటాడుటకు సామర్థ్యములేదు. చాలబరువుగలపదార్థమొకటియాతనిదేహమునకుఁ గట్టిపెట్టినట్లుఁ గన్పట్టుచుండెను. అతఁడు పైకితేలినతోడనే యొకపడవ యాతనిసమీపమునకు వచ్చెను. కాని, యాతఁ డందులోని కెక్కునుపాయము లేదు. అప్పుడాతఁడు మఱలమునుఁగునట్లుండెను. పడవలోనిమనుష్యులు నీటివఱకును వ్రేలాడునట్లొకవస్త్రమునువిడిచి యొకప్రక్కదానిని బట్టుకొనియుండిరి. అసామ్రనుఖానొకచేతితో రెండవప్రక్కను బట్టుకొనియెను. చాలమంది యావస్త్రమును బట్టి మెల్లగఁ బైకిలాగిరి. కొందఱు క్రిందికివంగి యాతనిచేతిని బట్టుకొనిరి.

అనేకులుచేరి జ్ఞానశూన్యప్రాయుఁడైన యసామ్రనునిదేహమును పైకిఁ గొంచెముదూరము లాగిచూచిరి. అసామ్రన్ ఖానొక్కఁడే నీటిపై తేలలేదు. ఆతనికటిప్రదేశమునకొకబట్ట బిగించికట్టఁబడియుండెను. ఆబట్టయొక్కమఱియొకయంచున భారమైనయొకపదార్థము కట్టఁబడియున్నట్లు తోఁచుచుండెను. అది యచేతనప్రాయమైనయ

యేషాకళేబరము. ఆమెశిరోబంధమువిడిపోవుటచే దానినుండి నీరో
డుచుండెను. జనులందఱు నతిజాగరూకతతో నిరువురను పైకిఁదీసిరి.

అస్మాన్‌ఖాను తెలివిఁదెచ్చుకొని "దాసినిబ్రదికించినవారికి
విశేషబహుమానమిచ్చెదను" అనియెను.

ఒక్కఁడప్పుడే యయేషాతోఁగూడవచ్చినయామెనునీటినుండి
తీసి మఱియొకపడవయందు పరుండఁబెట్టెను.

అయేషాశరీరముపై వస్త్రమించుకంతయును చెదరలేదు. మ
నుష్యులతిజాగరూకతతో మర్మరప్రస్తరనిర్మితమై, సుఘటితమై
యొప్పుప్రతిమవలెనున్ననామెశరీరము నాపడవయందుఁబెట్టిరి.

---

## పండ్రెండవప్రకరణము.

---

అయేషా చాలసుకుమారి. ఆమెకుఁ దటస్థించినయాపద ప్రా
ణాపాయకరమైనది. అస్మానుఖానునిప్రయత్నముమూలమునను, పరి
శ్రమమూలమునను నామె సలిలసమాధినుండి నిష్కృతిఁజెందినది.
కాని, యాదుర్ఘటనమూలముననామెదారుణజ్వరపీడితయై బాధపడు
చుండెను. విజ్ఞులగుననేకాయుర్వేదచికిత్సకులును, యూనానివైద్యులు
నువచ్చి విశేషకౌశలములతో నామెకు వైద్యముచేయనారంభించిరి.
నవాబుగృహమునందామె రోగముచేఁగలిగినయుద్వేగమునకుఁ బా
రములేదు. కటుల్‌ఖానునకనేకభార్యలుండిరి. అయేషా వారియందఱి
కిని ప్రేమధనమైయుండెను. వారందఱు నిప్పుడు వ్యాకులచిత్తలై
యుండిరి. కాశ్మీరబేగము నిద్రాహారములనువీడి రాత్రింబవళులయేషా
శయ్యాపార్శ్వముననుండి యామెకు శుశ్రూషచేయుచుండెను. అ

యేషా నవాబునంతఃపురమున కలంకారమై యొప్పారుచుండును. ఎల్లరకును లోచనానందదాయకమై సర్వజనప్రసాదనకారిణియై మెలంగుచుండు. నవాబునందినికి రోగము కఠినముగానుండుటనుజూచి దాసీజనము మొదలుకొని యాభవనమునఁగలవారందఱు, వ్యాకులచిత్తులై కన్నులవడి పెట్టుకొనుచుండిరి.

సర్వదా విలాసమయుఁడై సాంసారికవ్యాపారములయందించుకంతయును లక్ష్యముంచకుండ నుదాసీనుఁడై యుండెడినవాబును, లేమానుఖానుగూడ నయేషాకఠినరోగసమాచారమునువిని విచలితుఁడై సురాపాత్రనువీడి, రూపవతులగు సుందరులసహవాసమును త్యజించి, విలాసములనొల్లక యనుదినమును పదింబదిగ నయేషానమాచారము నత్యావేగముతోఁ దెప్పించుకొనుచుండెను.

ఇకనస్మానుఖానో! ఆతనిసంగతి నేమనిచెప్పుదుము? ఆతనిహృదయావస్థనుగూర్చి చెప్పఁబూనుట కేవలమాడంబరమనితలంచెదము. రోగియుండెడిగదిప్రక్కనున్నయొకవసారాయందనవరతము రాత్రింబవళు లాతడు విరామము లేకుండఁ గూర్చుండుచుండెను. ఆతనియారాజ్యమెక్కడ? ఆయుధములెక్కడ? సంధియెక్కడ? ఆతనియాయుత్సాహమేది? ఆతనియాదురాకాంక్షయేది? అన్నియుఁ బోయినవి. ప్రపంచమందలివ్యాపారములనన్నిఁటి నాతఁడు మఱచిపోయెను. ఇంతయేల? ఆతనిదేహమునే యాతఁడు మఱచిపోయెను. యూనానివైద్యులామెరోగమునుగూర్చి చెప్పెడివృత్తాంతములను పదింబడిగవినుటకై పార్శ్వమందున్నవసారాయందధైర్యముతో నొంటరిగఁగూర్చుండియుండెను.

దినములు జరిగిపోవుచుండెను. భగవంతుఁడు తనకృపాకటాక్షవిలాసము నొక్కింతయుఁటుఁబఱపెను. రోగికిఁ గ్రమక్రమముగ

నొక్కించుక గుణముకనంబడజొచ్చెను. చికిత్సకులు ధైర్యవంతులై ధైర్యమును జెప్పుచుండిరి. నవాబునకు పోయినప్రాణము వచ్చినట్లయ్యెను. యూనానివైద్యులును నాయుర్వేదభిషజ్ఞులునునవేకులచే బహుమతులను బడయసాగిరి. అనేకవిధములుగ విశేషధనము వ్యయమగుచుండెను. అనేకదానధర్మములు, దరిద్రులకు భోజనములు పుణ్యకార్యములు, దేవతాపూజలు, మొదలగున వెన్నియో నడచుచుండెను. నవాబుగారినగరమున నందఱు నానందజనకకార్యముల యందుఁ బ్రమత్తులై యుండిరి. క్రమముగా నవాబునందినియు నారోగ్యమునొందెను. పథ్యముసేయుటవలనను, నౌషధసేవవలనను క్రమముగా నామెశరీరమున రక్తముపట్టి శక్తియభివృద్ధికాఁ జొచ్చెను. రోగముచే నవగతమైపోయినయామెపూర్వమనోహరకాంతి మరలఁ గనుపట్టనారంభించెను.

అస్మానుఖా ననవరతమును నయేషాగదిబ్రక్క వసారాలోఁ గూర్చుండుటమాని, యనుదినమును బదింబదిగవచ్చుచుఁబోవుచు రోగమునుండి క్రమక్రమముగవిముక్తయగుచున్న యయేషాసమాచారమును స్వయముగఁ దెలిసికొనుచుండెను. ఆమెకు స్వాస్థ్యమభివృద్ధియైనకొలఁదిని నస్మానుఖానునిరాకపోకలు క్రమక్రమముగఁ దగ్గిపోవుచుండెను. తుదకొకటిరెండుదినముల కొకమాఱువచ్చి యాతఁడయేషానుజూచి పోవుచుండెను.

అయేషాతల్లి యంతవఱకును ననన్యవ్రతయై సదా కుమార్తెపార్శ్వముననే గూర్చుండుచువచ్చెను. అయేషా శయ్యనుండిలేచి యటునిటుతిరుగాడుచుండుటకారంభించెను. అందుచే నెప్పుడు నామెకుఁ బరిచర్యసేయుటకై పార్శ్వముననే యుండవలసినయావశ్యకము తల్లికిలేకపోయెను. ఒకనాఁటిమధ్యాహ్నకాలమున నయేషా యొక్క

తెయు మంచముపైఁగూర్చుండియుండెను. పరిచారిక లెవ్వరు నాసమీపమున లేరు. నవాబునందినియు ననేకవిధములగు విచారములలో నిమగ్నమై యుండెను. "ఇప్పుడేమిజరిగినది? పఠానులదైన్యావస్థకుఁ దానేకమాత్రకారణమా? ప్రయత్నముచేసినచోఁ బ్రస్తుతమున సంభవమైయున్నయాయవస్థ నన్యథాచేయవలనుపడదా? "ఈ మొదలగు ననేకాలోచనలలో నయేషా మునిఁగిపోయియుండెను.

ఇంతలో ద్వారముకడనుండి "అయేషా! ఎట్లున్నది?" అని యస్మాన్‌ఖానడిగెను.

అయే.— నెమ్మదిగనున్నది. అస్మాన్! లోపలకురమ్ము.

అస్మాన్—(వెనుకముందుచూచుచు)అయేషా! నీవొక్కతెవే కూరుచుంటివేమి? నేనిప్పుడు రాఁజాలను. మఱొక్కసమయమున వచ్చి నిన్నుఁ జూచెదను.

అయేషా తానొక్కతెయే యుండుటనుజూచి యస్మాన్‌ఖాను లోపలకు వచ్చుటకు సంశయించుచున్నాఁడని తెలిసికొని, లేచి ద్వారముపఱకును బోయి "అస్మాన్! లోపలకురమ్ము. నీతో మాటలాడవలయుననియున్నది." అనియెను.

అస్మాన్‌ఖాను మాఱుమాటాడక యామెయున్నగదిలోనికి వచ్చెను.

అయే—నిలుచుంటివేమి? ఇచ్చటనే కూర్చుండవచ్చును.

కూర్చుండుటకచ్చట శయ్యాతక్క వేరుస్థలములేదు.

అస్మా—నీవుకూర్చుండుము. నేను నిలిచియుండెదను. నాకు బాధకష్టమేమియు లేదు.

అయే—సంకోచపడవలసిన యావశ్యకమేమియును లేదు. నేను చెప్పినపిదప నిస్సంశయముగా నీవీశయ్యపైఁగూర్చుండవచ్చును.

అస్మాన్ ఖానామంచముపై నొకతట్టునఁ గూర్చుండెను. ఆ యేషాయు నామంచముపై వేఱొకతట్టునఁ గూర్చుండుటనుజూచి యస్మాన్ ఖానాశ్చర్యనిమగ్నుఁడయ్యెను.

అయే — నేను నీసాన్నిధ్యమునువీడి కొంచెముకాలము చాల దూరము పోయియుంటిని. తిరిగి వచ్చినతోడనే జబ్బుచేయుటచే నీతోఁగలసి విశేషముగ మాటలాడుట కవకాశము లేకపోయినది. నే నబలను. నీశాసనాధీనమునందుండుట నాకుఁగర్తవ్యము. అట్లుచేయకుండుటగొప్పయపరాధమగును. నాయపరాధమునుక్షమింపవలయునని నిన్ను వేఁడుకొనుచున్నదానను.

అస్మాన్ — క్షమింపుమని వేఁడుకొను టెందులకు? నాకేమైన నీపైఁగోపమున్నదా? నీవు మరల దయయుంచి నవాబునగరమునకు వచ్చుటచే మృతప్రాయమైన నాకళేబరమునకు జీవకళవచ్చినట్లయినది. నీవపరాధమునుజేసితివని నేనెన్నఁడు ననుకొనలేదు. అందుచే నీవు క్షమాపణమును వేఁడుకొను టెందులకు?

అయే — నేనిచ్చట లేనిసమయమున మనభాగ్యమంతయు ననేకవిధములుగా పరివర్తనమైపోయినది. సోదరా! అందుకొఱకు నీవు హృదయమున నేమైనవిచారించుచున్నావా ?

అస్మా — అదృష్టమునందు విషమపరివర్తనమైనదనుమాట నిశ్చయము. అందునిమిత్తమై నాహృదయమవసన్నముకాలేదని చెప్పఁగలను. నీవపరాధమునుగూర్చి చెప్పితివికదా ! ఈమనభాగ్యపరివర్తనమునకు నిజముగా నీవే కారణమవు. నీవస్మానునిబాహువులయందు బలమును, హృదయమందు సాహసమును, మనస్సునందు బుద్ధియు, కార్యములయం దుత్సాహమునై యున్నావు. అస్మానుని యాబలమును, సాహసమును, బుద్ధియును, నుత్సాహమును నపహరిం

చుకొని నీవెచ్చటికో పోయియుంటివి. ఇఁక నదృష్టమెట్లునిలుచును? అదియును పరివర్తనమైపోయినది. దురదృష్టము సంభవమైనది.

అయే — జేనట్లే జరగినది. కాని, యిప్పుడందుల కుపాయమేమియును లేదా?

అస్మా — లేకేమి? ఉపాయముల కేమికొఁదవ? నీపీనగరము నకు మంగళమయినవైనయధిష్ఠాత్రివి. నీవు నాశుభమునుగోరుటలో నుదాసీనతను వహింపవేని సర్వమును శుభమగును.

అయే — అన్నా! అస్మాన్! అట్లనెద వేల? నీయిష్టానిష్టము లతో నాసుఖదుఃఖములు జడితములై యున్నవనుసంగతి నీవెఱుంగవా?

అస్మా — నేనాసంగతినెఱుంగుదును. ఎఱింగియుంటినిగనుకనే యింతవఱకును మేనఁ బ్రాణములు నిలుపఁగలిగితిని. కాని, యొక్క విషయమును నిన్నడిగి తెలిసికొనుటమేలని తోఁచుచున్నది. నీవు సర్వదా నాహితమునుగోరుదానవై యుండియు నాకుఁ గష్టకాలము సంప్రాప్తమైనప్పుడు నీవు నన్నువిడిచి యేలవెళ్లిపోయితివి? అయేషా! దారుణములైనయీనాదుర్దినములలో నీవు నన్నెట్లువిడిచిపోఁగలిగితివి?

అయే — (చాలసేపు యోచించి పిదప) నాయీజీవితమునందలి కార్యములయందొక్కటియైన నెవనికిఁదెలియకుండనుండదో, అట్టివాని కడ నావిషయమును దాచిపుచ్చుటెందులకు? విషయమేమో నీకుఁ గష్టదాయకమైనదగును. నీవు దానినిగూర్చి నన్ను ప్రశ్నింపకయుండినచో నేనావిషయమును నీతోఁ జెప్పకయేయుందును. నేను యువరాజగుజగత్సింహుని చెఱనుండి విడిపింపవలెయుననునభిప్రాయముతోఁ బాట్నానగరమునకును బిదప నచ్చటనుండి యాగ్రాపట్టణము

నకును వెళ్లితిని.

అస్మా—నాకాసమాచారము తెలియనే తెలియదు. అదృష్ట వంతుఁడగు జగత్సింహుఁడు నీహృదయరాజ్యమునకు రాజను విషయమును నీవు గోపనము చేయుచుండుట లేదు. అందుచే నాతనిని చెఱనుండి విడిపింపవలయుననుకోర్కెయు నసంగతముకానేరదు. నీయా కార్యమువలనఁ బ్రకారాంతరముగా నాయిష్టార్థముకూడ నాకుఁజేకూరినట్లయినది.

అయే—అదెట్లు?

అస్మా—జగత్సింహుఁడు నాకువధ్యుఁడు. ఆతనిని వధించుటకొఱకే నేనింకను జీవించియున్నాఁడను. ఆతఁడు యావజ్జీవమును గారాగారమునందే యున్నచో నేనాతనిని నాశనమొందించుట కవకాశమే లేకపోవును. నీవాతనిని చెఱనుండి విడిపింపఁబ్రయత్నించుటవలన నాకు మహోపకారమైనది.

అయేషా తనవదనమును మఱియొకవంకకుఁ ద్రిప్పికొని యాలోచింపఁదొడంగెను.

అస్మా—మాటాడుటలేదెందువలన? అయేషా! నావాక్యములవలన నీహృదయమున కేమైనఁ గష్టము కలిగినదా యేమి?

అయే—లేదు.

అస్మా—అట్లయిన యోచించుచున్నావేమి?

అయే—నేను యోచించుచున్న దేమంటివా? నావంటియభాగిని నీప్రపంచమున సృష్టించినందువలన విధాతకుఁ గలిగిన లాభమేమి? నేను ప్రపంచమున కేయుపకారమును జేయుటకును వచ్చినదాననుగాను. నావలన నొకరికిని హితము కలుగుచుండుటలేదు. నానిమిత్తము కేవలము కలహద్వేషప్రవాహమే యవ్యాఘాతముగాఁ బ్ర

వహించుచున్నది. నీవంటిమహాపురుషుఁడు నానిమిత్తమై నిరంతర ముగానంతరికజ్వాలచే దగ్ధుఁడై పోవలసివచ్చినదికదా!

అన్నా—అనంతమైనయాజ్వాల ననుభవించుటకు నేనెప్పుడును వెనుదీయను. ఆమహాజ్వాలను హృదయమున భద్రముగా నిడికొని సహించుటకుసమర్థుఁడనై యున్నాఁడను. అట్లునిరంతరమును సహించుకొనుచు వచ్చుచున్నాను. అయేసా! , నాకాజ్వాలవలనఁ గలిగెడిసుఖమునకుఁ బారములేదు. నిజముగా నట్లు కాదేని నాజ్వాల నణఁగించుటకు నేను ప్రయత్నపడుట లేదేమి? మఱియు, నట్లుకాదేని, ఎవరినిమిత్తము నాజ్వాలయుదయించినదో, అట్టినీవు దృష్టిపథము నుండి దాటిపోయినప్పుడు ప్రపంచమే శూన్యమైనట్లుఁ గన్పట్టుచుండుటేమి? సత్యముగా నాజ్వాలవలన సుఖమే కలుగుచున్నది. అట్లు కాదేని నిన్ను మఱచిపోవుటకై దయామయుఁడైన భగవంతునిపాదపద్మములను ప్రార్థించుటకు నాహృదయము ప్రయత్నింపదేమి? అట్లుకాదేని, నాజ్వాల కెవ్వరుకారణమో, ఆమె యేభవనమున నివసించియుండునో, అదేభవనమున వేఱొకప్రక్క వాసము సేయుటకు నాకవకాశముచిక్కెనేని యెంతయోసుఖ మనుభవించుచున్నట్లు నా హృదయమునకు సంతుష్టికలుగుటేమి? అట్లుకాదేని నీహృదయము నందించుకంతయును నాకుఁ దావులేదని స్పష్టముగాఁ దెలిసికొని యుండియు నాహృదయ మహర్నిశమును నీయందే నివిష్టమైయుండుటేమి? అట్లుకాదేని, ప్రపంచమునందలిసర్వపదార్థములకంటె నాజ్వాలయుదయింపఁజేసెడిపదార్థమే సర్వోత్కృష్టమైనదిగాఁ దోఁచుచుండుటేమి? అయేసా! ఆజ్వాల సర్వదా నాకానందదాయకము. సుఖదాయకము.

అహో—ఆజ్వాలనట్లనుభవింపుమని భగవంతుఁడు నీకు విధిం

చినట్లు తోఁచుచున్నది. సర్వగుణాధారుఁడవగు నీవంటి మహాత్మున కిట్టి చిరకాలయాతన తటస్థించుట కీయభాగినియే కారణము. అస్మాన్! నీవీపిశాచమును మాటిమాటికి మృత్యుముఖమునుండి రక్షించెదవెందులకు ?

అస్మా—అయేషా! ప్రపంచమున దేనిని బ్రియమని చెప్పుచుందురో, దానిని నీవు బాగుగా నెఱుంగుదువు. జగత్సింహుఁడు కారాగారమునందు బద్ధుఁడై యున్నాఁడనువార్తను వినినంతనే పితృభవనమును వీడి దేశాంతరమున కెందుల కేగితివి? సామాన్యమైన కారాగారవాసమునుగూర్చి వినినప్పుడే నీవు సహింపఁజాలక పోయినప్పుడు, నీకు మరణము సంభవించునట్లు నేనున్మాదుఁడనుగాకుండ నుండుటెట్లు?

అయే—అస్మాన్! నేను కాతరముతో వేఁడుకొనుచున్నదానను. నీహృదయమును వెనుకకు మరలించి ప్రస్తుతకార్యాసక్తమగునట్లు చేయుము. నీవు వీరుఁడవు—సాహసివి—విశేషించి రణకోవిదుఁడవు. రణక్షేత్రమునఁ గీర్తిని సంపాదించుటయందును, సామ్రాజ్యసంపాదనమునందును బ్రయత్నించుఁడవు కమ్ము. అంతటి సుఖసౌభాగ్యము లే మహాత్మునకుఁ దంగేటిజున్నువలె నుండునో, అట్టి మహానుభావుఁడవగు నీవొకసామాన్యస్త్రీవిషయికమగు చింతచే నయోగ్యయగు నొకయభాగినిప్రేమపిపాసచే నీమహత్తరములైన యాకాంక్షలను, నాదర్శములను సంపూర్ణముగఁ ద్యజించి, ప్రవర్తించుట నీకుఁ గర్తవ్యమేనా?

అస్మా—నేను నాహృదయమును బ్రికృతిష్ఠము చేసియున్నాను. నేనెంతవఱకుఁ బ్రికృతిష్ఠము చేసినదియు నీవు వినినచో స్తంభితవై నివ్వెఱపడుదువు. నేనిప్పుడు నిన్నుఁ బొందఁజాలనని తెలిసికొని

త్తున్నను నాప్రాణమింకను దేహమున నిలుపుకొనియున్నాఁడను. నే
నిప్పుడు నిన్నుఁ బొందఁజాలనని తెలిసికొనియున్నను, నాహృదయ
ము కార్యాసక్తమై, ప్రయత్నములను జేయుచునేయున్నది. నీతో నా
కు సమప్రాణత లేదని తెలిసికొనియున్నను నాహృదయము జయప
రాజయములచేఁగలిగిన సుఖదుఃఖముల ననుభవించు ప్రవృత్తిలోను
న్నది. ఇంతకంటె విశేషాశ్చర్యమును గలుగఁజేయునది వేఱేదియు
లేదు. అయేషా! రణరంగమునఁ బ్రమత్తుఁడవుకమ్మని కాదా చెప్పి
తివి. నాప్రకృతావస్థయందది యొక్కటియే నాకుఁ గర్తవ్యమై యు
న్నది. ఆమార్గమే యిప్పుడు ముఖ్యముగ నవలంబనీయమైనది. కా
ని, అయేషా! నాదొక్కవిన్నపమున్నది. నాహృదయమును నేను పూ
ర్ణముగా ప్రకృతవ్యాపారములకు మరలించుకొనెదను. దానికి సందే
హములేదు. కాని నాయందు దుర్బలత్వమొకటి సంపూర్ణముగా ను
న్నది: నీవు నాకు లభింపకపోయినను నేనికఁ గాతరమునొందను. నీ
వెవరిదానవైనను నాయోచనమువలన నేను వ్యాకులుఁడనుగాను. కా
ని దూరమునుండియైన నొక్కసారి నిన్నుఁ జూచుచుండవలయునను
నాశను నేనింకను విడువఁజాలకున్నాఁడను. ఒక్కసారి నీతో నొకటి
రెండుమాటలు మాటాడవలయునను నాశను దృజించుట కింకను స
మర్థుఁడను గాఁజాలకున్నాఁడను. నీవేభవనమున నివసించుచుందువో
యాభవనమున వాసము సేయుగౌరవమును బరిద్యజించుట కింకను శ
క్తుఁడనుగా నేరకున్నాఁడను. నీకుశలమునందు సుఖమును నీకష్టమునం
దు దుఃఖమును బొందకుండనుండుటకు నేనింకను సమర్థుఁడను గాఁ
జాలను. అయేషా! నిర్భాగ్యుఁడగు నీదీనునియాశలన్నియును త్రోసి
వేయఁబడినవి. నీవు నాయాచిన్నికోరికలనుకూడ నసంగతములైనవి
గనే యోచించెదవా? భిక్షుకునకు రత్నములవలెనున్న నాయాయభి

లాపలను నిరర్థకముగాఁ జేయుటయే నీయభిప్రాయమా?

అయే.—కాదు, అస్మాన్! జీవితమునందును మరణమునందును నీతోఁగూడ నెప్పుడునుండెదను. వివాహరూపమైన శాశ్వతబంధము మనయదృష్టమునందు లేదు. కాని యందువలన బాధకమేమి? నాయీదేహమును నీచరణపద్మములయందుత్సర్గము సేయుటకు నాకు స్వాధీనము కాకపోయినను, విధివిధానముచే నీసేవయందు నాయాత్మ సమర్పణముఁ గావించుకొనుటకు నాకధికారము లేకపోయినను, నందువలన బాధకమేమి? అస్మా! మనము సుఖమునందును, దుఃఖమునందును, సంపదయందును, విపత్తునందును సహానుభూతులమై మెలయుండరాదు? మనమిరువురమునొకే హృదయముతోఁ గష్టసుఖములయందొక్కటిగనుండి, ఒకే ప్రాణముతోఁ గార్యసాగరమునఁ బడి యీఁదులాడుచు జీవితమును గర్మమయముగ నేల చేయరాదు? అస్మాన్! నేను చావుబ్రదుకులయెడ నిన్నెడబాయకుండ సదా చరించుచుండెదను. నీకు సంతోషదాయకములగు కార్యముల నొనర్చుటయే నాకు వ్రతము.

అస్మా—అయేషా! ఈనిర్భాగ్యునిజీవితము నిప్పుడీవు సుఖమయముగను, నానందమయముగను జేసితివి. నీయీయపారకృపాకటాక్షము నన్ను ధన్యతమునిఁగఁ జేసినది. ఈభిక్షుకుఁడు మఱిదేనిని గావలయునని కోరుట లేదు. అయేషా నాకవిచలితప్రైషిణి; అయేషా నాసుఖదుఃఖములలో సహానుభూత. అయేషాయాజ్ఞచేఁ బాలితుఁడనై కార్యసాధనమునకొఱకు నియుక్తుఁడనైనాఁడను. అదియే నాకుఁ బరమగౌరవము. మఱియు నదియే పరమానందదాయకము. ఇంతకంటె నాకు విశేషప్రార్థనమేమియును లేదు.

అయే—ఆమాటలవలనఁ బ్రయోజనమించుకంతయును లేదు.

మనమిప్పు డేయుపాయముచే నపహృతమైపోయిన మనరాజ్యమును మరల సంపాదింపఁగలమో, యాయుపాయము నారయుట మనకుఁ గర్తవ్యము.

అస్మా—అందుకొఱ కంతగాఁ జింతింపవలసిన యావశ్యకము లేదు. ఇఁకముందు రణరంగమున నాపరాక్రమమునుజూచి మానవసమాజము విస్మయావహముగాకపోదు. జయముపై జయమువచ్చి నన్ను సాదరభావముతో నాలింగనము చేసికొనును. మంగళమయమైన యయేషాప్రసన్నతకును, నాకార్యసూత్రమందలి సఫలతకును నిత్యసంబంధమున్నది.

అయేషా జనని ద్వారముకడ నిలుచుండి "తల్లీ! ఔషధమును సేవించు వేళయైనది" అనియెను.

అయే—అమ్మా! లోపలకురమ్ము! ఔషధమును బుచ్చుకొనకపోయినను బాధకము గాన్పించుట లేదు.

అయేషాయును నస్మానుఖానును మంచముపై నుండి లేచిరి. బీగము గదిలోపలకువచ్చి యువతీయువకులవదనప్రసన్నతాలక్షణములనుజూచి పరమానందమునొందెను. వారియాభావ మత్యంతశుభసూచకమని యామె యనుకొనియెను.

## పదుమూఁడవ ప్రకరణము.

జగత్సింహుఁ డంధకారమయమైన కారాగారమునందు లోహశృంఖలాబద్ధుఁడై యతికష్టముతోఁ గాలమును గడపుచుండెను. ఆ దారుణదుఃఖదినము లెప్పటికిని గడచునవా? మఱల నాతఁడు స్వ

తంత్రిచే తోడిమానవకోటింజేరి సుఖమయములైన కార్యముల యందు జీవితమును నియోగింపఁజాలఁడా? ఆతనియాశయును, సుఖా నందములును సంపూర్ణముగఁ గారాగృహమునందు దీర్ఘనిశ్వాసము లతోఁ బర్యవసితములై పోవలసినదేనా?

అభిరామస్వామి స్వయముగాఁ జెఱసాలకువచ్చి విజ్ఞాపనప త్రముపైఁ జేవ్రాలుంపించి దానిని తీసికొనివెళ్ళియున్నాఁడు. నవా బునందినియుఁ జెఱనుండి విడిపించుటకై వ్యాకులపడుచున్నది. ఆమె స్వజనులనువీడి యొరిస్సాదేశమునుండి పాట్నానగరమున కిందునిమి త్తము వచ్చియున్నది. వారియందఱిప్రయత్నములును, వ్యర్థములు గాఁజాలవు. కాని, చాలకాలము గడచిపోయినది. అయినను, శుభ సమాచారమేమియు నింకను రాలేదు. ఏమిచెప్పుమా! ఈధైర్య విశ్వాసములు వ్యర్థముగా నంతమొందవలసినదేనా?

కారాగారమునందు జగత్సింహుఁ డొంటరిగఁ గూర్చుండి యీరీతిగ యోచించుకొని, పిదప నయేషావిషయమున ననేకవిధ ములుగ యోచింపఁదొడంగెను. అంతటిస్నేహమయి, అంతటిహితై షిణి యెచ్చటను గానరాదు. ఆమెసాహాయ్యమును బడసినయాతఁ డే మానవులలో ధన్యుఁడు. అయేషాను మనుష్యస్త్రీగాఁ జెప్పిన చో నన్యాయము చేసినట్లగును. స్వర్గమునందుఁగూడ నట్టిదేవియుం డదు. కాని, ఆహా! అంతటిపూజనీయురాలగునావనితారత్నము త నయసామాన్యప్రణయము నొకయయోగ్యునియందుంచి చిరవిషా దమును దెచ్చిపెట్టుకొనినదికదా! ఆమెపడుచుండు యాతనల క న్నిఁటికిని నీదురదృష్టవంతుఁడే యేకమాత్రకారణుఁడు. ఈయదృష్ట హీనుఁ డామెదృష్టిపథమునఁ బడకుండెనేని యాదేవి యీప్రపంచ మున సర్వసుఖములకు నధికారిణియైయుండునుగదా! అసదృశమైన

యారత్నమును నిజముగాఁ బ్రేమమూర్తియైనపురుషశ్రేష్ఠుఁడు స
హోదరభావముతోఁ దనవక్షస్స్థలమునధరించి యనంతసుఖభోగ
ముల ననుభవించుటకంటె నీప్రపంచమునఁ గావలసినదేది? నిజము
గా శోభామయమైనయాప్రసూన మాదరములేమి, మలినమై శు
ష్కించిపోవుటకంటె దుఃఖకరమేమున్నది? కృతఘ్నుఁడగునీనరాధ
ముఁడు దేవదుర్లభమైనయాప్రణయమునకుఁ బ్రతిదానముఁజేయన
శక్తుఁడుగ నున్నాఁడు. అట్టివానిపైఁగూడ నాకరుణామయి యను
గ్రహమా! ఆహా! ఈజీవితమునందు జగత్సింహుఁ డామె నొ
క్కసారిచూడఁగలఁడా? లేక, తనకృతజ్ఞత నామెకుఁ దెలుపుటక
కవకాశమే లేకుండఁబోవునా?

తిలోత్తమ యతికష్టముతోఁ గాతరమై కాలము నెట్లో గడపు
చుండెనని యభిరామస్వామి చెప్పియున్నాఁడు. అంత్యములేనియాత
నల ననుభవించుటచేఁ గోమలమైనయాప్రాణ మిదివఱకుఁ బోవకుం
డ నింకను నిలిచియుండునా? ఆమె యింకను జీవములతో నుండునా?
ఆప్రేమమయిజీవించియుండఁగాఁ జూచుభాగ్యము జగత్సింహునకు
లభించునా? ఆమెతోఁ దనమనోవ్యథలనుగూర్చి మాటలాడుకొనుట
కెప్పుడైన నీతని కవకాశముకలుగునా?

కర్తవ్యమునుజేయనందులకై తనతండ్రి తన్నుఁ గారాగృహ
మున కంపినాఁడు. కాని, కుమారునియాదుర్దశను స్మరించుకొని తం
డ్రి హృదయ మించుకంతయును విచలితముకాలేదా? పాట్నానగర
మునందున్న తనసవతితల్లులెవరును తన్ను చెఱనుండివిడిపించుటకై
వ్యాకులపడుచుండుటలేదా? అట్టిస్వజనులున్నను జగత్సింహుఁ డీరీ
తిగ నీయంధకారముననే కాలము గడపవలయునా?

ఆకష్టము సహింపశక్యముగానిది. లోహశృంఖలములను వ

హించుట కష్టముగాదు. అంధకారమందుండుటయుఁ గష్టముకాదు. బంధమువలననుకష్టములేదు. ఒక్కసారి—ఒక్కసారిమాత్రమే—దూరమునుండి—ప్రాణమునకుఁ బరమప్రియమైనయామనోహరాకృతిని జూడగల్గినచో నీకష్టములను సహింపవచ్చునని తోఁచుచున్నది. దూరమునుండియైన నొక్కసారి—ఒక్కసారిమాత్రమే—తిలోత్తమనుజూచు నుపాయ మేమియును లేదా?

జగత్సింహుఁడీరీతిగఁ బరిపరివిధములఁ జింతించుచు "నొక్కమారుగఁ దనకాలుచేతులకున్నసంకెలలనూడఁ బెరికిపాఱవైచి శక్తి కొలఁది యాకారాగారపుటినుపతలుపులను బ్రద్దలుకొట్టి మంద్వారణ దుర్గాభిముఖముగఁ బాఱిపోయినచో—" అని యనుకొనియెను.

ఇంతలో నాకారాగృహసింహద్వారము వికటమగుఘుర్ఘురశబ్దముతోఁ దెఱవఁబడియెను. తెఱచినయాద్వారమునుండి చల్లనిగాలి వచ్చి జగత్సింహున కించుక వినోదమునుగలిగించెను. ఆద్వారమునుండి కారాగారాధ్యక్షుఁడును, మఱియొకయనుచరుఁడును లోపలకువచ్చిరి. అనుచరునిచేతియందు వివిధవస్త్రాలంకారములుండెను.

కారాగృహరక్షకుఁ డెదురుగవచ్చి నిలుచుండి విశేషసన్మానముతో యువరాజునకుఁ బ్రణామముచేసెను.

జగ—సమాచారమేమి?

కారా—(వినయముతో) యువరాజుగారికి విముక్తి కలిగినది.

యువరాజాశుభవార్తను తాల్మితో విని కారారక్షకునితో నిట్లనియెను—

జగ—నీమాట నిజమనినమ్ముటకు నిదర్శనము లేకైన నీయొద్దనున్నవా? నిదర్శనము లేకుండఁ జెఱసాలనుండి యవ్వలకువచ్చితినేని రాజద్రోహినిగాఁ బరిగణింపఁబడవచ్చును.

కారా—నాయొద్ద నట్టినిదర్శనము లేమియు లేవు. ఆగ్రినుండి ఘాదుషహావారి పేరుతో ముద్రాంకితమైనయొక యాజ్ఞాపత్త్రికను దీసికొనివచ్చి సిపాయి యొకఁడు మహారాజుగారిచేతి కిచ్చినాఁడు. మహారాజుగారిస్వంత సేవకుఁడొకఁడు వారియాజ్ఞను నాకెఱింగించినాఁడు. మహారాజుగారిసైనికు లనేకులు యువరాజునిక్కడనుండి తీసికొనివెళ్లుటకై వచ్చి ద్వారముకడ నిలుచుండియున్నారు.

యువ—నీమాటయందు నాకవిశ్వాసము లేదు. కాని, నీవు కార్యమును సరిగాఁ జేసియుండ లేదు. సిపాయిలతోఁగూడ మహారాజుగారియుంగరముఁగాని, లేదా వారిముద్రాంకితమైయున్న యాజ్ఞాపత్త్రికఁగాని తీసికొనివచ్చినచో సరిగానుండును. నీవు దానినిజూచి నన్ను విడిపించుటకువచ్చియుంటివేని నీకర్తవ్యమును నీవు సరిగాఁ జేసినట్లగును.

కారా—(కొంచెము యోచించి, పిదప) చిత్తము. ఏలిక న్యాయముగా నాజ్ఞయొసంగినారు. ఆనందాతిశయముచే నేను చేయవలసినపనిని మఱచిపోయితిని. ఇప్పుడేమియాజ్ఞ?

జగ—నీవుపోయి యాసైనికాధికారితో " మహారాజుగారి యాజ్ఞగాని, లేదా ఘాదుషహావారియాజ్ఞగాని పడయనిదే చెఱసాలనుండి యివ్వలకువచ్చుటకు యువరాజంగీకరింపలేదనియు, హుజూరుకచ్చేరికిఁ బోయి యట్టినిదర్శనమును తీసికొనిరావలసినదనియుఁ జెప్పి నీవుతిరిగిరమ్ము. అంతవఱకును శృంఖలావిమోచనమును వేషపరివర్తనము ననావశ్యకములు.

కారాగృహరక్షకుఁడు యువరాజుబుద్ధిస్థైర్యమును సావధానతయును జూచి విస్మితుఁడై మఱియేమాటయును జెప్పకుండ " ఆజ్ఞాప్రకార మట్లే. " అని యటనుండి వెడలిపోయెను. పోవునప్పుడా

కారాగృహముయొక్క తలుపు వేసిపోవలేదు. యువరాజును చెఱనుం
డి విడిపింపవలయుననివచ్చిన యాజ్ఞావిషయమున నాతనికించుకంతే
యు ననుమానము లేదు.

ఒకించుక సేపటిలోనే కారాగృహరక్షకునితోఁగూడ మధురా
సింహుఁడు కారాగారములోపలఁబ్రవేశించి సన్మానముతో యువ
రాజున కిట్లువిన్నవించెను. "యువరాజా! మందారణదుర్గసమీపమున
నీసేవకుఁ డేయుంగరమునుయువరాజునకుఁజూపి మహారాజుగారియా
జ్ఞను నివేదించెనో, అదేయుంగరమిప్పుడీదాసునియొద్దనున్నది. ఏలిక
కు విముక్తికలిగెనుగదా యనునానందముతో దానినిమీకుఁ జూప
మఱచితిని, దాసునియపరాధమును క్షమింపవలయును" అని విన్నవిం
చి మధురాసింహుఁడు తనయుష్ణీషమునందున్నముద్రికనుదీసి యువ
రాజుసమ్ముఖమునఁ బెట్టెను. యువరాజాముద్రికను సన్మానించి కా
రాగృహాధ్యక్షునితో "నాశృంఖలములను దీసివేయుము" అనియెను.

కారాధ్యక్షుఁడు పరమానందముతో జగత్సింహునికాలు చే
తులయందున్నసంకెలలను దీసివేసెను. మధురాసింహుఁ డనుచరునిచే
తియందున్నవస్త్రాలంకారములను తానుతీసికొని యువరాజుకాలు చే
తులును మొగమును గడుగుకొనుటకై యుదకమును దెమ్మని యను
చరున కాజ్ఞాపించెను. నీరువచ్చినపిదప జగత్సింహుఁడు తనవదనమును,
కాలుచేతులను గడిగికొని యసహ్యములగుకారాగృహమందలిదుస్తు
లనుదీసివేసి మధురాసింహునిచేతనున్న యమూల్యవస్త్రాలంకారము
లను ధరించెను. మస్తకమున వజ్రఖచితమగునుష్ణీషము, కర్ణముల
యందురత్నకుండలములు, కంఠమున ముత్యాలహారము, మొదలగు
నాభరణములచే నలంకృతుఁడయ్యెను. కటియందుకత్తి — పాదముల
యందు రత్నఖచితములగుపాదుకలుధరించెను. చాలకాల మంధకార

మయుమగుకారాగారవాసము, దారుణదుశ్చింత, మొదలగుకారణ ములచే జగత్సింహునిమూర్తి మలినమైయుండెను. అయినను నాతని స్వభావసిద్ధమైనయాకాంతి రాజవస్త్రధారణముచే మిగుల శోభాయమానమై ప్రకాశించుచుండెను.

సమస్తయాతనానిలయస్వరూపమై నరకసదృశమగుకారాగారమునుండి జగత్సింహుఁడు విడివడియెను. అనేకవిధములగుదుశ్చింతలతోడను, భయవిచారములతోడను పరిపీడితుఁడై జగత్సింహుఁ డచ్చటబహుకాలమతికష్టముతోఁ దనజీవితమును గడపెనో, ఆస్థానముతోడిసంబంధ మిప్పు డాతనికిఁ దొలఁగిపోయినది. ముందు మధురాసింహుఁడు; నాతనివెనుక యువరాజు, ఆతనివెనుక కారారక్షకుఁడు; అనుచరులు, ఈరీతిగ నందఱు నివ్వలకరుదెంచిరి. జగత్సింహుఁడు చాలకాలమునకుఁ బ్రపంచములోనికి వచ్చెను. అవ్యాహతమైన వాయుసముద్రమునకువచ్చి యాతఁడు క్రొత్తజీవనమును బొందెను. క్రొత్తప్రపంచమునకువచ్చిన ట్లాతఁ డనుకొనియెను.

మధురాసింహునియధీనమున నేయేబదిమందిసిపాయీలు జగత్సింహుని బందీగాఁ జేసితీసికొనిపోవుటకుఁ బూర్వము వచ్చియుండిరో, ఆయేబదిమందిసిపాయిలే మరలఁగారాగారమునుండి యాతనిని తీసికొనివెళ్లుటకై వచ్చి యాప్రాంతమున నిలిచియుండిరి. జగత్సింహుని శ్వేతాశ్వతము సుసజ్జితమై చాలకాలమునకు మరలఁ దనప్రభువు నెక్కించుకొని తీసికొనివెళ్లుటకై యచ్చటకువచ్చియుండెను. అశ్వసమీపమున ఛత్రధారుఁడొకఁడు ముత్యములజాలరుచే నలంకృతమైయున్న విశాల శ్వేతఛత్రమును చేతఁబూని నిలుచుండియుండెను. కిన్ కాఫ్ వస్త్రముతో నంచు వేసి కుట్టఁబడినయొకవీవనను జేతఁదాల్చి యొకమనుష్యుఁడు ఛత్రధారిప్రక్క నిలుచుండియుండెను.

యువరాజునుజూచుటతోడనే యాయేబదిమంది సైనికులును తమకత్తులనెత్తి ప్రణామమునుజేసి సమస్వరముతో “జయము! జయము! యువరాజు జగత్సింహునకు జయమగుగాక!” అని జయఘోషములనుజేసిరి.

యువరాజుకూడ నదేరీతిగఁ గత్తిచే వారికిఁ బ్రతివందనము చేసి “జయము! అక్బరుపాదుషాహాకు జయమగుఁగాక! జయము! మానసింహమహారాజునకు జయమగుఁగాక!” అనియెను.

జగత్సింహుఁ డశ్వము నధిష్ఠించెను. చాలకాలమైనపిదపఁ దనప్రభుసందర్శనమగుటచేఁ బరమానందముతో నశ్వము నృత్యము సేయుచు ననేకవిధములఁ దనయానందమును సూచించుచుండెను. కారారక్షకుఁడువచ్చి యువరాజునకుఁ బ్రణామమునుజేసెను. జగత్సింహుఁ డాతనితో “కారాగారమునందు నేనున్నకాలమున నీవు నావిషయమునఁ జక్కఁగాఁ బ్రవర్తించితివి. నీప్రవర్తనమునెడలఁ నేను మిగులసంతుష్టచిత్తుఁడనైనాఁడను. నీవు మఱియొకప్పుడువచ్చి నన్నుఁ జూచినచో నీకు సన్మానమును జేసెదను” అనియెను.

కారాగృహరక్షకుఁడు యువరాజునకు మరలఁ బ్రణామము చేసెను. సైనికులలో నిరువదియైదుగురు గుఱ్ఱపురౌతులు యువరాజునకుముందు నడచుచుండిరి. మిగిలినయిరువదియైదుగురును నాతనికి వెనుకవచ్చుచుండిరి. మధురాసింహుఁడు పూర్వమువలె యువరాజుపార్శ్వమునందుండక తనసైన్యమునకుముందు నడచుచుండెను. ఛత్రధరుఁడును, వ్యజనకుఁడును, యువరాజున కుభయపార్శ్వములయందు నడచుచుండిరి. పిదప మధురాసింహుఁ డుచ్చైస్స్వరముతో “జయము! జయము! యువరాజుకుమారజగత్సింహునకు జయమగుఁగాక” అనియెను.

ముందునడచుచున్న యిరువదియైదుగురును పునరుక్తిగ నా
వాక్యములనే యనుచు జయఘోషములను జేసిరి. వెనుకనున్న యి
రువదియైదుగురు నదేరీతిగ మరల "జయము! జయము! యువరాజ
గు కుమారజగత్సింహునకు జయమగుఁగాక" యని జయజయ
ధ్వానములను జేసిరి.

ఆస్వరము తరతరముగ లేచి యాకాశమార్గమునఁ జాలదూ
రము వ్యాప్తమయ్యెను. వారందఱును మెల్లమెల్లగ ముందునకు న
డచుచుఁ గ్రమక్రమముగ నగరములోఁ బ్రవేశించిరి. నగరము
నందలిరాజవీథులన్నియుఁ దోరణములచేతను పతాకాదులచేతను,
పత్రపుష్పాదులతోడను నలంకృతములై యొప్పారుచుండెను. రాజ
మార్గమున కిరుపార్శ్వములయందు నున్నసౌధములమీఁదను, వసా
రాలల్లోను, వాతాయనములయందును నన్నియెడలనౌత్సుక్యభావము
లతోఁ బురుషులును, స్త్రీలును గుంపులుగుంపులుగఁ జేరి నిల్చుండి
యుండిరి. అట్టాలకములన్నియు రంజితవస్త్రములతోడను, పుష్పమా
లికలతోడను కేతనములతోడను, బరిశోభితములై యుండెను. ఆ
పూట కన్నములేనిబీదవారిపతనోన్ముఖకుటీరములయందును యథో
చితముగ శృంగారము చేయఁబడియెను. ప్రతిగృహముయొక్క ముం
గిలివాకిలియందును వారిపూర్ణకలశములుంపఁబడెను. కదళీవృక్ష
ములు స్థాపితములై యుండెను.

యువరాజు మొదలగువారు నగరమునఁబ్రవేశించినతోడనే
యుచ్చైస్స్వరముతో "జయము! జయము! యువరాజు జగత్సింహునకు
జయమగుఁగాక" యను జయధ్వానములు బయలువెడలెను.

ఏకకంఠ్యముగా వచ్చుచున్నయాశబ్దము పాట్నానగరమునం
దంతటను వ్యాపించెను. రాజవీథిగుండ రాజపుత్రాదులు మెల్లగన

డచుచుండిరి. పుణ్యాంగనలు గవాక్షములగుండ రాజపుత్త్రునిపై నక్షతలు, లాజలు, పుష్పములు చల్లనారంభించిరి. వివిధములగు మంగళవాద్యధ్వనులతో దిఙ్మండలము ప్రతిధ్వనించుచుండెను. జగత్సింహుఁ డవనతమస్తకముతో నందఱిశుభాశీర్వాదములను గ్రహించుచు నడచుచుండెను.

క్రమముగా వారందఱును మానసింహమహారాజు కొలువుకూటముకడకు వచ్చిరి. ఆకొలువునందే కుమారుని నేరములను విచారణచేసి మహారాజు కారాగారశిక్ష విధించియుండెను. కుమారజగత్సింహుఁ డాదర్బారుగృహముకడ నశ్వావరోహణముచేసెను. తోడనే పండ్రెండుగురు రాజపుత్త్రమొగలాయిసైన్యాధిపతులు వచ్చి యాతని కనవతమస్తకములతోఁ బ్రణామముచేసి సమాదరభావముతో నాతనినిగూడఁ దీసికొనివెళ్లి సభామండపమును బ్రవేశించిరి.

---

## పదునాల్గవప్రకరణము.

ఏసభయందు సర్వజనసమక్షమున శృంఖలాబద్ధుఁడై కారాగారపువస్త్రములనుధరించి జగత్సింహుఁడు దండితుఁడయ్యెనో, ఆ సభయందు మరల విశేషసన్మానముతో రాజవేషమునుదాల్చి యాతఁడు ప్రవేశించెను. ఎత్తుగనున్న యాభద్రాసనమునందే మానసింహమహారాజతిగంభీరభావముతోఁ గూర్చుండియుండెను. వెనుకటి పారిషదులు, సభాసదులే యిప్పుడును; కొంచెముతగ్గియున్న పీఠములపైఁగూర్చుండి యుండిరి. సైనికులతోడను, రాజసేవకులతోడను,

సాధారణజనసమూహముతోడను, కొలువుకూటము పరిపూర్ణము
గా నిండియుండెను. పూర్వమువలెనే సాధారణజనులు దర్బారునకు
వచ్చుట కెట్టియభ్యంతరమును లేదు. జగత్సింహునిశుభాగమనమును
సందర్శింపవలయునని వీథివీథియందును జేరినజనులందఱు తండతండ
ములుగ దర్బారుమహలునకు రానారంభించిరి.

సభామధ్యమున జగత్సింహుఁడు ప్రవేశించినమాత్రముననే
యుచ్చైస్స్వరముతో "జయము! జయము! యువరాజుజగత్సిం
హునకు జయమగుఁగాక!" అని జయధ్వానములు చేసిరి.

జగత్సింహుఁడును వెంటనే "జయము! జయము! అక్బరు
షాదుషహాకు జయమగుఁగాక! జయము! జయము! మానసింహ
మహారాజునకు జయమగుఁగాక!" యనియెను.

జగత్సింహుఁడు ముందునకునడచి క్రమముగా మానసింహ
మహారాజుకూర్చుండియున్నభద్రాసనమును సమీపించెను. భద్రా
సన మెత్తుగనున్నయొకగద్దెపై స్థాపింపఁబడియుండెను. జగత్సిం
హుఁడాసమీపమున నిలుచుండి తనయుష్ణీషమును శిరసునుండితీసి
మహారాజుపాదముకడసర్పించి చేతులుజోడించి "మహాపరాధియగు
తనయుఁడు కాతరభావముతో మహారాజుగారిని క్షమాభిక్షను వేఁ
డుకొనుచున్నవాఁడు" అనియెను.

మహారాజు—(గంభీరస్వరముతో) వత్సా! నీయపరాధము
లన్నియుఁ దొలఁగిపోయినవి. అక్బరుపాదుషహావారు స్వయముగా
మహానుగ్రహముతో నీయపరాధములనన్నిఁటిని క్షమించినారు. ఇం
తేగాక కారాగారమునుండి నిన్నువిముక్తిఁజేసినారు.

సభవారందఱు నైకకంఠ్యముగా "జయము! జయము! అ
క్బరుషాదుషహాకు జయమగుఁగాక!" యనుజయఘోషములను జే

యసాగెరి.

జగ—ఘాముపహారియనుగ్రహము నాకు శిరసావహింపఁదగినది. కాని, యెవరునాకీజగత్తునందుఁ బరమగురువులో, యెవరు నాకిహపరములయందు ప్రత్యక్షదేవతాస్వరూపులో, అట్టిపితృదేవతానుగ్రహమును బొందినఁగాని నాజీవితమంతయు వ్యర్థమైపోఁగలదు. తండ్రీ! మీమనోభావమునెఱుంగఁగోరి యధముఁడగు నీతనయుఁడు కాతరభావముతో నిటనిలుచుండియున్నాఁడు.

మాన—వత్సా! నీయపరాధములనన్నిఁటిని సరళహృదయముతో నేను క్షమించితిని. నీవునాయుష్ణీషమునుదీసికొని శిరస్సునందు ధరింపుము. నీవుకర్తవ్యపరాయణుఁడవై కీర్తినిసంపాదింతువుగాకయని యిదేయాశీర్వదించుచున్నాను.

సభాసదులమధ్యనుండి "జయము! జయము! మానసింహమహారాజునకు జయమగుఁగాక!" అనుజయధ్వానములు వెలువడియెను.

జగత్సింహుఁడు తండ్రిపాదములకడనున్న యుష్ణీషమునుదీసి శిరస్సున ధరించుకొనియెను.

జగ—ఇప్పుడు నాజీవితము సార్థకమైనది. తండ్రిగారియసంతృప్తిభారమును తలపైనిడుకొని జీవించుటకంటెఁ గొమరునకు మరణమే మంగళకరమైనది. నేనింతవఱకును జీవించియున్నను మృతప్రాయుఁడనే. దయామయుఁడవగునోతండ్రీ! నాయపరాధము లనేకములు. నాయపరాధములయం దేయపరాధములు క్షమింపఁబడినవి? మఱియేయపరాధములచే నేనింకను నపరాధిగా నున్నాఁడను? అదియు నసర్హతకలదేని దయచేసి సెలవిండు.

మాన—ప్రియకుమారా! పారివారికసంబంధమైనట్టియు,

రాజనీతిసంబంధమయినట్టియు నీనేరములన్నియును పూర్ణముగా క్షమింపఁబడినవి. నవాబునందినియగునయేషాహృదయమునందుఁ బ్రేమానలమును బ్రజ్వలింపఁజేయుటకు నీవెట్టిప్రయత్నములునుజేసియుండలేదనియు, అందుల కేవిధమగుసాహాయ్యమును నీవొనర్చియుండలేదనియు నాకు స్పష్టముగాఁ దెలిసినది. ఒరిస్సానవాబగు నసొౘ్రనుఖాను స్వయముగావచ్చి యావిషయములను నాకెఱింగించినాఁడు. అందుచే నావిషయమున నిన్నపరాధిగాఁదలంచుట యసంగతము.

జగ—(అవనతమస్తకుఁడై) నాయపరాధములింకను జాలఁగలవు.

మాన—వీరేంద్రసింహునితనయను నీవు పరిణయమాడుటచే నీవొకమహాపరాధమునుజేసితివనియే నిశ్చయింపఁదగియున్నది. అయ్యేన నొక్కటియున్నది. రూపమునందును విశేషించి గుణమునందును వీరేంద్రునితనయతో సరిపోలినవారెచ్చటను లేరు. తిలోత్తమ నిజముగా రాజలక్ష్మీస్వరూపురాలు. అందుచే నామెను బరిణయమాడుటచేఁ జేసినమహాపరాధమును క్షమార్హమైనది.

జగత్సింహునిహృదయ మానందముచే నృత్యముసేయఁదొడంగెను.

మాన—రాజకార్యమువట్ల నీవు గావించినమహాపరాధములు భూమండలాధిపతియే స్వయముగా క్షమించినాఁడు. దానినిగూర్చి యేయభిప్రాయమునైనను వెల్లడిచేయుటకుఁ బ్రయత్నింపఁబూనుట మహాపరాధమగును. నీవిప్పుడు పాదుషహావారియెడల సంపూర్ణముగా నిర్దోషివైతివి.

సభాసదులందఱు నైకకంఠ్యముగా "యువరాజునకు జయము

గుఁగాక !" అని జయజయధ్వనులను జేసిరి.

జగ—నావిషయమున నిప్పుడు మహారాజువారియాజ్ఞయేమి? ఏకార్యమును చేసి మహారాజగారియనుగ్రహమునకుఁ బాత్రుఁడను గావలయును?

మహారాజు పారిషదునకొకనికి సంజ్ఞచేసెను. అతఁడు లేచివచ్చి జగత్సింహునిచేతియం దొకయాజ్ఞాపత్రిక (సనదు)ను బెట్టెను.

మాన—యువరాజా! జగత్సింహా! చక్రవర్తిగారికృపచే నీవిప్పుడొరిస్సావంగవిహారదేశములకు రాష్ట్రపరిపాలకుఁడవైనాఁడవు. నీకు లభించినయీమహాభాగ్యము సామాన్యమనుష్యునియదృష్టమునందుఘటియింపదు. నేనునిన్నాశీర్వదించుచున్నాఁడను. కర్తవ్యపరాయణతయందును, న్యాయనిష్ఠయందును సాహసమునందును సువిచారమునందును నసదృశుఁడవై చిరస్థాయియగుకీర్తిని నీవు సంపాదింతువుగాక!

సభాసదులందఱు నుచ్చస్వరముతో "జయము అక్బరుషాదుషహాకు జయమగుఁగాక! జయము మానసింహమహారాజునకు జయమగుఁగాక! జయము! కుమారజగత్సింహునకు జయమగుఁగాక!" అని జయఘోషములను జేసిరి.

సభయందున్నగొప్పసభాసదులును పారిషదులును తమతమపీఠములనుండి లేచి సంభ్రమముతో జగత్సింహునకుఁ బ్రణామమును జేసిరి. వారిలోనొక్కఁడు ముందునకువచ్చి "మేము నవీనరాష్ట్రపరిపాలకునియధికారము నంగీకరించుచున్నాము. మేమాతనికి వశ్యులమైయుందుము. అవిచలితచిత్తులమై మేమాతనియాజ్ఞలన్ని శిరసావహించుట కంగీకరించెదము. మేము మనఃపూర్వకముగ నాతని శుభమును సదాగోరుచుందుము. ప్రస్తుతమున నాతనికీయున్నతపద

ని లభించినందులకై సర్వాంతఃకరణములచేతను మేమానందించుచు
న్నాము. మేము మనోవాక్కాయములచే నాతనికి సంపూర్ణసన్మా
నమును జూపుచుందుము. ఉత్సాహపూర్ణహృదయములతో మేమా
తనికి సర్వదా జయజయధ్వానములను జేయుచుందుము." అనియెను.

జగత్సింహుఁ డాశ్చర్యాన్వితుఁడయ్యెను. అంధకారావృతమై
నకారాగృహమునందు లోహశృంఖలనిబద్ధుఁడై యున్నయాయవస్థ
యెక్కడ? ఒరిస్సా, బీహారు, వంగదేశములకు సుబేదారుపదప్రాప్తి
యెక్కడ? దీనికిని, దానికిని గలయంతరము కల్పనాతీతమైనది. ఈ
యవస్థాద్వయమునకుఁ గలభేదము నాలోచించిచూచినచో శరీరము
కంపమొందును. ఈపరివర్తన మాకస్మికముగ నప్రార్థితమై యెన్నఁ
డు ననుకొననిదై వచ్చియుండుటచే దానిరహస్యమును దెలిసికొన
నసమర్థుఁడై జగత్సింహుఁడు ముగ్ధుఁడై యుండెను.

మాన—కుమారజగత్సింహా! నీవిప్పుడే కార్యభారమును వ
హింపవలయును. ఱేపటినుండియు నేనీకార్యమునుండి విడివడవల
యును.

జగ—అదేమి?

మాన—చక్రవర్తిగారియాజ్ఞ యట్లైనది. ఈయుత్తరవు చే
రినతోడనే నన్ను పాట్నానగరమునువిడిచి రావలయునని యాజ్ఞాపిం
చినారు. ఒకనిమేషకార్యార్థ మాలస్యముచేయకుండఁ బోయి యా
గ్రాయందుండవలయును. అచ్చటనుండి ఢిల్లీకిని ఢిల్లీనుండి, అజ్మీరున
కును వెళ్లవలసియున్నది. అచ్చటనుండి మఱియేకార్యములకొఱ కె
చ్చటకుఁబోవలయునో యింకను స్థిరపడలేదు. నేనిచ్చటనుండనిస
మయమునందు నిన్నొరిస్సావంగవిహారదేశములకు సుబేదారుగా చ
క్రవర్తి నియమించినాఁడు. అదియంతయు భూమండలాధిపతి స్వయ

ముగాఁ జేసినది. దానికి నేఁజేయవలసిన దేమియును లేదు.

అంతసేపటికి జగత్సింహుఁడు తనప్రకృతావస్థను గ్రహించెను. పిదప నేలపై మోకాళ్లూని "రాజాధిరాజుగారియాజ్ఞను శిరసావహించుట కీసేవకుఁడు చిరబాధ్యుఁడై యున్నాఁడు. మహారాజుగారియాజ్ఞాపరిపాలన మీదాసునకుఁబరమధర్మమైయున్నది. నాపైఁజూపినయీమహానుగ్రహమునకుఁ జక్రవర్తిగారియెడలను మహారాజుగారిపాదపద్మములయెడలను సదాకృతజ్ఞుఁడనై మెలంగెదను." అనియెను.

పిదప మానసింహుఁడు సింహాసనమునుండిదిగి జగత్సింహుని కడకువచ్చి యాతనిహస్తమునుబట్టుకొని "వత్సా! రమ్ము. వచ్చి సింహాసనముపైఁ గూర్చుండుము. నీకు నేను జనకుఁడనైనను నీశాసనాధికారమునకు లోఁబడినప్రజలలో నేనొకఁడను. ఏముహూర్తమునఁ జక్రవర్తిగారియాజ్ఞాపత్రము నీచేతికందినదో యాముహూర్తము మొదలుకొని వంగవిహారములకును నోరిస్సాదేశమునకును నీవుసుబేదారుఁడవైనాఁడవు. నిన్ను సుబేదారుసింహాసనముపైఁ గూర్చుండఁబెట్టుట నాకుఁ గర్తవ్యము." అనియెను.

జగత్సింహుఁడు తండ్రిపాదములకు వందనముఁజేసి యాతని పాదధూళిని శిరస్సునందుధరించెను. పిదప మానసింహుఁడు తనయునిహస్తమునుబట్టుకొని సభాసదులవంకఁజూచి యుచ్చైస్స్వరముతో "నేను రాజాధిరాజుగారియాజ్ఞానుసారముగ సర్వజనసమక్షమున నీసభయందు యువరాజగుజగత్సింహుని నోరిస్సావంగవిహారరాష్ట్రపరిపాలకసింహాసనమునఁ గూర్చుండఁబెట్టుచున్నాను. ఈనవీనరాష్ట్రపరిపాలకునియధికారకాలమున నీతనిపరిపాలనమునకు లోఁబడినదేశములయందు శాంతి సదా విరాజిల్లుచుండుననియు, ప్రజలు సర్వవిధములచేతను నిరుపద్రవులై యుండురనియు, యుద్ధములయం దశా

రణముగ రక్తపాతము లేకుండనుండుననియు నమ్ముచున్నాఁడను" అనియెను.

క్రొత్తసుబేదారు—నాసర్వప్రయత్నముల చేతను పాదుష హాదారియభీష్టమును నెరవేర్చుచుందును. పరిపాలనావిషయమున నాతండ్రిగారవలంబించినపద్ధతులనే యనుసరించుట కించుకంతయు శక్తివంచనము లేకుండఁ బ్రయత్నించెదను. సర్వవిధముల చేతను నాయధికారముక్రిందనున్న ప్రజల కనురంజనమగులాగునఁ బరిపాలించెదను.

మాన—జయము! జయము! క్రొత్తసుబేదారునకు జయమగుఁగాక!

దానిననుసరించి సభాసదులందఱును "జయము! జయము! క్రొత్తసుబేదారునకు జయమగుఁగాక!" అని జయఘోషలను జేసిరి. మిగిలినసైనికులును చూడవచ్చినవారందఱును సమస్వరముతో నదేరీతిగ జయధ్వానములను సల్పిరి. పిదప సభముగిసెను.

---

## పదునైదవప్రకరణము.

---

ఒరిస్సా వంగవిహారదేశముల సుబేదారగు కుమారజగత్సింహుఁడు తండ్రితోఁగూడ సభనుండి వెడలిపోయెను. తండ్రికొడుకులిరువురు న్నాకేయంతఃపురమున కేగిరి. అచ్చట మహారాజు కుమారునితో "నీవేగి మీతల్లులను జూచిరమ్ము" అనిచెప్పి యాతఁ డింకొకతావునకుఁ బోయెను.

యువరాజు మొట్టమొదట నూర్మహాదేవిసదనమున కేగెను. అచ్చట నాతనిసవతితల్లులు ముగ్గురుండిరి. భక్తిభావముతో నాతఁడు వారందఱిచరణముల కెఱఁగెను. వారు జగత్సింహునకు శుభాశీర్వాదములనుచేసి పిదప జరగిపోయినక్లేశవృత్తాంతము నెత్తి తమతమహృదయములయందలిదుఃఖమును తెలియఁజేసిరి.

ఊ—బిడ్డా! ఆఁకలిఁగొనియున్నావుగాఁబోలును. విశ్రాంతి యావశ్యకమని తోఁచుచున్నది. నీతోడమాటలాడవలసినసుఖదుఃఖసమాచారము లనేకములున్నవి. కాలాంతరమునందు వానినిగూర్చి మాటాడుకొనవచ్చును. నీవిప్పుడు నాతోఁగూడరమ్ము.

జగత్సింహుఁడు మాటాడకుండ నూర్మహాదేవితోఁగూడ నేగెను. కొంచెముదూరమేగినపిదప నచ్చటనున్నయొకగదిగుమ్మముకడనిలుచుండి యానూర్మహ "నీవీగదియందు విశ్రమింపుము. నేనుఁ వెళ్లి నీభోజనమువిషయమున నన్నియు సిద్ధముచేసెదను" అనియెను.

జగత్సింహుఁ డాగదిలోఁ బ్రవేశించెను. తోడనే పార్శ్వమునుండి సాశ్రునయనయైనసుందరి యొక్కర్తు శీఘ్రముగవచ్చి యాతనివక్షమునఁబడియెను. ఆసుందరి తిలోత్తమ.

యువరాజు నిశ్చేష్టుఁడై యేమియు మాటలాడలేకపోయెను. ఇదేమిస్వప్నమా? లేక నిజముగా జరుగుచున్నదియా? ప్రేతావిష్టుఁడైనమనుష్యునివలె నిప్పుడాతనికన్నియు భ్రాంతిమయములై కన్పట్టుచుండెను. ఆకస్మికముగఁ దనకున్మాదరోగము జనించి బుద్ధిభ్రంశమయినదని భయపడియెను. కాని, నిజముగా నశ్రుపూర్ణనయనయైనయాసుందరి తనప్రాణమునకుఁ బ్రాణమైనతిలోత్తమయేగాని మఱియెవరునుగారు. నిజముగా నాతనిహృదయవినోదినియే యాతనివక్షస్థలమున నశ్రువులఁ గురియించుచుండెను. మానవున

కాకస్మికముగ నీరీతిగ నదృష్టమునఁ బరివర్తనము సంభవించునా ? వియోగయాతనమువలనఁగలిగినదుశ్చింతలచేఁగొట్టఁబడినపిమ్మట నా కస్మికముగ నిట్లు పూర్వసుఖసంపద లొక్కమారుగఁజేరుట యెచ్చ టనైన సంభవించునా ? అదియెచ్చట ననుసంభవముకాకపోయినను, ఈసందర్భమున నట్లేసంఘటితమైనది. అందులకు సందేహములేదు.

తిలోత్తమకునయనములయందునీరు—అధరమునందుగనవు— అత్యద్భుతసమావేశము! జగత్సింహుఁడాప్రేమపుత్తలిని గాఢా లింగనముజేసికొని యాశ్చర్యముతో "తిలోత్తమా! నీవిచ్చట కెట్లు వచ్చితివి ? " అని యడిగెను.

తిలోత్తమ నవ్వుచునవ్వుచు "నన్ను తిలోత్తమయని సంబో ధించి మీరు తిలోత్తమకుఁ జాల నన్యాయముచేసినవారగుచున్నా రు. భువనవిఖ్యాతుఁడగునంబరేశ్వరునికోడలును,నారిస్సావంగవిహార దేశములకొత్తసుబేదారునకు ధర్మపత్నియునైననన్నుఁ బేరుపెట్టిపి లుచుట కెవరికిధైర్యమున్నది ?" అనియెను.

జగ—సరిగా మాటలాడనియపరాధమునకై తరువాత నీవు విధించెడిశిక్షను గ్రహించెదను. కాని, దయచేసి నీవిప్పుడిక్కడ కె ట్లు వచ్చితివో చెప్పుము ?

తిలోత్తమ మరలఁ జిఱునగవుతోఁగూడినమొగముతో "మామగారిగృహమునకు, భర్తయాశ్రయమునకు నెట్లువచ్చితివని మీరడుగుటెందులకు ? అట్లడుగవచ్చునా ? నాయంతట నేనే వచ్చి నాస్థానాధికారమును గైకొంటిని " అనియెను.

జగత్సింహుఁడాసుందరివదనమును చుంబనమాడి " నిజము గాఁ జెప్పుము. అదియంతయు నెట్లుజరిగినది ? " అనియెను.

తిలోత్తమ నవ్వుచు జగత్సింహుని సమీపముననున్నసింహా

సనముపైఁగూర్చుండఁబెట్టి "మీరు చాల శ్రమపడియున్నారు. భోజనాదికమైనపిదప సమస్తమును జెప్పెదను" అనియెను.

జగ—ఇప్పుడు సంభవించినయపూర్వఘటనావిశేషములన్నిటివలనను నాబుద్ధి భ్రమసిపోయినది. దీనిని స్పష్టముగాఁ దెలిసికొనినఁగాని నాబుద్ధి స్థిరముగానుండదు.

తిలోత్తమ వీవననుగైకొని యువరాజునకు వీవఁదొడంగెను. యువరాజామెచేతివీవనను దీసికొని "అంబరేశ్వరునికోడలికనేకపరిచారికలుకలరు. వారువచ్చి విసరెదరు. దయచేసి మొదట నాసంభ్రమమును నివారణముచేసి నామనస్సును స్థిరముచేయుము" అనియెను.

జగత్సింహుఁడత్యాదరముతోఁ దిలోత్తమను దగ్గరదీసికొని తొడపైఁ గూర్చుండఁబెట్టుకొనియెను. రాకొమరుని బందీగాఁజేయుటకుఁబూర్వపుదినమున సాయంకాలమైనపిదప మందారణదుర్గమందలిసౌధముపైఁ దిలోత్తమ యేభావముతో జగత్సింహునివక్షస్థలమునఁ దనమస్తకమునుంచుకొనియెనో, చాలకాలమునకుఁదరువాత నిప్పుడుమరల నదేరీతిగ, నదేసుఖోపధానముపైఁ దిలోత్తమ మస్తకము నిడికొనియెను. కాని, యప్పటికి నిప్పటికి నెంతభేదమున్నది! అప్పుడెంతభయానకమైనయాశంక! ఎంతభయవిశిష్టమైనవిషాదము! ఇప్పుడో! అసదృశమైనయెంతయానందము! ఎంతటిసుఖము!

ఆరీతిగఁగూర్చుండి తిలోత్తమ యావదుదంతమును క్రమక్రమముగ నాతనికెఱింగించెను. మానసింహమహారాజు యాత్రార్థము శ్రీక్షేత్రమునకు విచ్చేయుట, తాను తనసవతితల్లియగువిమలతోఁగూడ వచ్చుటి కూర్మిత్రాళామహారాజ్ఞికడకు వచ్చుట, కరుణామయియగు నామహారాజ్ఞి సాహాయ్యమునుబడయుట, ఆమెయనుగ్రి

హాముచే మహారాజునకుఁ బరిచయమగుట, తాను చేసిన సేవకు మహారాజు మెచ్చుకొనుట, మహారాజ్ఞియొక్క కౌశలముచే మహారాజు క్షమించి తన్ను కోడలనుగా గ్రహించుట, మొదలగుసంగతులనన్నిఁటిని దిలోత్తమ మెల్లగా సంక్షిప్తముచేసి మధురములైనమాటలతో జగత్సింహునకుఁ దెలియఁజెప్పెను.

జగ—(సంగతులనన్నిఁటిని వినినపిదప) నాకిప్పుడు తెలిసినది. తిలోత్తమా! నీబుద్ధికౌశలముచేతనే నాకీభాగ్యము లభించినది. నీప్రేమయందు ముగ్ధుఁడై నీదాసత్వమునంగీకరించినమహారాజు తనమనోభిప్రాయమును నీకేమని తెలియఁజెప్పినాఁడు? ఏమిచెప్పియాతనికృతజ్ఞతను నీకడవెల్లడిచేసినాఁడు? నన్నుఁ జెఱనుండివిడిపించుటకుఁగూడ నీకౌశలమే కారణమైనదని తోఁచుచున్నది.

తి—మీరు ప్రేమాంధులు. అందుచేఁ బ్రకృతవ్యాపారములన్నె దెలియఁజాలరు. నేను ప్రయత్నముచేసి నాస్థానాధికారమును బొందితిని. అజ్ఞాతమగుహీనభావమునందు నాజీవితమును వ్యర్థపఱుపకుండ న్యాయసంగతమైననాస్థానమును నేను పొందితిని. నావలననైనదింతియే. అందువలన నాకు విశేషగౌరవమేమియు లేదు. మిమ్ములను విడిపించువిషయమున నేనేప్రయత్నములను జేసియుండలేదు. ఆవిషయమునఁ బ్రయత్నముచేయుటకు నాకు సాధ్యమగునా? నవాబునందినియగునయేషా, శక్తియందును,బుద్ధియందును, కౌశలమునందును, నద్వితీయ; ఆమెస్వయముగానాగ్రాకువెళ్లి మిమ్ములను విడిపించినది. మీకులభించినయున్నతపదవికూడ నామెప్రయత్నఫలమేయని తోఁచుచున్నది; మీరు వినియున్నారో లేదో, నాకుఁ దెలియదు. నాకు సంవత్సరమునకు లక్షస్వర్ణముద్రికలయాదాయమువచ్చుజాగీరు నిచ్చితిమనిచక్రవర్తియాజ్ఞనంపినాఁడు. దానినినిజముగానవాబునందిని

యే చేసినది. కల్పనాతీతములైన మనయీసుఖోదయములకన్నింటికి నామెయనుగ్రహమే కారణము. ఈయుపకారమునకు మనము కృతజ్ఞతఁజూపఁదలంచితిమేని సర్వశక్తిమయియగు నాయమ్మయేసాకు మనము యావజ్జీవమును దాసులమై యుండవలయును.

జగ—అందులకు లేశమును సందేహము లేదు. ఆదేవిబుుణము నించుకయైన నెట్లుతీర్పఁగలమో నాకుఁ దెలియుటలేదు.

తిలో—(సాదరముగ జగత్సింహునికంఠాలింగనమును జేసికొని) ఆయుపాయమును నేనెఱుంగుదును. మీరీదాసిమాటల నాదరింతురా?

జగ—అట్లనెదవేమి? తిలోత్తమా! నీమాట కన్యథాయే న్నఁడైన జరగునా? న్యాయసంగతమైననీవాక్యమును విని యసాధ్యమైనదాని నిజేయవలసివచ్చినను నేనట్లుచేయుటకు వెనుకంజవేయను.

తిలోత్తమ జగత్సింహుని రెండుచేతులను బట్టుకొని "మీరు యేషాను పత్నీభావముతో గ్రహింపవలయును" అని బ్రతిమాలుకొనియెను.

జగ—ప్రాణేశ్వరీ! నీయీప్రస్తావమునువిని నీసరళస్వభావమును, నుదారతను, సహృదయతను మిక్కిలి కొనియాడుచున్నాఁడను. కాని యొక్కవిచారముమాత్రమున్నది. నీబుద్ధినిగూర్చి ప్రశంసచేయఁజాలను. కేవలముకృతజ్ఞతనువ్యక్తముచేయుటకు, పొందినయుపకారమునకుఁ బ్రత్యుపకారముసేయుటకు, బుుణవిముక్తి చేసికొనవలయుననునాశతో నేస్త్రీమణియొకస్త్రీని సవతిగాఁ గ్రహించుటకిష్టపడియెనో, యట్టియబలహృదయము చాలఁ బవిత్రమైనదనుట కించుకంతయును సందియములేదు. నేను నీహృదయమహత్వమును యోచించి యానందముతోఁ బదింబదిగ నిన్నుఁ గొనియాడుచున్నాను.

తి—కొనియాడినచోఁ గొనియాడవచ్చును. లేదా మానవ చ్చును. కాని, నన్ను నిందించు టెందులకు?

జగ—నిందించుటలేదు. అయేషాను పత్నీభావముతో గ్రహింపుమని నీవుచేసినబ్రస్తావమునకై నీబుద్ధిని ప్రశంసింపఁజాలకున్నాను.

తిలో—అదేమి? మహారాజునకును మహారాజ్ఞకినిగూడ నిదే యాశ; వారిరువురును బందింబందిగ నీవిషయమునుగూర్చి యయేషాతోఁ బ్రస్తావించియున్నారు. ఆమె యంగీకరింపలేదు. కాని, మీామనోభిప్రాయమును దెల్పినచో నామెహృదయమును ద్రిప్పవచ్చునని నానమ్మకము.

జగ—మీానమ్మకము మిగులఁ దప్పైనదియే; అయేషాహృదయసముద్రమందలియొకతరంగమునైనను మీారెవరును జూచియుండలేదు. మహారాజును, మహారాజ్ఞియును, వివాహముచేసినచో భార్యకాఁగలదనియు, ప్రేమించినచో నదియే ప్రణయమనియుఁ దలంచుచున్నారు. కాని, ప్రేమతత్వమును బూర్ణముగ నెఱింగినయయేషా యట్లనుకొనుటలేదు. ఆమెయభిప్రాయము వేఱు. హృదయవినిమయములేకుండ వేయిమందిపురోహితులుచేరిమనయిప్పటిపురోహితులవలె నసందర్భముగాఁ గర్ణకఠోరములైనతప్పుమంత్రముల సెకరువుపెట్టక సుస్వరముతోఁ గ్రమమెఱిగి సరియైనమంత్రములనన్నిఁటిని జెప్పి పరిణయముచేసినను నది పరిణయముకాదనియు, ఏప్రణయము తనంతటనదియుదయించి మనసునవృద్ధిఁజెంది ప్రాణమునుదేల్పఁజాలదో, యట్టిప్రణయము ప్రణయముకాఁజాలదనియు, నామెయభిప్రాయము. అయేషాకు వివాహముకాదు. నాయీాక్షేత్రమునందుహృదయవినిమయముగలుగునను ధైర్యము లేదు. అయేషాతన

హృదయమున నాకొక కగాధపణయమును బోషించుచున్నదని నే నెఱుంగుదును. కాని నాహృదయతంత్రి యాబ్రణయస్వరము నాలా పించు టెఱుంగదు. నేనయేషాను మిక్కిలిగఁ బ్రేమించుచున్నానను మాట నిశ్చయము. కాని యాప్రేమ యయేషాప్రేమకనురూపమై యుండలేదు. అందుచే నేనామెను బత్నీభావముతో గ్రహింపఁజాల ను. ఆమెయు నాకుఁ బత్నియగుట కంగీకరింపదు.

తిలో — మీరు మీహృదయము నయేషా కెందులకీయఁజాల రు? ఆమెవలెనే మీరు నామె నేలప్రేమింపఁజాలరు?

జగ — ఇదిమిగులమంచిప్రశ్న; పిల్లలడిగినట్లే యడిగితివి! ఇం కనుగొన్ని ప్రశ్నలను నీవడుగవచ్చును. పగలు రాత్రియగుట లేదే మి? రాత్రిపగలగుట లేదేమి? నీటియందగ్ని యేలయుండదు? అగ్ని యందు నీరేలయుండదు? ఇట్టిప్రశ్నల నేక మడుగవచ్చును. కోమలీ! ఏదియెట్లుకావలయునో యట్లుజరగును. ఎందుకొఱకేదిసృష్టింపఁబడి నదో యదియాకార్యములను జేయుచుండును.

తిలో — అట్లయ్యును, ప్రియత్నమునవలనను ప్రియాసమువల నను ప్రబలమైనయనురాగమువలనను ననేకవిషయములలో ననేకప రివర్తనములు జరుగుచుండవచ్చును. మీరు ప్రయత్నించినచో మీ హృదయము నవశ్యముగఁ ద్రిప్పవచ్చును. నిజముగా మీహృదయ తంత్రి యామెహృదయరాగము నాలాపనచేయఁగలదు.

జగ — హృదయమనునది యిష్టమువచ్చినప్పు డిష్టమువచ్చిన వారి కొసంగుట కవకాశము లేనిది. నీయేకమాత్రాధికారమునకులోఁ బడియున్నయీహృదయమునందు మఱియెవరికిని స్థలముదొరకదు. ఒకయాకాశమున వేలకొలఁది నక్షత్రములుండవచ్చును. కాని యిరు వురుసూర్యులకుఁగాని, యిరువురుచంద్రులకుఁగాని యటస్థలముండదు.

నీపరిణయరాగమునాలాపించుట నాహృదయతంత్రికిఁ దెలియును. అదిమఱియేరాగము నెఱుఁగదు. అయేషా, యాకాశమున నొకప్రక్క మిణుకుమిణుకుమనుచుండెడి యొకసామాన్యనక్షత్రమువంటిదికాదు. అయేషాపరిణయవిశిష్టమగురాగము నాలాపించుటకు నాహృదయతంత్రి కాస్వరము లేదు.

తిలోత్తమ చాలసే పధోముఖియై చింతించెను. రాజపుత్రుని వాక్యములయందలి మర్మమును దెలిసికొనలేక నిట్టూర్పువిడిచి "అట్లయినచో శోభామయమైనయాపుష్పము దానియంతట నదియే ముకుళించిపోవలసినదేనా? అనర్హమగుచోటనుంచినపరిణయసంబంధమగుతీవ్రజ్వాల ననుభవించుచు నసదృశమైనయాజ్యోతి తనంతట తాను హరించిపోవలసినదేనా?" అనియెను.

జగ — విధాతృని నియమమేమో నేనెఱుఁగను. కాని నీవు చెప్పినదే యయేషానుదుట వ్రాసినట్లుతోఁచుచున్నది. నేనామె నతిశయముగఁ బ్రేమించుచున్నాఁడను. ఆమెగుణములయం దత్యంతము ముగ్ధుఁడనై యున్నాఁడను. ఆమెరూప మసదృశమైనదని నేనెఱుంగుదును. నేనామెకు విశేషముగ ఋణపడియున్నాఁడను. ఆమెనిమిత్తము ప్రాణములనర్పించుమన్న నందులకు సిద్ధముగా నున్నాఁడను. కాని దేనినిపొందినచో నామెకు సుఖముగలుగునో, దానినామెకొసంగుటకు నాకు సాధ్యములేదు. ఏమంటివా? అది నాదికాదు. ఏపరిణయముచే నరకముస్వర్గమైపోవునో, ఏపరిణయముచేఁ బ్రపంచమందలిసర్వదుఃఖములును దూరములైపోవునో, ఏపరిణయముచే మానవుఁ డమరత్వమునుబొందునో, ఆపరిణయము నిప్పుడు నాయంకపీఠినిగూర్చుండియున్న దేవికి నిక్షేపముగా నర్పించివైచితిని. అయేషాయిప్పు డాపరిణయమును బ్రార్థించుచున్నది. ఆపరిణయము నీదే

నీచరణసమీపమున నీక్షవలె కే యర్పితము జేసివైచితిని. అందుచే నా దేవికొసంగుటకు నాదైనపదార్థమేమియునాకడలేదు.

తిలోత్తమ మాటాడకుండ మౌనయై యుండెను. మిక్కిలిప్రగాఢమైనప్రేమవిషయము! అయేషాపూర్ణహృదయము పూర్ణప్రేమమునఁదక్క మఱిదేనివలనను పరితృప్తిఁజెందనేరదు. అల్పమతులగుస్త్రీలవలె మానసింహమహారాజుగారి యసంఖ్యాకమహిషులవలె ప్రణయాస్పదుఁడగు వానినిభర్తయనిచెప్పుకొనుపాటియధికారమును పొందినచో నయేషాహృదయమునకు సంతుష్టిలేదు. అందుచే నామె దుఃఖము నివారణమగుట కుపాయమే లేదు.

జగత్కృతజ్ఞతనుగూర్చి చెప్పియుంటివికాదా? అయేషామొదలఁ గృతజ్ఞతావిషయమునుగూర్చి యోచించినఁ బ్రయోజనము లేదు. ఎవరిహృదయమునందు నన్నుఁగూర్చినయగాధప్రేమము కలదో, అట్టియయేషాకృతజ్ఞతాప్రత్యాశచేఁగాని ప్రేమోద్దీపనము చేయవలెనను నాశచేఁగాని నాకట్టియుపకారములను చేసినదా? అట్లయినచో నొకప్పుడైన నామె నన్నుఁ జూచుట కిష్టపడియుండును. ఒకప్పుడైనను ప్రస్తావవశమునఁ దనప్రణయవృత్తాంతమునుగూర్చి నాకుఁ దెలిపియుండును. ఆదేవిహృదయ మగాధమైనమహాసముద్రమువంటిది. ఆసముద్రతరంగమాలలో నొకతరంగమునైనను నీవు చూచియుండలేదని నేను మొదటనే చెప్పియుంటిని.

పార్శ్వమునందలిద్వారముకడ నిలుచుండి యూర్మిళాదేవి "కుమారా!" అని కేకవైచెను.

తిలోత్తమ వేఱుమార్గముగుండ శీఘ్రముగ నవ్వలకుఁ బరువెత్తికొనిపోయెను. జగత్సింహుఁడు "అమ్మా! లోపలకుదయచేయుము" అనియెను.

యువరాజు పీఠమునుండి లేచి నిలుచుండెను. తోడనే యూర్మిళాదేవి వివిధఖాద్యవస్తుపరిపూర్ణమైనసువర్ణపళ్లెరమును దీసికొని లోపలకువచ్చెను.

---

పదునాఱవప్రకరణము.

మానసింహమహారాజు భార్యలతోడను, నితరానుచరులతోడను నాగాప్రపట్టణమునకుఁ బయనమైపోయెను. జగత్సింహుఁడతిసమర్థతతో వంగవిహారాదిదేశములను బరిపాలనము సేయుచుండెను. వెడలిపోవునప్పుడు మానసింహుఁడు కుమారునకు రాజకార్యసంబంధములగు ననేకసదుపదేశములను జేసి మనఃపూర్వకాశీర్వాదముల నాతనిశిరముపై వర్షించెను.

మహారాజ్ఞియగునూర్మిళాదేవి ప్రయాణసమయమున రాజలక్ష్మీస్వరూపయగు తిలోత్తమను తనతోఁగూడ దీసికొనివెళ్లవలయునని యెంతయో యాశపడియెను. మానసింహుఁడుగూడఁ దిలోత్తమ లేకపోయినచోఁ దనకుఁ గష్టముగనుండునని తనయభిప్రాయమును వ్యక్తముచేసెను. కాని, మహారాజును, మహారాజ్ఞియుఁగూడ యువరాజొక్కఁడేయున్నచో ననేకవిధములగు కష్టముల కతఁడు పాల్పడుననియు, తిలోత్తమ నాసమయమున స్థానాంతరమునందుంచుట యుచితముగాదనియుఁ దలంచి యామె నచ్చటనే యుంచిరి. మహారాజును మహారాజ్ఞియు వెడలిపోవునాఁటికథను వివరముగా మేమిచ్చట చెప్పుటలేదు. సంక్షేపముగా నింతమాత్రము చెప్పిన

చో మనకథకుఁ జాలునని మాయభిప్రాయము. బాష్పాకులనేత్రియైనతిలోత్తమ ప్రణామమును జేసినపిదప నాశీర్వాదము సేయునప్పుడు కఠినహృదయుఁడగు మహారాజు కపోలములయం దశ్రువులు ప్రవహించుచుండెను. మహారాజ్ఞియగునూర్మిళయు కోడలను గాఢాలింగనము చేసికొని కన్నులనీరు పెట్టుకొనుటను జూచి కూడనున్నవారనేకులు మిగులవ్యాకులచిత్తులైరి. జగత్సింహుఁడొక్కఁడే పాట్నాయందున్నచో నాతనికిఁ గష్టముగనుండునని యోచించి మానసింహమహారాజు తన రెండవతనయుఁడగు మహాసింహుని జగత్సింహునకుఁ బాసటగఁ బాట్నాయం దుంచిపోయెను. మహాసింహుఁ డతిసమర్థుఁడగు సేనాపతియు, సాహసియు, రణకుశలుఁడును పేరొందిన పాదుషహావారిసేవకుఁడునై యుండెను. మహాసింహుఁడు వయసునందు జగత్సింహునికంటె రెండువత్సరములు చిన్నవాఁడు.

జగత్సింహుని యాత్మీయులందఱును పాట్నానుండి వెడలిపోయిరి. కాని, తిలోత్తమయాత్మీయులలోఁ జాలమంది పాట్నానగరమునకు వచ్చియుండిరి. దీర్ఘకాలవ్యాపియైనదుర్దశ జరిగిపోయినపిదప యువరాజును జూడవలయునని విమలయాత్రపడుచుండెను. కాని, యా సమయమునఁ బాట్నానగరమును వీడి మందారణదుర్గమునకు వచ్చుట జగత్సింహున కుచితముగాదని తలంచి తనయను, అల్లునిఁ జూచుకొనుటకు విమలయే పాట్నానగరమునకు వచ్చెను. ఆమెతోఁగూడ నాస్మానియును వచ్చెను. ఆస్మానిప్రయాణమగుచుండుటను జూచి లక్ష్మణియుఁ దనమూటను గట్టెను. వారినందఱఁదీసికొని యభిరామస్వామి పాట్నానగరమునకు విచ్చేసెను. గజపతివిద్యాదిగ్గజుఁడును పాట్నానగరమును జూడవలయుననునాశను విడువలేకపోయెను. వీరే కాకుండ దాసదాసీజనులును, నితరజనులును, వారితోఁగూడ వచ్చిరి.

విమల యల్లునియింటియందుండదు. అందుచే గంగాతీరము నందొక పెద్దసౌధమున నామెకు నివాసమేర్పఱుపఁబడియెను. ఆమెతోఁగూడవచ్చినపురుషులందఱు వేఱుగృహమున నివసించియుండిరి. జగత్సింహునియనుమతిఁబడసి తిలోత్తమ సవతితల్లికడకువచ్చియుండెను. చెవినిబట్టుకొనినచో శిరసుగూడవచ్చునుగదా! కుమారజగత్సింహుఁడుగూడఁ దనప్రాసాదమునువీడివచ్చి గంగాతీరమునందలి యాసౌధమునందే కాలముగడపుచుండెను. అంతయుఁ బరమానందముగ నుండెను. చూచుచుండగనే రెండునెలలుగడచిపోయినవి.

ఒకనాఁటియుదయమున నాసౌధమునందొకగదియందభిరామస్వామియును విమలయుఁ గూర్చుండి మాటలాడుచుండిరి.

విమల—కావలసినదంతయు నైనది. అసహనీయమైనమహాజ్వాల నింతవఱకునుమాటలాడకుండ సహించితిని. ముందును నిట్లే సహించుచుండుటవలనఁ బ్రయోజనమున్నట్లు కాన్పింపదు. తిలోత్తమయిప్పుడు సర్వసుఖములకు నధికారిణియైనది. మానసింహమహారాజామెను తనయునకు దాసిగానైన నొప్పుకొనుననుమాటయుఁ గూడ నక్కఱలేకుండ మనయదృష్టముచే నామెను మహాదరముతోఁ గోడలనుగా గ్రహించినాఁడు. ఆమెభర్త పదవియందును ధనమునందును గౌరవమునందును నగ్రస్థానమువహించినాఁడు.

అభి—నీయవివేకముచేతనే మనకిన్నిదుర్దశలును దుర్ఘటనలును సంభవమైనవని నిన్నొకప్పుడు తిరస్కరించియున్నాఁడను. ఇప్పుడైనను, నీబుద్ధిని, సద్వివేచననుగూర్చి శ్లాఘింపవలసియున్నది. మహారాజ్ఞయగునూర్మిళాదేవి చిరకాలమునుండి నీపైఁ జాలదయఁగలిగియున్నది. ఆమెయాశ్రయమునఁ జాలకాలము నీవు సుఖమనుభవించితివి. ఆమెయనుగ్రహమువలననే నీభర్త మానసింహునికో

పాగ్నినుండి రక్షింపఁబడినాఁడు. ఆమెయనుగ్రహమువలననే నీవు వరించినపురుషుని నీవుపతిగాఁ బడయఁగలిగితివి. ఆమహారాజ్ఞి పురుషోత్తమనగరమునకు వచ్చినదని తెలిసికొనిపోయి తిలోత్తమనామెకు శరణాగతగాఁ జేసినావు. అందుమూలముననే నీయుక్తాయుక్తవివేచనాజ్ఞానము వ్యక్తమగుచున్నది. ఆమహారాజ్ఞిబుద్ధికౌశలమువలననే తిలోత్తమకిప్పుడు సంభవాతీతమగుమహాభాగ్యములభించినది.

విమల— ఆమహారాజ్ఞిపాదపద్మములకు నేను నిత్యమును వందనములను చేయుచుందును. భగవంతుఁడామెకు సదా సర్వసుఖములు నొసంగి రక్షించుచుండుఁగాక! ఆమహారాజ్ఞియనుగ్రహముచే నిప్పుడు నాసకలాభీప్సితములును నెరవేరినవి. తండ్రీ! ఇఁకముందు నేనీప్రపంచమునందుండు టెందులకు ?

అభి—ఏమిచేయవలయునని యాలోచించుచున్నావు ?

విమల—ఎవనికిజీవితము నర్పించితినో యాతఁడీప్రపంచమున లేఁడు. నేనీప్రాణము నిఁక నిలుపుటెందులకు ?

అభి—ప్రాణపరిత్యాగమువలన విశేషపాపము కలుగును. అందువలన నభీష్టసిద్ధి యిసుమంతయుఁ గానేరదు. వత్సా! నాయుపదేశమును వినుము. నీవు జీవన్మృతవుగమ్ము. దానివలన సకలశుభములును గలుగును. జీవితమానందమయమగును. సమస్తాశలను త్రోసివేసి పూర్ణానందమున కధికారిణివగుట కభ్యాసమునుజేయుము—ఇదియే నాయుపదేశము.

విమల—మీయుపదేశము శిరసావహింపఁదగినది. కానియీవిషమహృదయజ్వాలానివృత్తికి మఱియేమియు నుపాయమ్ములేదా ?

అభిరామ—ఉన్నది. సుఖదుఃఖములను సమముగాఁజూచు జ్ఞానమును సంపాదించితివేని యాతనలన్నియు నశించిపోవును.

విమల—అజ్ఞానములభించు టెట్లు? సుఖదుఃఖములు రెండును సమానమని దెలిసికొనఁగలిగినచోఁ గష్టములు నశించిపోవుననుమాట నిజము. కాని, యాజ్ఞానమును బడయుటకుపాయమేమున్నది?

అభి—బిడ్డా! జ్ఞానసంపాదనమున కుపదేశమును సాధనము నావశ్యకములు. ఏకారణములచే నేనిచ్చట బద్ధుఁడనై యుంటినో యవియన్నియు ముగిసిపోయినవి. ఇఁక నీకు సాధనవిధానముల నుపదేశించి వెడలిపోయెదను. మనము మరలఁ బాట్నానగరమునకు రావలసినయావశ్యకము లేదు. నీవొక నెలదినములు కుమార్తెయొద్దను, నల్లునియొద్దనుండి యానందముననుభవింపుము. దీర్ఘమగునీలౌకికానందమునందు సుఖములేదని నీవు తెలిసికొనియుండవచ్చునని తోఁచుచున్నది. వ్యర్థమై, నిర్మలానందరహితమైన యీయానందమువలనఁ బ్రయోజనమేమి? బిడ్డా! అక్షయమై యనంతమైనయానందమునుబడయుటకు నీకు మార్గమునుజూపఁబ్రయత్నించుచున్నాఁడను. ఇప్పుడే యీస్థలమునువిడిచిపోవుట కుచితములగు నేర్పాటులను జేయరాదా?

విమల—ఆజ్ఞాప్రకారమట్లే. మొదట తిలోత్తమతోడను పిదప రాజపుత్త్రునితోడను నీవిషయమునుగూర్చి ప్రస్తావించెదను. రాజపుత్త్రుఁ డిప్పుడే యింటనుండి వెడలిపోయినాఁడు. సాయంకాలమువఱకును నాతనిజూచుట కవకాశముండదు. ఈలోపుగఁ దిలోత్తమతో నీవిషయమునుగూర్చి ప్రస్తావించి సిద్ధారణచేసెదను.

విమలయు నభిరామస్వామియుఁ గూర్చుండిమాటలాడుచున్న గదిసమీపమున నతికౌతుకావహమగు కార్యమొకటి జరగుచుండెను. గజపతివిద్యాదిగ్గజుఁడు గృహపార్శ్వమందలి యొకవృక్షచ్ఛాయను లక్ష్మిపాదములనుబట్టుకొని యేడ్చుచుండెను. అతఁడట్లేల యే

ద్భుచుండెనో తెలుపవలయుననిన సంతకుఁబూర్వవృత్తాంతము నించు కమీాకు ముందుగఁ దెలుపవలసియుంటును.

గజపతివిద్యాదిగ్గజుఁడు చాలమర్మపీడితుఁడై యుండెను. ఎవ తె పేరునందు మొదటియక్షరము "అ" యును నంత్యాక్షరము "ని" యునుండెనో యామె తనప్రిణయినియని తెలిసికొనియుండెను. అది యొక్క-దైవజ్ఞునివచనము. ఇంతేకాదు. ఆతనిలలాటలిపికూడ నట్లే యున్నది. అందుచే నామాట యసత్యముకానేరదు. ఒకప్పుడభిరా మస్వామికడనుండివిమలకొకయుత్తరమునుదీసికొని పాట్నానగరము నకుఁ బయలుదేరెను. ఆసంగతిపాఠకులకుజ్ఞప్తియందుండవచ్చును. అప్పుడు మధురాసింహునిసైన్యములోనిపూర్వపరిచితుఁడును, హాస్య ప్రియుఁడును జ్యోతిశ్శాస్త్రవిదుఁడునైనసైనికుఁడొకఁడు దైవవశ మున నీగజపతినిచూచెను. గజపతి యాతని నానవాలుపట్టలేకపో యినను, సైనికుఁడు గజపతిని సులభముగా నానవాలుపట్టెను. విశే షామోదముగనుండునని యోచించి యాసైనికుఁడు తనగురువనిచె ప్ప వేఱొకసైనికుని గజపతియొద్దకుఁ దీసికొనివచ్చెను. ఆగురువు గ జపతివిద్యాదిగ్గజునిలలాటముఁజూచి "ఎవతెనామాక్షరములలో మొ దటియక్షరము "అ" యును, నంత్యాక్షరము "ని" యుండునో యా మె నీప్రిణయినియనిస్పష్టముగావ్రాసియున్నది" అనిచెప్పెను. ఆల లాటలిపి నిస్సందేహముగాఁ దెలిసినపిదప గజపతివిద్యాదిగ్గజుఁడు మి గులసంతుష్టచిత్తుఁడయ్యెను. కాని దానివలననైనదేమి? ఘటనయా తనికిఁ బ్రతికూలమేకాఁదొడంగెను.

అభిరామస్వామి ప్రిస్తావవశమున విమలతో "గజపతివి ద్యాదిగ్గజునితోఁ బరిహాసమాడుచుండు టనుచితమని నుడివియుండె ను. అప్పుడచ్చట నాపొమ్మనీకూడ నుండెను. అదిమొదలుకొని విమల

యు నాషాస్త్రీయును నావిషయమునఁ జాలజాగరూకులై యుండిరి. ఆ షాస్త్రీ గజపతి కెదురుగఁబోవఁడు. పోయినను మాటలాడఁడు. మరి యొకదిక్కునకుఁ దొలఁగిపోవుచుండును. సూర్యచంద్రు లీశాస్త్రము నకు సాక్షులో యీశాస్త్రమసత్యమేనా ?

గజపతివిద్యాదిగ్గజు డాషాస్త్రీచేసెడు నన్యాయమైన యత్యాచారమునుగూర్చి యామెపై నభియోగమును దెచ్చుటకుఁ దనకధికారముగలదని స్థిరపరుచుకొనియెను. దేశమునకంతకు నధిపతియైన యువరాజతనికి విశేషపరిచయుఁడు. అందుచే నాతనికడ "ఫిర్యాదు" చేయుటావశ్యకము. జగత్సింహుఁడు గంగాతీరమునందున్న సౌధమునకు వచ్చుసమయమునందు గజపతియునువచ్చి సింహద్వారముకడ కాచినిలుచుండి జగత్సింహుని యాగమననిర్గమనములను జూచుచుండెను. కాని, రాజపుత్త్రున కెదురుగఁబోయినిల్చుండుటకు, నాతనితో మాటలాడుటకు గజపతికి ధైర్యము లేకపోయెను. రాజపుత్త్రునితోఁగూడ వెనుకనుముందును విచ్చుకత్తులతో రక్షకులుండుటనుజూచి గజపతికి చేతులుకాళ్లునడంక "తలయెగిరిపోవునేమో" యనుయోచన హెచ్చయ్యెను. అభియోగమునుగూర్చినయోచన యెక్కడనో యదృశ్యమైపోయెను.

ఒకానొకనాఁడు గజపతి లక్ష్మణికన్నులఁబడియెను. యువరాజువచ్చుటనుజూచి దిగ్గజుఁడొకవృక్షచ్ఛాయకుఁబోయి నిలుచుండియుండెను. యువరాజుసౌధమునుండి తిరిగివెళ్లినపిదప గజపతియు నాస్థలమునుండి యీవలకువచ్చెను. ఎక్కడనుండియో వచ్చుటకు వచ్చినలక్ష్మణి యాతనిహస్తమునుబట్టుకొనియెను. గజపతితోఁ బరిహాసమాడు టభిరామస్వామికిఁ గోపహేతువని యామె యెఱుంగదు. అందుచే నామె గజపతితో నించుకపరిహాసమాడవలయునని

తలంచి ముఖమును జిట్లించుకొనుట నభినయించి క్రోధభావమును గనబరుచుచు నాతనిహస్తమును బట్టుకొనియెను.

దిగ్గజున కిప్పుడా మొదటివేషము లేదు. కటియందు ధోవతిని ధరించి భుజముపై నామావళియున్న వస్త్రమును వేసికొని, కంఠము నందు తులసిమాలనలంకరించుకొనియెను. లలాటమునందును నాసాగ్రమునందును తిలకముండెను. శుద్ధవైష్ణవయావేషముతోనున్న యానాగరకునిహస్తమునుబట్టుకొని లక్ష్మణి "ఆహా! దొంగచిక్కినాఁడు. చాలఁగా వెదకివెదకి తుదకుఁ బట్టుకొంటిని" అనియెను.

లక్ష్మణి నాకస్మికముగఁ జూచినను గజపతి భయపడక మనస్సునందిట్లు తర్కముచేసికొనఁదొడంగెను. యత్ర ధూమో తత్ర వహ్నిః" లక్ష్మణీరూపమేఘ మెచ్చటనుండునో, ఆపాత్మ్రీరూపజల మచ్చట వర్షించును. మొగటచూడ విశ్వే తటస్థమైనది. లక్ష్మణి నా తృష్ణామేఘము — జలము లేదు. శ్రీరాధాపాదపద్మనూపురధ్వనులు న్నవి — శ్రీరాధికలేదు. దూరమందున్న కుసుమసౌరభ మిటనున్నది — కుసుమము లేదు. ఆగతశీలుఁడైన నరపతియొక్క పరివారపదజనితధూళియున్నది — నరపతి లేఁడు" ఈవిధముగాఁ దనలో వితర్కించుకొనుచుండుటచే లక్ష్మణినిజూచి గజపతి పూర్ణానందమునొందక పోయినను, నాతని కానందముగనే యుండెను. కొంతసేపటికి ధైర్యముఁదెచ్చికొని "నీవు లక్ష్మణివి. నీవు లక్ష్మణివైనచో నీయాపాత్మ్ర నీయేది?" అనియెను.

ల — ఆపాత్మ్రీయెచ్చటనున్నదో నేనెఱుఁగుదునా? నన్నుజూచిన నీకుఁ జాలదా? ఈవిధముగాఁ గాళ్లచేఁ దన్నుకొనిపోవువాఁడవు, నన్నెందులకు వ్యామోహపెట్టితివి?

నేను నీనిమిత్తమై చాలగ నలసియున్నానని నీహృదయము

నందొక్కమారైన దోఁచకపోయెనా ?

దిగ్గజు—ఆసంగతిని నేను బాగుగా నెఱుంగుదును. నేనును నీ నిమిత్తము నిజముగఁ బిచ్చివాఁడనై పోయితిని. కాని, యావిషయము బాగుగా నీకుఁ దెలియలేదు. ఆస్త్రీతో నాకుఁ జాలపనియున్నది. అనేకదినములనుండియున్న పరిణయము; తటాలున నామెను విడనాడవీలులేదు. నీవు దయచేసి యామెనొక్కమారు తీసికొని వచ్చెదవా ?

ల—నాకేమియగత్యము ? తమశత్రువును తామే తీసికొని వచ్చి పాలుదాగించువారుందురా ? నేనామెనెప్పుడును తీసికొని రాను. నేను నిన్నిఁక విడువను. నావాఁడవగుదువో, లేదో చెప్పుము.

దిగ్గ—నిజముగా నీవాఁడనయ్యెదను. కాని, సుందరీ! ఆస్త్రీనివిడిచి నీతోఁగూడవచ్చుటకుఁబూర్వ మొక్కసారి యామెను కడసారిచూచి యామెకడ సెలవుఁగైకొను టుచితముకాదా ? నాతోడు ! అందులకేదైనఁ దగినయుపాయ మాలోచింపుము.

ల—అదెప్పుడును జరుగదు. నిన్నాస్త్రీతో మాటలాడనీయను. నీవామెను దూరమునుండియుఁ జూడఁగూడదు. ఆస్త్రీయును నీవును నొక్కచోనుండగా నెప్పుడైన నేను జూచుటతటస్థించెనేని నీకాక్షణముననే సమార్జనీప్రాయశ్చిత్తము తప్పక సిద్ధించును.

విషమసమస్య—దిగ్గజుఁడు చాలసేపుయోచించి పిదప "అట్లయినచో నీజన్మమున నిఁక నాస్త్రీని జూడఁగూడదా ?" అనియెను.

ల—ఎప్పుడును జూడఁగూడదు.

దిగ్గజుఁడేడ్చుచు లక్ష్మణిపాదములనుబట్టుకొని "సుందరీ !

అట్లయినచో నేను చచ్చిపోయెదను. నన్నుఁ జంపుటవలన నీకు లాభమేమి ? ” అనియెను.

లక్ష్మణియు మిగులఁగష్టముమీఁద నగవునాపుకొని “నీవుచచ్చిపోయినను మంచిదే. నిన్ను యమసదనమునకై పంపించెదను గాని, యాషామ్మనీవాఁడవగుట కామెయొద్దకుఁ బంపుట కొప్పుకొనను” అనియెను.

గజపతివిద్యాదిగ్గజుఁడు రోదనముచేయుచు లక్ష్మణిపాదములనుబట్టుకొనియుండఁగా నభిరామస్వామి యచ్చటకువచ్చెను. ఆతనినిజూచినతోడనే లక్ష్మణి పారిపోయెను. పారిపోవుటకు శక్తియు నిష్టమునుగలవాఁడైనను దిగ్గజుఁడు పారిపోవలేదు. అధోముఖుఁడై యచ్చటనే నిలుచుండియుండెను.

అభి—మూర్ఖా ! ఆస్త్రీలందఱు నిన్నుఁ బరిహాసము చేయుచున్నారు. ఆసంగతి తెలిసికొనుటకు నీకు బుద్ధిలేదా ? నీలలాటము నందీపరిణయము వ్రాసియున్నదని యెవఁడనియెనో యాతఁడు నిన్నుఁ బరిహాసముచేయుటకై యట్లుచెప్పినాఁడు. అది యసత్యపుమాట. నేను జ్యోతిషమునందు బాగుగా గణితముచేసిచూచినాఁడను. నీలలాటమునందట్టిదేదియు వ్రాయఁబడియుండలేదు. నీవు నాయనుగ్రహమునుగోరుచుంటివేని, యాకుత్సితవ్యాపారములనన్నిఁటిని విడిచిపెట్టుము. నాతోఁగూడరమ్ము.

చేయునదిలేక గజపతివిద్యాదిగ్గజుఁ డధోముఖుఁడై గురువుననుసరించి వెడలిపోయెను.

# పదునేడవప్రకరణము.

జగత్సింహుని రాజ్యప్రారంభమునందు విశాలమైన యూప్రదేశమునం దెచ్చటను నెట్టియశాంతియుఁ గనుపట్టలేదు. సర్వత్ర ప్రకృతిపుంజము నిరుపద్రవమై నిశ్చింతతో నెమ్మదిగనుండెను. భిన్నభిన్నములుగానున్న యూమూఁడుదేశములందును నసంతోషమనునది లేదు. విద్రోహవహ్నిప్రధూమము లెగయుచుండెననియెడివార్తలెచ్చటను లేవు. స్వాతంత్ర్యభావముతోఁ బ్రేమమయియైన హృదయేశ్వరినిగూడి నూతనముగ సంపాదించిన పదగౌరవములననుభవించుచు జగత్సింహుఁడు పరమానందముతోఁ గాలమును గడపుచుండెను.

కాని, ప్రపంచమునం దెచ్చటను నానందము చిరస్థాయియై యుండఁజాలదని తోఁచుచున్నది. ఆనందకుసుమము వికసింపఁగనే నిరానందకీటకమలత్స్యభావముతో వచ్చి దానినాక్రమించుకొని, దానిశోభాసౌందర్యములను హరించి, దానిని వికృతముగను విరూపగను జేసివేయును. ఆకస్మికముగ నోరిస్సానుండి రామచంద్రదేవమహారాజు—నవాబగునస్మ్రముఖాను విశేషసైన్యములను సంగ్రహించుచున్నాఁడనియు, యుద్ధమునకు సన్నద్ధుఁడగునట్లు తోఁచుచున్నదనియు శీఘ్రకాలములోనే యొరిస్సాదేశమున నశాంతికలుగుననియు జగత్సింహునకు వర్తమానమంపెను.

ఆవార్తనువిని జగత్సింహుఁడు మిగులఁ జంచలచిత్తుఁడయ్యెను. కుమారమహాసింహునితో నాలోచించి, యేమిచేయవలసినదనియు, నిర్ధారణముసేయవలయునని నిశ్చయించుకొనియెను. యుద్ధము

నుజేయుటయే కర్తవ్యమని నిశ్చయించి యప్పుడే తాముఁగూడ రణ
సన్నద్ధులుకావలయునని యన్నదమ్ములిరువురు నాలోచించుకొనిరి.
మొగలాయీలపక్షమున నాలోచన లారంభమయ్యెను.

కొలఁదిదినములలోనే యొరిస్సాదేశపుఁబఠానులనవాబగు
నస్మాన్‌ఖాను స్వయముగా సైన్యములనుదీసికొనివచ్చి చాలసల్లరి
చేయుచున్నాఁడనియు, పూరిపట్టణమును మరల నాక్రమించుకొని
తమకై వశమున నుంచుకొన్నాఁడనియు, రామచంద్రదేవరాజు వే
ఱుదుర్గము నాశ్రయముగాఁ జేసికొనియున్నాఁడనియుదుర్గము పఠాను
లవశమగుననుభయముగలుఁగుచున్నదనియు సమాచారమువచ్చెను.

పఠానులను నాశనముసేయవలయుననునుత్సాహముతోఁ గు
మారమహాసింహుఁడు గొప్పసైన్యమునుదీసికొని యొరిస్సాకుఁ బ
యనమైపోయెను. భద్రకుసమీపమందలియొకస్థలమున నాతఁడు
శత్రుసైన్యములనుజూచి యచ్చటనే యుద్ధమునకుఁ బ్రారంభించె
ను. అస్మానుఖానుస్వయముగా సైన్యములనడుపుచు నత్యంతోత్సా
హముతో రణమొనర్చుచుండెను. యుద్ధమునందు జయలక్ష్మి య
స్మాన్‌ఖాను నాశ్రయించెను. మొగలాయీల కతిలజ్జాకరమైనప
రాజయమయ్యెను. మహాసింహునిసైన్యము చాలవఱకు మృత్యు
ముఖమునఁ బడిపోయెను. హతశేషులగుసైనికులు ప్రాణభయము
చేఁ బలాయనులైపోయిరి. తుదకు మహాసింహుఁడును రణక్షేత్ర
మునుండి వెనుదిరుగవలసివచ్చెను.

పఠానులు మరలనోరిస్సాదేశమునంతను జయించి తమస్వాధీ
నములోనికిఁదీసికొనిరి. కాని, యుత్సాహశీలుఁడును నయేష్టాపూల
మునఁగలిగినక్రొత్తబల్లముచే మిగులధైర్యమునుజెందినసాహసుఁడు
నగునస్మానుఖానున కొరిస్సాదేశముతోఁ దృప్తికలుగలేదు. వంగ

దేశమునుగూడ జయింపవలెననునుద్దేశముతో నాదేశమునకభిముఖ
ముగసైన్యమును దీసికొనివెళ్లెను. మహాసింహుఁ డెంతయోప్రయ
త్నించియు నామహాప్రవాహము నాపలేకపోయెను.

జగత్సింహుఁడుగూడ రణరంగమునకు వచ్చిచేరెను. అప్పటి
కప్పుడే పఠానులు వంగదేశమునఁ జాలభాగము తమవశముచేసికొ
ని రాజ్యపాలనముసేయుచుండిరి. అత్యల్పకాలములోనే పఠానులు
మేదినీపురము మల్లభూమి కోట్లానులను సంపూర్ణముగాను, వీరభూమి
వర్ధమానములయందుఁజాలభాగమును దమవశముఁజేసికొనిరి. ప్రతి
యుద్ధమునందును నస్మాన్ఖానునకే జయముగలుగుచుండెను. ఆత
నిశక్తిసాహసాదులనుజూచి శత్రుపక్షమువారు ముగ్ధులగుచుండిరి.
ఆతనిబాహువులయం దెప్పుడును జూడనిశక్తియు, నాతనిహృదయ
మున్నం దనంతమైనయుత్సాహోద్యమములును వర్ధిల్లుచుండుటఁజూడ
జయలక్ష్మియాతనికి నిత్యసంగినియేమోయనునట్లుతోఁచుచుండెను.
ఒరిస్సాదేశము మొగలాయీలచేతినుండివదలిపోయినదనియు, వం
గవిహారదేశములుకూడఁ గొలఁదికాలములోనే మొగలాయీలనుం
డివీడి యస్మాన్ఖానునియధికారపాశమున బద్ధములైపోవుటకవనత
మస్తకములతో నిలుచుండియున్నవనియు నందఱు ననుకొనఁజొచ్చిరి.

అస్మాన్ఖానునియీజయోల్లాసమునుజూచి యయేషాపొందె
డియానందమునకు మితిలేకుండెను. కేవలము నస్త్రధారణముచేసి ర
ణక్షేత్రమునందవతరింపకపోయినను నాదేవియే యీసమరవ్యాపార
మునఁ బ్రధానాధిపత్యమును వహించియుండెను. ఆమె యనేకయుద్ధ
ములల్లోఁదనదాసీజనసహితముగ నేగియస్మాన్ఖానునితోఁగూడనుం
డుచువచ్చెను.అనేకయుద్ధములలో రణవిరతిసమయముననస్మాన్ఖా
నయేషాకుటకుటీరమునకువచ్చి యామెతో నాలోచనము సేయుచుం

డెను. అయేషామంత్రిత్వముచేతను బుద్ధికౌశలముచేతను సులభము
గా నస్మాన్ఖాను ప్రతియుద్ధమునందును జయమునుబొంద నారం
భించెను. రోగమునుండివిముక్తయైనపిదప నయేషాయు నస్మాన్ఖా
నునుజేయవలసినదానినిగూర్చి యేమేమిమాటలాడిరో యదియంత
యు నిప్పుడు సఫలమగుచువచ్చెను. అస్మాన్ఖానుని యుత్సాహ
మునకుఁ బారము లేదు. రణరంగమునకు జగత్సింహుఁడువచ్చినను
నస్మాన్ఖానునకుఁబరాజయముగలుగుట లేదు. తుదకు జగత్సింహుఁ
డు సమ్ముఖమున యుద్ధముచేయుటనువీడి కౌశలముచే నస్మాన్ఖా
నుని వినాశనమునకు వలయునుపాయముల వెదకఁదొడంగెను. వెంట
నే యందులకవకాశమును దొరకెను.

అస్మాన్ఖాను వర్ధమానమును జయించినచో బంగాళాదే
శాధిపత్యము సంపూర్ణముగాఁ దనకుఁ గరగతమగుననియూహించి
యట్లుచేయ స్థిరముచేసికొనియెను. వర్ధమానమునుజయించునిమిత్త
మాతఁడు మొట్టమొదట మందారణదుర్గము నాక్రమించుకొన
వలసియున్నదని తలంచెను. మందారణదుర్గము పఠానులవశమై య
చ్చటవారిసైన్యమునుంచుకొనుట కనుకూలమయ్యెనేని వర్ధమాన
మతిసులభముగా వారికిఁ జిక్కఁగలదు. ఈయభిప్రాయమును మ
నమునవిడికొని యస్మాన్ఖాను తనసైనికులలోఁ జేరొందినవారిని
మందారణదుర్గాభిముఖముగ నేగ నియమించెను. జగత్సింహుఁ డప్పు
డు వర్ధమానమునందుండెను. ఆసంగతి యస్మాన్ఖానెఱింగియుండె
ను. జగత్సింహుఁ డొక్కొకప్పుడు వర్ధమానమునుండి మందారణదు
ర్గమునకు వచ్చుచుండవచ్చునని యూహించి మందారదుర్గసమీపా
రణ్యములలో నచ్చటచ్చట నెవ్వరికిని గనఁబడకుండ దాఁగియుండి
యాతఁడెప్పుడైన నత్తవారింటికి వచ్చునేమో చూచుచుండుఁడ

యు పీడితైనచో నాతని బ్రాణములతో బందీగాఁజేసి తీసికొనిరావలసినదనియు నట్లుసాధ్యపడనిచో నాతనిని వధింపవచ్చుననియు; దానుసరిగా సమయమునకు వచ్చి స్వర్గస్థుఁడైనవీరేంద్రసింహునిదుర్గము నాక్రమించుకొని యుద్ధముచేయుమార్గమును జెప్పెదననియు నస్మాన్‌ఖాను తనసైనికులకుఁ జెప్పిపంపెను.

సైనికులుపదేశానుసారముగ మందారణదుర్గసమీపారణ్యమున దాగియుండి జగత్సింహునియాగమనమును నిరీక్షించుచుండిరి. జగత్సింహుఁ డొక్కసారియైనను మందారణదుర్గముకడకు రాలేదు. ఆతఁడు వర్ధమానమునుండి యల్పసంఖ్యగలసైనికులనుగూడఁదీసికొని యోరిస్సాభిముఖముగ బయలుదేరెను. ఎవరునుసంచారముచేయనియొక్కకాలిమార్గముగుండ నేగి యస్మానుఖానునిజుట్టుముట్టవలయునని యాతనియభిప్రాయము. యోధులిరువురు నొకేరీతిసమాలోచనతోఁ బరస్పరజయాభిలాషులై పోవుచుండిరి. వారిరువురును గొంచెముకొంచెముగ సైనికులనుదీసికొని ప్రచ్ఛన్నభావముతోఁ బోవుచుండిరి.

సువర్ణరేఖానదీతీరమున కత్యల్పదూరమున నస్మానుఖాను నిపక్షమువారు విడిసియుండిరని జగత్సింహునకు వార్త వచ్చెను. జగత్సింహుఁ డస్మానుఖానునిబట్టుకొనుట కిదేయదననియెంచి తత్ప్రయత్నముతో నచ్చటకు వచ్చుచుండ నస్మానుఖాను శత్రుని యభిప్రాయమునుగ్రహించి యుద్ధవిరతిసూచకమైనయొకపతాకము నొకదూతచేతికిచ్చి జగత్సింహునియొద్ద కంపించెను.

దూత యువరాజుసమక్షమునకువచ్చి వినీతభావముతో నిట్లు విజ్ఞాపనముచేసికొనియెను.

"నేఁటియుద్ధమునం దుభయపక్షములవారికిని లక్ష్యమొకటి

యేయని తోఁచుచున్నది. అస్మాత్ఖాను నంతమొందింపవలయునని యువరాజుగారియభిప్రాయము. యువరాజుగారి నంతమొందింపవలయునని నవాబుగారియభిప్రాయము. ప్రకృతమునసంభవించిన యీఖండయుద్ధమువలన నింతకంటె వేఱుద్దేశముండునని తలంచుట కవకాశము లేదు. అట్లైనచో నకారణముగా నరహత్యలనుజేయకుండ యువరాజును, నవాబును ద్వంద్వయుద్ధము చేసినచో సులభముగా నుభయపక్షములవారియుద్దేశములును సఫలములగును. ఈవిషయమున యువరాజుగారియభిప్రాయమేమి ? ”

జగత్సింహుఁడు యుద్ధోద్యమమును నిలుపుచేయవలసినదని సైనికులకాజ్ఞయొసంగి యాదూతతో “ నేనావిషయమున సంగీకారమొసంగుచున్నాఁడను. నీవు నవాబునకుఁ దెలుపుము. నేను యుద్ధమునకు సిద్ధముగ నున్నాఁడను. నవాబు యుద్ధమునకువచ్చుట కాలస్యమయ్యెనేని నాకాసమాచారమును దెలియఁజేయుమని నేనుఁ వేఁడుకొనుచున్నట్లు మీప్రభువుతో విన్నవింపుము ” అనియెను. దూతయభివాదనముచేసి వెడలిపోయెను. దూత తిన్నగ నస్మాత్ఖాను నిశిబిరములోనికిఁ బోవుటను జగత్సింహుఁడును నాతనిసైనికులును దూరమునుండిచూచిరి. పిదపఁ గొంచెముసేపటిలోనే యస్మాత్ఖాను నశస్త్రుఁడై బయలువెడలి జగత్సింహున కభిముఖముగ వచ్చుచుండెను. యువరాజుసమీపమున నాతనియశ్వము సుసజ్జితమై నిలుచుండియుండెను. కాని యస్మాత్ఖాను నడచివచ్చుచుండుటనుజూచి జగత్సింహుఁడును నశ్వమునధిష్ఠింపక యత్యుత్సాహముతో నస్మాత్తున కభిముఖముగఁ గొంత దూరము ముందునకుఁబోయెను.

వీరాగ్రగణ్యులిరువురును సమీపించినతోడనే జగత్సింహుఁడు “ మీసందర్శనమప్పుడొకసారియైనది. మరల నిదియొకసారి—

ఈసందర్శనమే మనకిరువురకును తుదిసందర్శనమని నానమ్మకము. ఈస్థలమునుండి మనయిరువురిలో నొకఁడుమాత్రమే వెనుదిరిగిపోవుట సంభవించును " అనియెను.

అస్మాన్—మనయిరువురకును మున్ను జరగినద్వంద్వయుద్ధ సమయమునందైనసందర్శనమే కడసందర్శనమనుకొనుఁడు. ఇప్పుడు మనమిరువురము నాద్వంద్వయుద్ధముకొఱకే యిచ్చటఁ జేరితిమి. మీరు నాకుఁబరమశత్రువులు. నాశత్రువును నాస్వహస్తముతోడనే కడతేర్పవలయుననునాశతో నీద్వంద్వయుద్ధము నేర్పఱచితిని. ఈసారి నాయాశ సఫలముకాఁగలదనియే నానమ్మకము.

జగ—వ్యర్థముగా వాగ్వ్యయముఁ జేయుటకై మనమిచ్చటకు రాలేదు. మీరు యుద్ధమునకు సంసిద్ధులై యుండవలయును.

అస్మా—(గర్వముతో) నేను సిద్ధముగా నున్నాఁడను. మీరు ప్రాణములను రక్షించుకొనుట కుపాయమును వెదకుకొనవలయును.

తుములయుద్ధమున కారంభమయ్యెను. ఉభయపక్షములయందలివీరులును దూరముననిలుచుండి చింతాకులులై భయానకమైన యాయుద్ధమును బ్రత్యక్షముగాఁ జూచుచుండిరి. ఇరువురినైపుణ్యమును, హస్తలాఘవమునుజూచి దర్శకులాశ్చర్యమునొందుచుండిరి. ఇంతలో నస్మానుఖానునికత్తి జగత్సింహునికత్తిదెబ్బచేఁ జూర్ణమైపోయెను. అస్మానుఖాను భల్లముదీసికొని రాజపుత్రునిఁ గొట్టవలయునని యత్నించెను. జగత్సింహుఁడును గత్తినివిడిచి భల్లమును గైకొనియెను.

అస్మానుఖాను వేసినభల్లము యువరాజుకంఠమునకుఁదగిలి యించుకచర్మమును రాచికొనిపోయెను. ఆశ్చర్యకరమైనశిక్షాకౌశలముచే నస్మానుఖాను శరవేగముతోఁబోయి తనభల్లమును దీసి

కొనియెను. రాజపుత్రుఁడు వైచినభల్ల మస్మాన్‌ఖానుశిరము
నకుఁ దగిలెను. ఆయాఘాతముచే నాతనియుష్ణీషము దూరముగఁ
బడిపోయెను. కాని, తలకువిశేషముగ దెబ్బతగులలేదు. విచిత్ర
దక్షతతో రాజపుత్రుఁడు తనభల్లమును మరలఁ దీసికొనియెను.
కాని, యాతఁడు దానినితీసికొనుటకుఁబూర్వ మస్మాన్‌ఖాను వేసిన
భల్లము జగత్సింహునిపార్శ్వమునకుఁ దగిలెను. జగత్సింహుఁడు
దానిని మరలఁబుచ్చుకొనుటకస్మాన్‌ఖానునకు నావకాశమీయకుండ
దానినిఁగూడఁ దానేతీసికొని యస్మాన్‌ఖానునితలకుఁ గుఱిపెట్టి బల
ముగా విసరివైచెను. అది ప్రచండవేగముతోఁబోయి యస్మానుని
తలకుఁదగిలెను. మెదడునుగదపివైచిన యాయస్త్రఘాతముచే న
స్మానునకుఁ గన్నులుచీకట్లుగ్రమ్మెను. నాల్గుదిక్కులును శూన్యా
కారముగాఁ గనుపట్టనించుకసేపాతఁడు నిశ్చేష్టుఁడై నిలుచుండి
యుండెను.

జగత్సింహుఁడాసమయమునఁ గొంచెముదూరము దగ్గరకు
వచ్చి యస్మానునివక్షస్థలమునకు సరిగాగుఱిపెట్టి బలముకొలఁదిని
భల్లమును విసరివైచెను. అప్పుడస్మాన్‌ఖా నాత్మసంరక్షణముచేసి
కొనుటకశక్తుఁడై యుండెను. ప్రేక్షకులందఱును రాజపుత్రుని
యాభల్లముచే నస్మానునిప్రాణములు పోయిననితలంచిరి. జగ
త్సింహుఁడు తనబలముకొలఁది నాభల్లమును విసరివైచెను. ఆక్షణ
మున భూమినిజీల్చుకొని యుద్భవించినట్లొకస్త్రీ యటఁబ్రత్యక్షమ
య్యెను.

ఆసుందరి మానసికచింతవలె నతిసూక్ష్మగామినియై ఱెప్పపా
టుకాలములో రాజపుత్రునిచేతినుండివచ్చుభల్లమునకును, నస్మాను
ఖానునకునునడుమవచ్చి నిలుచుండెను. చూచువారందఱు నేమియుఁ

దోఁచక యూరకుండిరి. నారినోటినుండి యాతనానూచకమైన "ఓ
హో" అను శబ్దము బయలు వెడలెను. అస్మాన్ ఖానుని నిమిషమాత్రా
జ్ఞానావస్థ యప్పటికి వదలిపోయెను. జగత్సింహుఁడు శరీరమువడకు
చుండ నార్తభావముతోఁ దన రెండుచేతులను బైకెత్తెను. ఆతని
హస్తమునుండి వెడలిన యాభల్లము సుందరి వెన్నును భేదించుకొ
నిపోయెను. తోడనే యాస్త్రీ యస్మానునివక్షస్స్థలముపైఁబడి బిగ్గ
అగా "గుణమయసోదరా! అస్మాన్! నాజీవితము నీయశేషయా
తనలకుఁ గారణమైనది. జన్మాంతరమునందు నేను నీదుఃఖమునకుఁ
గారణముగా నుండకుండవలయునని ప్రార్థించుచున్నాను" అనియెను.

ఆసుందరి, అయేషా! అప్పుడిఁక యుద్ధసంబంధములగు యో
చనలెవ్వరికిని లేవు. అస్మానుఖానాసుందరిని వక్షమునఁజేర్చికొని
భల్లము నామెవక్షమునుండి పెరికివైచెను. జగత్సింహుఁడు చేతి
తోఁదలను మోదుకొనుచు "అయ్యో! జగత్తునందలి సారరత్న
మీవిధముగా నాభల్లముచేఁబడిపోయినదే. నాకుఁ బరమహితైషిణి
యైనదేవి మహాప్రస్థానమును జేయుచున్నది! అస్మానియస్త్రా
ఘాతముచే నీకృతఘ్నునిప్రాణమింతకుముందే నష్టమైపోయినచో
నింతటిదారుణము సంభవించియుండదుకదా!" అనివాపోవఁజొచ్చెను.

అయేషా—రాజపుత్రా! సమీపమునకురమ్ము—ప్రేమ
మయుఁడవగు సోదరా! అస్మాన్! నాకిఁకఁ గాలములేదు. చెప్ప
వలసినదియు విశేషముగలేదు. రాజపుత్రుఁడు బుద్ధిపూర్వకముగ
నాపై భల్లమును విసరలేదు. అందుచే నాతఁడు దోషియని తలం
పఁగూడదు. అదృష్టదోషమువలన నాహృదయముపై నాకుఁ గలయ
ధికారమును బోఁగొట్టుకొని యావజ్జీవమును దుఃఖమునకు లోనై
తిని. నిన్నును దుఃఖసాగరమునందు ముంచివైచితిని. అభిన్నహృ

దయసోదరా! నీవు ప్రేమమయుడవు. నీప్రేమమున లవలేశ మునోందఁగలిగినను జనులు ధన్యులగుదురు. స్వర్గములోనను నంతటిప్రేమయుండదు. జన్మాంతరమునందును నీయీయలౌకిక ప్రేమ ననుభవించు నధికారమునుండి వంచితనుగాకుండునట్లు నాకాశీర్వాద మొసంగుము" అనియెను.

శిబిరమునుండి వైద్యులువచ్చినిలుచుండిరి.

అయేషా—వైద్యులవలనఁ బ్రయోజనమేమియును లేదు. ఈయాఘాతమునకుఁ బ్రతీకారములేదు. రాజపుత్రా! నేను నిన్నత్యంతముఁ బ్రేమించుచున్నాను. ప్రతిదానమును బడయవలెనన్న నాశలేకుండ నాప్రాణములయందలిప్రణయమునంతను నీపాదపద్మములకడ నర్పించితిని. అర్పించినదానిని వెనుకకుఁదీసికొనుటకు నాకు సాధ్యముకాదు. పరలోకప్రక్క నానిమిత్తము ప్రణయసాగరము సిద్ధమైయున్నది. నేను దానినిజూచియుఁ జూడనిదానివలె నున్నాను. అందునిమిత్తమై నేననేకులహృదయములను దుఃఖసాగరమున ముంచి చిరకాలము సెలవుఁగైకొనుచున్నదానను. రాజపుత్రా! నన్ను క్షమింపవలయును. నేనీజన్మమునందు మరల నిన్నుఁ జూడకుందునని యనుకొనియుంటిని. కాని, నాజీవనమునకు జీవనమైన యస్మానుఖానునివక్షమున భల్లముగ్రుచ్చుకొనునని యెడిభయముచే నేనిప్పుడు కనఁబడవలసివచ్చినది. అయేషాదురదృష్టవంతురాలు. ఆమెజీవనము శీఘ్రముగఁ బోయినచోఁ బరమమంగళమగును.

జగ—ఏదేవికిజీవితము చిరఋణబద్ధమై యున్నదో, ఎవ్వరియందీజీవిత మసంఖ్యోపకారములచే బద్ధమైయున్నదో, ఎవరికినసమానమీాప్రపంచమునందెక్కడయును లేదో, ఎవరియెడల నాకృతజ్ఞత యనంతమైయున్నదో, అట్టియయేషాను, కరుణామయిని, నిష్కారణ

ముగ సాహస్యములతో నంత మొందించితిని. అసహనీయమైన యీ దుః
ఖ మాజన్మాంతమును నాహృదయమును వీడిపోవునదికాదు. ఈకృ
తఘ్నుఁడిందులకే ప్రాణాంతములగు ననేకాపదలనుండి విడివడియెఁ
గాఁబోలు! హా! దైవమా!

అయేహా—యువరాజా! మఱచిపొమ్ము. విషమయమైనయ
యేహాజీవితమునందలి విషయములన్నిఁటిని మఱచిపొమ్ము. నీవు సు
ఖముగాఁ గాలముగడపవలయునని ప్రార్థించుచున్నాను. నాసోదరి
తిలోత్తమ కీవర్తమానమును దెలియనీయకుము. నాకు సెలవొసం
గుము. పోయెదను.

రాజపుత్త్రిక యధోముఖుఁడై రోదనముచేయఁదొడఁగెను.
అన్నా హా శరీరమందలి గాయమునుండి రక్తము ప్రవహింపనారంభిం
చెను. ఆమె కంఠస్వరము మిగులసంక్షుబ్ధమైపోయెను. అతికష్టముతో
నామె యిట్లు చెప్పఁదొడఁగెను. "అస్మాన్! ప్రియమయా! నీముఖ
మునిప్పుడు బాగుగాఁ జూడఁజాలను. ఇఁక నావకాశము లేనట్లు
తోఁచుచున్నది. ఈజీవితమునందు నీకనేకయాతనలను గలుగఁజే
సితిని. నీకిప్పుడు కడసారికష్టమును గలిగించి వెడలిపోవుచున్నదానను.
అన్నా! అస్మాన్! ఈయంతిమసమయమున నాసకలాపరాధము
లను క్షమించి నాకు సెలవొసంగుము"

అస్మాన్ఖానుని నేత్రములయందు నీరు లేదు. హృదయమున
నిట్టూర్పును లేదు. నోటినుండి మాటయును లేదు. యోధ్ధవస్త్రముల
నుధరించి యున్నయావీరుఁడు పాషాణవిగ్రహమువలె నిశ్చలభా
వముతోఁ గూర్చుండియుండెను. ఆతనియంకపీఠముపై శోణితనిషి
క్తయు, మృత్యుకబళితయు నగునాభువనమోహినియుండెను.

జగత్సింహుఁడు కాతరభావముతో "నవాబుసాహేబ్! న

వాబునందని మీకడ సెలవుగైకొనుచున్నది" అనియెను.

అస్మాన్ — (ఆశ్చర్యముతో) ప్రాణేశ్వరీ ! సెలవుగైకొను చుంటినని చెప్పుచుంటివా ? ఏరమణీమణినిముహూర్తకాలముచూ డకపోయినచో భువనమే యంధకారమయముగఁ గన్పట్టుచుండు నో, ఏదేవిప్రసన్నతను లక్ష్యమునందుంచుకొని నేనీజీవితమునందలి సమస్తకార్యములను చేయుచుంటినో, అట్టియామెకు సెలవొసంగు టయా ! ప్రాణేశ్వరీ ! నీవు కొంచెముముందుగఁ బోఁదలఁచుకొంటి వా ? నీయస్మాను నీవెనువెంట నేవచ్చును.

అ — మాటాడలేను. చెప్పవలసినది ముగిసినది. నాతల్లి— దుఃఖినియైననాతల్లినిసమాధానపెట్టుము.నీవునాయెడలఁజిరకరుణామ యుఁడవని నేనెఱుంగుదును—నీయంకపీఠముపై మరణము—[illegible]ల సుఖముగానున్నది—అస్మాన్ —ఎంత శోభ!నీవును—నేనును—స్వ ర్ణరథమునందు—సోదరీసోదరులము—ఎంత మాధుర్యము— ఆహా! పోవుదము—అస్మాన్ !

అయేషానోటినుండి యింక మాట లేదు. సముజ్వలమైనయావ ర్తిక ,యాకస్మికముగ నారిపోయినదనియు, సౌందర్యశోభాయు క్తమైనపుష్ప మకాలమున రాలిపోయినదనియునందఱు ననుకొనిరి.

# ఉపసంహారము.

---

అతిరమణీయప్రదేశమందలి యొకనిభృతస్థలమున నయేషా వరవపువును సమాధిచేసిరి. ప్రతిదినమున నుదయమునను సాయంతనమునను నొకపురుషుఁ డాసమాధికడకువచ్చి సమాధిపై శిరసుంచి మౌనియై యశ్రువర్షమునుగురియించుచుండుట ననేకులు చూచుచుండిరి. ఆమనుష్యుఁడుస్మాన్‌ఖాను.

ఆదురవస్థసంభవించినపిదప నుత్సాహమును, బలమును నుస్మాన్‌ఖానునివిడిచిపోయినవి. ఏనారమణిబలముచే నుస్మానుఖాను బద్ధుఁడయ్యెనో, ఆమె యాతనిని విడిచిపోయినది. మరల నొకటిరెండుయుద్ధములందు సులభముగా నుస్మానుఖానోడిపోయెను. పఠానుల సమస్తాధికారములును మొగలాయీలవశమైపోయినవి. అందుకొఱకుస్మానుఖానొక నిట్టూర్పయినను విడువలేదు. ఒరిస్సాదేశమునఁ బఠానులయాధిపత్యము సమాప్తమైపోయెను.

ఘటనాఘటనసమర్థుఁడగువిధివిధానములాశ్చర్యజనకములు. కాశ్మీరబీగముసోదరునితనయయగునయేషా యెక్కడ? కటుల్‌ఖానునియింటఁబెరుగుటెక్కడ? ఢిల్లీలో మొగలాయీలకడ సేవకుఁడుగనున్న పఠానునితనయుఁడెక్కడ? ఆఱేండ్లవయసున మాతృవియోగము తటస్థింప బంధువని కటుల్‌ఖానునియింటనభివృద్ధిఁజెందుటెక్కడ? ఆతనిసుగుణసంపత్తిని, ధైర్యసాహసములంజూచి, కటుల్‌ఖాను తనపుత్త్రునిగ నెంచి సంరక్షించుచు సర్వసేనాధిపత్యమునొసంగుటెక్కడ? మానసింహమహారాజు తనయుఁడెక్కడ? బందీయై కటుల్‌ఖాను భవనమునఁ జేరియయేషా ప్రేమకు నిలయమగుటెక్కడ? ఈఘటనముకం

కు విచిత్ర మేమికలదు? సంతతభోగపరాయణుఁడగు జ్యేష్ఠపుత్రు నిమూలమునఁ బతానురాజ్యమునకేమైన భంగమువచ్చునేమోయని తలంచి యస్మత్సుఖానుని రెండవతనయునిగా గ్రహించి రాజ్యాధికార మొసంగి యతనిమూలమున పఠానులరాజ్యమంతయు స్వహస్తలోనికి వచ్చుననుకొనిన కటుల్‌ఖానుని యుద్దేశమేమైనది? భారతవర్షమునఁ బతానులయాస్తిత్వము మొదలంటనిర్మూలమైపోయినది. విధివైద్ధ ములవిలంఘ్యములుకదా!

అస్మత్సుని జీవితాంతమున నాతని యిచ్ఛానుసారముగా న యేపాసమానై పార్శ్వమున నాతనినశ్వరకళేబరము సంరక్షితముసే యఁబడియెను.

సమాప్తము.



